# జలంధర కథలు

జలంధర




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

JALANDHARA KATHALU *by Jalandhara*

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

ప్రచురణ నెం. : 2350/12

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : సెప్టెంబర్, 2003





ముఖచిత్రం: చంద్ర

**వెల: రూ. 100-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



*ముద్రణ:* **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హైదరాబాద్.

# అంకితం

కథ వెనకాల
ఆర్తి ఉంటుంది. అర్థముంటుంది.
విస్తరించే విజ్ఞానముంటుంది.....
భావుకత ఉంటుంది.... భయముంటుంది.

నా మనుష్యులు, నా వాళ్లు అంటూ మన చుట్టూ ఉండే అందరిమీదా ఆప్యాయత ఉంటుంది.... ప్రశ్న ఉంటుంది. పరమార్థముంటుంది.

కథకుల్లో జరిగే ఈ అక్షర విస్తృత ప్రయాణం అర్థం చేసుకుని పాఠకులకు అందజేసే వారధి పత్రికల ఎడిటర్.

ఎంతో మంది మామూలు స్థితినుంచి మహారచయితల స్థితికి ఎదగడానికి కారణం ఎడిటర్.

వారిలో సంస్కారం, ఔన్నత్యం, స్పందన లేకపోతే రచయిత పాఠకుడికి దగ్గర అవడం కష్టం.

అందుకే ఈ నా కథల సంపుటిని
మన పత్రికలను గౌరవస్థాయికి తీసుకువచ్చిన
**మంచి ఎడిటర్స్‌కు**
అంకితం చేస్తున్నాను.

# కృతజ్ఞతలు

మామూలు మనుష్యుల్లో మహనీయత చూడడం, స్పందించడం - వీటికి అర్థం చెప్పిన డాక్టర్ గోపాలకృష్ణగారికి,

"కథ చెప్పడమే కాదు, జ్ఞాపకం! ఉండేట్లు చెప్పాలే పిచ్చిమొద్దూ" అని కేకలు వేసి చెప్పే మా అత్తయ్య, కళాప్రపూర్ణ, శ్రీమతి తెన్నేటి హేమలత గారికి,

"నువ్వు వంద శాతం నేర్చుకుంటే యాభైశాతం మాట్లాడగలవు. అందులో పాతిక శాతం రాయగలవు... అందులో ఎంత శాతం ఆలోచింపచెయ్యగలవు?" అని ప్రశ్నిస్తూ పెంచిన మా నాన్నగారు డాక్టరు గాలి బాలసుందరరావుగారికి.

"నిండు వెన్నెల, పండు వెన్నెలా వీటికి అర్థం ఒక్కటే అనిపించవచ్చు. కానీ ధ్వని వేరు... అక్షరానికి అందం, లయ కలిస్తేనే పదమౌతుంది, చంద్రమోహినీ!" అనే గురుతుల్యుడు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి,

"కథ cross section of life....ఏ చెట్టు బెరడునో మైక్రోస్కోప్ కింద పెట్టగానే దాని back ground అంతా తెలిసిపోతుంది.... అట్లా ఉండాలి కథ...." అని చెప్పి guide చేసిన శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారికి

"అనవసరంగా, కథకు పనికిరాని వాక్యం రాయకూడదు..." అంటూ ఎడిట్ చేసే శ్రీ శార్వరిగారికి.

నా కథలు చదివి "నాకేం అర్థం కాలేదు" - అంటూనే ఆ కథ గురించి చాలా expressive గా మాట్లాడే శ్రీ చంద్రమోహన్‌గారికి,

నా కథ స్క్రిప్ట్‌గా ఉన్నప్పుడే చదివి వినిపించుకుని అభిప్రాయం చెప్పి, నన్ను ఎన్నోసార్లు ఆలోచింపచేసిన నా పాపలు మధు, మాధవికి,

ఎన్నోసార్లు నన్ను ఎంకరేజ్ చేసి ప్రేమించిన నా వాళ్లకు...

"నీ కథల సంపుటి వెయ్యాలి, తప్పదు.... అని నన్ను బలవంతపెట్టి, ఆప్యాయతతో కేకలు వేసి, ఈ కథాసంపుటి రావడానికి కారణమైన డా॥ వాసిరెడ్డి సీతాదేవిగారికి,

పబ్లిష్ చేస్తున్న విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి,

మరెందరికో - నా కృతజ్ఞతలు.

**- జలంధర**

# ఇందులో...

# ఊహల్లో స్వర్గం

మనిషి మేధస్సు సృష్టించిన రంగుల కల స్వర్గం.

ఉపనిషత్తులు, పురాణాలు ఏమైనా చెప్పనీ.... నిజానికి చక్కటి ఊహ ఈ స్వర్గం. మృత్యువుకు, మనిషికి మధ్య ప్రవహించే వైతరణీ ముఖద్వారం స్వర్గమే అయితే... స్వర్గం నిజమే అయితే... అంతకన్న కోరుకోదగింది ఏముంది? జాగృతిని మరచిన ఆత్మీయులు ప్రక్కన, ఆశనిరాశలమధ్య ఊగాడుతున్న మనిషికి ఎంత చక్కని ఆశ ఈ స్వర్గం!

ఒకనాటికి.. అందరూ పోయేవారే... మనకు తెలియకుండానే ఈ బొమ్మల పుస్తకంలో ఆఖరిపేజీకి వస్తుంటాం. కానీ, ఈ లోకంలో మిగిలిపోయిన కోరిక ప్రేమ, ఆప్యాయత, ఆశ, మళ్లీ మరో లోకంలో మనవారినందర్నీ కలుసుకుంటామనుకునే తృప్తినిస్తుంది. ఈ అద్భుతమైన ఊహ ఎంత అందమైంది?

చిన్ననాటినుంచీ మమ్మల్ని కన్నుల్లో దీపాలుగా పెంచిన అమ్మ చనిపోతూంటే, దుఃఖాంతమని తెలిసీ, ఆశలు విరిగిపోతున్నాయని తెలిసీ కన్నీళ్లపునాదులు వేసుకుంటూ, ఏనాడో మళ్లీ ఈ ప్రేమను పొందగలుగుతాము అనీ, అదే స్వర్గమయితే ఒప్పుకోవాలనీ ఆశ ఉండదా?!

"అన్నయ్యా! స్వర్గం ఉందిరా?" మైకంలో గబుక్కున పైకి అనేశాను.

"స్వర్గం లేదు, నరకం లేదు, పిచ్చిగా వాగకే" అనే చిన్నన్నయ్య.

"లేదు, చిన్నారీ! మనం ఆఖరివరకు ఏదో ఒకటి చెయ్యాలి కానీ, పిచ్చిగా ఆలోచించి మనస్సు చెడగొట్టుకోకూడదు" అనే డాక్టర్ అన్నయ్య.

"ఇవ్వాల్టితో ఈ జీవికీ, మనకూ ఋణం తీరిపోయిందే, తల్లీ!" అని పిచ్చిశోకాలు పెట్టే బామ్మ. వీళ్లందరూ నా కలను భగ్నం చేస్తున్నారు. నాలోని ఆశను పాతేస్తున్నారు.... కానీ, ఈ అందమైన ఆశను ఎల్లా వదులుకోను?

కావలసినవారి మృత్యువును కలలోకూడా ఊహించలేమంటారు. ఆఖరిక్షణాల కోసరం, చైతన్యం నర్తించే శరీరంలో జీవం నాశనమవడానికి, దీపం ఆరిపోవడం తప్ప మరొక మార్పు రాదని తెలిసీ, ఏదో ఒక మార్పు కోసరం ఎదురుచూడడం ఎంత దురదృష్టం? ఈ నిరీక్షణ ఎంత పాపిష్టిది?

"కళ్లు తెరచే నిద్రపోతున్నావా, చిన్నారీ?" అని అన్నయ్య హెచ్చరించాడు. కళ్లు తెరచుకుని నిద్రపోవడం... ఈ జాగృతికి, సుషుప్తికి, సత్యానికి, ఊహకు మధ్యఉన్న దూరాన్ని ఇంతకన్న చక్కగా ఎలా కొలవడం...? కలలోనుంచి

తొంగిచూశాను. మెళ్లో స్టెతస్కోపుతో అన్నయ్య అమ్మముఖంలోకి చూస్తున్నాడు. అన్నయ్యలో మనిషి నా బోటివాడేనేమో, కానీ, అతనిలో పెరిగిన ఈ అవాస్తవిక పరిజ్ఞానం ఆశలను, అందమైన భావాల్ని కప్పేస్తుందేమో... అమ్మ ఎప్పుడూ అనేది 'రోజాపువ్వును స్పిరిట్‌లో నానబెట్టడం లాంటిది మీ జీవితం' అని.

అన్నయ్యను డాక్టర్‌ను చెయ్యాలని అమ్మ ఏన్నో కలలు కన్నది. అవి నిజమయ్యాయి. అన్నయ్యలో వైద్యుణ్ణి చూసుకుంది అమ్మ. హాయిగా దాటిపోతూంది. అన్నయ్యకే కాదు, ఏ డాక్టర్‌కూ అలవికాని రోగంతో అమ్మ అంతమైపోతూంది. ఈ చేతులలోని వెచ్చదనం మరికాసేపటికి ఉండదా?

"అన్నయ్యా! ఏదన్నా చెయ్యరా! అంత బాధపడుతూంటే చూస్తూ ఊరుకుంటావేమిరా?" అన్నాను.

"ఏం చెయ్యగలం! చెయ్యగలిగినదంతా చేశాం."

అయ్యో! చూస్తూ చూస్తూ అమ్మను మృత్యువు చేతుల్లోకి ఎట్లా అందివ్వడం? ఆమె బాధను ఎలా చూడడం? అందుకని ఎలా మృత్యువును కోరడం? ఇదెక్కడి పాపిష్టిబాధ అమ్మకు?

అమ్మవంక తేరిపారచూచాను. పచ్చటిముఖం నీలివర్ణానికి తిరుగుతూంది... ఎప్పుడూ తాంబూలం వేసినట్లుండే పెదవులు నల్లబడుతున్నాయి,

"అమ్మా! నా వంక చూడమ్మా! ఒక్కసారి మాట్లాడమ్మా!" అని ఏడ్చాను.

"ఒద్దు చిన్నారీ! ఊరుకో!" అని చిన్నన్నయ్య ఓదార్చాడు.

"నా చిన్నారివికదూ! ఏడవకు" అని దగ్గరకు తీసుకుని బుజ్జగించాడు పెద్దన్నయ్య. అమ్మ ఆ మాటలు విన్నట్లుంది. కనులు విప్పి అన్నవంక చూచింది.

దాదాపు ఇరవై అయిదేళ్ల క్రితం అనాథ శరణాలయంలో నుంచి ఒక పాపను తెచ్చింది అమ్మ. ఆ బిడ్డ తల్లి క్రిస్టియన్, తండ్రి హిందువు. సనాతన కుటుంబంలో పెరిగిన అమ్మ, ఐశ్వర్యం మధ్య పెరిగిన అమ్మ ఆనాడు ఆ బిడ్డ మీద జాలితో, సంఘాన్ని, లోకాన్ని కాదని ఆ బిడ్డని ఇంటికి తెచ్చుకుంది. ఆ సాహసాన్ని సులభంగా క్షమించదలుచుకోలేదు మా బామ్మ.

ఆ బిడ్డకు చైతన్య అని పేరు పెట్టింది అమ్మ. అతణ్ణి డాక్టర్ చేసింది. అతడేమో పెద్దన్నయ్య. అన్నయ్య ఈ ఇంట్లో పెరుగుతున్నందువల్ల మా కుటుంబానికి రాకూడని నిందలు చాలా వచ్చాయి. రాబందుల్లాంటి బంధువులు అమ్మను పీక్కుతినడానికి ప్రయత్నించారు. అన్ని నిందలు భరించింది అమ్మ. ఒకనాడు నాన్నగారి దగ్గరికి వెళ్లి, "ఇందరిలో మీరొక్కరే నన్ను అర్థం చేసుకున్నారనుకుంటాను. ఈ బిడ్డ నా కెంతో, మీకూ అంతే. నే కోరుకునేదొకటే. ఈ అప్యాయత ఒక్కటే నా నేరమైతే ఈ ఒక్క తప్పు మన్నించండి."

అమ్మ కన్నీటికి కరగనంత కఠినులు కారేమో నాన్న. ఒప్పుకున్నారు. ఆ చేయూతే అమ్మకు ఆధారమైంది. బహుశా, అమ్మమీద ప్రేమకన్న, ఆమెలోని

వ్యక్తిత్వాన్ని గౌరవించి నాన్న ఒప్పుకుని ఉంటారు. అటుతరవాత నాన్నగారు ఆమె చుట్టూ ఆవరించిన చైతన్యపు పరదాని తొలగించదలుచుకోలేదు. ఆ తరవాత పుట్టిన నేను, అన్నయ్యకూడా పెద్దన్నయ్యకు చెల్లెలు, తమ్ముడుగానే పెరిగాం. అన్నయ్య ఫిఫ్త్ ఫారంలో తప్పినప్పుడు "ఆc! ఆ అనాథప్రేతానికి చదువేమిటి నా బొంద?" అని మా బామ్మ వెక్కిరించింది. నాన్నగారు "తంజావూరు వీణ అనుకుని మోహనరాగం ఆలపించబోతే అది వీథివాయిద్యం అనితెలిసినప్పుడు కలిగే ఆశాభంగానికి నువ్వు తట్టుకోలేవేమో, మాలతీ!" అన్నారట పరిహాసంగా.

"ఉన్నత కులంలో పుట్టినంత మాత్రంచేత మనమంతా ఉన్నతులమై పోయామేమిటండీ! ఒక్క అనాథబిడ్డకి ఆశ్రయమివ్వలేని ఈ కులంలో ఉన్నతత్వ ముందంటారా?" అని కోపంగా అడిగిందట. అమ్మ పట్టుదలే ఊపిరిగా పోసి పెంచడంవల్ల కాబోలు – అన్నయ్య మరెప్పుడూ అమ్మను నిరాశ పరచలేదు. నేను పుట్టిన తరవాత మరొక్కసారి బామ్మ అమ్మమీద దాడి ప్రారంభించిందట, "ఆడపిల్లకు పెళ్లి అవ్వాలి... ఆ అనాథ వెధవని ఎక్కడైనా ఉంచమనరా... కావాలంటే డబ్బు పారెయ్యమను" అని. కానీ, ఒక్క క్షణం మమ్మల్ని, అమ్మను, నాన్నను చూడకుండా ఉండలేని అన్నయ్యను ఏం చెయ్యగలదు అమ్మ? అమ్మ పట్టుదలను నాన్న అర్థం చేసుకున్నాడు. అన్నయ్య డాక్టర్ చైతన్య అయ్యాడు.

ఎవరైనా, ఎప్పుడైనా, "మీరు ఇంత పట్టుదల కలవారుకదా! ఒక అనాథశరణాలయాన్ని మీ ప్రేమకు చిహ్నంగా కట్టించకూడదూ?" అని అమ్మతో అంటే, "అయ్యా బాబోయ్! ఒక్క అనాథబిడ్డడిని పెంచడానికి నేను పడ్డపాట్లు భగవంతుడికే ఎరుక. ఇంక అంత పెద్దబాధ్యతే? ఆ పని సంఘానికి ఒదిలేద్దాం..." అని తప్పించుకునేది నవ్వుతూ.

అమ్మ ఎప్పుడూ అన్నయ్యకు తనే కన్నతల్లి అని చెప్పి మోసగించలేదు. "ఏం? తనే తల్లిని కానని తెలిసినప్పుడు నా మీద ప్రేమ చైతన్య చంపుకుంటే, మాతృత్వానికి అర్థమేమిటి? అతడి తల్లిని నేను కాకపోయినా, అమ్మ అని పిలిపించుకున్నాను. అదీ గొప్ప..." అనేది.

అన్నయ్యకు ఒడుగు చెయ్యడానికి వీలులేదని పట్టు పట్టింది బామ్మ. ఒడుగు జరిగితీరాలని పట్టుదల కాకపోయినా, అన్నయ్య అన్నివిధాలా ఆ ఇంటిబిడ్డడని అనిపించాలనే తాపత్రయంతో నలిగిపోయింది అమ్మ. నాన్నగారు అమ్మ బాధ చూడలేక, "గాయత్రి అందరూ జపించవచ్చు" అన్నారు. అన్నయ్యకు జ్ఞానంవచ్చిన తరవాత ఎన్నోసార్లు చర్చికి తీసుకువెళ్ళింది. "చైతన్యా! నీకు ఏ పద్ధతి నచ్చితే అదే అనుసరించు. భగవంతుడొక్కడే" అని చాలాసార్లు చెప్పింది. "వాడిది అమ్మ మతం" అని అనేవారు నాన్న ఎప్పుడూ. తన స్వార్థం కోసరం ఎప్పుడూ అమ్మ ఎవర్నీ ఏమనలేదు. ఏదీ చెయ్యమని శాసించలేదు. అల్లాంటి అమ్మ వెళ్లిపోతూంది...కొన్ని గంటలు...అంతే...

మెల్లిగా కన్నీరు తుడుచుకుని కలియచూశాను.

"ఆc! ఆ చీరలో మన్నిక తక్కువలెద్దూ!" అత్తయ్యలు మాట్లాడుకుంటున్నారు మరొకపక్క. "పిల్లకి నగలేం షెట్టారొదినా?" అని పెళ్లిముచ్చట్లు అడుగుతున్నారు పక్కింటి అత్తయ్య మరొకామెను.

నాకు ఆశ్చర్యం వేసింది. మాకు మా అమ్మ ఆదర్శమూర్తి. వాళ్లకేమిటి? మనుషుల తత్త్వమంతేనేమో అని సరిపెట్టుకుని అమ్మవంక చూశాను. అమ్మ జాలిగా ఒక్కసారి చూచింది. ఆ కళ్లల్లో ఓదార్పు కన్నీటిపొరలా కదలాడింది.

"ఆవిడ పేర ఏదో మేడా గీడా ఉందనుకుంటాను... విల్లూ అదీ తయారుచేయించారా?" అంటూ హడావిడిగా రైలు దిగి వస్తున్న పెదనాన్నగారు నాన్న చెవిలో ఊదారు.

నాన్న ఇబ్బందిగా, 'వీళ్లతో ఎలా' అన్నట్లు చూశారు.

చిన్నన్నయ్య లేచి, "ఇదుగో, పెదనాన్నా! నువ్వు వెళ్లి ఆ హాల్లో కూర్చో" అన్నాడు గట్టిగా.

ఆయన గొణుక్కుంటూ వెళ్లిపోయాడు.

"వాణ్ణంటావేమిటిరా మధ్య... అదేదో నీ మంచికే చేద్దామని వాడి తాపత్రయం... ఉట్టి మొరటువెధవని తయారుచేసింది." బామ్మ సణుగుతూంది.

అవును, చిన్నన్నయ్య మొరటువాడే... అమ్మ చేతుల్లో పెరిగిన చిన్నన్నయ్యకు మొరటుదనం ఎక్కువ. ఇద్దరి తత్త్వంలో ఎంతో భేదం. ఆప్యాయత కోసరం తలొగ్గుతాడు పెద్దన్నయ్య. హక్కులకోసం ఎవరితోనైనా నిలబడి పోరాడతాడు చిన్నన్నయ్య. ఈ రెండు సమానాంతరరేఖలను ఆప్యాయత పొరలతో కట్టి పెంచింది అమ్మ.

అన్నయ్య కేకలకు అమ్మ కళ్లు విప్పి చూచింది.

"అమ్మా! ఏం కావాలీ?" అని మెల్లిగా అడిగాడు చిన్నన్నయ్య.

"చైతన్య!" అంది అమ్మ.

"అయ్యో! చావుతెలివి ఒచ్చిందర్రో" అంటూ అందరూ మంచం చుట్టూ చేరారు.

"ఇదిగో! మీరంతా దూరంగా పొండి ముందు..." అని ఒక్క కసురు కసిరాడు చిన్నన్నయ్య.

అందరూ మెల్లిగా దూరంగా వెళ్లి నిలబడ్డారు.

ఇరవై ఏళ్ల వ్యక్తిత్వం, చదువూ, వయస్సు అన్నీ మర్చిపోయి పసివాడిలా నాన్నగారి ఒళ్లో తలదాచుకుని బావురుమని ఏడ్చేశాడు పెద్దన్నయ్య.

అమ్మ అన్నయ్యని, నాన్నగార్ని చూసింది. అస్తమిస్తున్న సూర్యునితో మెల్లిగా అంతరించే కాంతిలా నవ్వింది.

"చిన్నారి అమాయకురాలు... అందులో ఆడపిల్ల. జాగ్రత్త!" అని ఇంక మాట్లాడలేకపోయింది.

"తులసితీర్థంపొయ్యండ్రా!" ఎవరో అరిచారు.

అమ్మ తల ఒళ్లో పెట్టుకుని, మెల్లిగా, భక్తిగా తులసితీర్థం పోశాడు పెద్దన్నయ్య. తలెత్తి అమ్మ అన్నయ్యవంక చూసింది... అంతే.

'అమ్మా!' అంటూ అన్నయ్య, 'మాలతీ!' అంటూ నాన్న స్పృహతప్పి పడిపోయారు. ఇల్లంతా శోకాలతో గగ్గోలైంది.

అమ్మ చేతిలో నా చెయ్యి అలాగే ఉండిపోయింది. చనిపోతే ఎలాగో అయిపోతారనుకున్న నాకు ఏ మార్పూ అమ్మలో కనబడలేదు. అసలు చనిపోలేదేమో... అని అనుమానమొచ్చింది. ఈ నిద్ర శాశ్వతనిద్రా? ఎప్పటినించో అమ్మ మృత్యువును తలుచుకుని దుఃఖిస్తున్న నాకు ఆశ్చర్యంగా మృత్యువు పరదా అమ్మని కప్పినప్పుడు దుఃఖం రావడం లేదు. చావు మనిషిని కబళిస్తుందనుకున్నాను కానీ, ఇంత చల్లగా, విప్పారిన పొగలా, కనిపించని తెరలా మృత్యువు మనిషిని ఆవహిస్తుందా?

కొన్ని గంటలు కలలా గడిచిపోయాయి. చుట్టూ ఏమిటో గగ్గోలు. ఎంతమంది జనం.... అమ్మ జీవితం వీళ్ల పొగడ్తలతో ఊపిరి పోసుకుంటుందేమో ననిపించింది.

సోఫాలో పడుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు ఎంతో ధైర్యశాలి అనుకున్న చిన్నన్నయ్య.

ఎవరైనా కొత్తవాళ్లు వచ్చినప్పుడల్లా గగ్గోలుగా ఏడుస్తోంది బామ్మ. మెల్లిగా పెద్దన్నయ్య, నాన్నగారు స్నానాలు చేసివచ్చారు. ఏదో మునిగిపోయినట్లు అందరూ బామ్మ దగ్గిరికి వెళ్లి గుసగుస ప్రారంభించారు.

"ఆ కిరస్తానీవాడు దానిని ముట్టుకుంటానికి వీల్లేదు!" అని ఒక్క అరుపు అరిచింది బామ్మ.

పెద్దన్నయ్య ముఖం వివర్ణం అయిపోయింది. నాన్నగారికి దుఃఖంలో నిస్సహాయత.

ఒకసారి లేచి కూర్చుని, "ఎవరా మాట అన్నది?" అని ఒక్క అరుపు అరిచాడు చిన్నన్నయ్య. వాడి నోటికి దడిసి చాలామంది ఆగారు.

"అదికాదురా..." అని దీర్ఘం తీస్తూ బామ్మ మాట్లాడబోయింది.

మెల్లిగా ఆవిడ కుర్చీ దగ్గిరకు వెళ్లి నిలబడి, "ఇదుగో, బామ్మా! అమ్మ ఉన్నంతకాలం నిన్ను ఒక్క మాట అననీయలేదు మమ్మల్ని... ఆ గౌరవం ఇప్పుడుకూడా దక్కించుకో" అని విసురుగా లోపలికి వెళ్లాడు.

ఐదునిమిషాల్లో స్నానం చేసి, ధోవతి, అంగవస్త్రంతో వచ్చాడు. ఏనాడూ చిన్నన్నయ్య కర్మ, క్రతువు వీటిల్ని నమ్మలేదు. అమ్మ ఎంత బతిమాలినా ఏరోజు కూడా తన మనస్సుకు ఇష్టంలేని తతంగం చేసేరకం కాదు. కానీ, ఈనాడు పెద్దన్నయ్య హక్కు కాపాడడానికి తను తలఒగ్గాడు.

అటు పెద్దన్నయ్య, మధ్య చిన్నన్నయ్య, మరొక పక్క నాన్న ముగ్గురు ముందుగా –వెళ్లిపోతున్న అమ్మ మూడు ప్రమిదలలో వత్తులు కలిసి భగవంతుడే వెలిగించిన దీపశిఖలా ఉన్నది. ఏదో తెలియని మైకం నన్నావరించింది.

రెండు చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తున్నాడు పెద్దన్నయ్య.

"ఏమైంది అమ్మ? మన దగ్గిరే ఉంది!" అని అన్నయ్యను ఓదారుస్తున్నాడు చిన్నన్న.

"లేదురా! అమ్మ లేదని ఏడవడం లేదురా! అమ్మ నన్ను ఎంత ప్రేమించిందో నాకు తెలుసు. మనని ఇంత ప్రేమించి, మనల్ని విడిచి ఎక్కడికి పోతుంది? మన ఊహకందని ఏదో లోకంలో నిరంతరం ఉంటుంది. ఇంతకాలం స్వర్గమంటే నవ్వొచ్చేది. నాకు... కానీ, అమ్మలాంటి దేవతలు ఎక్కడో ఒక చోట ఉంటారు. అదే స్వర్గం!" అన్నాడు పెద్దన్నయ్య.

"మృత్యువులో ఎన్ని అందాలున్నాయో? ఇలాంటిదే ఏదో లోకం అక్కడా ఉందేమో! అక్కడ అందరం కలుసుకుంటామేమో! కాలమే మధ్య పరదా..." నా ఊహ ఇది. ఈ స్వర్గం ఎంతమంది కవులను, మేథావంతులను భ్రమింప చేసింది! నిజంగా స్వర్గమనేదే ఉంటే, అక్కడ అమ్మ ఉండనిదే అది స్వర్గమెలా అవుతుంది? మా అమ్మ ఉంది.... ఉంటుంది... అక్కడ.

*(ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక - 16-4-1969)*

# కానుక

"నమస్కారం, టీచర్!"

"ఎవరది?" తలఎత్తి చూసింది సీతాదేవి, చేతుల్లో ఉన్న ఎంబ్రాయిడరీ ఫ్రేమ్ పక్కన పెడుతూ.

ఎదురుగా ఎరుపుగళ్ల పట్టుచీరతో, మెడలో నగలతో, తలనిండా మల్లె పూలతో ఐశ్వర్యానికి, సౌందర్యానికి ప్రతిబింబంలా ఉంది ఒక యువతి. ఆమె పక్కనే తెల్లని ఫ్రాకియాయీ టైయిల్స్‌తోచందమామలాంటి చిన్నారి నిలబడివుంది. చప్పున గుర్తు పట్టలేక పోయింది. వృద్ధురాలైన సీతాదేవి. నేనే టీచర్, లలితను.... ఇప్పటకైనా గుర్తుకు వచ్చానా?" అంటూ నవ్వుతూ దగ్గరకు వచ్చి తన చేతిలోని పళ్ళు ఆమె కిచ్చి, కాళ్లకు దణ్ణం పెట్టింది ఆమె. ఇంద్రధనుస్సులా వంగి దణ్ణం పెడుతున్న ఆమె బారెడు జుట్టు, పచ్చటి, సన్నని నడుము చూడగానే సీతాదేవి వెంటనే గుర్తు పట్టింది.

"అమ్మా! నువ్వు లలితవా?" అంటూ దగ్గరకు తీసుకున్నది ఆమెను. "ఈ పాప?" అంది వెంటనే, సగం తెలుసులే అనే భావనతోనే.

"మా పాపేనండి!" అంది నవ్వుతూ లలిత.

"రా, అమ్మా! రా తల్లీ, రా, అమ్మా!" అంటూ పాపను దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకున్నది ఆవిడ.

ఆ వృద్ధురాలిలో ఏ భావాలు మెదిలాయో - ఆమె కన్నుల నుండి ఆనందాశ్రువులు ఆగకుండా ప్రవహిస్తున్నాయి. జారిపోయిన బుగ్గలు, కళ్లకింద నీడలు, ఎండిపోయిన చేతులు, కళ్లజోడు, ఊడిపోయిన పన్ను... అసలే పిట్టమనిషేమో వృద్ధాప్యం మరింత కుంగదీసింది ఆమెను.కానీ ఆ నవ్వులో, ఆ ఆప్యాయతలవెన్నెల నీడల శతకోటి ఆశీస్సులు---- అవి మాత్రం మారలేదు.

"మీరు చాలా ముసలివారైపోయారు, టీచర్..." నవ్వుతూ అంది లలిత.

"కాదు మరీ... వయస్సు రాలేదా, ----- నువ్వు మాత్రం ఆ నాటి లలితలా ఉన్నావా, చెప్పు?" అన్నది, పాప బుగ్గమీద మృదువుగా ముద్దుపెట్టుకుంటూ. మిలమిలా మెరిసే ఇంతింత పెద్ద కళ్ళతో ఆవిడ వంక ఆశ్చర్యంగా చూసింది పాప.

"మా శేఖర్ కళ్లే వచ్చాయి, లలితా పాపకు. ఊc! ఇంతకూ అతను ఎలా ఉన్నాడు? కలాసానా? ప్రాక్టీసు అదీ బాగున్నదా?" ఆప్యాయంగా అడిగింది ఆవిడ.

"అఁ! కులాసానే... మా చుట్టాల ఇంట్లో పెళ్లి, టీచర్! ఆయన రాలేకపోయారు. మీ ఓల్డ్ స్టూడెంట్ ఎవరో మీ అడ్రస్ ఇచ్చాడట. వచ్చేముందు కంపార్ట్మెంట్ ఎక్కేదాకా ఏ వంద సార్లో చెప్పారు... మిమ్మల్ని చూసి రమ్మని. మీకు నమస్కారాలని చెప్పమన్నారు."

గలగలా నవ్వింది సీతాదేవి.

"పిచ్చి ఆప్యాయతమ్మా అతనిది. ఏముంది నన్ను చూడటానికి తల్లీ? ఎండి రాలిపోయే పండుటాకును" అంది సీతాదేవి.

"అలా అనకండి, టీచర్! మీరు వంద సంవత్సరాలు చల్లగా ఉండాలి. ఈ రోజు మేమింత సుఖంగా ఉన్నామంటే అది మీ చలవే, టీచర్!" అది లలిత. ఆ మాటలన్నీ భక్తి, వినయం, ఆప్యాయతలతో చేసిన రసగుళికలలాగా ఉన్నాయి ఆమె చెవులకు. అంతకన్న వృద్ధాప్యంలో తనదంటూ ఏమీ మిగుల్చుకోకుండా కేవలం సీతా టీచర్గా మాత్రం మిగిలి, ఏ చల్లటి సాయంత్రాన్నో ఈ జీవితపు గ్రంథాన్ని సవ్వడి లేకుండా ముగించడానికి ఎదురుచూస్తున్న ఆ వృద్ధురాలి జీవితంలో మధుర క్షణాలు ఏముంటాయి?

ఆప్యాయతా పరిమళాలు నిండిన ఆ గదిలో కొన్ని క్షణాలు మౌనం మృదువుగా మ్రోగింది.

"టీచర్! రాజీ..." ఏదో జ్ఞాపకమొచ్చినట్లుగా అంది లలిత.

గాజుకళ్లతో తల ఎత్తి చూసింది సీతాదేవి. ఆ వృద్ధురాలి కళ్లలో జ్ఞాపకాల నీడలు కదలాడాయి.

"అవునమ్మా! మనకు రాజీ ఇక లేదు.. మీకు తెలుసుగా?..." అంది ఎటో చూస్తూ.

"అవును! టీచర్! తరవాత తెలిసింది. ఆయనా, నేనూ చాలా బాధపడ్డాము. అసలు అలా ఎలా జరిగింది, టీచర్?"

"పోనిలే, అమ్మా! అదంతా ఇప్పుడెందుకు? ఊఁ! ఇంకా విశేషాలు ఏమిటి?" అంటూ మాట తప్పించి పక్కనున్న ఎంబ్రాయిడరీ చేతిలోకి తీసుకున్నది.

ఎవరి పాప ఫ్రాక్ మీదో పువ్వులు కుడుతున్నది సీతాదేవి.

"ఎవరికి టీచర్, అది?" అంది లలిత.

"పక్క ఇంటి పాప పుట్టినరోజమ్మా రేపు. ఆ పాపకు నేనంటే పంచప్రాణాలు. శిథిలమైపోతున్న ఈ నా చేతులతో ఇంకా అ ఆ లు దిద్దించాలని ప్రయత్నిస్తోందమ్మా ఆ పాప" అన్నది ఆమె గలగలా నవ్వుతూ.

"మీకింకా ఎదురింటి అమ్మాయిల మీదా, పక్కింటి అమ్మాయిల మీదా మోజు తీరలేదా, టీచర్?" సూటిగా చూస్తూ అన్నది లలిత.

ఆవిడ మాట్లాడలేదు. కాని, ఆవిడ మౌనం లలితకు చాలా చెప్పింది. మెల్లగా ఏవో కబుర్లు సాగాయి. చల్లటి పిల్లగాలిలో సన్నజాజుల పరిమళాల వంటివి జ్ఞాపకాలు. వాటిలో ఆనందం అనుభవించేవారికే తెలుస్తుంది.

"వస్తాను, టీచర్!... ఆలస్యమైంది. మళ్లీ రేపు రాత్రి వెళ్లిపోతున్నాను. వెళ్లేముందు వస్తాను" అంది లలిత, సీతాదేవి ఒళ్లో ఆదమరిచి నిద్రపోతున్న పాపను తీసుకుంటూ.

లలితను పంపి తలుపు వేసి వెనక్కు తిరిగింది సీతాదేవి. ఒక్కసారిగా రాజీ జ్ఞాపకాలు ఉవ్వెత్తున ఆమెను కదిల్చివేశాయి. కళ్ల నీళ్లు తుడుచుకుంటూ వద్దనుకుంటూనే ఒక్కొక్క అడుగే వేసుకుంటూ మెల్లిగా పాత ట్రంక్ పెట్టె తీసి, ఆ మూలా ఈ మూలా వెతికి, చిన్న అట్టపెట్టె తీసుకుని సోఫాలో కూర్చుంది సీతాదేవి. లైటు కాంతిలో మిలమిలా మెరిసిపోతున్న తెల్లరాళ్ల ఉంగరం! కళ్లలో సుళ్లు తిరుగుతున్న కన్నీళ్ల చాటుగా దాన్నే పరీక్షగా చూస్తున్న సీతాదేవికి ఉంగరంలో ప్రతి రాయీ రాజీ కథను గుర్తుకు తెచ్చింది.

దాదాపు పదేళ్ల క్రితం....

❀ ❀ ❀

రాజమండ్రికి ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన సీతాదేవి, కొత్త వాటాలో సామాను సర్దుకుంటూ, ఎవరో గుమ్మంలో నిలబడ్డట్టనిపించి తల ఎత్తి చూసింది. అప్పటిదాకా నిలుచున్న అమ్మాయి చప్పున వెనక్కి తిరిగి వెళ్లిపోయింది.

'ఇంటి వాళ్ల అమ్మాయి కాబోలు! రేపన్నా వాళ్లను పరిచయం చేసుకోవాలి' అనుకుంటూ కాంప్‌కాట్ మీద మేనువాల్చింది సీతాదేవి.

❀ ❀ ❀

"ఏమిటే, అమ్మా, ఆవిడ అలా ఉన్నదీ! పెళ్లయినట్లు లేదు. లేకపోతే వెధవముండ అంటావా? టీచర్లాగా లేనేలేదేమే?" ఎవరో అమ్మాయి దీర్ఘాలు తీస్తూ అంటున్న మాటలు పక్కవాటాలోనించి వినిపించాయి.

చప్పున తాగుతున్న కాఫీ గ్లాస్ పక్కన పెట్టేసింది సీతాదేవి. ఇప్పుడు తను చూసిన అమ్మాయేనా ఈ మాటలాడేది? ఓరి, భగవంతుడా, ఇదేం భాష? అనుకున్నది వెగటుగా.

మర్నాడు పొద్దున్నే తలుపు చప్పుడై తీసింది.

"కొత్తగా వచ్చినట్లున్నారు, పిన్నిగారూ! ఏదీ, రాత్రి చూద్దామంటే పడనేలేదు. అన్నీ వసతిగా ఉన్నాయా?" అంటూ ఒకావిడ వంటింటి దాకా తొంగి చూచి ఇంకా గబగబా ఏవో మాట్లాడేస్తూంది. నిర్ఘాంతపోయి ఆవిడను నఖశిఖ పర్యంతం పరీక్ష చేసింది సీతాదేవి. నలిగిపోయిన చీర, జారిపోయిన ముడి, వాడి దారాలు కనబడుతున్న పూవులు, మెడనిండా, చేతినిండా రకరకాల నగలు... అమ్మో, ఈవిడకు ఈ నగలతో నిద్రెలా పడుతుందో? అనుకున్నది సీతాదేవి.

"మీవారున్నారా? లేక..." అన్న ప్రశ్నతో ఒక్కసారిగా మత్తు వదిలి, "లేదండీ..." అని ఇంకా ఏదో చెప్పబోయి, "ఏమిటే, అమ్మా, ఇక్కడున్నావ్? కాఫీ

ఇవ్వవా? ఆకలేస్తోంది" అని గునుస్తూ సరాసరి లోపలికి వచ్చిన అమ్మాయిని చూసి మరోసారి నోరు తెరిచింది సీతాదేవి. చెరిగిన తల, బంగారపు జడకుప్పెలు, నలిగిపోయిన పట్టు పరికిణీ, అప్పుడే ముఖం కడుక్కున్నట్లుంది. అక్కడే వంగి పరికిణీతో ముఖం తుడిచేసుకుంటూంది ఆ అమ్మాయి.

"ఆహాఁ! అయితే భర్త లేడన్నమాట..." అని ఏదో నిర్ణయానికి ఆవిడే వచ్చేసి, "అలా అడిగాననుకోకండి, ఒంటరి వారని, పిన్నీ... ఆఁ! అన్నట్లు ఇది మా అమ్మాయి, పేరు చెప్పవే!?" అంది భుజాన్నానుకుని నిలుచున్న కూతుర్ని మోచేత్తో పొడుస్తూ.

"రాజరాజేశ్వరి!" సిగ్గుపడుతూ చెప్పింది ఆ పిల్ల. మెలికలు తిరిగిపోతూ.

ఏం మాట్లాడాలో తెలియలేదు సీతాదేవికి.

"చూడండీ! పాలతన్నీ అదీ ఏర్పాటు చేస్తాను. మా పాలవాడే... మంచివాడు. నిన్న కాఫీ తెప్పించుకున్నట్లున్నారు. ఈ వేళ మా ఇంటి నించి పంపుతాను లెండి. ఏమన్నా కావాలంటే అడగండి. సంకోచించకండి. వస్తా... మళ్లీ పనుంది" అని రెండు తలుపులూ బార్లాగా తెరిచి వెళ్లిపోతూ, "అన్నట్లు మీ పేరు?" అంది ఆవిడ ఆగి.

"సీతాదేవి." సన్నగా, బిక్కచచ్చిపోయి చెప్పింది. తల్లి వెనకాలే లేగదూడలా వెళుతూ, పులుక్కున చూసి మరీ వెళ్లింది ఆ అమ్మాయి.

'పిల్ల బాగానే ఉన్నది కానీ బాబోయ్' అనుకుంటూ లోపలికి వెళ్లింది సీతాదేవి.

"ఇదుగోనండి కాఫీ!" అంటూ ఒక పొడుగాటి గ్లాసులో పొగలు కక్కుతున్న కాఫీ అడుగున ఓణీ ఒత్తుగాపెట్టి పట్టుకు వచ్చింది రాజరాజేశ్వరి.

"ఎందుకమ్మా శ్రమ..." అన్నది సీతాదేవి.

"అదేం... మేం తాగడంలే?!" అని ఠపీమని టేబిల్ మీద కాఫీ పెట్టి, బెడ్డింగ్ మీద కూర్చుంది. ఆ పిల్లవి పెద్దకళ్లు. ఆ కళ్లలోని లేడి చూపులబెదురు, మంచులాంటి స్వచ్ఛత సీతాదేవిని ఇబ్బందిపెట్టాయి.

"చూడు, పాపా... ఆఁ! అన్నట్లు నిన్ను ఇంట్లో ఏమని పిలుస్తారు?"

"రాజూ అంటారండీ."

"అహాఁ! అయితే, నేను 'రాజీ' అని పిలవనా?" మెల్లిగా అడిగింది.

"అలాగే పిలవండి. నాకు అలా అంటేనే ఇష్టం. ఎందుకంటే... ఎందుకంటే..." మెల్లిగా జడ కుప్పెలు సవరించుకుంటూ సిగ్గుగా అంది.

"ఎందుకని?"

"మామయ్య నన్ను అలాగే పిలుస్తాడండీ!" అంది సిగ్గుగా.

ఆ పిల్ల చెక్కిళ్లమీద రోజాలు పూశాయి. చాలా అర్థమైనట్లుంది సీతాదేవికి.

"మీ మామయ్య అంటే ..." కాఫీ చల్లారపెట్టుకుంటూ అడిగింది.

"మామయ్య అంటే ... మా శేఖరం మామయ్యండి ... డాక్టర్ అయిదో సంవత్సరం చదువుతున్నాడు. చదువు అయిపోగానే నన్నిచ్చి చేస్తారు" అంది.

మరొకసారి నిర్ఘాంతపోయింది సీతాదేవి. 'ఏమిటీ పిల్ల, ఈ ఆలోచనలు?' అనుకుంది.

"మీ మామయ్యకు నువ్వంటే ఇష్టమేనా మరి?" నవ్వుతూ అడిగింది.

"ఇష్టమేననుకుంటా! కానీ, ఎప్పుడూ ఏడిపిస్తాడండి–కోతి, పెద్ద పేరక్కా అదీ ఇదీ అని." గారాబంగా అన్నది.

"అన్నట్లు, రాజీ, నువ్వేం చదువుకున్నావ్?" కుతూహలంగా అడిగింది సీతాదేవి.

"ఆc! ఏదో వానాకాలం చదువులెండి. మనకూ, దానికీ చాలా దూరం. మా మామయ్య వచ్చినప్పుడల్లా చదువుకోవే అంటాడు కానీ, నా ఒంటి కది పట్టదుగా! మరేం చెయ్యనూ?" అంది దీర్ఘం తీస్తూ.

ఏదో తెర తీసినట్లైంది సీతాదేవికి – ఈ పిల్లను పెళ్లి ఎలా చేసుకుంటాడా అని!

"నీకు కట్నం అదీ బాగా ఇస్తారా, రాజీ?" అంది సీతాదేవి, ఏమిటీ ప్రశ్నలు. ఈ పిల్లతోపాటు నాకూ అతి ఎక్కువైపోయిందనుకుంటూ.

"ఆc! చాలా ఇస్తారండి. వంద కాసుల బంగారం పెడుతుంది మా అమ్మ. పొలం, కారు అన్నీ ఇస్తారట. మీరు మా ఇంటికి వచ్చినప్పుడు చూపెడతాను, పెద్ద బీరువాడు స్టీలు సామాను దాచిందండి మా అమ్మ" అని చేతులు తిప్పుతూ, కళ్లు తిప్పుతూ చెబుతున్న ఆ పిల్లను మతిపోయినట్లు చూసింది సీతాదేవి.

"రాజీ! మీ మామయ్య బాగుంటాడా?" నవ్వుతూ అడిగింది సీతాదేవి.

"చాలా బాగుంటాడు, టీచర్!... దొరబాబులా ఉంటాడు" అంది రాజీ. ఆ మాటలు చూసి అదురుకున్న సీతాదేవి ఆ అమ్మాయి కళ్లలోని ఆరాధన చూసి ఆశ్చర్యపోయింది.

"ఇదుగో, ఈ ఉంగరం మా తాతయ్య నేను పెద్దమనిషైనప్పుడు ఇచ్చాడండీ! ఇదే ప్రధానపు ఉంగరమనుకోవే, అమ్మాయీ, అన్నాడండీ! అందుకే నాకు ఇదంటే చాలా ఇష్టం. ఎప్పుడూ వేలునుంచి తియ్యను" అని ఒక తెల్లరాళ్ల ఉంగరం చూపించింది రాజీ. 'ఈ పిల్లకు అరమరికలు లేవు కాబోలు' అనుకుంది సీతాదేవి.

"ఒసేయ్, రాజీ! ఎక్కడికి వెళితే అక్కడే పాతుకుపోతా వేమే?" అన్న కేక విని, "వస్తానండి! అమ్మ పిలుస్తోంది" అని ఒక్క గెంతులో బయటికి వెళ్లి, మళ్లీ వెనక్కి తిరిగి, "ఏమండి! మిమ్మల్ని ఏమని పిలవను?" అన్నది.

"సీతా టీచర్ అని పిలు" అన్నది.

"సరే, వస్తాను, టీచర్!" అని పరుగెత్తింది రాజీ.

ఆ పిల్ల వెళ్లినా, ఎందుకో ఆ అమ్మాయి జ్ఞాపకాలు చాలాసేపు ఆ ఇంట్లో మిగిలి ఉన్నట్లనిపించాయి సీతాదేవికి.

మరో నాలుగైదు రోజుల తరవాత ఒక సాయంత్రం స్కూటర్ చప్పుడు విని కిటికీలోంచి చూసింది సీతాదేవి. ఎవరో చాలా అందమైన కుర్రాడు రాజీ వాళ్ల ఇంట్లోకి వెళ్లాడు. ఎవరై ఉంటాడా అనుకుని జవాబు వెదుక్కునే లోపలే, రాజీ అతణ్ణి చెయ్యిపట్టుకు లాక్కుని వచ్చి, "మా శేఖరం మామయ్య, టీచర్!... నే చెప్పలే, ఈవిడే సీతా టీచర్. చాలా మంచివారు" అంటూ గబగబా మాట్లాడేస్తూంది రాజీ.

"నమస్కారమండీ! ఏమిటి, మా రాజీ మీకు ఫ్రెండేమిటి!?" అంటూ కుర్చీలో కూర్చున్నాడతను.

మెల్లిగా కబుర్లు సాగాయి. అతని చదువు సంగతి, కాలేజీ సంగతి చాలా చెప్పాడు. మధ్యలో ఏదో దీర్ఘంతీస్తూ మాట్లాడబోయిన రాజీని "నువ్వూరుకో" అని కసిరాడు. కాసేపాగి, "మా మొద్దును కాస్త సంస్కరించండి, టీచర్!" అన్నాడు నవ్వుతూ.

"నాకేం, నేను బాగానే ఉన్నా!" ఉక్రోషంగా అంది రాజీ.

"ఆహా! చాలా బాగున్నావు. దీనికంతటికి కారణం మా అక్కయ్య టీచర్!" అన్నాడు.

"మధ్య అమ్మ నెందు కంటావు? అయినా, మీవాళ్ల కిదేం జబ్బు? ఆ తాతయ్యా అంతే ..." అంది.

"ఏడిశావులే. వెళ్లి అమ్మ నడిగి కాఫీపట్రా" అన్నాడు.

"ఇదుగో తీసుకువస్తా" అంటూ వెళ్లింది రాజీ.

"చూశారా, టీచర్! దాని ముది మాటలు. చాలా గోలగా ఉంది దీని వ్యవహారం. పైగా అక్కయ్య సపోర్ట్! ఎందుకులెండి" అన్నాడు.

"ఆ పిల్ల మనసు మంచిది, బాబూ!" అంది సీతాదేవి.

"నిజమే, టీచర్! కానీ, మిగతావి భరించడం ఎట్లా?" అన్నాడు. ఈలోపల రాజీ వచ్చింది. అతను వెళ్లేముందు – "మా రాజీకి చదువు చెప్పండి, టీచర్! మిమ్మల్ని చూసిన తరవాత ఇన్నాళ్లకి ఈ కొంపలో సంస్కారం ప్రవేశించిందనిపించింది. కనీసం మీరన్నా ట్రై చెయ్యండి" అని వెళ్లాడు.

ఆనాటినుండి సీతాదేవి వాత్సల్యం శేఖర్‌ను చాలా విధాల ఆకట్టుకున్నది. అతని మాటపై సీతాదేవి రాజీని మెట్రిక్ కట్టిద్దామని చాలా ప్రయత్నించింది. కానీ, పెద్ద ఆలోచనలు, అనవసరపు వ్యాఖ్యానాలు అలవాటైన రాజీ దగ్గరకు సరస్వతీదేవి ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేకపోయింది. రాజీ కట్టూ, బొట్టూ, మాటలలోనన్నా మార్పు తెద్దామని ప్రయత్నిస్తే, అలవాటు లేని రాజీ ఎదురు తిరిగింది. పైగా, రాజీ వాళ్లమ్మ వచ్చి, "ఈ టక్కులు సంప్రదాయం కలవాళ్లకు చెల్లవులెండి" అని గుండెల్లో గుచ్చుకునేటట్లు అన్నది. ఆ తరవాత రాజీ విషయంలో ఎక్కువగా సీతాదేవి కలగజేసుకోలేకపోయింది.

రోజులు గడిచిన కొద్దీ రాజీలో మంచితనం సీతాదేవిని ఆకట్టుకున్నది. ఇంట్లో పిల్లలా తిరిగే రాజీలో వెన్నెల లాంటి మంచితనం చూసి, ఈ అమ్మాయి జీవితం ఎట్లా ఉంటుందోనని భయపడేది సీతాదేవి.

రాజీ కథకు ప్రస్తావన సంవత్సరం తరవాత ఎదురింట్లో లలిత ప్రవేశించిన తరవాత జరిగింది. సన్నగా బాపూ బొమ్మలా, అతి నాజూగ్గా, సభ్యతా సంస్కారాలు ఉట్టిపడేటట్లుండే లలిత పి.యు.సి. ప్రైవేటుకని సీతాదేవి దగ్గరకు వచ్చింది. ఏదో ఆఫీసులో క్లర్క్‌గా పనిచేసే లలిత తండ్రికి నలుగురు ఆడపిల్లలు. లలిత పెద్దపిల్ల. "ఎంత బాగుంది, టీచర్, ఆ అమ్మాయి!" అని లలితను చూసి రాజీ నోరు తెరిచింది. నవ్వుకుంది సీతాదేవి. నిజానికి రాజీకన్న అందం తక్కువ, రంగు తక్కువ లలితకు. కానీ, ఆ అమ్మాయికి పొందిక అందాన్నిచ్చింది.

"టీచర్!" అంటూ ఒక రోజు లోపలికి వచ్చాడు శేఖర్. ఒక్కసారి తన విశాలమైన కనురెప్ప లెత్తి అతని వంక మౌనంగా చూసి తల దించుకున్నది అక్కడే ఉన్న లలిత. ఆ అమ్మాయి వంకే చూస్తూ నిలబడ్డ శేఖర్‌కు అక్కడే ఉన్న రాజీ లలితను పరిచయం చేసింది. బొమ్మల పరికిణీ మీద పువ్వుల నైలాన్ ఓణీ, జూకాలు, ముక్కుపుడకతో ఉన్న రాజీ, లేత రోజారంగు చీరతో అందంగా తలుపు కానుకుని ఉన్న లలిత ఒకేసారి శేఖర్ కళ్లబడ్డారు. లలితను చూసిన శేఖర్ కళ్లలో మెచ్చుకోలు అర్థమైనా, అది మరింత దూరం దారి తీస్తుందని ఊహించలేదు సీతాదేవి. ఆ తరవాత శేఖర్ వారంలో నాలుగు రోజులు అక్కయ్యగారి ఇంటికి రావడం కేవలం లలితకోసమేనని అర్థం కావటానికి చాలా కాలం పట్టలేదు ఆవిడకు.

"టీచర్! కొత్త వడ్డాణం. ఈ వేళే తెచ్చాడు కంసాలి. చూడండి" అంటూ పరుగెత్తుకుంటూ వచ్చింది రాజీ. నైలాన్ ఓణీ మీద బెల్టు పెట్టుకున్నట్లు పెట్టుకుంది. అక్కడే ఉన్న లలిత, శేఖర్ నవ్వుతూ చూసుకున్నారు.

"బాగుందా మామయ్యా, బాగుందా?" అడిగింది ఆత్రంగా.

"నీ ముఖంలా ఉంది, భోషాణానికి పెట్టినట్లు" అన్నాడు నవ్వుతూనే శేఖర్.

కోపం తెచ్చుకోకుండానే వడ్డాణం తీసేసింది రాజీ.

"మీరు పెట్టుకోండి లలితా, చూద్దాం" అన్నాడు శేఖర్.

"వద్దండి, నాకు అలవాటు లేదు" అంది లలిత తడబడుతూ.

"ఫరవాలేదు... చూద్దాం... ఆవిడకు ఇవ్వవే, రాజీ!" అన్నాడు శేఖర్.

సన్నటి నడుం బారెడు జడ, పొందికగా కట్టిన చీరలో ఉన్న లలితకు వడ్డాణం చాలా అందంగా ఉంది. అదోలా శేఖర్ వంక చూసి "ఎలా ఉంది?" అంది లలిత.

ఆ చూపులు చూడగానే చాలా విషయాలు అర్థమైనాయి సీతాదేవికి.

"చూశావా, ఆ అమ్మాయికి ఎంత బాగుందో? నీ నడుమూ ఉంది రౌండ్ టేబిల్‌లా" అన్నాడు శేఖర్ రాజీని చూస్తూ.

మాట్లాటలేదు రాజీ. ఒక్కసారి కళ్లెత్తి చూసింది. ఆ చూపులు దెబ్బతిన్న లేగ దూడ చూపుల్లా ఉన్నాయి. సీతాదేవికి గుండెలు మెలిపెట్టినట్లైంది మెల్లిగా వడ్డాణం తీసుకుని గుడ్డలో నీళ్లు కుక్కుకుంటూ వెళ్లిపోయింది రాజీ. ఆరోజే మొదటిసారిగా రాజీ బాధపడడం చూసింది సీతాదేవి.

"టీచర్! నేను వచ్చి చాలాసేపైంది. అక్కయ్య, రాజీ బయటికి వెళ్లినట్లున్నారు. ఒకవేళ అక్కయ్య వచ్చి అడిగితే మీ ఇంట్లో భోజనం చేశానని చెప్పండేం" అన్నాడు శేఖర్ ఒకనాడు వచ్చి.

"అదేం?" అంది సీతాదేవి ఆశ్చర్యంగా.

"నేను లలిత వాళ్లింట్లో భోజనం చేశాను. ఇప్పుడు తెలిస్తే గోల పెడుతుంది. ప్లీజ్!" అన్నాడు.

అతని వంక పరీక్షగా చూసింది సీతాదేవి. ఆ చూపులు తప్పించుకుంటూ వెళ్లిపోయాడు శేఖర్.

"కాబేజీ కూరా, బీరకాయ పప్పు, గారెలూ ..." ఏమిటేమిటో చెపుతున్నాడు రాత్రి తొమ్మిదింటికి వచ్చిన వాళ్ల అక్కకు శేఖర్. "ఇన్ని చేసిందిటరా ఆవిడా?" అని ఆశ్చర్యపోతూంది రాజీ వాళ్లమ్మ.

తొమ్మిదింటికి అన్నం తింటూండగా వచ్చింది రాజీ.

కంచంలోని సాంబారూ, కూరా చూస్తూ కూర్చుంది.

"ఏమిటి రాజీ, చూస్తున్నావు? అన్నం తింటావా?" అడిగింది సీతాదేవి ఆప్యాయంగా.

"వద్దు టీచర్, తిన్నాను" అంది ఎటో చూస్తూ.

"టీచర్!" అంది కాసేపాగి.

"ఏమమ్మా?"

"మామయ్య లలితా వాళ్లింట్లో భోజనం చేశాడా?"

"ఏం, అలా అడిగావ్?" అంది ఆశ్చర్యంగా సీతాదేవి.

"ఏం లేదు" అంటూ వెళ్ళిపోయింది. అమాయకురాలైన రాజీలో అసూయ పొదులు కొలుపుతూంది. కానీ, కేవలం అసూయతోనూ, అతి ప్రేమతోనూ లలితతో పోటీ పడే అర్హత రాజీకి లేదు.

లలిత కళ్లు, మాట, నడక, కట్టు అన్నీ చాలా అందంగా ఉండేవి చూడ్డానికి. దానికి తగ్గట్లు అందరి వంకా మామూలుగానూ, శేఖర్ వంక మాత్రం కోటి అర్థాలు నిండిన చూపులను జల్లి, నిమిష నిమిషానికీ అతణ్ణి కట్టి పడేసేది లలిత. రాజీ ఎదురుగా ఉంటే ఆ ఇద్దరి మధ్య వ్యత్యాసంవల్లనేమో అది మరింత కొట్టవచ్చినట్లు కనిపించేది. కొన్నాళ్లకి లలితలా చీర కట్టాలనీ, కళ్లు దిద్దుకోవాలనీ ప్రయత్నించి, అభ్యాసం లేక అభాసై, శేఖర్ వెక్కిరించాడని రెండు రోజులు అన్నం తినక బాధపడింది రాజీ. కానీ, ఆమె ఏనాడూ మంచితనం లలితను గురించి వాళ్లమ్మకు

చెప్పనివ్వలేదు. క్రమంగా రాజీ కళ్లలో నీలి నీడలు కనబడసాగాయి. వాటి అర్థం సీతాదేవికి తెలుసు. కానీ, ప్రయోజనం?

"నా నిర్ణయం తప్పంటారా, టీచర్?" అడిగాడు శేఖర్ ఒకరోజు.

లలితను తప్ప ఎవర్నీ పెళ్లిచేసుకోడట. ఏమనగలదు సీతాదేవి?

"కానీ, రాజీ నీ మీద ఆశలు ..." నసుగుతూ అంది.

"అదొక పిచ్చిది, టీచర్! ఇట్టే మరిచిపోతుంది. అయినా, నేను రాజీని ఎలా చేసుకోను, టీచర్?" అన్నాడు తేలిగ్గా.

"అలా అయినప్పుడు నువ్వు మొదట్లోనే రాజీ ఆశలు తుంచెయ్యాల్సింది, శేఖర్!" అంది సీతాదేవి బాధగా.

"నేను రాజీకి ఎటువంటి ఆశలూ కల్పించలేదు, టీచర్! చిన్నప్పటి నుంచీ దాని మొగుణ్ణి నేనే నన్న భావం దానికి ఈ పెద్దవాళ్ళంతా కలిగించారు. దానికి నే నెంతవరకు బాధ్యుణ్ణి? ఇంకొక విషయం టీచర్! చిన్నప్పటినుంచీ మా అక్కది డామినేటింగ్ మనస్తత్వం. మా అందరి మీదా అజమాయిషీ ఆవిడదే. ఆవిడ కూతుర్ని చేసుకుని, ఆవిడకు జీవితాంతం మరింత లొంగి పడి ఉండడం నా కిష్టం లేదు. పైగా, లలితను చూసి ఉండకపోతే రాజీ గురించి ఏమన్నా ఆలోచించే వాడినేమో కానీ, ఇప్పుడు నా నిర్ణయం మారదు. రాజీ గురించి మనం బాధపడక్కర్లేదు టీచర్! దానికి మా అక్కకు ఉన్న ఐశ్వర్యంతో నాకన్న నాలుగు రెట్లు గొప్ప మొగుణ్ణి తేగలదు. వెండి పానకపు బిందెలు, బంగారపు తొడుగులతో లలిత తండ్రి పెండ్లి చెయ్యలేదు. అట్లాంటి పేద కుటుంబంలోని గుణవంతురాలైన పిల్లను ఏ మాత్రం ఐశ్వర్యానికి తక్కువ లేని నన్ను కేవలం కట్నానికి లోబడి అన్యాయం చెయ్యమంటారా? మీరే చెప్పండి, టీచర్!" ఆవేశంగా అడిగాడు శేఖర్.

ఏం మాట్లాడలేకపోయింది సీతాదేవి.

అందరికీ ఎదురుతిరిగి రిజిస్టర్ మారేజ్ చేసుకున్నాడు శేఖర్ లలితను. ఆ విషయం వినగానే లలిత ఇంటిమీదపడి, వీలైనన్ని శాపనార్థాలు పెట్టి 'నా కూతురికి రాజా లాంటి సంబంధం తెస్తాను' అని శపథాలు పట్టి కక్ష తీర్చుకుంది రాజీ తల్లి. ఆ వేడిలో సీతాదేవిని కూడా పెట్టవలసిన నాలుగూ పెట్టింది. కానీ, రాజీమాత్రం ఏం మాట్లాడలేదు. ఆ మూగ చూపుల్లోని బాధ ఒక్క భగవంతుడికే తెలియాలి.

ఆ పెళ్ళి రోజు మాత్రం --

పెట్టె మీద కూర్చుని, గడ్డం కింద మోకాలు బోటు పెట్టి, "టీచర్!" అన్నది.

"ఏమమ్మా?"

"ఈపాటికి మామయ్య పెళ్లయిపోయి ఉంటుంది కదూ?" అంది. అంతే. వెంటనే కళ్లు తుడుచుకుంటూ లేచి వెళ్లిపోయింది.

మూడు నెలలు తిరక్కుండానే రాజీకి పెళ్లి నిశ్చయం చేశారు. "రాజాలాంటి సంబంధం" అన్నది వాళ్లమ్మ పెళ్లి కొడుకుని చూసి వచ్చి. పెళ్లివారు పొగాకు వ్యాపారంలో లక్షలు ఆర్జించారట. చాలా చెప్పింది ఆవిడ.

కానీ, పెళ్లినాడు బంగారం గొలుసుతో మెరిసిపోతున్న నల్లటి మోటు పెళ్లి కొడుకూ, "ఇంకొంచెం పెద్ద రవ్వల దుద్దులు పెడతారనుకున్నాం, వదినా! ఇంతటితో సరిపుచ్చా రేమిటీ?" అనే అత్తగారూ, ఖరీదైన నైలాన్ చీరలు బాగా పైకి కట్టి, వీలైనన్ని నగలు దిగేసుకున్న ఆడబడుచులూ ... ఈ వాతావరణమంతా చూసి, బంగారపు బొమ్మలా ఉన్న రాజీని చూసి బాధపడింది సీతాదేవి. 'నాకు రాజీ మీద ఆప్యాయతే కానీ, రాజీకి అంతకన్నా మంచి సంబంధం దొరకడానికి తగిన తీరుగా పెంచలేదుగా వాళ్లమ్మ' అనుకున్నది సీతాదేవి విరక్తిగా.

"చూశావా, టీచర్! మామయ్య రానేలేదు" అంటూ కళ్లనీళ్లు పెట్టుకున్నది రాజీ, పీటల మీదకి వెళ్లబోతూ. శేఖర్ అప్పటికే బొంబాయిలో సెటిల్ అయాడు. కళ్లు తుడిచి పంపించింది సీతాదేవి.

అక్కడే స్తంభానికి ఆనుకుని నిలుచున్న ఆవిడకు–తను, చిన్ననాటి స్నేహితుణ్ణి ప్రేమించడం, అతను కట్నానికి, సౌందర్యానికి అమ్ముడుపోవడం, ఆ తరవాత తను వివాహం మీదే ఇచ్ఛ చంపుకుని బ్రతకడం–ఇవన్నీ గుర్తుకు వచ్చాయి.

'భగవాన్! ఆకర్షణ లేనివాళ్లకు ప్రేమరాహిత్యాన్నెందు కివ్వవయ్యా?' అనుకున్నది సీతాదేవి నిట్టూరుస్తూ.

ఏడోనెల సూడిదలకని వచ్చింది రాజీ. మరింత బాగుంది.

"సూడిదలకని అమ్మ రాళ్ల గాజులు చేయించింది, టీచర్!" అంది విరక్తిగా నవ్వుతూ.

ఆ నవ్వులోని నిస్పృహకు ఆశ్చర్యపడి, "ఎలా ఉంది, రాజీ, జీవితం?" అని మాట తప్పించింది.

"బాగానే ఉన్నది కానీ, మామయ్య గురించి ఏమన్నా వార్తలు తెలుస్తున్నాయా, టీచర్?" అంది కుతూహలంగా.

అదిరిపోయి చూసింది సీతాదేవి. 'ఈ పిల్ల ఇక అతణ్ణి మరిచిపోదా?' అనుకున్నది. కానీ, ఆ అమ్మాయి గడుపుతున్న అనాగరిక వాతావరణంలో మామయ్య తలపులు ఒయాసిస్‌లని ఆవిడకు తరవాత తెలిసింది. రాజీ కోరిన జీవితం శేఖర్‌తో. కానీ, దానికి రాజీని ఎంతవరకు అర్హురాలిని చేసింది వాళ్లమ్మ!

"ఫారిన్ వెళ్లాడటమ్మా! లలితకూడా వెళ్లిందిట. ఉత్తరం రాశాడు."

"ఉహుఁ!" అంది రాజీ, దీర్ఘంగా ఏదో ఆలోచిస్తూ.

"మీ అత్తవారు మంచివాళ్లేనా, రాజీ, నిన్ను బాగా చూస్తారా?" అంది మరోసారి మాట మారుస్తూ.

"ఆహా! వెండి గిన్నెలో వేడి అంబలి తాగే రకాలు... వాళ్ల గోల ఎందుకు టీచర్, ఇప్పుడు?" అని మాట మార్చింది. రాజీ మనస్తత్వంలో చాలా మార్పు వచ్చింది. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేది.

"దిక్కుమాలిన వెధవ. తమ్ముడనుకోవడానికే సిగ్గు. నా బిడ్డ జీవితం నాశనం చేశాడు" అని తిట్టుకునేది వాళ్లమ్మ రోజు కొకసారి శేఖర్ని. "ఊరుకో, అమ్మా!" అని అక్కడినుంచి వెళ్లిపోయేది కానీ, మరోమాట అనేది కాదు రాజీ.

ఒకరోజు తెల్లవారుజామున ఎవరో తొందరగా తలుపులు తడుతూంటే, ఉలిక్కిపడి లేచి తలుపులు తీసింది సీతాదేవి. రాజీ వాళ్లమ్మ! శేఖర్ పెళ్లి అయినప్పటినుంచి ఆవిడ సీతాదేవితో ముభావంగానే ఉండేది. ఇలాంటిది ఈ వేళప్పుడు...

"రాజీకి నెప్పులొస్తున్నాయి టీచర్! కొంచెం తొందరగా తోడువస్తారా?" అంది ఆవిడ ఖంగారుగా. వెంటనే అందరూ పరుగెత్తారు హాస్పిటల్‌కు. రాజీ తండ్రి ముఖంలో కత్తివాటుకు నెత్తురు లేదు. ఆ కుటుంబంలో ఆయన అంతర్వాహిని వంటివాడు. ఆయన మూగబాధ సీతాదేవిని మరింత కలచివేసింది. వెంటనే ఆపరేషన్ చెయ్యాలన్నది లేడీ డాక్టర్.

ఆపరేషన్ థియేటర్‌కు తీసుకుని వెళుతూ, "ఒకసారి వచ్చి అమ్మాయిని చూడండి" అన్నారు నర్సులు. గోలపెడుతూ పరుగెత్తారు తల్లీ, తండ్రీ. సీతాదేవి తలుపు దగ్గరే ఆగిపోయింది. 'భగవంతుడా! రాజీని రక్షించు' అనుకున్నది.

"సీతాదేవిగారూ! మిమ్మల్ని పిలుస్తోంది" అంటూ కళ్లనీళ్లు ఒత్తుకుంటూ వచ్చింది రాజీ తల్లి.

మెల్లిగా లోపలికి వెళ్లింది సీతాదేవి. తెల్లటి గుడ్డ మెడదాకా కప్పారు. ముఖమంతా ఎర్రబడి ఉంది. కళ్లలో నీళ్లు తిరుగుతున్నా, పెదవులు నవ్వాయి.

"రాజీ!" అంటూ చప్పున వెళ్లి చెయ్యి పట్టుకుంది సీతాదేవి, వెచ్చగా ఉన్నది చెయ్యి.

"నమస్కారాలు, టీచర్!" అంది రాజీ, రెండు చేతులూ జోడించి.

దుఃఖం పొంగుకు వచ్చింది సీతాదేవికి. "ఛీ! అదేమిటి? నీకేం భయంలేదు..."

"లేదు, టీచర్, నాకు తెలుసు ఏం జరిగేది..." అంది పెదవి నొక్కిపడుతూ.

"అమ్మా, రాజీ!" అని కళ్లకు కొంగు అడ్డం పెట్టుకున్నది సీతాదేవి.

"టీచర్!" మళ్లీ పిలిచింది రాజీ.

"ఏమమ్మా?"

"ఇదుగో, టీచర్! ఇది నా జ్ఞాపకంగా మామయ్య కివ్వండి. రాజీని మామయ్య మరిచిపోయినా, మామయ్యను రాజీ మరిచిపోలేదని చెప్పండి" అని దుఃఖం ఆపుకోలేక రెండు చేతులతో ముఖం దాచుకున్నది రాజీ.

స్తబ్ధురాలై పోయింది సీతాదేవి.

"నోనో... షీఈస్ ఎమోషనల్... మేడమ్ ప్లీజ్!" అన్నారు నర్సులు- "వెళ్లిపొండి" అనే అర్థంతో.

తన చేతుల్లో రాజీ ఉంచిన తెల్లరాళ్ల ఉంగరాన్ని చూస్తూ అలాగే నిలబడిపోయింది సీతాదేవి.

"వెళుతున్నాను, టీచర్! మీ రాజీని మరిచిపోకండి..." అని 'ఇక వెళ్లండి' అన్నట్లు సంజ్ఞ చేసింది.

సీతాదేవి కన్నీటి పొరలలోనించి రాజీ చేతులు జోడించి నమస్కారం చెయ్యడం కనిపించింది. "అమ్మా, రాజీ!" అని కొంగు అడ్డం పెట్టుకుని బయటికి వచ్చింది.

ఆపరేషన్ థియేటర్ బయట గడిపిన గంటా యుగంలా ఉన్నది అందరికి. కానీ, రాజీ ప్రాణాలు ఆపరేషన్ టేబుల్ మీదే పోయాయి. డాక్టర్లు ఏవో కారణాలు చెప్పినా, రాజీ కోరి ఈ చావు తెచ్చుకున్నదనిపించింది సీతాదేవికి.

'మీరంతా రాజీ చావుకు కారణం...' అని కసిగా తిడదామనిపించి ఒక్కసారిగా వెనక్కు తిరిగిన సీతాదేవికి గుండెలవిసేలా ఏడుస్తున్న రాజీ తల్లి తండ్రులు కనబడ్డారు. ఏమనగలదామె? ఆడపిల్ల జీవితానికి ఏది కావాలో అది ఇవ్వలేని ఈ ప్రేమలకు, ఆప్యాయతలకు అర్థం ఏమిటి? అనుకున్నది.

సీతాదేవి ప్రస్తుతం ప్రశాంతంగా రిటైర్డ్ దశ గడుపుతున్నది. ఎంతో మంది విద్యార్థులకు స్నేహితురాలై తీర్చిదిద్ది వృద్ధిలోకి తెచ్చింది. ఎన్నో కుటుంబాలను ఆదుకున్నది. కానీ, ఆవిడకు రాజీ గుర్తుకు వచ్చినప్పుడల్లా దెబ్బతిన్న పావురంలాగా అయిపోయి, ఈ తృప్తి అంతా అణిగిపోతుంది.

వృద్ధురాలు, బ్లడ్‌ప్రెషర్ పేషెంటు అయిన సీతాదేవి గతానికి తట్టుకోలేక ఆ రాత్రి నిద్రకు దూరమై పోయింది. మెల్లిగా ఏదో గొణుక్కుంటూ ఆ ఉంగరం తీసి దాచింది.

❀ ❀ ❀

"టీచర్! వెళ్లిపోతున్నాను... ఈసారి సమ్మర్ ట్రిప్ వేద్దామనుకుంటున్నాం. అప్పుడు తప్పకుండా మీ దగ్గరకు వచ్చి రెండు రోజులుంటాం. వస్తా, టీచర్!" అని కాళ్లకు వంగి దణ్ణం పెట్టింది, మర్నాడు సాయంత్రం వచ్చిన లలిత.

"తప్పకుండా రండి ... శేఖర్‌ను చూసి పదేళ్లు దాటింది... ఏమిటో, ఆ ఊరు మారగానే విశేషాలు తెలియకుండా పోయాయి" అంది సీతాదేవి.

"నమస్తే, టీచర్!" అంది పాప, ముద్దుగా లేత చేతులు జోడించి.

"అయ్యో, తల్లీ! నీకూ టీచర్నే ... మళ్లీ నీ చేత కూడా ఎ, బి, సి, డిలు రాయిద్దామనే ఉన్నదమ్మా! ఏదీ మరి... ముసిల్దాన్నైపోయానుగా!" అని మృదువుగా పాప నుదుట ముద్దు పెట్టుకుంది. ఏదో ఆలోచన వచ్చి మెల్లిగా వెళ్లి, పెట్టెతీసి, ఆ తెల్లరాళ్ల ఉంగరం తీసి, "పాపా! చెయ్యేదీ?" అని ముద్దుగా ఉన్న పాప వేలికి వణుకుతూ ఆ ఉంగరం తొడిగింది.

'రాజీ .... నీకు ఇది తృప్తి కలిగిస్తుందనుకుంటా నమ్మా! ...' అనుకున్నది మనస్సులో, దుఃఖం ఆపుకుంటూ.

వెంటనే,"అయ్యో! ఉంగరం వదులైనట్లుంది. జాగ్రత్త తీసిదాచమ్మా, లలితా! పెద్దదైన తరవాత పెట్టు. అది ... అది కానుకమ్మా!" అంది వణుకుతున్న గొంతుకతో.

"ఎందుకు, టీచర్, ఇప్పుడివన్నీ ..." అంటూ ఉంగరం తీసి, ఒకసారి దానివంకా, సీతాదేవి వంకా మార్చి మార్చి చూసి, వెంటనే, "వస్తాను, టీచర్! ..." అని పాప నెత్తుకుని టాక్సీ ఎక్కింది లలిత.

❀ ❀ ❀

మరొక వారం రోజుల తరవాత .... భోజనం చేసి పడక కుర్చీలో పడుకుని విశ్రాంతి తీసుకుంటున్న సీతాదేవికి 'పోస్ట్' అన్న కేక వినబడింది. మెల్లిగా ఉత్తరం తీసుకుని చించింది..

"ప్రియమైన సీతా టీచర్‌కు" ... అని చదివి 'ఎవరబ్బా?' అనుకుంటూ సంతకం చూసింది. "లలిత" అని ఉన్నది. మెల్లిగా వెళ్లి పడకకుర్చీలో కూర్చుని ఉత్తరం చదవడం ప్రారంభించింది.

"ప్రియమైన సీతా టీచర్‌కు అనేక నమస్కారాలతో-

మీరు నా మీద చూపించిన వాత్సల్యానికి ఎంతో కృతజ్ఞురాలిని. టీచర్! మీరు ఎంతో అభిమానించిన రాజీకి శేఖర్‌ని దూరం చేశానని, మీరు నన్ను ద్వేషిస్తారని భయపడుతూ వచ్చాను. కాని, మీ అప్యాయతకు ద్వేషం తెలియదని మరొకసారి తెలుసుకున్నాను.

మీరు పాపకు ప్రెజంట్ చేసిన ఉంగరం ఎవరిదో మరిచిపోయా ననుకున్నారా, టీచర్? దాన్ని చూడగానే ఒక్కసారి నా గుండె కలుక్కుమన్నది. రాజీ అనుభవించవలసిన జీవితం నాది అయింది. అవును, టీచర్! స్వార్థంతో, పట్టుదలతో శేఖర్ ప్రేమను గెలుచుకున్నాను. ఐశ్వర్యం ఉండి, అందం ఉండి కూడా రాజీ శేఖర్‌కు దూరమవడానికి కారణం ఏమిటో తెలుసా? కొంతవరకు పెంపకం, టీచర్! అన్నీ ఇవ్వగలిగి, ఆడపిల్లకు కావలసిన అసలు శిక్షణ ఇవ్వలేని తల్లుల వల్ల ఈ దేశంలో చాలామంది ఆడపిల్లలు మనస్సు ఉండి కోరింది పొందలేకపోతున్నారు. జీవితానికి కావలసింది మనస్సే, టీచర్! కానీ, అదొక్కటి చాలదు. ఆడపిల్లకు అసలు సరిపోదు. టీచర్! రాజీతో అన్నాళ్లు పరిచయం ఉండి కూడా శేఖర్ ఆ ఉంగరాన్ని గుర్తుపట్టలేకపోయాడు.

'పిచ్చి టీచర్, ఇంత ఖరీదైన ప్రజంటేష నిచ్చారేమిటి పాపకు?' అని నవ్వి ఊరుకున్నాడు. అది రాజీ ఉంగరమని నేను చెప్పలేదు, టీచర్! చెప్పి, శేఖర్ని పశ్చాత్తాపానికి గురి చెయ్యలేను. అందుకే చెప్పలేదు. నేను స్వార్థపరురాల్నే.

ఒప్పుకుంటాను. రాజీ నా తప్పులు ఎన్నింటినో క్షమించి ఉంటుంది. ఇది కూడా క్షమించే ఉంటుందనుకుంటాను.

కానీ, టీచర్! ... మీరనుకున్నట్లు నేను రాజీని మరిచిపోలేదు. మీరు మా పాప పేరు అడగడం మరిచిపోయారు. దాని పేరు రజని. అయినా, మేమంతా పిలిచేది 'రాజీ' అని!

నమస్కారాలతో,..

మీ...

-లలిత."

*(ఆంధ్రప్రభ వారపత్రిక - 31-10-1973)*

# గడ్డిపూలు

"వదినా! రెడీయా?" బైటనుంచి అడిగాడు శేఖర్.

"వస్తున్నాను. పదవయ్యా!" అంటూ ఎర్రఅంచున్న తెల్లరంగు గద్వాలు చీర ఒంటినిండా కప్పుకుని, మెళ్ళో చంద్రహారం సరిచేసుకుని బైటకు వచ్చింది స్వర్ణ. కారులో వెనక సీటులో కూర్చుంటూ, "పూలు, పళ్ళు అన్నీ కార్లో పెట్టించావా?" అని అడిగింది.

"ఆఁ! అయినా, అవన్నీ నీ డిపార్టుమెంటు. ఎందుకైనా మంచిది ఒకసారి చూడు-నేను దేవుడి కోసం గుడికి రావడంలేదు కదా వదినా?" అన్నాడు శేఖర్ నవ్వుతూ.

మాట్లాడకుండా అన్నీ సరి చూసుకుంది స్వర్ణ. శేఖర్ గుడికి రావడానికి గల కారణం ఆమెకు తెలుసు కనుక లోలోపలే నవ్వుకున్నది.

రాజారావుగారు ఆ ఊళ్ళోని ధనవంతుల్లో ఒకరు. ఫాక్టరీ బాధ్యతలన్నీ పెద్ద కొడుకుకు వదిలిపెట్టారు. కుటుంబ బాధ్యతలన్నీ పెద్దకోడలు స్వర్ణకు విడిచిపెట్టారు. సాయంత్రం ఆరు గంటలయ్యేటప్పటికి నిశ్చింతగా క్లబ్బుకు వెళ్ళిపోతారు. ఆయన రెండో కొడుకు శేఖర్. సరదాకొద్దీ ఏదో ఉద్యోగం అంటూ చేస్తున్నాడతను. ఐదుగంటల కల్లా ఆఫీసునుంచి వచ్చే అతని మీద అన్నగారు స్వర్ణను శుక్రవారం పూట గుడికి తీసుకువెళ్ళే బాధ్యత పెట్టారు. కానీ, అది ఒక కారణం అయినా, అతనికి అక్కడ బోలెడంత కాలక్షేపం. అక్కడికి వచ్చే రకరకాల అమ్మాయిలు, పాత స్నేహితులు, పూజారుల కక్కుర్తి, అమ్మవారి అలంకరణ, బ్లాక్‌మార్కెటీర్ల భక్తి. కొత్తదంపతుల అన్యోన్యత ... ఇలా బోలెడు కాలక్షేపం. నానారకాల అల్లర్లు చెయ్యొచ్చు భక్తి చాటున! స్వర్ణకు అది తెలుసు. అందుకనే నవ్వుకుంది. వదినంటే ఎంత చనువుందో, అంత గౌరవమూ ఉంది శేఖర్‌కు. తనకన్న ఆరేడు ఏళ్లు పెద్దదే అయినా, ఆమె తన ప్రవర్తనతోను, మంచితనంతోనూ ఆ గౌరవం సంపాయించుకుంది. సామాన్యసంసారుల ఇంటినుంచి లక్షాధికారుల కోడలైన స్వర్ణకు జీవితంలో ఆటూ, పోటూ అన్నీ తెలుసు.

'అయినా, ఆ అమ్మాయిని చూసి మారచ్చునేమో!' అనుకుంది. డ్రైవింగ్ సీట్లో ఉన్న శేఖర్‌ను పరీక్షగా చూసింది. దాదాపు ఆరడుగుల పొడుగుతో, పచ్చటి ఛాయతో, ఆకర్షణీయంగా కనిపించే అతను అందగాడికిందే లెక్క. అతని బట్టలు ఐశ్వర్యానికి చిహ్నాలు. అతని గుణం-అహంకారం, అమాయకత్వం-ఈ రెండింటి నేత. అందరి డబ్బున్న కుర్రాళ్ళలాంటివాడే అతను. కానీ, ఏమో...

కారు గుడి ముందు ఆగింది. ఒకసారి చుట్టూ కలియజూసి, కారు దిగింది స్వర్ణ. జనం చాలా త్రొక్కిడిగా ఉన్నారు.

ఆ రోజు శ్రావణ పౌర్ణమి, శుక్రవారం.

జనాన్ని తప్పించుకుంటూ పూలు, పళ్ళు పట్టుకుని ముందుకు వెళుతోంది స్వర్ణ. వెనకాల విసుక్కుంటూ వస్తున్నాడు శేఖర్.

"హల్లో, ఆంటీ!" తీయటి కంఠస్వరం వినబడింది.

తలెత్తి, ఎవరా అని చూసింది స్వర్ణ.

లావణ్య!

"హల్లో! అమ్మ వచ్చారా?" అంది స్వర్ణ.

"అదిగో, అక్కడ కూర్చుందిగా!" అంది లావణ్య, అమ్మవారి గుడిదగ్గర కూచునిఉన్న లావుపాటి ఆవిడను చూపిస్తూ.

"ఆహా! నేను చూడనేలేదు. హల్లో మిసెస్ రావ్! కులాసా?" అంటూ ఆమె దగ్గరకు వెళ్ళి పలకరించింది స్వర్ణ.

"ఆఁ! ఆఁ! కులాసానే... లావణ్య వచ్చింది చూశావా? ఈ అబ్బాయి ఎవరూ? నీ మరిదా? ఇంకా పెళ్ళి కాలేదు కదూ?" ఏదేదో మాట్లాడుతూనే, శేఖర్‌ను ఆపాదమస్తకం కళ్ళతోనే పరీక్ష చేసి, లెక్కలేస్తోంది ఆవిడ.

మెల్లిగా ఆవిడను వదుల్చుకుని, ఒక ప్రదక్షిణంచేసి అమ్మవారి గుడివైపు అడుగువేసింది స్వర్ణ. అక్కడ అష్టోత్తరానికి క్యూ! ఆ కాసేపట్లో అమ్మవారికి చేయించే అర్చనలోనూ, చేయబోయే దర్శనంలోనూ, మిగిలినవారికన్నా అధికులు కావాలని మనుష్యులు పడే తపనంతా అక్కడ కనబడుతోంది!

అమ్మవారికి హారతి ఇచ్చారు. త్రొక్కిసలాట ఎక్కువైంది. పసిపిల్లల ఏడుపులతో నానా బీభత్సంగా ఉంది. పూజారి తెచ్చిన హారతి కళ్ళకద్దుకుని పళ్ళెంలో రూపాయి వేసింది స్వర్ణ.

"వదినా!" పిలుపు విని స్వర్ణ వెనక్కి తిరిగింది. శేఖర్ చేతిలో చిల్లరడబ్బు.

"పూజారి పళ్ళెంలోవి..... వేరుసెనక్కాయలు కొనుక్కోవచ్చు" అన్నాడు చిలిపిగా.

"ఛా! పడెయ్ముందు. ఏంపనది?" కోపంగా కసిరింది స్వర్ణ.

"ఆఁ! వాడికి తెలియొచ్చిందా ఏమిటి? అయినా, నువ్వు రూపాయ్ వేశావ్, నేను అర్ధరూపాయ్ తీశాను. ఇంకా వాడికే లాభం...."

కోపంగా వెనక్కి తిరిగింది స్వర్ణ.

"వదినా! ఆ మాజిక్ చూడు." అన్నాడు శేఖర్. పూజారి ప్లేట్లో డబ్బులు కొన్ని అమ్మవారి వెనక పెట్టి, కొన్ని బొడ్లో దోపేసి, మరి కొన్ని హుండీలో వేశాడు. "ఇందులో ఎవరెవరి కెంతెంతంటావ్?"

మాట్లాడలేదు స్వర్ణ. ఆమెకు కోపమొచ్చిందని గ్రహించాడు శేఖర్. మళ్ళీ అర్చనకు ప్లేటు వచ్చినప్పుడు ఎనిమిది అణాలు పడేసి, మరో ఐదుపైసలు కూడా స్వర్ణ చూసేట్లుగా పడేసి, "పాపపరిహారంతోసహా ఇచ్చేశాను వదినా!" అన్నాడు. నవ్వుతూ ఊరుకుంది స్వర్ణ. చుట్టూ వయస్సులో ఉండే ఆడపిల్లలు ఈ అల్లరంతా చూసి, పైట కొంగులు అడ్డం పెట్టుకుని నవ్వుతున్నారు. వాళ్ళను చూసి, మరీ రెచ్చిపోయి అల్లరి చేస్తున్నాడు శేఖర్. అది తెలుసు స్వర్ణకు.

జనం మరింతగా ఎక్కువ అవుతున్నారు. నిలుచునే చోటు లేకుండా ఉంది. "కొంచెం జరుగుతారా! అమ్మవార్ని చూసి దణ్ణం పెట్టుకు వెళతాను. కొంచెం..."

"అసలే గోలగా ఉంటే నువ్వేమిటమ్మా మధ్య. ఊఁ కానీ, వెళ్లు!" అని విసుక్కుంటోంది ఎవరో మామీ.

"ఊరికే చూసి వెళ్ళిపోతానండీ, అంతే!"

ఆ కంఠం విని, అటుగా వంగిచూసింది స్వర్ణ. "అరే! ఆ అమ్మాయి..." అంది గట్టిగా.

"ఏ అమ్మాయి వదినా?" చాలా కుతూహలంగా ముందుకు వంగి చూశాడు శేఖర్.

చామనచాయ. నీరు దిగిపోయిన ముక్కుపుడక, నలిగిపోయిన వాయిల్ చీర, పొడుగాటి జడ, తల్లో ఎండి వాడిపోయిన గన్నేరుపూవు. భక్తిగా కళ్ళు మూసుకుని నిలబడి ఉంది ఆ అమ్మాయి.

"ఈ అమ్మాయా? నేనింకా ఆ అమ్మాయి అనుకున్నా!" అన్నాడు కటకటాలలో నుంచి బైటికి చూస్తూ-శేఖర్. అటు చూసింది స్వర్ణ.

లావణ్య వాళ్ళమ్మ పక్కన, మారేడు వృక్షం మొదట్లో ఉన్న సిమెంటు చప్టా మీద కూర్చుని నాజూగ్గా కొబ్బరి ముక్క కొరుకుతోంది. మబ్బురంగు జరీ ఎంబ్రాయిడరీ చీర, మెళ్ళో ముత్యాలహారం, వేలికున్న రవ్వల ఉంగరం దీపాలకాంతిలో తళతళలాడాయి. ఐశ్వర్యమిచ్చిన ఆరోగ్యం ఆమె బుగ్గలకు గులాబులద్దింది. సుఖమైన జీవితం ఆమె కళ్ళకు మెరుపులు నిచ్చింది. యవ్వనమిచ్చిన అందంతో, నీరెండవేళ కొమ్మలో ఊగే రోజాపూవులా వుంది ఆమె. చటుక్కున చూపులా మార్చి తనముందున్న అమ్మాయిని చూసింది స్వర్ణ. శకుంతల కాబోలు ఆ అమ్మాయి పేరు. నిజమే, వీళ్ళద్దరికీ పోలికెక్కడ?

అష్టోత్తరం చేయించడమైన తరవాత బైటకు వచ్చారు. మండపం మీద కూర్చుని కొబ్బరికాయ కొడుతున్నాడు శేఖర్. శకుంతల గుడి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది. ఏం కోరుకుంటోందో?

"దేవుడా! నాకేమీ వద్దు. నాకు ఎవరో ఒక పెళ్ళికొడుకుని చూపించి, మావాళ్ళకు నా బాధను విరగడ చెయ్యి"- అనా?

మోకాళ్ళమీద తల ఆన్చి, అలవోకగా అటే చూస్తూ ఆలోచిస్తున్న స్వర్ణ

"హాయ్! స్వర్ణక్కా!" అనే పలకరింపు విని తలెత్తి చూసింది. మీనాక్షి. ముదురు లేత నీలం కలయికతో, ఏవో గళ్ళు గళ్ళుగా ఉన్న బెల్‌బాటమ్స్ వేసుకుంది. అవి ఖరీదైనవి కాకపోయినా, ఆకర్షణీయంగా వున్నాయి. మెళ్ళో ఏవో పూసలదండ. చేతికి కడియం. చెవులకు ఆర్టిఫిషియల్ ముత్యాల దుద్దులు. తమాషాగా ఉంది మీన.

"హాయ్ శేఖర్! తమరు కూడా ఏమిటి గుడికి!" అంది చటుక్కున ఇద్దరి మధ్య కూర్చుంటూ.

"చూడండీ మీనాంబికగారూ! తమరి ఉద్దేశం నేను గుళ్ళోకి రాకూడదనా, లేక..." కొబ్బరి ముక్క మీనా మీదుగా వంగి స్వర్ణకు అందిస్తూ అన్నాడు శేఖర్.

అది మధ్యలోనే అంది పుచ్చుకుంది మీన.

"ఆహాఁ! ఐడియా అది కాదు. సైతాన్ కూడా వేదాలు వల్లిస్తుందేమిటా అని. బైదిబై నా పేరు మీనాంబిక కాదు. మీన. నీ కొబ్బరి ముక్కకు థాంక్స్!"

"అనవసరంగా థాంక్స్ చెప్పకు. నీకేం ఇవ్వలేదు నేను. నువ్వు పుచ్చుకున్నావ్ అంతే. అయినా, మీ వాళ్ళు నీకు పెట్టిన పేరు అదేకదా తల్లీ!"

"వాళ్ళకు బుద్ధిలేకపోతే పిలిచేవాళ్ళకుండాలి. అది సరే స్వర్ణక్కా–" అంటూ స్వర్ణ వంక తిరిగి ఏదో అడుగుతోంది మీన. ఆమెవంకే చూస్తోంది స్వర్ణ పరీక్షగా. మీన పెద్ద అందగత్తేం కాదు. కానీ, ఆ అమ్మాయిలో ఆకర్షణ వుంది. ఎదుటి వాళ్ళను ఆకట్టుకునే శక్తి వుంది. చటుక్కున గుడివైపు చూసింది స్వర్ణ. ముప్పయ్యో ప్రదక్షిణానికి గుర్తుగా కాబోలు చింతగింజ పెట్టుకుని వెళుతోంది శకుంతల.

మీన రాకతో చుట్టుపట్ల సంచలనం ఏర్పడింది. కొందరి కళ్ళల్లో కుతూహలం, కొందరి కళ్ళల్లో నిర్లక్ష్యం – మొత్తానికి అందరినీ ఆకర్షించింది మీన.

"వెళ్ళొస్తాం ఆంటీ!" అంటూ నాజుకుగా అడుగులు వేస్తూ అటుగా వచ్చింది లావణ్య.

"నువ్వా లావణ్యా? రా!" అని పిలిచి మీనకు శేఖర్‌కు పరిచయం చేసింది స్వర్ణ. వాళ్లు ముగ్గురూ చాలా సులభంగా మాటల్లోకి దిగారు. మీన ఏవో జోక్స్ చెబుతోంది. వాళ్ళ వంకే మౌనంగా చూస్తూ, వాళ్ళ ఉత్సాహాన్నీ ఆనందాన్నీ పంచుకుంటోంది స్వర్ణ. లావణ్య చాలా చక్కగా, హుందాగా కూర్చుని మాట్లాడుతోంది. ఆమెకు తెలుసు– శేఖర్ చూపులు తనను వెంటాడుతున్నాయని. మరింత మెల్లగా తెచ్చిపెట్టుకున్న నిర్లిప్తతతో మాట్లాడుతోంది లావణ్య. గబగబ ఏవో కబుర్లు చెప్పేస్తోంది మీన. ఇద్దరి ప్రయత్నం అంతరాంతరాళాలలో ఒకటే–అది శేఖర్‌ను ఆకర్షించాలని. యవ్వనంలో ఉన్న అమ్మాయిల మనస్తత్వం కొత్త కాదు స్వర్ణకు.

పక్కగా ఏదో అలికిడైతే తిరిగి చూసింది స్వర్ణ. శకుంతల ప్రదక్షిణాలు పూర్తి అయినట్లున్నాయి. అలుపుగా వచ్చి, స్వర్ణకు కాస్త దూరంగా కూర్చుంది. ఆమె ముఖమంతా చెమట పట్టింది. ముంగురులు చెరిగాయి. బొట్టు చెమ్మగిల్లింది. ఆ

కళ్ళల్లోని యవ్వనంలో ఉండే తళుకులను, బ్రతుకుభయం దాచేసింది. ఆ అమ్మాయి కూర్చున్న తీరులో పొందిక, బేలతనం స్వర్ణను కదిలించివేశాయి.

❀ ❀ ❀

ఏం శకుంతలా ఒక్కదానివి వచ్చావా?" అడిగింది స్వర్ణ.

శకుంతల ఉలిక్కిపడి చూసి మీరా? ఎవరో అనుకున్నాను అంది. ఆమె చూపులు స్వర్ణనుదాటి శేఖర్‌ను గమనించాయి. అందంగా, హుందాగా ఇద్దరు ఆకర్షణీయమైన అమ్మాయిలు తనను గమనిస్తున్నారని తెలిసి, బ్రహ్మాండమైన ఉత్సాహంతో మాట్లాడుతున్నాడతను. శకుంతల కళ్ళల్లో అందమైన అబ్బాయిని చూసిన ఆడపిల్ల హృదయస్పందన తళుక్కుమన్నది. వెంటనే చూపు మార్చేసుకుంది. శేఖర్ గమనించలేదు కానీ స్వర్ణచూసింది.ఎంత చక్కటి కళ్ళు ఈ పిల్లవి అనుకుంది.

ఈ అమ్మాయిని శేఖరుకు పరిచయం చేసి చూద్దామనుకుని పక్కకు తిరిగింది.

మీరు "టోరాటోరా చూశారా.... అందులో" అని ఏదో మాట్లాడుకుంటున్నారు ఆ ముగ్గురూ. మా బామ్మ అప్పడాలు చేస్తూ, పీట ఏదో చేతిమీద వేసుకుందండీ! చెయ్యి వాచి జ్వరమొచ్చింది. ఒకటే గోల. అందుకే ఒంటరిగా వచ్చాను నేను ప్రదక్షిణాలు ఆపడమెందుకని..." ఏదో మాట్లాడుతోంది శకుంతల.

"లాభంలేదు..." అనుకుని తిరిగిపోయింది. స్వర్ణ. ఒక టిక్కట్టు నాలుగు రూపాయలు పెట్టి సినిమా చూడగల తాహతు ఉంది లావణ్యకు. శేఖర్‌కు జీవితం జీవించడానికే' అనే మీన ఎవరినో టోకరా కొట్టి అదే క్లాసులో కూర్చుని సినిమా చూసేయగలదు. కానీ అప్పడానికి పది పైసల చొప్పున నలభై అప్పడాలు చేసి నాలుగు రూపాయలు సంపాదిస్తే కాని, జీవితం గడవదు శకుంతలకు. వీళ్ళ పరిధులు కలవవు.' అనుకుంది స్వర్ణ. కాసేపు తరువాత అంతా బయలుదేరారు.

❀ ❀ ❀

శకుంతలతోపరిచయంచాలా విచిత్రంగా జరిగింది స్వర్ణకు. ప్రతి శుక్రవారం గుళ్ళో చూస్తుండేది ఆ అమ్మాయిని. అదే సహనం, అదే కళ, తీర్చిదిద్దినట్లుండేది ఆ అమ్మాయి. కుతూహలంగా గమనించేది ఆ అమ్మాయిని స్వర్ణ.

"ఎవరో లక్ష్మీదేవిలా ఉంది కదూ పిన్నిగారూ పిల్ల." అంది పక్కనే కూర్చున్న బామ్మగారితో.

"ఆహాఁ! గుణం ఉందమ్మా! ఏం ప్రయోజనం? తల్లీతండ్రీ ఇద్దరూ లేరు, వేరే దిక్కూ లేదు. ఇక్కడ మేనత్త కుంతి కొడుకున్నాడు. కోడల్ని చేసుకుంటాను రమ్మంటే, అంతకన్నా దిక్కులేక వచ్చింది. ఇక్కడ పరిస్థితి మరీ ఘోరం. వాడికి అప్పుడే పెళ్ళై ఇద్దరు పిల్లలట. ఆ కుంతివాడికి, ఆ అనాకారి నచ్చలేదట. రూపసి కావాల్సివచ్చింది– రూపసి! 'నా మొగుడి వంక చూశావా చంపుతాను' అంటుంది వాడి పెళ్ళాం. 'దాంతో నీకేమిటి? నా మాట విను. మూడుముళ్ళు వేయిస్తాను'

అంటుంది మేనత్త. ఇద్దరి మధ్య నలిగిచస్తోంది ఈ పిల్ల. చంపేశాడన్నా కాదు పాపిష్టిదేముడు," అని గబగబా తూర్పుదేశపు యాసతో చెప్పేసింది ఆ బామ్మగారు, ముసుగు సవరించుకుంటూ.

"అదేం మాట బామ్మగారూ! ఆ పిల్ల మీకేం భారమైందని?" నొచ్చుకుంటూ అంది స్వర్ణ.

"ఏం భారమేమిటమ్మా! అది నా మనవరాలు. ఇద్దరం ఆ పల్లెటూరి నుంచి మరే గతిలేక ఇక్కడికి పడివచ్చాం. ఇక్కడా అక్కడా కూడా నిత్యదరిద్రం తల్లీ! అప్పడాలు ఒత్తి, వడియాలు పెడితే జీవితాలు గడుస్తాయా అమ్మా? నా ఖర్మ!" అంది బామ్మగారు కొంగుతో, కళ్ళు అద్దుకుంటూ.

అదిరిపోయింది స్వర్ణ. బామ్మగారి వంక పరీక్షగా చూసింది. ముతక నీరుకావి పంచ. పీక్కుపోయిన దవడలు. గాజు కాయల్లాంటి కళ్ళు, నిత్యకష్టానికి అలవాటుపడి నరాలు ఉబ్బిమోటుదేలిన చేతులు.... ఏమిటోగా అనిపించింది స్వర్ణకు. వెంటనే పర్సుతీసి ఓ పది రూపాయలు ఇవ్వబోయింది.

"ఏమిటిది? వద్దమ్మా వద్దు. వాటితో మా రోజులు గడవబోవు. ఒకళ్ళకు పెట్టే వంశంలో పుట్టాం. ఉరేసుకునైనా చస్తాం కానీ, ఊరికే చెయ్యి చాచం తల్లీ!" ఎంతో అభిమానంతో అంది బామ్మగారు.

ఏం మాట్లాడలేకపోయింది స్వర్ణ. వెంటనే, "ఊరికే వద్దులెండి. మా ఇంటికి అప్పడాలు తెచ్చిపెట్టండి పోనీ" అని బలవంతాన, ఆవిడ చేతిల్లో పెట్టింది. అయిష్టంగానే ఆ పది రూపాయల్ని తీసుకుంది ఆవిడ. ఆ నోటు ఆవిడకు ఎంత అవసరమో అర్థమైంది స్వర్ణకు. 'అవసరాల ముందు ఏ ఆత్మాభిమానాలు ఆగవు' అనుకుంది.

అప్పుడే అక్కడికి వచ్చి కూర్చుంది ఆ అమ్మాయి. అలిసిపోయినా, అందంగానే ఉంది ఆ అమ్మాయి. 'దీపకళికలా ఉంది పిల్ల' అనుకుంది స్వర్ణ.

"నీ పేరేమిటమ్మా?" అని అడిగింది.

"శకుంతలండి!" మెల్లిగా చెప్పింది.

"నా అమ్మ, నా తల్లీ! ఎక్కడైనా మంచి సంబంధం ఉంటే చూసిపెడుదూ... ఆడపిల్ల, గుండెలమీద కుంపటైపోయింది. మాది గడపదాటని వంశం తల్లీ! రెండో పెళ్లైనా, మూడో పెళ్లైనా సరే. కన్నెచెర వదిలిస్తే చాలు. ఏమీ ఇచ్చుకోలేనమ్మా! ఏదో గుళ్ళో పెళ్ళి చేస్తాను. ఆ ఇంటినుంచి బయటపడితే చాలు. బిడ్డ దిగులుతో అన్నం తిని మూడురోజులైంది" గబగబా చెపుతోంది బామ్మగారు.

ఆ అమ్మాయి వంక చూసింది స్వర్ణ. ఆ లేతగుండెలో యెన్ని అగ్నిపర్వతాలు రేగుతున్నాయో? 'భగవంతుడా! ఎలాంటి జీవితాలు సృష్టించావు?' అనుకుంది స్వర్ణ. బామ్మగారికి అడ్రసు చెప్పి బయలుదేరింది. ఇంటికి వచ్చేదాకా ఆలోచిస్తూనే ఉంది ఆమె విషయం. ఏదో ఒక రకమైన ఆవేశమొచ్చింది స్వర్ణకు. ఆ పిల్ల జీవితం

నాశనం కాకూడదు. చాలామంది వికార అందహీనుల కన్నా. గుణహీనుల కన్నా కొద్దిగా అదృష్టవంతురాలే, ఆ పిల్ల. సంప్రదాయం, సౌందర్యం, సుగుణం మూడూ ఉన్నాయి ఈ అమ్మాయికి.

ఆమె దృష్టిలో తెలిసిన కుర్రాళ్ళు అందరూ కదిలారు. అందులో మంచి పెళ్ళికొడుకులెంతమంది ఉన్నా, బామ్మగారికి కావలసిన, కులం గోత్రం చాలా విధాల అడ్డు తగిలాయి: ఆ పిల్ల ప్రాణాలు పోయినా ఒప్పుకుంటుందేమో కానీ, వర్ణసంకరం కానీయదు బామ్మగారు. పోనీ, తనకు తెలిసిన ఏ శరణాలయంలోనో, స్త్రీ సంక్షేమ కేంద్రంలోనో చేర్పిస్తే.... ఆలోచించింది స్వర్ణ. కానీ, వాటి గురించి విన్న కథలు భయపెట్టాయి స్వర్ణను. ఏమీ తెలియని ముగ్ధ ఆ పిల్ల. ఆలోచిస్తే, అన్నింటికీ, ఆ అమ్మాయి మంచితనం, సంప్రదాయం రెండూ అడ్డు తగులుకున్నాయనిపించింది స్వర్ణకు. ఒక్కసారిగా, మెదడులో తళుక్కుమన్నట్లు శేఖర్ గుర్తుకువచ్చాడు. అవును, శేఖర్ ఎందుకు చేసుకోకూడదు?

"మీనా ఎందుకో నాకు నచ్చదు వదినా! తను మంచి స్నేహితురాలు. ఒప్పుకుంటాను. చాలా హాయిగా కబుర్లు చెపుతుంది నిజమే. కాని నా భార్యగా ఊహించలేను; ఆ ధైర్యాన్ని మెచ్చుకుంటాను కానీ భరించలేను. నాకు దరిద్రమంటే అసహ్యం లేదు వదినా! గుణవంతురాలు, బుద్ధిమంతురాలు అయితే చాలు: ఈ ఇంటి కోడలంటే నీలా ఉండాలి వదినా! నీ నిర్ణయం మీద నాకు నమ్మకముంది. కానీ, జాలిపడి మీనాను చేసుకోమనకు. ఆ పిల్ల ఒక సుడిగాలి. భార్యగా ఊహించ లేను నేను" అన్నాడు శేఖర్ ఒకసారి. ఆరోజు అతని భావాలు విని, భార్య గురించిన అతని ఊహ విని ఆశ్చర్యపోయింది స్వర్ణ. ఆడుతూ, పాడుతూ ఉండే అతను అంత ఆలోచిస్తాడనుకోలేదు. అతని స్వార్థానికి నవ్వు కూడా వచ్చింది. మీన అల్లరిచేసి కబుర్లు చెప్పడానికి పనికివచ్చే స్నేహితురాలు; భార్యగా పనికి రాదన్నమాట!

మీన తండ్రి స్కూలు మాష్టరు. స్వర్ణ కుటుంబం కొత్త ఇల్లు కట్టుకుని రాక మునుపు వాళ్ళ ఇంటి పక్కనే ఉండేవారు. ఆయనకు ఆరుగురు సంతానం. వాళ్ళలో మూడో పిల్ల మీనా. తండ్రి మూర్ఖత్వం, తల్లి చాదస్తం, త్వరగా పెళ్ళి చేసుకుని, విధవ అయిన అప్పగారు, కాలుజారి జీవితానికి శాశ్వతంగా దూరమైన చిన్నక్క- వీళ్ళందరూ చాలా పాఠాలు నేర్పారు మీనాకు. రాత్రి ఎనిమిదింటికి సిగరెట్లు తెమ్మని ఆడపిల్లలను వానలో పంపే తండ్రిని గురించి ఏమాత్రం సదభిప్రాయంలేదు మీనాకు. అందుకే వింతగా తయారైంది. ఏంచేస్తే ఇతరులు ఆకర్షింపబడతారో తెలుసు మీనాకు. ఆ పిల్ల బోళాతనం, చురుకుతనం చూస్తే స్వర్ణకు మొదటి నుంచీ ఇష్టమూ, జాలీ. శేఖరంటే ఏదో ఆకర్షణ ఆ పిల్ల పెంచుకుంటోందని తెలుసు. ఇల్లు మారినా, శేఖరుండే సమయం చూసి, ఉప్పెనలా వచ్చి, కాసేపు కబుర్లు చెప్పి, అల్లరి చేసి పోతూంది మీన. ఆమె వున్నంతసేపూ సరదాగానే మాట్లాడి, సమానంగా అల్లరి చేసేవాడు శేఖర్. ఆ ధైర్యంతోనే ఒకరోజు,"పోనీ మీనాను పెళ్ళిచేసుకుంటావేమిటి శేఖర్?" అని నవ్వుతూ అడిగింది. అతని జవాబు విని మారు మాట్లాడలేదు స్వర్ణ.

"ఈ ఇంటి కోడలంటే నీలాగ ఉండాలి వదినా!" శేఖర్ మాటలు గుర్తుకు వచ్చాయి. తను ఏ పరిస్థితుల్లో ఈ ఇంటి కోడలైంది? అర్ధరాత్రి దాటినా ఆ అమ్మాయే గుర్తువచ్చి నిద్రపట్టని స్వర్ణ తన గురించి ఆలోచించింది. రాజారావుగారి చిన్ననాటి స్నేహితుడి కూతురు స్వర్ణ. చూసిన రెండు రోజుల్లోనే ఆమె గురించి చాలా చక్కని అంచనా వేసింది రాజారావుగారి బిజినెస్ బుర్ర. ఎవరో క్రిస్టియన్ అమ్మాయితో తిరుగుతూ ఫారిన్ వెళ్ళిపోదామని ప్రయత్నిస్తున్నాడు పెద్దకొడుకు చంద్రం. ఇంట్లో బాధ్యత నిర్వహించే దిక్కులేదు. ఇన్ని సమస్యలకు తీర్పు స్వర్ణ అనుకున్నాడాయన. "నీ కిష్టమైతే నీ స్నేహాలు వదులుకోవద్దురా అబ్బాయ్! అలా అడ్డుపడే పిల్ల కాదు. నా మాట విను. కానీ స్నేహితురాలైన ప్రతి ఆడదీ పెళ్ళాంగా పనికి రాదురా!" అని చాలారకాలుగా మభ్యపెట్టి కొడుకును ఒప్పించాడు. "నేను అయిష్టంగానే పెళ్ళికి ఒప్పుకున్నాను స్వర్ణా! ఆ తరవాత నిన్ను చాలా రోజులు మనిషిగా గుర్తించలేదు నేను. కానీ, కేవలం నీ ప్రవర్తనతో నాలో మార్పు తెచ్చావు. నాన్న చెప్పింది నిజం! ప్రతి ఆడదీ పెళ్ళాం కాలేదు. అందులో నా స్వర్ణ అసలు కాలేదు" అనే భర్త మాటలు గుర్తుకు వచ్చాయి స్వర్ణకు. 'ఆ రాజారావుగారి కొడుకేగా శేఖర్! ఏమో చూద్దాం. శకుంతల అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుంది' అనుకుంది స్వర్ణ ఆ రాత్రి.

కానీ, ఈ శుక్రవారం అనుకున్నవన్నీ తలక్రిందులైనాయి. శకుంతల శేఖర్‌లు ఉత్తర దక్షిణ ధ్రువాలని తెలిసిపోయింది స్వర్ణకు.

మరో నాలుగైదు రోజుల తరువాత కాబోలు - ఎవరో వచ్చారని పనిమనిషి చెబితే, భర్త బట్టలు సర్దుతున్న స్వర్ణ కిందికి వెళ్లింది. బామ్మగారు "అమ్మా! నా మనమరాలకి సంబంధం కుదిరింది తల్లీ! ఎన్ని అవస్థలు పడ్డానో, ఎందరి కాళ్ళు పట్టుకున్నానో మీలాంటివారితో చెప్పుకోవల్సినవి కావవ్వి. ఆ రోజు మీరు డబ్బిస్తే అభిమానపడ్డాను. ఈ రోజు నోరు తెరచి అడుగుతున్నాను. ఈ పెళ్ళికి మీలా ఎవరైనా నలుగురు సాయపడాలి తల్లీ....!" ఇంకేమిటో చెప్పి ప్రాధేయపడిందావిడ.

"పిల్లాడెవరు?" కుతూహలం ఆపుకోలేక అడిగింది స్వర్ణ,

"పిల్లాడూ?! హయ్యో రాత! పిల్లాడా చట్టుబండలా?! రెండో పెళ్ళివాడు. పగలు చూస్తే రాత్రి కల్లోకొస్తాడు!" తల కొట్టుకుంటూ అంది ఆవిడ.

"మరి శకుంతల ఒప్పుకుందా?"

"తప్పదు తల్లీ! దాన్నడిగితే చేసుకుంటాననంది. ఏం చేస్తుంది మరి! మరో దారేది?" దీర్ఘాలు తీస్తూ, కళ్లు తుడుచుకుంటూ, దారంతో కట్టిన కళ్లద్దాలు సవరించుకుంటూ చెపుతోంది బామ్మగారు. వసివాడని పూవులాంటి ఆ పిల్ల భవితవ్యం-పాతకాలపు మూర్ఖత్వం, అంతులేని ఆప్యాయత తప్ప మరొకటి లేని ఈ బామ్మగారి చేతుల్లో ఉంది... కానీ, మరొకరేరి మరి? ఆలోచిస్తూ లోపలికి వెళ్ళి, మెట్ల దగ్గర ఆగిపోయింది స్వర్ణ. ఏదో చెయ్యాలి. ఏమైనా చేసి, శకుంతల జీవితం బాగుచెయ్యాలి. ఏం చేద్దాం!? ఆమె మనస్సు చాలా విధాలుగా ఆలోచిస్తోంది.

"ఏమిటమ్మా! ఆలోచిస్తున్నావు?" పూజగదిలో నుంచి వచ్చిన మామగారు అడిగారు.

ఆ సమయంలో ఆమె మనస్సులోని తపన ఎవరికైనా చెప్పుకోవాలి. వెంటనే బయటపడిపోయింది స్వర్ణ. కాని, అప్పుడు కూడా జాగ్రత్తగా చెప్పవలసినంతే చెప్పింది శకుంతల గురించి.

"చూడమ్మాయ్!" కళ్ళజోడు బంగారుఫ్రేం సవరించుకుంటూ సూటిగా చూస్తూ అన్నారు ఆయన: "అందరి జీవితాలు మనం బాగు చెయ్యలేము. మన బాధ్యత ఎంతవరకంటే, ఏదో తోచిన సహాయం చెయ్యటం వరకూ, అంతే. ఆ అమ్మాయి బాధ్యత మరే విధంగా మనం తీసుకోగలం? అయినా చూడు, ఒకటి నేర్చుకో, హక్కులేని ఆప్యాయతలు చెల్లవు. ప్రతి చిన్న విషయానికి బాధపడితే ఎలా అమ్మా? పద--ఏదో తోచింది ఇచ్చి పంపు." ఆప్యాయంగా చెప్పినా, ఆ మాటల వెనక సూక్ష్మగ్రాహ్యత, అధికారం ఆమెకు చిరపరిచితాలే.

మౌనంగా పైకి వెళ్ళి కొత్తచీర, రెండువందలు తెచ్చి బామ్మగారికిచ్చింది. గోడకు జారగిలబడి నీరసంగా కూర్చున్న బామ్మగారు ఒక్కసారి నిటారుగా నిలబడి, ఒక వంద పొగిడి, పది కాలాలపాటు చల్లగా ఉండాలి అని దీవించి, "అప్పడాలు, ఇదుగో ఈ హడావిడి తరవాత తెస్తానమ్మా! మర్చిపోలేదు" అని వెళ్ళిపోయింది.

అటే చూస్తూ నిలబడింది స్వర్ణ. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. బంగారపు బొమ్మలాంటి పిల్ల!

"ఏమిటి వదినా, ఇక్కడ నిలబడి ఆలోచిస్తున్నావ్?" అన్నాడు ఆఫీసుకు బయల్దేరబోతూ శేఖర్.

ఉలిక్కిపడి "ఆహఁ!...ఆ అమ్మాయి...." ఆమెకు శేఖర్‌తో చాలా చెబుదామని ఉంది. కానీ ప్రయోజనం లేదని తెలుసు. "ఏంలేదయ్యా... ఏంలేదు..." అని వెళ్ళిపోయింది.

❀ ❀ ❀

మరు శుక్రవారం వద్దన్నా వచ్చాడు శేఖర్ గుడికి. స్వర్ణకు తెలుసు లావణ్య కోసం వచ్చాడని. అమ్మవారి ముందు దణ్ణం పెడుతున్న స్వర్ణ ఉన్నట్లుండి ముందున్న అమ్మాయిని చూసి అదిరిపోయింది. శకుంతల! కానీ, ఏదో మార్పు! సన్నటి నడుముకు వడ్డాణం, మెళ్ళో రాళ్ళ నెక్లెసు, పసిమి శరీరానికి ఎర్రటి పట్టుచీర, మెళ్ళో మెరుస్తున్న పసుపు తాడు, నల్లపూసలు, కాటుకతో చెమర్చిన కళ్ళు.... చాలా అద్భుతంగా ఉంది శకుంతల! 'పోన్లే. ఎవరో డబ్బున్నవాడు చేసుకున్నట్లున్నాడు. అదృష్టవంతురాలు. తిండికి కష్టపడదింక' అనుకుంటూ పక్కకు చూసింది. నల్లగా, పొడుగ్గా ఉన్నాడతను. పైన ఉత్తరీయం, కొత్త పంచ, చేతికి రాళ్ళఉంగరాలు. నలభయ్యోపడిలో ఉన్నాడతను. ఎందుకో వెనక్కి తిరిగి చూసింది శకుంతల. "మీరా?" అని పలకరించబోయి ఆగిపోయింది. ఏమిటా అనుకుంటూ పక్కకు చూసింది, స్వర్ణ-శేఖర్!

కన్నార్పకుండా శకుంతలనే చూస్తున్నాడతను. ఒక్కక్షణం కళ్ళు దించుకొని, మళ్ళీ మామూలుగా "మీరు...." ఏదో మాట్లాడబోయింది శకుంతల.

"ఊc! చాల్లే! ఇక పోదాం పద" అన్నాడు ఆమె భర్త. ఆ ధ్వనిలో అనుమానం, కరుకుతనం అర్థమైంది స్వర్ణకు. ఆ మాటల్లో ఆమె దురదృష్టం కత్తి ఝుళిపించినట్లయింది.

మౌనంగా కళ్ళతోనే సెలవు తీసుకుని, ఒంటి నిండా చెంగు కప్పుకుని భర్త వెనకాల వెళ్ళిపోయింది శకుంతల.

"ఎవరా అమ్మాయి వదినా! ఎక్కడో చూసినట్లున్నాం.... చాలా బావుంది కదూ!" అటే చూస్తూ అన్నాడు శేఖర్.

ఒళ్ళు మండిపోయింది స్వర్ణకు. ఇవ్వాళ, ఇలా కనబడితే బావున్నదన్నమాట శకుంతల! వారం రోజుల క్రితం నిరాశ, నిస్సహాయత మూర్తీభవించిన శకుంతల ఎదురుగా వున్నా కళ్ళకు కనబడలేదు కాబోలు శేఖర్‌కు! ఇవ్వాళ 'చాలా బావుంది...' నాలుగూ అడిగేద్దామన్నంత కోపంగా వెనక్కు తిరిగింది. "హాయ్" అంటూ అప్పుడే వచ్చిన లావణ్యను పలకరిస్తూ వెళ్ళిపోయాడు శేఖర్. ఏమనగలదు?

అన్యమనస్కంగానే కాస్సేపు కూర్చుని, కారు దగ్గరకు వచ్చింది. రోడ్డు మీద దీపాలు మిణుకుమిణుకుమంటున్నాయి.

"చాలా చీకటి పడింది. పద బాబూ, పోదాం" అని బిచ్చగాళ్ళకు చిల్లరవేసి వెనక్కు తిరిగింది స్వర్ణ.

"ఏయ్ శేఖర్! స్టాప్ ఫర్ ఎ సెకండ్." రివ్వున సైకిల్ మీద వచ్చింది మీనా. బాగా అలసిపోయినట్టు ఉంది ఆమె.

"అనుకున్నాను స్వర్ణక్కా, నువ్వు వస్తావని! నేను ఎయిర్ హోస్టస్ పోస్ట్‌కు అప్లై చేశాను. ఉద్యోగం రావాలని కాస్త మీ దేవుణ్ణి ప్రార్థిద్దూ" అంది.

"నువ్వా? ఇంక విమానాలు నడిచినట్లే!" అన్నాడు శేఖరం నవ్వుతూ.

"విమానాలు నడవ్వు బుద్దూ! ఎగురుతాయి. వస్తానక్కా! అద్దె సైకిల్ ఇచ్చెయ్యాలి. వస్తాను శేఖర్!" అంది.

శేఖర్ మీనాను చూడడంలేదు. లావణ్య కారు ఎక్కుతూ చెయ్యి వూపింది. అటే చూసి చెయ్యి ఊపాడు శేఖర్. ఇద్దరి వంకా మార్చి మార్చి చూసింది మీనా. ఒక్కసారి స్వర్ణ వంక చూసి "వస్తానక్కా!" అని రివ్వున వెళ్ళిపోయింది.

❀ ❀ ❀

పెద్ద బిజినెస్ మాగ్నేట్ కూతురు లావణ్య. వాళ్ళ నాన్న ఏదో ఇన్‌కంటాక్స్ ట్రబుల్‌లో ఇరుక్కోవడం వలన, కొన్ని నెలలు ఆలస్యమైంది శేఖర్, లావణ్యల పెళ్ళి. కానీ, అది కూడా వాళ్ళ నాన్న గౌరవానికి చిహ్నమే కాబట్టి, లావణ్య తెచ్చే కట్నం ముందు మిగతా విషయాలు పట్టించుకోవడం చాలా అనవసరం అనుకున్న రాజారావుగారు, అన్ని విధాలా మంచి సంబంధం అనుకున్న లావణ్య తండ్రి- వారిద్దరికీ పెళ్ళికి ఒప్పుకోవడంలో మరి తాత్సారం చెయ్యలేదు.

మళ్ళీ, శ్రావణ పౌర్ణమికి శేఖర్, లావణ్యలతో గుడికి వచ్చింది

"ఏమండీ!" ఎవరో పిలిచినట్లై అటు తిరిగి చూసింది. గుర్తుపట్టలేకపోయింది ఆమెను.

"నేనండీ! శకుంతలను.. మర్చిపోయారా?" అంది నవ్వుతూ.

కన్నార్పకుండా చూసింది స్వర్ణ. ఎక్కడికక్కడ శరీరమంతా లావైపోయింది శకుంతలకు. నలిగిపోయిన అందం వయసెక్కువ చూపెడుతోంది.

"ఇదేమిటి? ఇలా..."

"లావయ్యాననా? అందరూ అంటూనే ఉన్నారులెండి. ఆఁ! ఇదే హాయి లెండి. ఇప్పుడు నన్నెవరూ చూడరు. అనుమానాలు, దెబ్బలు, చుట్ట ముక్కల వాతలు తప్పుతాయి" అంది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో. అది నవ్వు కాదు–నిస్పృహాయత, బాధ, దాచుకునే ప్రయత్నం!

కళ్ళలో నీళ్లు సుళ్లు తిరిగాయి స్వర్ణకు. ఏదో మాట్లాడబోయింది. ఎయిర్ హోస్టస్ కావడానికి ఎక్సర్‌సైజస్‌చేసి సన్నబడ్డ మీనా, ఫిగర్ మెయిన్‌టనెన్స్ అని డయటింగ్‌చేసే లావణ్యా గుర్తుకువచ్చారు.

"వస్తా! ఆయన గేటు దగ్గర ఉన్నారు," అని రెండడుగులువేసి, "అన్నట్లు, మీ మరిది కులాసాగా ఉన్నారా?" అంది. శకుంతల,

మాట్లాడకుండా శేఖర్, లావణ్యవైపు చూపించింది స్వర్ణ. వాళ్ళు ఒకళ్ళనానుకుని ఒకళ్ళు కూర్చుని సర్వం మరిచిపోయి కబుర్లు చెప్పుకుంటున్నారు.

'ఈ అమ్మాయా?' అని ఏదో గొణుక్కుంటూ, "వస్తానండీ?" అని వెనక్కు తిరిగి చూడకుండా విసవిసా నడిచి వెళ్ళిపోయింది శకుంతల. అటే చూస్తున్న స్వర్ణకు, ఆ రోజే వచ్చిన మీనా ఉత్తరం జ్ఞాపకమొచ్చింది.

"నువ్వు పెళ్ళిచేసుకోమని రాశావు స్వర్ణక్కా! నీకు తెలుసు నేను శేఖర్‌ను మర్చిపోలేదని. అప్పుడపుడు ఈ ఎయిర్ హోస్టస్ జీవితం విసుగనిపిస్తోందక్కా! ఈ తెచ్చిపెట్టుకున్న ఫాస్ట్‌నెస్, సంపాయిస్తున్న డబ్బు ఇవన్నీ నావికావని, 'నేను చాలా మంచి పిల్లను శేఖర్' అని వచ్చేద్దామనిపిస్తుంది నాకు. కానీ, ఇక తిరిగిరాలేను. ఇప్పుడు ఆ దారి శాశ్వతంగా మూసుకుపోయింది. లావణ్య చాలా అదృష్టవంతురాలు. శేఖర్ పెళ్ళి శుభలేఖ నాలో ఎంత సంచలనాన్ని తెచ్చి ఉంటుందో గ్రహించేదానివి నువ్వు ఒక్కదానివే. ఇప్పుడు ఒకటే జీవితాదర్శం. ఇంటర్‌నేషనల్ ఎయిర్ హోస్టస్‌ను కావాలని. అన్నట్లు నీకు తెలుసా? నా సంపాదన మా ఇంట్లోవాళ్ళ అవసరాలను పెంచింది. అమ్మకు రవ్వల ముక్కుపుడక కావాలట. నాన్న కాల్చే ఒక్కోసిగరెట్టు ఖరీదు రూపాయ్. ఇవన్నీ మామూలే..." ఇంకా ఏదేదో రాసింది మీనా.

ఆలాగే ఆలోచిస్తూ, చాలాసేపు కూర్చుండిపోయింది స్వర్ణ ఒంటరిగా.

❀ ❀ ❀

రాత్రి తొమ్మిది గంటల వేళ కిటికీ చువ్వలు పట్టుకుని ఆలోచిస్తూ, భర్త రాకకై ఎదురుచూస్తూ నిలబడింది స్వర్ణ. ప్రకృతి అంతా సన్నని వానలో స్నానం చేస్తోంది. బయటనుంచి ఏదో జోక్ చెప్పుకుని వస్తున్నారు శేఖర్, లావణ్య. సన్నగా, తీగలా వుంది లావణ్య. ఏదో దేవతలా వుంది. హాయిగా నవ్వుతోంది. ఎవ్వరూ లేరనే ధైర్యంతో ఆమె భుజాల చుట్టూ చేతులు వేసి లోపలికి తీసుకువస్తున్నాడు శేఖర్. తన గదిలోనుంచి వాళ్ళనే చూస్తోంది స్వర్ణ. ఎందుకో ఆమెకు మీనా , శకుంతల గుర్తుకువచ్చారు. ఏం చేస్తోందో మీనా...? బహుశా భూమికి కొన్నివేల అడుగుల ఎత్తున, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో, విపరీతమైన అలంకరణతో, ప్రయాణీకుల హాస్యాలను, విసుర్లను భరిస్తూ సర్వ్‌చేస్తూ ఉంటుంది.

శకుంతల... ఒకప్పటి బంగారు బొమ్మలాంటి శకుంతల...ఇదే సమయంలో నలభై ఏళ్ళు పైబడ్డ వ్యక్తి మొరటు చేతుల్లో అనుమానాల మధ్య, కావేషాల మధ్య, పళ్ళు బిగబట్టి కన్నీళ్ళు దాచుకుంటూ నలిగిపోతూ ఉండివుంటుంది. ఆ ఆలోచనలు భరించలేక కళ్ళుమూసుకుంది స్వర్ణ.

లావణ్యలాంటివారు స్వతహాగా అదృష్టవంతులు. వాళ్ళ జీవితం వడ్డించిన విస్తరిలాంటిది. ఆర్థికంగా ఆలోచిస్తే, శకుంతల కన్నా ఒక మెట్టుపైన ఉంది మీనా. కానీ, మీనా తెగింపుతో జయించుకు వస్తోంది. ధైర్యంగా మంచో, చెడ్డో జీవితం ఎంచుకుంది. కానీ, మంచితనం, సౌందర్యం తప్ప మరొకటి లేని శకుంతల....?

చల్లటి ఈదురుగాలి కిటికీలోనుంచి దూసుకువచ్చింది. బల్లమీద మీనా ఉత్తరం కాబోలు రెపరెపలాడింది. అలికిడికి అటుగా చూసింది స్వర్ణ. ఆమె దృష్టి బల్లమీద వున్న పూలకుండీ మీద పడింది. పొద్దున్న అయిదేళ్ళ వాసు పరిగెత్తుకుంటూ వచ్చి. “మమ్మీ! ఈ పూలు చూడు, ఎంత బావున్నాయో!” అన్నాడు. వాడి చేతిలోవి గడ్డిపూలు! వాసు గోల భరించలేక అవి పూలకుండీలో పెట్టింది. వాటిని రోజూ కంచె చుట్టూ చూస్తూనే ఉండేది స్వర్ణ. కానీ ఇవాళ డిమ్‌లైట్‌లో, ఖరీదైన కట్‌గ్లాస్ ఫ్లవర్ వాస్‌లో, ప్లాస్టర్ ఆఫ్ పారీస్ విగ్రహం ముందు చెప్పలేనంత అందంగా వున్నాయి అవి. వాటి వంకే కన్నార్పకుండా చూసింది స్వర్ణ.

గడ్డిపూలవంటివారే శకుంతలలాంటి అమ్మాయిలు. వాళ్ళు అదృష్టవశాత్తు ఖరీదైన జీవితాన్ని పొందగలిగితే - వారి అందానికి, అమాయకత్వానికి మెరుగు లభిస్తుంది. లేనినాడు కాలికింద పడి నలిగిపోతున్నా గమనించరెవరూ! కానీ, అన్ని గడ్డిపూలూ కట్‌గ్లాస్ ఫ్లవర్‌వాస్‌లోకి ఎలా వస్తాయి?

*(వనిత మాసపత్రిక - అక్టోబరు 1975)*

# అగ్నిపుష్పం

రాధనీ యశోదనూ ఒకే స్త్రీలో దర్శించారా ఎవరైనా? హారతి గురించి చెప్పాలంటే ఆ మాట చాలు.

నేను సైంటిస్ట్‌ను. అధి భౌతికమైన విషయాలు, పరీక్షలకు నిలబడని అజ్ఞానాలు అంటే అసలు గిట్టదు నాకు. మానవ స్వభావానికి కారణమైన జీన్స్ మీద అనేక రకాల పరీక్షలు చేసి బహుమతులు పొందాను నేను. త్యాగాలకు, స్వార్థానికి. లౌక్యానికి, నికృష్టతకు కూడా మనిషిలోని జీన్స్ కారణం అని తెలిసినప్పుడు. జంతువులే ఈ థియరీ ప్రకారం ప్రవర్తిస్తున్నప్పుడు, మానవత్వం, ఔన్నత్యం - వీటి మీద పెద్ద నమ్మకం లేదు నాకు. కవిత్వాలు, సౌందర్యారాధనలు - ఇవన్నీ మనిషిలోని ఉన్మాదావస్థకు చిహ్నాలనిపించేవి. ఏ సెంటిమెంట్లూ లేని నాకు 'భగవంతుడు' మనిషి ఊదిన ఊహలబెలూనులాగా కనిపిస్తాడు. కానీ, విచిత్రమేమిటంటే - మనిషి తననుకున్నట్లు, తను ఆలోచిస్తున్నట్లు బ్రతకగలిగితే మానవ సమాజం మరొకవిధంగా ఉండేదేమో కానీ, వ్యక్తి సంఘజీవి. నా ఏరకమైన ఆలోచనలతోనూ నా చుట్టూ ఉన్న మనుష్యులకు సంబంధం ఉండదు. కేవలం ప్రేమతోనో, అభిమానంతోనో, సంపాదనపరుడననే గౌరవంతోనో నా ఆలోచనలు విన్నట్లు, గౌరవించినట్లు నటించేవారు. ఆ విషయం అర్థమైనప్పుడల్లా, నాకు హైపర్ టెన్షన్ వచ్చేది. అంతే. నేను మహా కోపిష్టినని ముద్ర వేశారు. కానీ, అందరి మనుష్యుల్లాగే నాకూ కొన్ని బలహీనతలు ఉన్నాయి. అందులో అతి ముఖ్యమైనది నా ఆలోచనలను ఎదటివారి మీద బలవంతంగా రుద్దడం, కన్నీరు తెప్పించడం - ఆ తరవాత ఆ బాధ చూడలేక లొంగిపోవడం. ఈ గుణం నాలో తెలియని మార్పులు ఎన్నో సృష్టించింది.

"పెళ్ళేమిటి? సెన్టిమెంటల్ నాన్సెన్స్ ... మారేజ్ ఈస్ ఎ మోస్ట్ ఎకనామికల్ వే ఆఫ్ గెటింగ్ ఫుడ్ అండ్ సెక్స్...." అని వాదించే నన్ను మా అమ్మ కన్నీళ్ళు, మా నాన్న బాధ లొంగదీసుకున్నాయి. 'ఒక్కగానొక్క పిల్లాడివిరా' అనే మావాళ్ళ మాట నా అహానికి తృప్తి కలిగించింది. "వాళ్ళపిల్లకు వాళ్ళు సరదాగా పెట్టుకుంటూంటే మధ్య నీ బాధ ఏమిటిట?" అని కసిరి, మావాళ్ళు కట్నం కూడా పుచ్చేసుకున్నారు. నా ఆలోచనలను, ఆశయాలను అగ్నిహోత్రం పాలుచేసినట్లు- మండిన కళ్ళతో, పెళ్ళి తంతును తిట్టుకుంటూ, పెళ్ళిపీటలమీద కూర్చున్న నాకు కనబడింది ఆమె.

ఇన్నాళ్ళ తరవాత, ఈ యాభైయ్యవ పడిలో జీవితంలో మామూలు మనిషికి ఉండే అన్ని సౌఖ్యాలు పొందిన నేను ఒక్కసారి గతంలోకి తొంగిచూస్తూంటే ఏనాడో

సహం చదువుతూండగా పోయిన మంచి పుస్తకం మళ్ళీ దొరికినట్లనిపిస్తుంది హారతి జ్ఞాపకం. మామూలుగా బ్రతికేస్తున్న మనిషి ఆగి అప్పుడప్పుడు ఆలోచించుకుంటే, వేసవి ఎడారుల్లో మంచిగంధపు తుపానుల్లాంటి అందమైన అనుభూతులు ఉక్కిరిబిక్కిరి చేసేవి కొన్ని ఉంటాయి. మనిషి ఆయుఃపరిమాణం కాలానికి కట్టుబడితే, మనిషిలోని ఆత్మ అనుభూతుల వాసనతో అజరామరమౌతుంది. ఆత్మ...పూర్వజన్మ వాసనలు....ఇవన్నీ తరవాత చదివాను. నేను ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, ఈ ఆలోచనలన్నీ ఆమె తరవాతవి.

"మీట్ మై డియరెస్ట్ ఫ్రండ్ హారతి...." అన్నది అపుడే నామీద అధికారాలు సంతరించుకున్న నా భార్య.

అసలే విసుగ్గా ఉంది ఈ పెళ్ళి తంతు. ఒక్కసారి అందరి మీదా విరుచుకు పడిపోయి లేచి పారిపోదామా అనిపిస్తున్న నేను తలెత్తి చూసి ఆటోమేటిక్‌గా చేతులు జోడించాను 'సూడో కల్చర్' అని తిట్టుకుంటూ. ఆమె... గులాబీరంగు చీర, చిన్న బొట్టు, కనీకనబడనట్లుండే నాజుకైన నగలు, కాటుకలేని కళ్ళు, చీరలో కలిసిపోయిన ఒంటిరంగు, హిమాచలాలే ఘనీభవించాయా అన్నట్లుండే ఆ కళ్ళు... అంతలో సౌందర్యానికి రవసెల్లా వేసినట్లు చటుక్కున కళ్ళు దించుకుని 'విష్ యు హాపీ మారీడ్ లైఫ్' అని సున్నితంగా చెప్పి, చేతులు జోడించి మెల్లిగా జనంలోకి వెళ్ళిపోయింది.

"ఎవరా అమ్మాయి?" అప్రయత్నంగా అడిగాను.

"నా స్నేహితురాలు..."

అటే చూశాను.. ఆమె లేదు.

మనిషికి మనిషికి మధ్య స్పందన అని ఎక్కడన్నా చదివితే విరగబడి నవ్వే నాకు ఎందుకో హారతిపట్ల ఏదో తెలియని అనుభూతి కలిగింది. అంతా ట్రాష్ అంటూనే ఆలోచిస్తున్నాను నేను.

"హారతి... అయినా అదేం పేరు?" అన్నాను ఆ తరవాత మాటల్లో నాభార్య శారదను కదిలిస్తూ.

"నిజమేనండీ! కర్పూరహారతిలాంటిదే దాని జీవితం. ఆలోచించే పెట్టారు వాళ్ళవాళ్ళు..." అంది శారద మెల్లిగా. నా భార్య చాలా సనాతనం. పొరపాటున కాలు తగిలితే ఎదుటివాళ్ళు ఇబ్బందిపడేదాకా వంగి కళ్ళకద్దుకోవడం, కనబడ్డ రాయికి, గోపురంలా కనిపించితేచాలు – అది ఏ ఇంటి బురుజైనానేమోనని ఆలోచించకుండా తలవంచి అర్ధనిమీలిత నేత్రాలతో దణ్ణం పెట్టడం, వాచీ పెట్టుకుని, ఆదే చేతికి గాజులు వేసుకునే కల్చరు, పసుపురాసిన కాళ్ళకు మట్టెలు పట్టాలు పెట్టుకుని హీల్సు వేసుకునే తత్వం, నేను ఏడిపించినకొద్దీ 'నా పద్ధతింతే' అని తేల్చి చెప్పే సున్నితమైన మొండితనం, అతి మంచితనం, కొంచెం – పెంకితనం ఇవన్నీ మూర్తీభవిస్తే నా శారద.

ఆ తరవాత హారతిని మళ్ళీ చూశాను మా ఇంట్లో. అదే మనిషి, అదే సున్నితమైన మాట, ఘనీభవించిన చూపు, పలుచని వెన్నెల్లాంటి చిరునవ్వు. కానీ, మాటలు? ఆ మనిషితో మామూలు ఆడవాళ్ళతో మాట్లాడినట్లు మాట్లాడడం చాలా కష్టమని అర్థమైంది నాకు.

శారద నమ్మకాల గురించి వెక్కిరించి ఏడిపిస్తున్నాను నేను. "ఒకరకంగా నిజమేనేమో. ఆమెది అజ్ఞానమైనా దానికి సెంటిమెంటు ఉంది. కొంత బలం ఉంది. "కానీ మీ అపనమ్మకాలన్నీ ఆకాశ దీపాల్లాంటివి. మీకు పూర్తిగా దేనిమీదా నమ్మకం లేదు సరే.... కనీసం అపనమ్మకం కూడా లేదే!" సన్నగా నవ్వుతూ అన్న మాటలకు తెల్లబోయి చూశాను నేను.

"నా గురించి ఏం తెలుసని అలా మాట్లాడుతున్నారు మీరు?...."

"తెలియక్కర్లేదు, చూశాను. మొన్న పెళ్ళి తంతులో మీకు ఏది ఇష్టమనిట అన్నీ అంత శ్రద్ధగా చేశారు? ఇదంతా నాన్సెన్స్, చెత్త అనుకుంటూనే అన్నీ ఆచరిస్తున్నారు మీరు. మీ ఐడియల్స్‌కు శత్రువులు ఎవరో కారు – మీరే.." అంది మళ్ళీ నవ్వుతూ.

నాకు కోపం ఎందుకు రాలేదో ఇప్పటికీ అర్థంకాదు. ఆ మాటే, ఆ తరువాత, మరింత పరిచయం పెరిగక అంటే, "కారణం ఒకటే..నేను వెక్కిరింపుగానూ, హేళనగానూ అనలేదు. హెచ్చరించాను...అంతకన్న యింకేం లేదు" అనేసింది.

"అంతకన్న ఇంకేం లేదా?" పరీక్షగా ఆమె కళ్లల్లోకి చూస్తూ అన్నాను నేను. శారద టీ కప్ లోపల పెట్టడానికి వెళ్ళింది.

మెల్లిగా చూపు మార్చేసింది...."మీ మారేజ్ ఆల్బం కావాలి నాకు..." అంది. పరీక్షగా ఆమెనే చూస్తున్న నాకు ఆ మాటల్లో ఏదో ధ్వని... 'నీకు పెళ్లైంది' అనా? లేక, 'అలా మాట్లాడకూడదు' అనా? ఇంతవరకు ఎంతో మంది ఆడపిల్లల అల్లరి కబుర్లు విన్నాను నేను. కానీ, ప్రతి మాట వెనకాల ఏదో తెలియని ప్రతిధ్వని విన్నది 'హారతి'లోనే!

"చాలా అందమైంది కదూ, మీ ఫ్రెండ్..." అన్నాను ఆ తరవాత శారదతో.

చురుగ్గా చూసింది.. ఉలిక్కిపడ్డాను నేను. నా మాటల్లో తెలియని వాంఛ ఏదో వినిపించి ఉండాలామెకు.

"నా ఉద్దేశ్యం అది కాదు..." అని ఏదో చెప్పబోయాను.

"ఎందుకలా భుజాలు తడుముకుంటారు? అయినా, హారతిలాంటివాళ్ళు వేరు... దాని సౌందర్యం, తెలివితేటలు అడవి కాచిన వెన్నెలలా అయిపోయాయి. మానవత్వం లేదండీ వాళ్లాయనకు..."

"హారతికి పెళ్లైందా?" ఆశ్చర్యంగా అడిగాను.

"అంటే మీ ఉద్దేశ్యం? దానికి యిద్దరు పిల్లలు కూడా!"

ఇది నా ఊహకందని విషయం. హారతి... ఆవిడ నా ఊహల్లో తెలియని రూపుదిద్దుకుంటున్న గగనకుసుమం. ఆమె మామూలుగా పెళ్ళాడి, పిల్లల్ని కని.. ఛా!

ఛా! నా ఊహలకు పొంతన లేదు... ఏమిటిది? నేను కూడా ఇలా సెన్టిమెంటల్ ఇడియట్‌లా తయారౌతున్నాను? ఛా! అందరు ఆడవాళ్లు ఒకటే!

నోములకు నా భార్య హారతిని పిలవలేదు... అదేమని అడిగాను.

"అది రాదండీ! తను పసుపు కుంకుమలకు నోచుకోలేదు!" కళ్ళంబడి నీళ్ళతో అంది శారద.

"వాట్ నాన్సెన్స్ ఆర్ యు టాకింగ్.."

"నిజమండీ! దాని భర్త పోయాడు..."

ఒక్కసారిగా ఈ ప్రపంచమంతా నాకు గిర్రున తిరిగినట్లైంది.

"అయినా అదేం జబ్బు నీకు ...ఇంకా అలాంటి ఫూలిష్..."

"ష్! ఎక్కువ మాట్లాడకండీ! మా హారతి విషయంలో నాకు అల్లాంటివేం లేవు. నేను అనుభవించే నరకం మీకెలా అర్థమౌతుంది? అదీ, నేనూ పసిపిల్లల దగ్గర నుంచి స్నేహితులం. వందకాసుల బంగారం, లక్షరూపాయల కట్నం యిచ్చి చేశారు పెళ్లి వాళ్ళవాళ్ళు. అతనొక పెద్ద ఇంజనీరు. కాని, మనసు ఎదగలేదు...దానికి అన్యాయం జరిగింది. అతను విధించిన శిక్ష నుంచి అది బయటపడలేకపోతోంది..." చీర కొంగుతో కళ్ళంబడి నీళ్ళు తుడుచుకుంటూ అంది శారద.

హారతి కథ క్లుప్తంగా యిది:

ఎంతో కట్నంతో, మరింత సౌందర్యంతో వచ్చిన హారతిని ఆమె భర్త భరించలేకపోయాడు. ఆమె సౌందర్యం, ఆత్మాభిమానం అతని స్థాయికి దిగజారలేక పోయాయి. జీవితంలో ఎంత గొప్ప వస్తువైనా, డబ్బు రూపంలో దాని విలువేమిటని ఆలోచించే మనుష్యుల మధ్య నుంచి వచ్చిన అతని ఆలోచనలు చాలా అట్టడుగువి. అందుకనే, సున్నితమైన, సుకుమారమైన హారతిని భరించలేకపోయాడతను. హింసించాడు, బాధపెట్టాడు. వీటిని సహించేదేమో కానీ అనుమానించి మనసు మీద వాత పెట్టాడు. వాటికి తలవగ్గకపోనేమో కానీ, ఆమెకు ఏమాత్రం సరితూగని ఆడదానితో సంబంధం పెట్టుకున్నాడు. తన కోరికలకి, డబ్బుకు లంకె కుదురలేదు. ఏదో ఫ్రస్ట్రేషన్‌లో ఈ ప్రపంచం నుంచి శాశ్వతంగా శలవు తీసుకున్నాడు. కానీ, వెళ్ళిపోతూ, "ఈ అకాల మరణానికి కారణం హారతి" అని తెలియజెప్పాడు. సంఘంలో, బంధువులనే రాబందుల మధ్య హారతి–అతి సున్నితమైన హారతి–చీకాకుల చిలకలా చిక్కింది. ఆమె కన్నీళ్ళు, ఆవేదన ఎవరికీ అక్కర్లేకపోయాయి. బ్రతకకూడదు అనుకుందామంటే పసిపిల్లలు కాలికి అనుబంధాలై పోయారు.

అన్నపూర్ణ విగ్రహం ముందు తానే వెలిగే హారతిగా మారి, అనంతమైన చీకటిలోని మృత్యురేఖగా వచ్చి తనను తీసుకుపొమ్మని ఎన్నోసార్లు ప్రార్థించింది హారతి. బ్రతకక తప్పదనుకున్నప్పుడు అందంగా, తెలివిగా బ్రతకటానికి అలవాటు పడింది. ఏదో ఉద్యోగం చేస్తోంది.

ఈ కథ నాలో చీకటి కోణాల తలుపుల్ని బలవంతంగా లాగి తెరిపించింది. ఉక్కిరిబిక్కిరి చేసింది. ఏమిటావిడ జీవితం! ఏదో కనబడని వక్రరేఖలు, వినబడని అపశ్రుతులు.

"ఇది నిజమా? అటువంటి రాక్షసుణ్ణి ఎలా భరించారు?" అని అడిగాను హారతిని కలిసినప్పుడు... ఎక్కడికీ రాని హారతి, శారద బలవంతం మీద అప్పుడప్పుడు మా ఇంటికి వస్తుంది.

"అనవసరంగా తిట్టకండి...అతని లెవల్ అంతే. అందుకే పెళ్ళి చేసేటప్పుడు స్థాయి చూడాలంటారు మనవాళ్ళు. ఐశ్వర్యాలస్థాయి చూస్తారు కానీ, మానసికమైన వాటి గురించి ఆలోచించరు. నా ప్రవర్తన అతనిలో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌ని నిద్ర లేపింది. నాకూ చిన్నతనం కదా! కలలలో బ్రతికే వయస్సు. అతనిలో తక్కువతనాన్ని భరించలేక రెచ్చగొట్టేదాన్ని. దాని ఫలితం-ఇదుగో యిలా పరిణమించింది. కొన్ని తప్పించుకోలేం... మా వాళ్ళు చూసిన జాతకాలు, పెట్టిన ముహూర్తాలు..."

"అంతా ట్రాష్...ఏమైంది యిప్పుడు?"

"అలా అనెయ్యకండి. అన్నింటి వెనకాలా ఏదో తెలియని ఫోర్స్ ఒకటి వుంటుంది. జ్యోతిశ్శాస్త్రం తప్పనకండి. యోని పొంతనాలూ, మీ జీన్స్‌థియరీ ఒకటేనేమో... మీరు చెప్పే, అల్ట్రాయిసమ్, సెల్ఫిష్‌నెస్, స్పైట్‌థియరీలన్నీ ఒకప్పుడు భర్తృహరి సుభాషితాలు చెప్పాయి. మనిషి స్వార్థం కోసరం శాస్త్రాన్ని మార్చుకుంటే చెప్పలేం కానీ, లేకపోతే తెలుసుకోవాలంటే చాలా వుంది."

ఏమిటీ అమ్మాయి - అర్థం కాలేదు నాకు... ఎప్పుడు ఏ విషయం అవునంటుందో, ఎప్పుడు కాదంటుందో, ఎందుకలా అంటుందో, చిక్కుముడి అంతా...

"ఇంత తెలిసి మరి మిమ్మల్ని మీరే సంఘం నుంచి యిలా దూరం చేసుకుంటున్నారెందుకని....?'

"ఏంలేదు. మొదట్లో బాధగా వున్నా, తరవాత అలవాటైంది. ప్రపంచానికి దూరంగా గాలరీ సీట్లో కూర్చుని జీవితాన్ని సమీక్షిస్తున్నట్లుంది."

రోజురోజుకూ ఆమెలో కొత్తమనిషిని చూశాను నేను. ఆమెలో స్త్రీత్వాన్ని నిద్రలేపాలనే చిలిపి ఆలోచన వచ్చేది నాకు. ఎంతటి గొప్ప స్త్రీ అయినా, పొగడ్తకు బానిస అనుకునే నన్ను సన్నగా నవ్వుతూ శాసించేది ఆమె. సాధారణమైన ఆడదానిలో లేని గొప్పగుణం ఆమెలో వుంది. ఆమె ఏమిటో ఆమెకు తెలుసు. ఆమె మీద నాకున్నది ప్రేమో, జాలో, ఆరాధనో తెలియని అయోమయ స్థితిలో ఉండగా శారద పురిటికి వెళుతూ "అసలే అయోమయ మనిషి హారతీ! కాస్త కనిపెట్టి వుండు" అని జాగ్రత్తలు చెప్పి వెళ్ళింది. దానికి కారణం శారదకు జెలసీ లేక కాదు - హారతి మీద నమ్మకం. ఆ విషయంలో శారదకు నమస్కరించ బుద్ధేస్తుంది నాకు. మామూలు జ్వరం టైఫాయిడ్‌గా పరిణామం చెందడానికి మూడురోజుల ముందే హారతికి ఫోన్

చేశాను. జ్వరం...నీరసం! ఈ బాధలో హారతి వస్తుందనే ఆలోచన హాయిగా వుంది. మానసికంగా నేను యిటువంటి అవకాశాలే చాలా రోజులుగా ఎదురుచూస్తున్నానేమోననిపించింది.

హారతి వచ్చింది - కర్పూరంలా, వెన్నెలలా, మలయమారుతంలా.... ఇంకేం రాయను? ...నిస్సహాయంగా పడుకుని, ఆమె సేవలు పొందడంలో వున్న హాయి మామూలు మనిషికి ఎలా అర్థమౌతుంది? డబ్బు, వస్తువులు, ఆస్తులు, హోదాలు....ఇలాంటి చీపిరి ఆలోచనల మధ్య వున్న నాకు తృప్తి, నిశ్శబ్ద సంగీతం, స్పందనలాంటి కొత్త పదాలకు అర్థాలు అవనికలు చీల్చుకుని హారతి రూపంలో సాక్షాత్కరిస్తున్నాయి. ఆ చూపులో తృప్తి, ఆ నిస్వార్థం, ఆ మాటలలో నిజాయితీ... ఆ పదిరోజులూ నా జీవనంలో మర్చిపోలేని మధుర సంగీతాలు ఎన్నో....

కాని, ఆమెలో స్పందన లేదా? ఆలోచించదా? నా కళ్ళలో జీరాడే ఈ ఆరాధన, నా ప్రతి పలుకులో ధ్వనించే ఆహ్వానం ఆమెకు అక్కర్లేదా? ఏమిటీ మనిషి? స్పందనే లేకపోతే ఈ సేవాతత్వం ఎక్కడిది? ఆ నిర్లిప్తత ఏమిటి?

ఆ మాటే అడిగాను. నా గొంతులోని నీరసం ఆమెనునిద్రలేపిందేమో అలవాటు చొప్పున మాట మార్చనీయలేదు.

"నాకు అర్థంకావటంలేదని ఎందుకనుకుంటున్నారు? నా జీవితం చాలా నేర్పించింది మూర్తిగారూ! ఇంత చక్కటి తీయని అనుభూతులు మళ్ళీ ఉండవు. మనిషి ప్రవర్తన పరిస్థితులకు ఎప్పుడూ కట్టుబడాలి. అందుకే అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిక్షణం శాశ్వతం కావాలనుకోవడం పిచ్చితనం. ఈ క్షణంలోని భావాలు, రేపు మళ్ళీ మనకుండవు. అల్లాంటప్పుడు అవి కోరికలతో మలినమై చూడండీ గాయాల్లా జ్ఞాపకానికి రాకూడదు. మెల్లిగా కూర్చోబెట్టి బత్తాయి రసమిస్తూ నా చూపుల్తో తన చూపులు కలవకుండా చెప్పింది హారతి. ఆలోచిస్తూ కళ్ళు మూసుకుని పడుకున్నాను ప్రతి మాట వెనకాలా తెలియని ధ్వని...ఇదే జీవితంలో ఏదో తెలియని మధురమైన , అనుభూతి రక్తనాళాల్లో చిమ్మి ఆనందంతో ఊపిరాడనీయటం లేదు. దీని ఫలితమేమిటి? ఫలితమంటూ ఎందుకు ఆలోచించాలి? హారతి చెప్పినట్లు ఆ క్షణంలో నాకు వెయ్యి భగవద్గీతలు లక్ష లాక్షణిక క్షణిక గ్రంథాలు అర్థమైతున్నాయి.

ఆ మిగిలిన కొద్ది రోజుల్లోనూ మా ఇద్దరి మధ్య ఎన్నో చర్చలు, ఎంతో చదివింది హారతి. నాలో సైంటిస్ట్‌కుండే మూర్ఖత్వాన్ని తొలగించింది. తత్వవేత్తను చేసింది. ఆలోచనలకు పరిమళమద్దింది. నాలో తెలియని జ్ఞానం వెలిగించింది. ఎంత ఒద్దనుకున్నా ఆరోగ్యం చిక్కింది నాకు.

మాట్లాడుతూండగానే ఒక మధ్యాహ్నం మటుమాయమైంది హారతి. అలా అర్థంతరంగా వెళ్ళిపోతుందని నా మనస్సెందుకో చెప్తూనే ఉంది నాకు. కర్తవ్యమైన మరుక్షణం నా దగ్గర ఉండదు నాకు తెలుసు.

ఆ తరవాత వాళ్ళ అన్నయ్య దగ్గరకు స్టేట్స్‌కు వెళ్ళిపోయింది హారతి.

మరొకసారి కనబడింది. మామూలుగా మాట్లాడింది. ఎందుకు వెళ్ళిపోయింది! నా కోసమే అని గర్వపడటానికి హారతి విషయంలో అంగీకరించడం లేదు. ఈ అనుభూతి ఎంత ఉన్నతమైనదంటే, ఇది నాలో అహంకారాన్ని కూడా అది చంపేసింది. ఆ తరవాత హారతి ఇన్స్పిరేషన్‌తో చదివాను. ఎన్నో బహుమతులు, మెడల్స్ పొందాను. ప్రతిదానికి వెనకలా చెప్పుకోలేని తీయని అనుభూతి. కంగ్రాట్యులేషన్స్ లెటర్స్ మాత్రం వచ్చేవి.

"హారతి మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదూ?" అని ఎవరో అడిగారు శారదను.

"హారతికి పెళ్ళా! దానిలా ఆలోచించే మొగవాడేలేడేమో, అది నిప్పు.... దాన్ని భరించడం కష్టమే..." అంటోంది శారద.

అమాయకంగా చెప్పినా నిజం చెప్పింది శారద.

నిజం! హారతి ఒక అగ్నిపుష్పం!

*(వనిత మాసపత్రిక - ఆగష్టు, 1980)*

# సాలభంజిక

"కళ్ళు మనస్సుకుండే గవాక్షాల్లాంటివి. మీ కష్టాలు, బాధలు కన్నీళ్ళతో దాచేద్దామనుకుంటున్నారా? ఏదీ, ఒక్కసారి తలెత్తి చూడండి"

మెల్లగా కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ సన్నగా నవ్వేసింది శారద. అది కన్నెపిల్ల కళ్ళల్లోంచి మేలుకుని ఉలిక్కిపడ్డ నవ్వుకాదు. కష్టాలు, కన్నీళ్ళు దాటేద్దామని ఇరవైఎనిమిదేళ్ళ యువతి చేసే ప్రయత్నం.

"వెళ్ళి మొఖం కడుక్కుని రండి. కాఫీ తాగుదాం..." ఆమె వంక చూడకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ అన్నాడతను.

అది ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు కూపే....

మెల్లగా రైలు కుదుపులకు బాలన్స్ తప్పకుండా అడుగులు వేసుకుంటూ వెళుతున్న ఆమెను చూస్తూ నిట్టూర్చాడతను.

చల్లని నీళ్ళు... సేద తీరింది. ఆలోచిస్తోంది శారద ఎంత వద్దు అనుకున్నా బెజవాడ ప్లాట్‌ఫారం మీద-

'వస్తాను శారదా! హాపీ జర్నీ! మీ ఆయనను అడిగానని చెప్పు" అని వెళ్ళిపోయిన సుధాకర్ గుర్తుకు వస్తూనే వున్నాడు ఆమెకు. కోటి కోరికలతో అతన్ని వెదుక్కుంటూ రాలేదామె. ఈ విశాల ప్రపంచంలో ఇన్ని కోట్లమంది ఒకప్పటి మనుష్యుల్లో ప్రేమికుడు, ఇప్పుడు స్నేహితుడిగానన్నా చేయూత ఇస్తాడేమోనని వచ్చింది... అతను? తన స్థితిని గమనించనే లేదు. 'కన్నీళ్ళేమిటి శారదా?అని అడగలేదు "కంట్లో ఏదో పడ్డట్లుంది తుడుచుకో" అన్నాడు. పెద్ద ఆఫీసర్ రాంక్‌లో ఉన్న తన భర్త హోదా గురించీ ప్రమోషన్ గురించీ అడిగాడు. ఇళ్ళు, వాకిళ్ళు ఆస్తులు అంతస్థులు వీటి - గురించే మాట్లాడాడు.

సుఖంగా ఉన్నావా శారదా?" అని అడగలేదు. "నీకేం తక్కువ శారదా?" అన్నాడు. చెప్పాలని తనకూ అనిపించలేదు. ఎందుకని ఇలా? తలుపు దగ్గర నిలబడి ఆలోచిస్తోంది ఆమె.

అరగంట అయింది వెళ్ళి, ఏమయ్యారా అని భయపడ్డాను రండి." వెనుకగా రాజశేఖరం.

ఎందుకంత భయం అతనికి? ఏం తెలుసునని? విచిత్రంగా చూసింది. రాజశేఖరం ... ఒకప్పుడు కాలేజీలో సుధాకర్. ప్రపంచంలో తామిద్దరం మాత్రమే ఉన్నామని భ్రమపడే తీయటి రోజుల్లో సుధాకర్ డబ్బుతో ఫీజు కట్టుకుంటూ, అతనంటే హీరోవర్షిప్‌తో వుండే రాజశేఖర్ ఇవ్వాళ తమాషాగా తటస్థపడ్డాడు.

అతనిచ్చిన కాఫీ తాగుతూ ఆలోచిస్తూనే వుంది. జీవితం వంచిస్తే పారిపోయి వచ్చింది తను. తనను ఒకప్పుడు ఆరాధించి, వలచి వలపించుకున్న సుధాకర్‌ను ఇవ్వాళ మరేమీ అడగడానికి రాలేదు. ఆత్మన్యూనతా లేకుండా ఎక్కడైనా -ఇప్పిస్తాడని ఆశతో వచ్చింది. కానీ అతను మారిపోయాడో, 'మర్చిపోయాడో, ఏం జరిగిందో చెప్పనీయకుండానే వెళ్ళిపోయాడు.

గమ్యం తెలియని తను ఏ రైలని ఎక్కుతుంది? తోటి ప్రయాణీకులకు చోటులేకుండా చేయడమే జీవితధ్యేయంగా పెట్టుకున్న కొంతమందిని చూస్తూ అలాగే నిలబడింది ఆమె. రైలు పట్టాలు కనుచూపుమేర కనబడేవరకు చూస్తోంది. కలవవు తన ఆశయాలు తన జీవితం-ఈ రెండు అంతే.

ఏమిటలా చూస్తున్నారు? సిగ్నల్ ఇచ్చాడు. ఎక్కండి... "ఎవరిదో గొంతు వినబడితలెత్తింది. తలుపు దగ్గర నవ్వుతూ నిలబడి వున్నాడు రాజశేఖరం.

"రైలు కదులుతోంది. త్వరగా రండి." చెయ్యి అందించాడతను. ఆలోచించే అవకాశం లేకుండా లోపలికి అడుగు పెట్టింది.

ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంటు. తన దగ్గర వున్నవి నూటపట్టై రూపాయలు. నిన్నటి వరకు తను ఒక పెద్ద ఆఫీసర్ భార్య. ఇవ్వాళ? నవ్వొచ్చిందామెకు.

"టికెట్టు సంగతి నేను చూస్తాను. కూర్చోండి."

మాట్లాడకుండా సీట్‌కు ఆనుకుని కూర్చుంది.

సర్వ ప్రకృతి చలిస్తున్నా తనుమాత్రం కరుడుగట్టుకుపోయినట్టుగా కూర్చుంది.

"సిగరెట్టు తాగితే మీకభ్యంతరమా?"

తలెత్తి చూసింది. చాలా కాస్ట్లీ సిగరెట్టుతో భర్త తన చేతిమీద మిగిల్చిన మచ్చ ఇంకా పచ్చిగానే వుంది. అప్రయత్నంగా ఆ ముంజేయి తడుముకుందామె. అతను అటే చూస్తున్నాడు.

చటుక్కున "అబ్బే అదేం కాదు" అనేసింది.

"ప్రపంచంలో మనిషి 'మీకేం అభ్యంతరం లేదుకదా' అంటూనే నిరభ్యంతరంగా తన పని తను చేసేస్తాడు. ఈ మానర్స్ వెనకాల మనిషి చాలా శాడిస్ట్." సిగరెట్టు వెలిగిస్తూ నవ్వుతూ అన్నాడతను.

నవ్వేసింది. పక్కకు చూసింది. బుట్టలో ఏవేవో పత్రికలు, తలనూనె, సున్నిపిండి, చిన్న డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లా వుంది. "అదేమిటి? అవన్నీ ఎలా తెలుస్తాయి విడి విడిగా?" ఆశ్చర్యంగా అడిగింది.

"అది మాంత్రికుడి పెట్టె మాడం... అలా ఉంటేనే కానీ నాకు తోచదు. ఠక్కున నాకు కావల్సిన వస్తువు నేను తీసుకోగలను. బెట్.... డిసార్డర్‌లో నుంచికానీ ఆర్డర్ రాదు నాకు. బిజినెస్ టూర్స్ కదా! అన్నీ అవసరం. సర్దుకోవడం బద్ధకం.." ఏవో కబుర్లు చెపుతున్నాడతను. పరధ్యానంగా వింటోందామె.

అప్పటికే అతను మూడో సిగరెట్టు తీయడం చూసింది,

"ఆ చైన్‌స్మోకింగ్ ఏమిటి? మంచిదికాదు వంటికి."

"థాంక్యూ! మరెవరికేనా చెపుతాను."

"అదేమిటి?"

"అంతేకదండి మరీ! మంచి సలహా మరొకరికి చెప్పడానికి తప్ప పనికిరాదు."

మరొకసారి నవ్వేసింది. ఇతనిలో యింత హ్యూమర్ ఉందని తమ నాలుగేళ్ళ పరిచయంలో ఎప్పుడూ అనుకోలేదు. కేవలం ఒక బీదకుర్రాడిగా, సుధాకర్ డబ్బుపై ఆధారపడే ఒక వ్యక్తిగా కొంచెం తక్కువగానే చూసేది తను అతన్ని. మాసిపోయిన బట్టలు, ఏ ప్రత్యేకతా లేని మొహం. సుధాకర్ చేసే ప్రతి పనీ కరక్టేనని ఒప్పుకునే ఇతను, ఈనాడు ఒక గొప్ప వ్యక్తిగా తారసపడ్డాడు. పరిస్థితులనుబట్టి మనిషిలో మరొక వ్యక్తి బయటపడడం అంటే యిదే కాబోలు అనుకుంది.

"ఇందాక ప్లాట్‌ఫాం మీద సుధాకర్ని మీరు..." అడిగింది.

"చూశాను. ఇన్‌ఫాక్ట్ వాడి ఇంటికే వచ్చి వెళుతున్నాను నేను..."

"అతని భార్య పిల్లలు బావున్నారా? అడిగే టైం లేకపోయింది నాకు." మెల్లిగా అడిగింది.

"ఉట్టి ఆడవాళ్ళలా మాట్లాడుతున్నారు. బావుండకపోవడానికి వాళ్ళకు తక్కువైంది ఏమిటిట? చూడండి శారదగారూ! సుఖం అనేది చాలా రకాలు. అందులో వ్యక్తిత్వం ఒకటి. చాలామంది ఈ ప్రపంచంలో రెండో రకమనేది ఉందని తెలియకుండానే బ్రతికేస్తున్నారు. మనసు అనేది నిద్రలేస్తే చాలా ప్రమాదమని, మనిషి ముందే దాన్ని మర్చిపోతున్నాడు. కార్లలో తిరగడం, కాస్ట్లీ బట్టలు వేసుకోవడం, సంఘంలో డబ్బున్న వ్యక్తిగా గుర్తింపబడడం – సుఖం అంటే ఇదేనని బ్రతికేస్తున్నారు మనుష్యులు. 'అబ్బబ్బ! ఈ జీవితం కన్న హాయిగా కలో గంజో తాగి గుడిసెలో బ్రతకడం హాయి...' అని చాలామంది కాస్ట్లీ మనుషులు అనడం వినే ఉంటారు మీరు. అప్పుడు వస్తుంది నవ్వు నాకు... ఎందుకో తెలుసా? వాళ్ళకి దరిద్రం అన్నా, ఆకలన్నా లగ్జరీగా కనిపిస్తుంది. కొంత సుఖం ఎదిటివారికిస్తే అది దొరుకుతుందని వాళ్ళకు తెలియదు. తెలిసినా చెయ్యలేరు. పంచతంత్రంలో రాని బంగారు కంకణం కోసం ఉన్న ప్రాణాలు తెగించి పులిదగ్గరకు వెళ్ళిన మనిషి మనస్తత్వం ఇప్పటికీ, అప్పటికీ మారలేదు. మీకు తెలుసా? సుధాకర్ భార్య ఐదులక్షల కట్నంతో వచ్చింది!"

"తెలుసు" అంది వచ్చే నిట్టూర్పును ఆపుకుంటూ.

"ఆవిడ బావుంటారా?" మెల్లిగా సందేహిస్తూ అడిగింది.

సిగరెట్టు కాలుస్తూ, సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. అతని కళ్ళు నవ్వుతున్నాయి.

"మరోసారి ఆడవారిననిపించారు! బావుంటుందా! అంటే నాకంటేనా అనా

అర్థం? సౌందర్యం ముఖ్యమనుకుంటే మీకంటే అందగత్తె ఎవరు శారదా? అదికాదుగా క్రైటీరియా.

"చూడండి శారదగారూ! దిగజారడంలో రకరకాలు. ఇప్పుడు పదివేలంటే నాకు లెక్కలేదు. కానీ, అప్పట్లో నా చదువుకోసరం ఎంత దిగజారి, యాచించి, ప్రపంచాన్ని బ్రతిమాలి బతికానో నాకు తెలుసు. జీవితానికిక ఏవిధంగానూ పనికిరాని ఆ డిగ్రీకోసరం ఎందుకంత బాధపడ్డానో నాకు ప్రపంచం అప్పటికి నేర్పలేదు. విషయమేమిటంటే, ఏమీలేని నేను పదివేలకు దిగజారాను. అన్నీ ఉన్న సుధాకర్ ఐదులక్షలకు దిగజారాడు. డిగ్రీస్ ఆఫ్ డిఫరెన్స్. అంతే" అతని కళ్ళల్లో ఎర్రటిజీర... మానసికంగా అతను తిన్న దెబ్బలు చెప్పుకోలేనివి.

మాట్లాడలేదు శారద. ఆలోచిస్తోంది. ఐదేళ్ళు ఒకళ్ళ ఊపిరిగా ఒకరు బ్రతికిన సుధాకర్, తాను ఎలా విడిపోయారు?

"అయాం సారీ శారదా! నన్ను క్షమించు. కులం కానిదాన్ని తీసుకువస్తే ఉరేసుకు చచ్చిపోతానంటోంది మా అమ్మ. నా పరిస్థితి అర్థం చేసుకో" అని కళ్ళంబడి నీళ్ళతో తన చేతులు పట్టుకుని బీచ్‌లో అడిగిన రోజున - ఎదురుగా వున్న సముద్రం, ఉదయించిన చందమామ, వీల్చుతున్న గాలి, సర్వం ఆబద్ధంలా కనిపించాయి తనకు. 'ఒక్కసారి సముద్రం ఉప్పొంగి చెలియలి కట్ట దాటి తనను తీసుకుపోరాదా?' అనిపించింది. విడిచింది 'నన్ను మర్చిపోతావా?' అని అడిగింది.

"అది అసాధ్యం శారదా!" అన్నాడు. తరవాత ఐదువారాల్లో హాయిగా పెళ్ళి చేసుకున్నాడు.

నవ్వొచ్చింది శారదకు.

"కోపంగా లేదూ మీకు సుధాకర్ అంటే?" అడిగాడు.

"లేదు. ఏ మనిషిమీదన్నా కోపం వచ్చినప్పుడు ఆ మనిషిలో మంచిగుణాలేవో తలుచుకోవాలి. ఈ సూత్రం చిన్నప్పుడే నేర్చుకున్నాను నేను" అంది కిటికీలోంచి చందమామను చూస్తూ.

ఆశ్చర్యంగా చూశాడు ఆమెను. తలకాయ కిటికీకానించి, ఒంటినిండా కొంగు కప్పుకుని రైలులో సాటి ప్రయాణం చేస్తున్న చందమామను కన్నార్పకుండా చూస్తోందామె. పసిమి ఛాయ, పెద్ద కళ్ళు, నవ్వే పెదవులు, పొడుగాటి జడ. చాలా సౌందర్యవతి శారద. నిస్సంకోచంగా ఆమెనే- మళ్ళీ చూడనేమో నన్నట్లయి, చూస్తున్నాడతను. చూపులు గుచ్చుకున్నట్లయి, చటుక్కున అతని వంక చూసింది శారద. ఆమెలో స్త్రీత్వం జాగ్రత్త పడింది.

"ఇప్పుడేం చేస్తున్నారు మీరు? బిజినెస్సా?"

"ఆc! చాలా చేస్తున్నాను. డబ్బు సంపాదించడానికి చాలా కష్టపడ్డాను నేను. అనుకున్నది సాధించాను. ప్రస్తుతం అదే నాకు సంపాదించి పెడుతోంది. ఆత్మాభిమానం, గౌరవం, మర్యాద - ఇలాంటివి బీదరికం పేరుతో నానుంచి లాగేసుకుని, ఆ తరవాత డబ్బిచ్చి తన పాపాలు కడుక్కుంటోంది ప్రపంచం."

"పోన్లెండి. మొత్తానికి మీరు కోరుకున్న స్థాయికి వచ్చారు".

"ఆఁ! అదే తమాషా. మనిషి జీవితంలో విషాదం ఏమిటంటే - తను కోరుకున్నది పొందలేకపోవడం; ఒక్కోసారి పొందడం కూడా అన్నాడు ఆస్కార్‌వైల్డ్."

సన్నగా నవ్వేసింది ఆమె.

"ఇవన్నీ ఎప్పుడు చదివారు మీరు?"

"జైల్లో వుండగా."

"జైలా! ఎందుకెళ్ళారు?"

"ఆ! నా దృష్టిలో రైటనుకుని చేశాను. తప్పని జైల్లో పెట్టారు. పాపాలు చేసుకుంటే బైటే వుండేవాడినేమో! ఇదిగో, ఇప్పుడు డబ్బు వచ్చిందిగా. నేను చాలా గొప్ప ఆదర్శంతో జైలు కెళ్ళానని చెప్పుకు బ్రతుకుతున్నారు నాతో అవసరమున్న వ్యక్తులు. లీవిట్." విసుగ్గా అన్నాడు.

ఏదో స్టేషన్‌లో రైలాగింది. నియాన్ లైట్ల వెలుగులో పట్టపగలులా ఉంది. ఎవరో తల్లి తన బిడ్డ చుట్టూ చెయ్యేసి తీసుకు వెళుతోంది... ప్రపంచంలో భయాలనుంచి, బాధలనుంచి కాపాడుతున్నట్లు మరింత దగ్గరగా పొదువుకుని తీసుకువెళుతోంది. అదృష్టవంతురాలు. తను మాత్రం ఏం కోరుకుంది? అందని అదృష్టాలు కోరుకోలేదే? తన భర్తకు వండిపెట్టి, బిడ్డలకు జడవేసి స్కూలుకు పంపించి, ఇల్లు శుభ్రంగా పెట్టుకుని శాంతిగా ఉండాలని కోరుకుంది. ఎందుకు దొరకలేదు తనకు? కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి శారదకు. ఆ తల్లీ బిడ్డా కనుమరుగయ్యేవరకూ చూస్తూనే వుంది.

"మీకు పిల్లలు లేరా శారదా?" ఆమెనే చూస్తూ అడిగాడు.

ఉలిక్కిపడింది... పిల్లలు... ఎంత దురదృష్టవంతురాలు తను! కడుపుతో ఉన్న తనను అనుమానించి, అవమానించి, బలవంతంగా అబార్షన్ చేయించాడు భర్త... బైట ప్రపంచానికి తన ఆరోగ్యం కారణమని చెప్పాడు. ఏడిచింది... కాళ్ళు పట్టుకుని ప్రార్థించింది. వినలేదు. 'భోగం దానికి పిల్లలెందుకే? పుట్టినా నా పిల్లలని గ్యారంటీ ఏమిటి? అని కడుపుతో ఉన్న తనని డొక్కలో కాళ్ళతో... తన్నిన ఆ రోజు ఒక్కసారిగా ఉప్పెనలా ఏడుపు వచ్చింది శారదకు. ఆపుకోలేక. కొంగు అడ్డం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న ఆమెను కన్నార్పకుండా చూస్తున్నాడు అతను. అతని గుండెల్లో ఏ లావా పొంగుతుందో కానీ, మునిపంటితో పెదవి కొరుకుతూ, గడ్డం కింద చెయ్యి పెట్టుకుని చూస్తున్నాడు అతను.

కాసేపటికి తలెత్తి చూసిందామె. "సారీ... ఐయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ!" వర్షపు జల్లులో వెన్నెలలా తడికళ్ళతో సిగ్గుతో నవ్వేసిందామె.

"అదెందుకు మళ్ళీ! హాయిగా కరువుతీరా ఆపకుండా ఏడ్చెయ్యగలగడం పెద్ద లగ్జరీ ఈ వెధవ దిక్కుమాలిన ప్రపంచంలో. తెలుసా? ఊఁ! ఇప్పుడు చెప్పండి. ఈ ప్రయాణానికి గమ్యం ఏమిటి?"

"తెలియదు" రాయిలా సమాధానం చెప్పింది.

ఏం కావాలి మీకు?" సీరియస్‌గా అడిగాడు.

ఒక్కసారి ఆడపులిలా కళ్ళెత్తి చూసింది.

ఈ ప్రశ్న సుధాకర్ అడుగుతాడని వచ్చాను రాజశేఖరంగారూ! తప్పేనేమో. ప్రేమించినంత మాత్రాన"

"ప్రేమేమిటండీ, అంతా ట్రాష్. ప్రేమ అనేది మరేంలేదు మన ఎగోను తృప్తిపరిచిన వ్యక్తి మనని ప్రేమిస్తున్నాడనుకుని ప్రోసీడైపోవడం. అంతే అంతా రబ్బిష్...."

"ఎందుకు ప్రపంచమంటే కక్ష మీకు?"

"కక్ష లేదు, జాలి. అర్థంలేని పదాలతో ఆత్మవంచన చేసుకొంటోందే అని జాలి. అంతే. ఈ శరీరం మీద పడ్డ దెబ్బలు ఎప్పుడో మర్చిపోయాను. మనసు మీద వాతలు మర్చిపోకుండా పెట్టారు. శారదగారూ! ఎందుకు రాదు బుద్ధి?" సిగరెట్టు విసిరి పుచ్చుకుని అవతల పారేశాడు రాజశేఖరం.

"నేనెప్పుడూ అడగటానికి ప్రయత్నించలేదు. మీ అమ్మా నాన్నా లేరా?" కుతూహలంగా అడిగింది.

"అమ్మ?" మెల్లిగా సిగరెట్టు తీసి చాలా జాగ్రత్తగా సున్నితంగా దాన్ని వెలిగిస్తూ, కాలు మీద కాలు వేసుకుని హాయిగా పొగవదులుతూ-

"అమ్మ! చాలా గొప్ప ప్రశ్న అడిగారు. శారదగారూ! మాతృత్వాలు, మాతృమూర్తులు, ఈ పదాలన్నీ విన్నప్పుడు నాకేమనిపిస్తుందో తెలుసా? సాహిత్యాన్నంతా తగలపెట్టాలనిపిస్తుంది. మాతృత్వం మర్చిపోయి, స్త్రీత్వం మిగుల్చుకోవాలని తపనపడే ఒక గొప్పింటి ఆడబడుచు అక్రమ సంతానాన్ని నేను. తన వంద కాసుల బంగారంలో రెండు బంగారపు గాజులు రిక్షావాడికి ఇచ్చి నా పీడ వదిలించుకుంది మా అమ్మ. అందుకే రిక్షా వాడి కొడుగ్గానే పెరిగాను. షిఫాన్ చీరలతో, ముత్యాలహారాలతో గొప్ప ఎక్సిక్యూటివ్ భార్యగా నా తల్లి కనబడింది. ఆవిడ నాకు అమ్మేమో కానీ, నేను కొడుగ్గా ఆవిడకు పనికిరాను. స్టేటస్ కృశ్చను. కన్నబిడ్డలకోసరం ప్రాణాలు బలిచేసే తల్లులున్నారేమో - వాళ్ళకు నా నమస్కారాలు. కానీ, డబ్బుకోసరం కన్నబిడ్డల్ని కసాయితనంగా కన్నెరికం చేయించే తల్లులూ ఉన్నారు. అందుకని మాతృత్వం, దయ, ప్రేమ, అభిమానం.... ఇవన్నీ మనిషి తెగకంతా సంబంధించిన పదాలు కావు. ఏ కొంతమంది కోసరమో ఏర్పడ్డవి. సుఖంగా ఉన్నంతకాలం మనిషి ఈ ముసుగుకింద బ్రతుకుతాడు. అవసరమొచ్చిందంటే, స్వార్థం నిద్రలేస్తే, ఈ పదాలన్నీ ఏకబిగిన చించి, తనక్కావలసినవి తాను పొందుతాడు మనిషి. ఇదే నేను నేర్చుకున్న జీవితసత్యం."

అతని వంకే ఆశ్చర్యంగా చూస్తోంది శారద. జీవితం చాలా విచిత్రమైంది. తమది ఎన్ని ఏళ్ళ పరిచయం? కానీ, ఏనాడూ అతని కథేమిటో అడగలేదు తను.

కనీసం ఆలోచించలేదు. రంగులకలల్లో బ్రతికింది. ఈనాడు జీవితంలో అన్నీ పోగొట్టుకున్న తను, ఎన్నో పణంగా పెట్టి హోదాను గెలుచుకున్న అతను, ఒక రైల్లో ప్రయాణం చేస్తూ ఒకరి గురించి ఒకరు చాలా తెలుసుకుంటున్నారు. ఆశ్చర్యం!

"అవునూ, మీ పెళ్ళి ఎలా జరిగింది?" సూటిగా చూస్తూ అడిగాడతను.

"నేను పనిచేసే ఆఫీసులో అతను జనరల్‌మేనేజర్." చీకట్లోకి చూస్తూ చెప్పింది.

"పెళ్ళికి, ది సోకాల్డ్ ప్రేమే కారణమా?"

"కాదు.... వాంఛ.... అందమైన స్త్రీ కావాలనే కోరిక. అతని భార్య అనాగరికురాలు. అనాకారి... తన హోదాకు తగ్గ భార్య, క్లబ్బులకు, మీటింగులకు తీసుకువెళ్ళడానికి కావల్సిన భార్య కావాలి. పెళ్ళంటే తప్ప నేను లొంగనని తెలుసు. అది మరొక కారణం."

"అంటే, అతనికి రెండో పెళ్ళని తెలిసీ మీరు.."

"ఛీ! ఛీ! అంత అనాగరికురాల్ని కాదు నేను, పెళ్లైన సంవత్సరానికి తెలిసింది అతనికి పెళ్లైందనీ, ఎదిగిన పిల్లలున్నారనీ. ఆ తరవాత కాంప్రమైజ్ అవుదామని ప్రయత్నించాను. కానీ, మొదటి మోజు తీరిన తరవాత అతనికి అనుమానం ప్రారంభమైంది. 'భోగం పిల్ల. తప్పుచెయ్యడం సహజలక్షణం.' ఈ ఆలోచన అతణ్ణి రాక్షసుణ్ణి చేసింది. అనుమానాలు, అమర్యాదలు, దెబ్బలు... ఎన్నో!" ఇప్పుడు ఆమె కళ్ళల్లో దుఃఖం లేదు. మనసు ఏడుస్తోంది.

"డైవర్స్ ఇచ్చేశారా?"

"లేదు. గౌరవప్రదంగా విడిపోయే అవకాశం కూడా కనీసం నాకివ్వలేదు ఆయన."

"ఏం జరిగింది అసలు?"

ఆమె మాట్లాడలేదు. చాలాసేపు అలా మౌనంగా కూర్చుంది.

"చెప్పడం ఇష్టంలేకపోతే..."

"అహఁ. అదికాదు. నన్నిలా అడిగేవాళ్ళెవరు? చెప్తాను." కిటికీకానుకుని చెక్కిలిని చెయ్యి పెట్టుకుని, చీకట్లో కనబడని నక్షత్రాలను లెక్కపెడుతున్నట్లుగా చూస్తూ మాట్లాడుతోందామె. ఆమెనే గమనిస్తున్నాడతను.

"మీకు తెలుసనుకుంటా, నాకు అమ్మ, అన్న తప్ప ఎవరూ లేరని. అమ్మ అన్నయ్యను ఇంజనీర్‌ను చెయ్యడానికి ఎంత కష్టపడిందో, ఏమేం చేసిందో నాకు తెలుసు. కానీ ఇంజనీర్ అయిపోయాక అతనికి అమ్మ చాలా దిగజారిపోయిన స్త్రీగా కనబడింది. మా నుంచి దూరంగా వెళ్ళిపోయాడు. మా సాంఘిక పరిస్థితులు తెలిసీ మాకు అండగా నిలబడకపోతే పోనీ, కనీసం ఆర్థికంగానన్నా అమ్మకు అండగా నిలబడలేకపోయాడు. అదృష్టవశాత్తు, అప్పటికే నా చదువైపోయింది. ఉద్యోగం వచ్చింది.

"శారదా! కన్నబిడ్డ చేత వినగూడని మాటలు పడ్డాను. ఈ జీవితానికి ఇది చాలు. నువ్వన్నా ఈ ఊబి నుంచి బైటపడు." కళ్ళంబడి నీళ్ళతో అమ్మ అడిగిన ఆఖరిమాటలివి. అప్పటికే సుధాకర్ నా జీవితం నుంచి తొలగిపోయాడు. బాస్‌గా పరిచయమయ్యారు నా భర్త అప్పుడు. తరవాత ప్రేమపూజారి నన్నారు. నాకూ, సుధాకర్‌కూ ఉన్న పరిచయం, మా ఫామిలీ బాక్‌గ్రౌండ్ అంతా చెప్పాను. ఆలోచించడానికి టైం అడిగారు. ఆ తరవాత మూడురోజులకు వచ్చి 'పంకంలో పుట్టింది పంకజం. నీ ప్రవర్తన ఆరు నెలలుగా చూస్తున్నాను. చాలామంది సోకాల్డ్ అరిస్టోక్రాటిక్ లేడీస్‌కన్న నువ్వు లక్ష రెట్లు నయం' అన్నారు. పెళ్ళి చేసుకోమని బలవంతం చేశారు. ఆనాడు ఆ పరిస్థితిలో అంతకన్న చేసేదేముంది? నోరులేని దేముడిముందు, అర్థంకాని మంత్రాలతో, అబద్ధపు బాసలతో నా పెళ్లైంది. మూడుముళ్లు పడడం ముఖ్యమనుకున్నానే కానీ, అవి గట్టిగా వుండాలంటే మరెన్ని ఉండాలో అప్పట్లో అర్థం కాలేదు నాకు."

ఆమె ఆపేసింది. అతను ఆమెవంకే చూస్తున్నాడు. "నా పెళ్లైన సంవత్సరానికే మా పెళ్ళి ఎంత పెద్ద ఫెయిల్యూరో నాకర్థమైంది. నాక్కావలసింది వేరు. అతను నా నుంచి కోరేది వేరు. తప్పదనిపించింది. సరిపెట్టుకున్నాను. అగ్రకులస్థుడిని అనుకునే ఆ వ్యక్తి అలవాట్లలో కానీ, మాటల్లో కానీ ఔన్నత్యం మచ్చుకైనా లేదు. తలెత్తి సూటిగా కళ్ళలోకి చూసి మాట్లాడ్డం తప్పని కట్టుబాట్లతో పెంచింది మా అమ్మ. మానసికంగా, శారీరకంగా నన్ను నేను ఎంతో చంపుకున్నాను. రవ్వల దుద్దులతో, పట్టుచీర్లతో, కార్లలో అతనితో, ఒక అంతస్థు చిహ్నంగా, అలంకార ప్రాయంగా తిరిగాను కానీ..." వాక్యం విరిగింది. బలవంతాన ఆపుకునే దుఃఖం.

"మీరు కోరుకున్నది చాలా తక్కువ. సోషల్ సెక్యూరిటీ. ఆ కొంచెం కూడా ఇవ్వలేకపోయింది ఈ ప్రపంచం. అంతే. గడ్డిపూలు తొక్కుతూ మల్లెపూలు కోసుకుంటారు మనుష్యులు."

"కానీ, ఆలోచిస్తే తప్పనిపించడం లేదు రాజశేఖరంగారూ! నేనైనా ఇన్నాళ్ళు నా గురించే ఆలోచించాను. నా బాధేమిటని దుఃఖపడ్డాను. నాలాంటి నలుగురి గురించి నేనేమాలోచించాను? మిగతా ప్రపంచమైనా అంతే. తప్పులేదు."

"నిజం మీరు సిన్సియర్‌గా ఒప్పుకున్నందుకు జోహార్లు. పదివేల రూపాయల జీతంలో వున్న వ్యక్తి కనీసం పదిమంది పరాయివాళ్ళ గురించన్నా ఆలోచించేలేకపోవడం అన్యాయమే. సరే కానివ్వండి. తరవాత?"

"చెప్పానుగా. ఉన్నట్లుండి అతనికి భార్యాపిల్లలు వున్నారని తెలిసింది, అడిగాను. 'నీకేం అన్యాయం జరిగిందట? నీ బతుక్కి నా భార్యననిపించుకున్నావు చాలు' అన్నారు. ఆ తరవాత, అసహ్యాకరమైన ఆంక్షలు...." ఆగిపోయిందామె.

"అర్థమైంది. చెప్పలేకపోతే ఆపేయండి." అతని గొంతులో జీర, బాధ, ఆమె గమనించే స్థితిలో లేదు.

"మూడురోజులక్రితం ఒక డిన్నర్‌కు వెళ్ళాం. పేరుకు అది డిన్నర్ కానీ, నాగరికులమనుకునే మనుష్యుల్లో పశుప్రవృత్తి పచ్చిగా బయటపడే చోటు అది. నా భర్త విపరీతంగా తాగేశారు, ఎవరు తీసుకు వెళ్ళారో తెలియదు. నన్ను వదిలి వెళ్ళిపోయారు. అసహ్యకరమైన ఆ వాతావరణాన్ని భరిస్తూ, ఆయనకోసం ఎదురు చూస్తున్న నేను, చాలా భయంకరమైన పరిస్థితుల్లో, మనుష్యుల్లో మృగాలు నిద్రలేస్తున్న సన్నివేశంలో చిక్కుకున్నాను. ఎలా పారిపోయి వచ్చానో, ఏనాటి పుణ్యం నన్ను కాపాడిందో తెలియదు. చిరిగిన బట్టలు, చెదిరిన జుట్టు.... అద్దంలో నా ప్రతిబింబం నాలో నిద్రపోతున్న ఆత్మగౌరవాన్ని నిద్రలేపింది. ఇంటికి రాగానే 'ఎందుకు చేశారీపని?' అని నిలదీసి అడిగాను. 'ఏమైందిప్పుడు?' చాలా తేలిగ్గా అద్దంలో చూసుకుని టై కట్టుకుంటూ అడిగారు. ఆ చూపులకి, ఆ మాటకి అతణ్ణి హత్య చెయ్యకుండా ఎలా ఉన్నానా అనుకుంటున్నానిప్పుడు.

'ఇదే మీ మొదటి భార్యైతే చేసేవారా?' అని అడిగాను. అంతే. ఆ తరవాత ఆయనలో విజృంభించిన రాక్షసుణ్ణి చూపారు. 'ఆమెకూ నీకూ పోలికా?' అని ఎర దొరికిన పులిలా... ఇదిగో నా సంసార జీవితానికి మధురస్మృతులు" బెల్టుదెబ్బలు చూపిందామె. నడుం మీద, వీపు మీదా

రాక్షసుడు" పళ్ళు పట పట కొరుకుతూ అన్నాడు రాజశేఖరం.

"సుధాకర్ నన్ను బైటకు నెట్టి తలుపు వేశారు. చేతినున్న బంగారు గాజులు అమ్మి సుధాకర్ కోసరం వచ్చేశాను నేను."

మోకాళ్ళ మధ్య తల పెట్టుకుని కూర్చుంది ఏం ఆలోచిస్తోందో, ఆలోచించకుండా ఉండటానికి ప్రయత్నిస్తోందో తెలియలేదు అతనికి.

తూరుపు తెల్లబడుతోంది. మరొక రెండు గంటల్లో తన గమ్యస్థానం చేరతాడు.

"ఇప్పుడేం చేద్దామనుకుంటున్నారు?"

ఎక్కడో తెలియని ప్రపంచంలో ప్రశాంతంగా బతకాలని ఉంది. రాజశేఖరంగారూ! నాకా అవకాశం ఉందా?"

"కాసేపు నిద్రపొండి. తరవాత చూద్దాం." దిండు ఇస్తూ అన్నాడతను.

జీవితంలో పెద్ద దౌర్భాగ్యం ఏమిటో తెలుసా.... మనం ఇష్టపడే మనుష్యుల ఎదుట చెప్పుకునే ధైర్యం మనకు లేకపోవడం ... అది ఈనాడు నేను నేర్చుకున్న సత్యం.

వద్దనుకుంటూనే మీకు ఒక విషయం చెప్తున్నాను శారదా ఒకరకంగా ఇది మిత్ర వంచనే. మీరు వస్తున్నట్లు సుధాకర్‌కు టెలిగ్రాం ఇచ్చారు. మీరు ఏపరిస్థితుల్లో వస్తున్నారో అతనికి పూర్తిగా తెలుసు ఎలా? అని అడక్కండి. గత ఐదేళ్ళుగా నేనెక్కడున్నా ఎలా ఉన్నా, మీరేం చేస్తున్నారో, ఎలా ఉన్నారో తెలుసుకుంటూనే ఉన్నాను. కానీ, గొప్పింటి ఇల్లాలిగా మీరు పడే బాధలు నాకు తెలియలేదు నాకు తెలిసేటప్పటికే ఆలస్యమైపోయింది మీకన్న ముందే సుధాకర్‌ను

కలుసుకుని చెప్పాను నేను. 'ఏం చెయ్యగలంరా? చూస్తూ ఊరుకోవడం తప్ప... డబ్బు కావాలంటే ఇస్తాను అన్నాడు. అతనికన్నా ఒకరకంగా మీ భర్తేనయం ఆమాటే అన్నాను. 'నేను పిరికివాణ్ణిరా నీకు తెలియదు. నా భార్యకు తెలిస్తే బావుండదు అన్నాడు. మిమ్మల్ని ఇంటికి రానీయకుండా స్టేషన్‌లోనే ఆపడానికే వచ్చాడు అతను. నేనువచ్చి దూరంగా నిలబడి, జరుగుతున్న అద్భుత నాటకానికి పతాక సన్నివేశం చూస్తూ నిలబడ్డాను. కన్నీటితో మీరు ఒంటరిగా నిలబడిపోవడం... సుధాకర్ వెళ్ళిపోవడం.... ఆ తరవాత కథ మీకు తెలుసు.

"ఇప్పుడు మీ మరొక ప్రశ్నకు జవాబు చెప్పాలి కదూ, నేను? మిమ్మల్ని ఎందుకు ఇంతగా గుర్తు పెట్టుకున్నానూ అని... చాలా గొప్పగా అందంగా అద్భుతంగా మీ ముందు నిలబడి చెప్పాలనుకున్న విషయాన్ని దౌర్భాగ్యవశాత్తు ఈ లెటర్ ద్వారా ఈ మొనాటనీలో ఈ దిక్కుమాలిన రైల్వే కంపార్ట్‌మెంటులో అర్థం లేని పరిస్థితుల్లో చెప్పాల్సివస్తోంది. శారదా! మిమ్మల్ని నేను ... ఎలా రాయాలో తెలియటం లేదు నాకు. 'ప్రేమించాను' అని రాసి చీప్ చెయ్యలేను దాన్ని. కాలేజీలో వున్ననాటినుంచి మిమ్మల్ని ప్రతి క్షణం నా కళ్ళల్లో నిలుపుకుని పూజించాను. సుధాకర్ మీ ఇద్దరి మైత్రి గురించి నాకు చెప్తూతూవుంటే, నేను పడ్డ నరకయాతన అంతా ఇంతా కాదు. కానీ, నాది బయటపడే పరిస్థితి కాదు. సుధాకర్ మూలంగా మీతో మాట్లాడే అవకాశం తీసుకునేవాడిని. ఏ ధైర్యంతో నిజం చెప్పగలను? మీ ముందు నిలబడి, 'శారదా! నా మనసిది' అని చెప్పే రోజు రావాలని, నేను ప్రయోజకుడినై మీతో సమానహోదాలో ఉన్నప్పుడు చెప్పి, ఒక్కసారి మీ మొహంలో ఆశ్చర్యం చూడాలని ఇలా చాలా చాలా ఊహలు..ఇసకలో మీరు వేసిన అడుగుల్ని చూస్తూ ఆగిపోయే టీనేజ్ ప్రేమ నాది. ఇప్పుడు చెపితే, అమాయకంగా ఉండచ్చు. అట్ట వేసిన నా ప్రతి పుస్తకం వెనకాలా మీ పేరు ఉండేది కానీ, నాకా అవకాశం రాలేదు. నేను జీవితంలో ఎదుగుతుండగానే మీకు పెళ్లైంది. ఎవరికీ చెప్పుకోలేని ఈ అనుబంధం నాలో నేనే దాచుకున్నాను. తీరని కోరిక తీపిగా ఉంటుందంటారే అలా! ఇన్నాళ్టికి మిమ్మల్ని కలుసుకోగలిగాను. కానీ, చెప్పుకోలేకపోయాను. కారణం? మీ నిస్సహాయతను అవకాశంగా తీసుకున్నవాడిని అవుతాను.

"మీరు కోరిన ప్రదేశం నాకు తెలియదు. క్రింద ఒక అడ్రస్ ఇస్తున్నాను. అక్కడికి వెళ్ళేటప్పటికి మీకు ఉద్యోగం సిద్ధంగా ఉంటుంది. అది ఒక అనాధాశ్రమం. మనిషిలో తమాషా అదే శారదా! నైట్ క్లబ్‌లు కట్టే సమాజంలోనే అనాధాశ్రమాలు, సేవాసంఘాలు ఉంటాయి. అనాధను కదా, అందుకని నా భాగం అందులో చాలా ఉంది.

"ఔన్నత్యం అనేది ఒక విక్రమార్క సింహాసనం శారదా! పలికితే తప్పు పలకని సాలభంజికలు ఎన్నో. కదిలిస్తే కథలు చెపుతాయి. అధికారమే ఔన్నత్యమనుకుని పాపపు పాదాలతో ఆ అధికార సోపానాలు ఎక్కితే, అవి కన్నీరు కారుస్తాయే కానీ కథలు చెప్పవు. ఏదో ఒకనాటికి కొన్ని వేలమంది ఆత్మాభిమానం గల శారదలు,

జీవితాలు పణంగా పెట్టిన రాజశేఖరాలు కలిసి మరో ప్రపంచాన్ని సృష్టించిననాడు, మానవత మనిషిలో ఏలికయిననాడు, ఈ మూగ జీవుల ఆవేదనలు బైటికి వస్తాయి. అంతవరకు పాపం పరిపాలించే ఈ సంఘం – చీము, నెత్తురు ఉన్న మనిషిని సాలభంజికగా మార్చి, నోరు మూయించే ఉంచుతుంది." మాట్లాడలేదతను.

చంటిపిల్లలా, తన సర్వ బాధ్యతలు, బాధలు పోయినట్లు అలసిపోయి పడుకుంది శారద. గులాబీపూవులా ఉన్న ఆమెను చూస్తూ అలానే కూర్చున్నాడు రాజశేఖరం.

❀ ❀ ❀

పేపర్ల వాళ్ళ అరుపులు, టీ, కాఫీ కేకలు... రైల్వే జీవన సంగీతం విని బలవంతంగా నిద్ర లేచింది శారద.

చుట్టూ చూసింది. ఎక్కడున్నదో ఆమెకే అర్థం కాలేదు. మెల్లిగా గుర్తుకు తెచ్చుకుంది. చటుక్కున ఎదురు సీట్లోకి చూసింది. రాజశేఖరం లేదు. అతని సామాను లేదు. గుండె గుభేలుమంది ఆమెకు. అప్రయత్నంగా తన చేతి మరొక గాజు చూసుకుంది. హమ్మయ్య అనుకుంది.

ఒక్కసారి వెర్రిగా నవ్వాలనిపించింది! 'మరొక మొగవాడు శారదా! అంతే. అన్నయ్య, సుధాకర్, తన భర్త – ఇప్పుడితను. అంతా అంతే. నీకు తెలియని జీవితమైతేగా భయపడడానికి? ఫరవాలేదు. ఏదారీ లేనప్పుడు, కన్నతల్లిలాంటి మృత్యువు ఉండనే ఉంది' అనుకుంది. తనకు తాను ధైర్యాన్ని ఊపిరిగా పోసుకోవడం తప్ప దారిలేదు. చేతికేదో తగిలింది. దిండు. నిద్రపోతున్నానని జాలి కాబోలు నయమే–అని నిస్పృహగా నవ్వుకుని పక్కకు జరపబోయింది. దిండుకింద ఏదో కవరు' శారదగారికి' అని రాసి ఉంది. మెల్లిగా విప్పింది. ఐదువందల రూపాయలనోట్లు, తన టిక్కెట్టు! ఉత్తరం మెల్లిగా విప్పింది.

"శారదగారికి!

చెప్పకుండా వెళ్ళిపోతున్నాను. క్షమించండి. మరొక మగవాణ్ణని మనసు రాయి చేసుకోకండి. జీవితంలో దౌర్భాగ్యం... మీరు ఆత్మాభిమానంతో తలెత్తుకుని నిలబడి మరి కొందరు శారదలను రక్షించిననాడు మళ్ళీ కనబడతాను నేను!

అందాకా గుడ్‌బై!

మీ

రాజశేఖరం"

ఉత్తరాన్ని గుండెలకు హత్తుకుని నిట్టూర్చింది శారద. మూసి ఉన్న ఆమె వెలుతురు కళ్ళు తమస్సులో ఏ కాంతిరేఖ వెతుకుతున్నాయో, కనబడని ఆత్మను ఏ దివ్యశక్తి ముందు అవనతమౌతున్నదో తెలియదు రైలు మాత్రం వెలుగులోకి దూసుకుపోతూనే ఉన్నది.

*(వనిత మాసపత్రిక – అక్టోబరు, 1981)*

# తులసిమొక్క

ముంగిట్లో ముగ్గును చూస్తోంది. చుక్కలో పడే నీరెండను.... కన్నీటి చుక్కలతో తుడుస్తోంది. ఆలోచించకూడదనుకుంటోంది. తల పక్కకు వాల్చింది.... కొమ్మకు ఊగుతూన్న రోజాపూవు... పసుపుగా, బంగారం రంగు దిగినట్టుగా, పసుపు రాసుకున్న పచ్చి బాలింత పసిమిలా, తనకు కాని మనోహరుడి కోసం చూసే మానినీ మనస్వినిలా, లే జవ్వనంలో ఉన్న తపస్వినిలా....

ఛా! కళ్ళు తుడుచుకుంటూ వరండాలో నుంచి లోపలికి చూసింది. మనీప్లాంటు... గుబురుగా, అందంగా, కన్నతల్లిలా. పచ్చగా.... 'ఎందుకు ఏ ఖరీదు లేని నీలో ఇంత అందం?' మృదువుగా ఆ ఆకులు సవరిస్తూ వుండిపోయిందామె.

"మీ ఇంట్లో మనీప్లాంటు చాలా బాగా పెరుగుతుంది. అంటే, డబ్బులు ఎక్కువుంటాయనా?" మనసులో ఎవరో ఏనాడో అన్న స్పందన....

ఉలిక్కిపడింది .... మెల్లగా కనుకొలనులో నీటిని తుడుచుకుంది. తుడుచుకున్న కొద్దీ కంటిలో నీరు జవ్వన ఊరుతోంది. ఉన్నవాడికీ, లేనివాడికీ కూడా లేదు అనుకోకుండా ఉండే వెన్నెల, పిల్లగాలి - వీటిలాంటిదే ఈ కన్నీరు కూడా... ఆ ఒంటరితనంలో మౌనంగా మూగగా మూలగా మ్రోగుతున్న వీణ స్పందిస్తోందా అన్నట్లు ఏడుస్తోంది. ఆమె భార్గవి....

ప్రపంచం దృష్టిలో అదృష్టవంతురాలు, సంపాదనాపరురాలు. తల్లిదండ్రుల జీవన నావలో సుఖంగా ఒడ్డున చేర్చే తెరచాప. కష్టపడ్డ పోస్ట్‌గ్రాడ్యుయేట్.

కాని వాటన్నింటికన్న మించింది, ఆమెను ఆమె గౌరవించుకునే గొప్ప శక్తి ఆమె దగ్గర ఉంది.

అదే అందంగా బ్రతకడం ... ఉయ్యాల్లో కళ్ళు తెరిచిననాడు, పెద్ద కూతురుగా పుట్టిన పాపాయికి అందంగా తొట్టెలో కట్టిన రంగుపూసల తోరణాల సౌందర్యంతో ఆ పాప కళ్ళు మెరిశాయి.

చిన్నప్పటి నుంచీ ప్లాస్టిక్ బకెట్లలో బుల్లి మొక్కలు పెంచేది. ఖాళీ సీసాల్లో పక్కింటివాళ్ళ ఆక్వేరియంలో అడిగి రెండు చేపలు తెచ్చి, ఆ చేప పాపాయిలు నీలాల నీళ్ళ మీద మిలామిలా కదులుతూంటే చూస్తూ కూర్చునేది. అమ్మ దెబ్బలు, తండ్రి చాలీ చాలని వేతనంలో నుంచి వచ్చే విసుగు, చిన్నవాళ్ళయిన తమ్ముడూ, చెల్లెళ్ళ పోట్లాటలు - ఇవన్నీ ఆకాశంలో చందమామను, చుక్కల్నీ చూస్తూ మర్చిపోయేది. సరిపోని జీతాల బాధల్లో సగం తిన్న రొట్టెలాంటి జీవితంలో ఎన్నో చేదు జ్ఞాపకాలు... కానీ, ఇవన్నీ ఆమెను మానసికంగా అంటలేదు.... కారణం - ఇంతకన్న గొప్ప

జీవితం వస్తుందనుకోలేదు... ఆశ పడలేదు. కానీ, ఉన్న జీవితాన్ని బాగు చేసుకోవాలనిపించింది. చదువుకుంది.... తన జీతం, తన జీవితం ఇంట్లోవాళ్ళకు ఖర్చు పెట్టింది...

"పెళ్ళెప్పుడు చేసుకుంటావమ్మా!" ఏ ముత్తైదువో అడిగితే, "చూద్దాం పిన్నిగారూ!" అనేసేది నవ్వుతూ పాతికేళ్ళకు.

"ఇంకెప్పుడే నీ కలల రాజకుమారుడిని చేపట్టేది....?" లక్షాధికారి కూతురు సృజన, ఫారన్ రిటర్న్డ్ బావతో పెళ్ళి కుదిరినప్పుడు అడిగింది.... అప్పటికి భార్గవికి ముప్పై ఏళ్ళు.

ఎర్ర పట్టుచీర.... నుదుట బాషికం.... విచిత్రంగా మెరిసే మామిడి పిందెల హారం... అందంగా పెట్టిన మెహందీ. ఆ పెళ్ళికూతురు అందం చూసి అచ్చెరులై పోయింది భార్గవి.

"ఏం మాట్లాడవే...."

"చూద్దాం. ఆ కళ్ళకు కొంచెం సుతారంగా కాటుక దిద్దనా కళ్ళు కొంచెం బావుంటాయి. అంటూ ఐలైనర్ బ్రష్ అందుకుంటూ అడిగింది." మాట ఆపింది.

"అయినా ఎప్పుడూ ఇలా బొమ్మలా ఎలా వుంటావే? ఏమిటో బాబూ, "పనీపాటా లేదు. పిల్లా జెల్లా లేరు. తీరి కూర్చుని సుతారంగా సుకుమారంగా వుండగలరు మీరంతా. నాబోటి వాళ్ళకెనా.... అయినా పెళ్ళిచేసుకోరాదా? నీ చెల్లెళ్ళ పెళ్ళి, తమ్ముడి పెళ్ళి చేసేశారట కదా?" బి. ఏ. లో క్లాస్‌మేట్ అరుణమ్మ ట్రైన్‌లో కనబడి అడిగింది ఒకప్పుడు. నవ్వేసింది. ఆ నవ్వులో దిగులు లేదు. ఈ మనుష్యులకు అర్థం కాని పరిస్థితుల మీద కొంచెం కోపం వచ్చింది. అయినా ఎవరి సమస్యలు వాళ్ళవి, ఎలా అర్థమౌతాయి మరొకరికి అనుకుంది.

"దానికి మేం పెళ్ళి చెయ్యలేమమ్మా! అంత మొండిది ప్రపంచంలో లేదు." తల్లి అందరికీ సర్ది చెపుతోంది తన భాషలో, తమ్ముడి పెళ్ళిలో.

పెళ్ళికొడుకు అక్కగారంటే వృద్ధురాలైన ఏ తెలుగు పండితురాల్లా వుంటుందేమో అనుకుంటున్న అందరికీ పోస్ట్‌గ్రాడ్యుయేషన్ ఇచ్చిన డిగ్నిటీతో హాయిగా లేఎండలాంటి భార్గవిని చూడగానే రకరకాల ఆలోచనలు వచ్చాయి.

"ఎన్నాళ్ళు వయస్సును దండగబెట్టుకుంటావు? దిక్కులేని పిల్లలతో సతమతమవుతున్నాడు మావాడు. కట్టుకోరాదటే కోడలుపిల్లా!" అంటూ వరస కలిపింది ఒక మధ్యవయస్సు అత్తయ్యగారు.

"ఒద్దండీ!" అంటూ పొడుగాటి జడ వెనక్కి వేసుకుంటూ మల్లెచెండు సవరించుకుంటూ వెళ్ళిపోయింది.

"ఏదో ఉంది కథ...." వయసు ఉడిగిపోతున్నా వసంతకుసుమాకరం సేవించి యవ్వనాన్ని నిలుపుకోవాలని తపనపడే మన్మథరావులు అనుకున్నారు.

ఆ తరువాత ఒక సాయంత్రం "అది నాలుగు వందలు పంపుతోంది కాబట్టి

దేహి అనకుండా బతుకుతున్నాం. లేకపోతే ఈ మొగ కుంకల మీద ఈ కోడళ్ళ మోచేతి నీళ్ళమీద ఆధారపడాల్సివచ్చేది..." అంటూ దేవుడి కుందులు చప్పుడు వచ్చేట్లు పడేస్తూ కోడలిమీద అక్కసు అంతా వెళ్ళపుచ్చుకుంటూ అంటున్న తల్లి మాటలకు విరక్తిగా నవ్వుకుంది భార్గవి....

ఏమనుకుంటోంది అమ్మ. ఇరవై వేల కట్నం, కోరిన లాంఛనాలు ఇచ్చి, ఈ ఇంట్లో అడుగు పెట్టిన మరదలులో పనిమనిషిని, వంట మనిషిని చూడాలన్న శాడిజం ఏమిటమ్మకు.....?

కానీ అమ్మ మాటల్లో చాలా విషయాలు అర్థమైనాయి. తనకు వచ్చే జీవితంలో నాన్నకుపంపగా నాలుగు వందలు సేవింగ్స్ బ్యాంకు ఎకౌంటు తీసేస్తే మిగతా మూడువందలకీ తను అధికారిణి... ఈ ఆర్థిక త్యాగాల కన్నిటికీ అడ్డుచెప్పని పెళ్ళికొడుకు దొరకాలంటే అది అయ్యే పనేంకాదు.

ఆమె రంభాకాదు....రాగరాగిణీ కాదు. కొంచెం అందం, మరికొంచెం సున్నితత్వం వున్న మామూలు ఆడపిల్ల... పరిస్థితులకు మారుమాట్లాడ్డం రాని మరో మధ్యతరగతి పిల్ల...

"నువ్వెవర్నైనా ప్రేమించావేమే...." ప్రాణస్నేహితురాలు రాధ సూటిగా చూస్తూ అడిగింది. అమె మౌనం మరోరకంగా అర్థమైంది రాధకు.

ప్రేమ....! నవ్వేసుకుంది భార్గవి. ప్రేమలో పడ్డానికి ప్రేమించడానికి చాలా సాహసం, ఏమీ తెలియని ముగ్ధత్వం, ప్రేమించే మనిషి మీద గట్టి నమ్మకం వుండాలి. వాటన్నిటికీ పరిస్థితులు అనుకూలించాలి. అవన్నీ తనకున్నా అటువంటి వ్యక్తి వున్నాడన్న నమ్మకం లేదు.

కానీ, ఆమె జీవితపు సహారాల్లో కొన్ని తొలకరి జల్లులున్నాయి. చెప్పదుకానీ....

పదిహేడేళ్ళ ముగ్ధత్వంలో, వయసొచ్చిన అందంలో భార్గవీ చాలా బావుండేది. ముగ్గేసుకుంటున్నా, వెనుక పెరట్లో బట్టలు వుతుక్కుంటున్నా పక్కింటి బ్యాంకులోనుంచి తననే ఏవో రెండుకళ్ళు గమనిస్తున్నాయని అర్థమైంది ఆమెకు. వయసు ఆమె బుగ్గల్లో ముద్ద మందారాలు పూయించింది. జీవితంలో అన్నిరకాల భావాలకు నిర్వచనం ఒకటే. గుర్తింపు... ప్రతి సెంటిమెంటుకూ, ప్రతి త్యాగానికి ఆఖరి అర్థం తన ప్రత్యేకత నిలుపుకోవడం! అహం! సంతృప్తిపడడం..... తనకోసం ఎవరో చూస్తున్నారు! అది గొప్ప భావం.

"అమ్మా! పక్కింటి మేనేజరుగారు మీ ఇంట్లో తులసిమొక్క వుందంటే ఇమ్మన్నారమ్మా!...." వాకిట్లో కూర్చుని చెల్లెళ్ళకు చదువు చెబుతున్న భార్గవి ఉలిక్కిపడి చూసింది. బ్యాంకు ప్యూను.

అర్థం కానట్లు చూసింది. వెంటనే ఆ ముందు రోజు జరిగిన విషయం గుర్తుకు వచ్చింది.

"పెరడునిండా ఇంత తులసి మొలచిందేమే అడ్డదిడ్డంగా!" అమ్మ మొక్కలకు పాదులు పెడుతూ అరిచింది.

"తులసికోటలో కృష్ణతులసి, లక్ష్మి తులసి కలిపి వేశానమ్మా! పోన్లే, మిగిలిన మొక్కలుండనీ..... తులసే కదా?" అంది భార్గవి.

అప్పుడు గోడపక్క నెక్కడో ఆయన వుండి వుంటాడు. ఒళ్ళు జలదరించింది ఆమెకు.

"బ్రహ్మచారికి తులసిమొక్కతో ఏంపనయ్యా? పూజ చేస్తాడా, పురస్కారం చేస్తాడా... అయినా తీసుకెళ్ళు. బోలెడు నారు పడింది." అమ్మ అంటోంది.

ఇవన్నీ వినబడీ వినబడకుండా వున్నాయి భార్గవికి. నరాల్లో ఏదో తెలియని మత్తు. ఊహలకు రెక్కలు కట్టి వినువీధుల్లో ఎగరేసుకొంటోంది.

"ఏమిటే ఆ కూచోడం.... ఆ పిల్ల లెప్పుడో లేచిపోయారు - పట్టించుకోవేం..." మోకాళ్ళ మీద తల పెట్టుకుని ఆలవోకగా ఆలోచిస్తున్న భార్గవిని చూస్తూ అరిచింది తల్లి.

ఆనాటినుంచీ, దొడ్లో పని చేసుకుంటున్నా, నూతిలో నీళ్ళు తోడుతున్నా, పక్కింటి కాంపౌండు దగ్గర అలికిడైనా, ఏవో రెండుకళ్ళు తననే చూస్తున్నాయనే భావం భార్గవిలో కొత్త అందాన్నిచ్చింది. మాటలో అందం, కళ్ళల్లో మెరుపు, నడకలో వయ్యారం వచ్చాయి. వాళ్ళింటి మందార గుబురు వెనకాల ఎవరిదో అలికిడయినప్పుడల్లా అతనేనని తలఎత్తేది కాదు భార్గవి.

"పక్కింట్లో కుర్రాడుకి బ్యాంకులో పనిట... మనవాళ్ళేట... వెళ్ళి విచారించకూడదూ...." అంటూ తల్లిపోరు, తండ్రి కదలడం విన్న భార్గవి ఆ రోజు నిద్రపోలేదు. ఆ మర్నాడు జ్వరం, తలకాయ నొప్పి. మూడోరోజు, "ఆ పిల్లాడికి అభ్యంతరం లేదుట, తల్లి తండ్రిని కనుక్కోమన్నాడు..." అన్న తరవాత లేచింది లేడిలా, జలపాతంలా, కదిలే మబ్బులా ఇంద్ర ధనుస్సులా... అలా హాయిగా తిరిగింది. వేసుకున్న ప్రతి బట్టా, చేసుకున్న ప్రతి అలంకారం, పూస్తున్న ప్రతి పూవూ నాకోసమే నా అందంకోసమే అనుకుంది.

వారం తరవాత, "వాళ్ళు చాలా పెద్ద ఎత్తున వున్నారమ్మాయి, చూద్దాం..." అనగానే 'ఆ! తండ్రిని అతనే ఒప్పిస్తాడు' అనుకుంది... కానీ, సహం ఉత్సాహం చల్లబడింది.

మరొక వారం గడిచింది. మూగగా, బ్యాంకు కిటికీలవంకా, లోపల తిరుగుతున్న ఫాన్స్‌వంకా, పైన అతను వుండే గదివంకా అర్థం కానట్లు ప్రశ్నార్థకంగా చూస్తూ గడిపేది.

"ఆ! అందని వాటి జోలికి పోవడమేమిటే, బంగారంలాంటి పిల్లాణ్ణి ఒదులుకుంటారా? మన ఎదిరింటి వాళ్ళు ఎప్పుడో కాపు వేశారు. పిల్ల బావుండదని సందేహించారట మొదట. లక్షరూపాయల కట్నం, బోలెడంత సామాను... ఇవన్నీ

మనమెక్కడ తేగలం?.... ఇప్పుడు ఒప్పుకున్నారట... " సహం అసూయగా, సహం నిస్సహాయంగా తల్లి చెపుతోంది పక్కింటి మాణిక్యమ్మకు.

"అయ్యో! బంగారంలాంటి పిల్ల మనమ్మాయి. పోన్లే దేనికైనా ప్రాప్తం వుండాలి. ఒక గ్లాసు కాఫీ పొడుం ఇయ్యి. పోతా...." అంటూ లేచిందామె.

గదిలో గోడకానుకుని కూర్చుని వుంది భార్గవి. అన్నీ వినబడుతున్నాయి. ప్రతి మాట ఆమెలో గుచ్చుకుంటోంది. ఎదురుగా వున్న పెద్ద వెంకటేశ్వరస్వామి పటం వంక చూస్తూ కూర్చుంది. కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి.

పెళ్ళివారొచ్చి చూసిపోయి, సంబంధం తప్పిపోయిందని తెలిసిన ప్రతి మధ్య తరగతి ఆడపిల్లా మర్నాటినుంచీ మళ్ళీ మామూలుగా వుండాలి. బాధపడుతున్నట్లు తెలియకూడదు. తప్పదు. "నన్నుఖర్లేదన్నారు" అని దుఃఖపడి ఎదుటివాళ్ళకు చాటుతామేమోనని భయం.

కానీ, ఎవరికీ చెప్పలేనిదీ, ఆమెలో రగిలిపోతున్నదీ ఒకటే ప్రశ్న... ఏ రకంగా ఎదురింటి సరోజ తనకన్నా గొప్పది... ఒక్క డబ్బేనా ముఖ్యం?

ఈ ఆలోచనకు చాలా కారణాలున్నాయి. వాళ్ళిద్దరూ ఎదురు బొదురిళ్ళలో పెరిగారు. పట్టుపరికిణీ కట్టుకుని, ఎలక తోక జడేసుకుని ధామ్మని జారి పడి ఏడుస్తూపోయే సరోజకు, పొందిగ్గా, నిదానంగా, బారెడు జడలో కనకాంబరం పూలతో, మెరిసే కళ్ళతో మెదిలే భార్గవికి ప్రతి క్షణం తెలియని పోటీ.... ప్రతీ విషయంలో భార్గవిదే పైచెయ్యి. "మీ పిల్ల మా ఇంట్లో పుడితేనా!" అనేది సరోజ తల్లి.

ఎదుగుతున్న ఇద్దరిలో ఏ కోశానా స్త్రీత్వం లేకుండా గడేకారిలా పెరిగింది సరోజ... ఓణీ నిలవదు, అలంకరణలో ఎక్కడా సౌలభ్యం లేదు. కానీ భార్గవిలో అందముంది. అమె రసపిపాస ఆమెలో తెలియని సౌకుమార్యాలు మొగ్గ తొడిగించేది.

అందుకే భార్గవిని చూస్తే ఎందుకో తెలియని కోపం సరోజకు. అది ప్రతి మాటలో వెల్లడించేది. ఆమె అసూయను బైటకు చెప్పకపోయినా చాలా గర్వపడేది భార్గవి.

కానీ ఈనాడు.... ఈనాడు తన సర్వస్వం ఆమెకున్న డబ్బుముందు ఎందుకూ పనికిరానివైపోయినాయన్నమాట. చేదు నిజం, అపశ్రుతిలా స్పందించింది ఆమెలో, ఆనాటి కన్నీళ్ళు, ఆ బాధ ఈనాటికీ మర్చిపోలేదు.

"మీ తోట, దొడ్డి, ఇల్లు ఎంత అందంగా అట్టేపెడతారమ్మా! మా బాబుగారు ఎప్పుడూ మెచ్చుకుంటారు." మర్నాడు బ్యాంకు ప్యూను ఏదో మాటల్లో అమ్మకు చెపుతున్నాడు.

"ఆс! ఏదోలే నాయనా! ఇవన్నీ ఎవరిక్కావాలి? హోదాలు, కట్నాలు... ఆ ఎడ్డి మొడ్డి స్వరూపాన్ని చేసుకుంటున్నాడుగా. అనుభవించమను..." అని మూతి మూడు వంకర్లు తిప్పి లోపలికి వచ్చేసింది అమ్మ.

రంగ రంగ వైభవంగా ఆమె ఎదురుగానే, ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగు వేసి ఇన్కంటాక్స్ ఆఫీసరుగారి అమ్మాయి పెళ్లైంది.

"మర్యాదగా ఉండదు" అంటూ అమ్మా నాన్నా వెళ్ళారు కానీ, గుమ్మం కదలలేదు భార్గవి.

"పెళ్ళికి రాలేదేం... మూణ్ణిద్దర్లకి వెళుతున్నాం, చెప్పిపోదామని వచ్చాను..." ఫెళ ఫెళలాడే పట్టుచీరతో లోపలికి వచ్చింది సరోజ. తల్లో చామంతిపూలు, చేతినిండా రకరకాల గాజులు, మెళ్ళో పేరు తెలియని నగలు... కానీ, పెళ్ళికళ.... 'బావుంది' అనిపించింది భార్గవికి.

"ఈ నెక్లెసేనా... మావారు తనే సెలక్ట్‌చేశారు – బావుందా!" అని ముందుకు వంగింది.

నీలిరాళ్ళ నక్షత్రాల నెక్లెస్. బావుంది. కానీ మెడలేని సరోజ మెడలో అడ్డంగా పడిపోయింది. అదే నాకైతే.... ఆలోచించలేకపోయింది భార్గవి.

అమ్మతో మాట్లాడి – "మా ఇంటికిరా! నేవచ్చిన తరువాత...." అని కేకేసిపోయింది.

ఆమె ప్రతి అడుగులోనూ, నీకన్నా నేను గొప్ప, గెలిచాను చూశావా అన్న భావం కనిపిస్తూనే ఉంది.

బావుండదని శ్రావణ మంగళవారం నోములకు వెళ్ళింది భార్గవి పేరంటానికి.

"ఆఁ! ఆ ఎదిరింటి భార్గవిని కూడా ఇద్దామని ప్రయత్నించారట మా అల్లుడికి. మన ఎదురుగా బైటపడరు లెండి... వాళ్ళు ఇచ్చే ముష్టి మూడు కాసుల బంగారానికి, మూడువేల కట్నానికి ఇంత రాజాలాంటి సంబంధం తెద్దామనా?.... ఏం చూసి, తళుకు బెళుకులు చూసి చేసుకోవాల్సిందే..." సరోజ తల్లి పేరంటాళ్ళ మధ్య అంటున్న మాటలు విని గిరుక్కున వెనక్కు తిరిగి వచ్చేసింది భార్గవి.

గుండెల్లో దుఃఖం. కళ్ళు ఎర్రబడ్డాయి. డబ్బు, డబ్బు, డబ్బు... ఇది తప్ప మరేం లేదా?...

కచ్చ, కోపం .... ఏం చెయ్యాలో తెలియక తులసిఆకులన్నీ దూసిపోసింది.

"అయ్యో! అదేం పనే?...." తల్లి తిట్లు ప్రారంభించింది. "పిలిచారు కదా అని వెళ్ళామా! మన్ని ఎత్తి పొడిచిందిట ఆవిడ... నాలుగూ పెట్టొచ్చాను చెప్పద్దూ. ఎవరి గొప్ప వాళ్ళది... సరేలే ... డబ్బుంటే కొండమీద కోతి దిగొస్తుందంటారే... అట్లాగే తెచ్చుకున్నాడు నీ అల్లుడు అని దులిపేశాను... మండిపోయిందనుకో..... సరే' ఆ తులసాకు మాల కట్టు, మెళ్ళో అన్నా వేద్దాం... పౌర్ణమి కూడా....." అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

మౌనంగా చెప్పిన పని చేసింది.

దేముడి మెళ్ళో మాల వేసింది. ప్రతి ఆకులో ఆమె కన్నీటి బొట్లు ఐక్యమైపోయాయేమో... ఆనాటినుంచీ భార్గవి చదువే ధ్యాసగా పెట్టుకుంది. రెండుమూడుసార్లు అతను సరోజ భర్తగా ఎదురుపడ్డా పలకరించలేదు.

ఉద్యోగస్తురాలైంది..... మళ్ళీ ఎప్పుడూ ఏడవలేదు భార్గవి. ఏడవవలసిన అవసరం తెచ్చుకోలేదు.

కానీ, ఈనాడు... ఈనాడు దుఃఖపడుతోంది 38 ఏళ్ళ భార్గవి.?! కారణం....

❀ ❀ ❀

ట్రాన్స్‌ఫర్ మీద హైదరాబాద్ వచ్చింది భార్గవి. ఆఫీసుకు దగ్గరగా ఇల్లు ఉందని తెలిసి స్నేహితురాలితో చూద్దామని వెళ్ళింది.

"ఈ కొంప మనకేం సరిపోతుందీ?... కాస్త పెద్ద ఇల్లు చూదండీ!... ఆఫీసువాళ్ళిస్తున్నప్పుడు కక్కుర్తి దేనికీ?...." ఎవరో ఇల్లాలు సాగదీస్తూ మాట్లాడుతోంది లోపల. ఎవరో తమబోటివాళ్ళే. "నయం, ఆవిడకు ఇల్లు నచ్చలేదు" అనుకుంటుండగానే బైటకు వచ్చింది ఆవిడ.

గోడకానుకుని నిలబడ్డ భార్గవి నిర్ఘాంతపోయింది. సరోజ! లావుగా, విచిత్రంగా తయారైంది. ముదేసుకుంది. అసలు వయస్సుకన్నా పదేళ్ళు పైబడ్డట్లుంది. అదే అశ్రద్ధ ఒంటిమీద.

ముక్కుమీద జారిన కుంకుమ.

చెదిరిపోయిన కుచ్చెళ్ళు.

నలిగిపోయిన చీర.

మరింత మోటుగా తయారైన చేతులు.

రవ్వల నగలు...

"ఎవరదీ?... నువ్వా భార్గవీ! ఏమండోయ్..... భార్గవి!" ఒక్క అరుపు అరిచింది.

ఇరకాటాన పడ్డది భార్గవీ.

లోపలనించి బైటకు వచ్చాడతను. పొడుగ్గా హుందాగా అలాగే ఉన్నాడు. కొంచెం జుట్టు నెరసింది.

"హల్లో!" అంటూ సూటిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. తల వంచుకుంది భార్గవి.

అతని చూపులు ఈ ఇద్దరు ఆడవాళ్ళను తూచి లెక్క కడుతున్నాయి.

"సరే ... ఇహ పదండి." గబుక్కున వెళ్ళి కారెక్కింది సరోజ. వెనక్కు తిరిగి చూసి "వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయాడతను.

"ఎవరే వాళ్ళు, ఇంత ఆపోజిట్ పెయిర్!" స్నేహితురాలు కుదుపుతూ అడిగింది.

ఏమని చెపుతుంది భార్గవి?

ఆ మర్నాడే ఆ ఇంటికే అడ్వాన్స్ ఇచ్చింది. ఇంట్లో చేరిన రెండో రోజు తెలిసింది, ఎదురింటి బంగాళాలో సరోజ, ఆమె భర్త చేరారని.

పట్టించుకోకూడదనే అనుకుంది భార్గవి. ఒంటరితనం, సరిపోయే డబ్బు ఆమెలోని కళాకారిణిని నిద్ర లేపాయి. ఆ పనికిరాని పాత కొంపను చక్కటి కుటీరంలా తీర్చిదిద్దింది. అక్కడొక మనీప్లాంటు, ఇక్కడొక మల్లె తీగ. బుల్లితోట.

నాలుగు నెలల తరవాత -

ఒక ఆదివారం మధ్యాహ్నం పుస్తకం చదువుకుంటూ కూర్చుంది. పరదాకు కట్టిన గంటలు మృదువుగా మోగుతున్నాయి.

గాలి దుమారంలా వచ్చి పడింది సరోజ.

"అసలు నీ ఉద్దేశం ఏమిటి?" కూర్చుంటూ అంది.

"ఏమిటీ?" అర్థం కాకుండా అడిగింది భార్గవి.

"ఎదురింట్లో చేరి ఈ రంగేళీ రాణీ వేషాలన్నీ ఏమిటీ? నా మొగుడిని నాకు కాకుండా చెయ్యాలనేనా? ఏమిటీ నీ ఉద్దేశం? 'ఇల్లు సర్దడం నేర్చుకోరాదూ ఆవిడను చూసి. మనిషంటే అలా ఉండాలి. అంత వయస్సే కనబడదు. ఎందుకు నీకేం తక్కువైంది అని. ఒంటి మీద శ్రద్ధ ఉండదు. ఛీ! ఆ ఇంటి ముందు మనిల్లు తలుచుకుంటే అశుద్ధంలో అడుగుపెట్టినట్లుంది.' ఇవన్నీ నా మొగుడి మాటలు. విన్నావా? అయినా, గడేకారిలా 38 ఏళ్ళు పైబడ్డా పెళ్ళీ గిళ్ళీ లేకుండా ఇలా అందంగా అలంకరించుకుంటూ వృద్ధ కన్యలా తిరుగుతూ ఎదటి వాళ్ళ కాపరాలు పాడు చెయ్యకపోతే ఎవడో గంతకు తగ్గ బొంతను కట్టుకోవచ్చుగా?" అని కంకరరాళ్ళలాంటి మాటలు కుమ్మరించిపోయింది సరోజ.

ప్రపంచమంతా ఏకమై 'నీకు వయసైపోతోంది' అని జ్ఞాపకం చేసినప్పుడు. ఏడవని భార్గవి, ఎదటి మొగవాళ్ళన్న వెకిలి మాటల్ని లెక్క చేయని భార్గవి, ఇంటా బైటా తన వ్యక్తిత్వంతో నిలబడ్డ భార్గవి, తన లోకాన్ని తాను సృష్టించుకుని అందులో ఆనందపడే భార్గవి మొదటిసారిగా చాలా రోజుల తరవాత "వృద్ధకన్యవు" అంటూ సరోజ తిట్టిన తిట్లకు వెక్కి వెక్కి ఏడిచింది.

కొమ్మన ఊగే రోజాపూవు, ఆకుచాటు మందారపూవు, ముంగిట్లో ముగ్గూ ఎదురింటి భవనపు యజమానిని ఒక్కటే ప్రశ్నించాయి మౌనంగా:

"అంత తులసిమొక్కమీద మోజున్నవాడివి గంజాయికేమని అమ్ముడుపోయావు మేనేజరూ?" అని.

*(వనిత మాసపత్రిక - నవంబరు, 1982)*

# శరణుఘోష

"శరణమయ్యప్పా..." ఒక్కసారిగా దాదాపు వందమంది కంఠాలలోనించి శబ్దతరంగాలు స్పందించి వాతావరణాన్ని మంత్రిస్తున్నాయి.

మరొక్కసారి.... మరొక్కసారి ఉప్పెనగాలిలా ఘోష... "శరణమయ్యప్పా...."

ఎవరికో పూనకమొచ్చింది.

వాకిట్లో డప్పుల శబ్దం. చాలా విచిత్రంగా ఉంది ఆలయం. మనిషిలో అంతః శక్తులమీద నరాల పీడన స్పందనలమీద పనిచేస్తుందది; మనస్సును హిప్నొటైజ్ చేసి, ఊహను మొద్దు బరచి ఏకాగ్రత్తనిచ్చి ఒకే భావనమీద కేంద్రీకృతమయ్యేటట్లు చేస్తుంది. అదుగో, అప్పుడే పూనకాలు వస్తాయి. వాతావరణంలోని చైతన్య శక్తిని ఫిజికల్ (physical)" లోనికి ఆవాహన చేసి మాట్లాడిస్తాయి.

భావన, భావము ఒకటైనప్పుడు, ధ్యాన్నా ధ్యాత్రాధ్యేయ రూపం ఒకటైనప్పుడు రూపుదాల్చేది. దైవం. కానీ, అలాకాక, భక్తి మితం దాటిపోయినప్పుడు, ఆవేశపు పై పొరలు విచ్చుకుని సబ్‌కాన్షియస్‌లో ఒదిగిన ఆలోచనా సరళి, కోరికల కోటలు ఎగో- ఇవన్నీ బైటపడతాయి. ఈ పూనకంలో దీనికి దైవత్వం ముద్ర పడటం కూడా జరుగుతుంది సాధారణంగా అలాంటప్పుడే సత్యము సుందరము, అయిన దైవత్వము, మనిషి ఏ అహంకార స్వరూపమైన 'నేను' అనే భావన ఈ రెండూ పడుగు పేకల్లాగా అల్లుకుని పోతాయి. అందుకనే అప్పుడు చెప్పేవి కొన్ని నిజాలౌతాయి, కొన్ని అబద్ధాలవుతాయి. వీటిని మూఢంగా నమ్మినప్పుడు కొన్ని జీవితాలే మారిపోతాయి.

చేతులు కట్టుకుని, స్తంభానికి ఆనుకుని ఆ పెద్ద బంగళాలో చీకటి చారలో నిలబడి దూరంగా పెద్ద హాల్లో జరుగుతున్న తంతు అంతా చూస్తూ ఆలోచిస్తున్నాడు భార్గవ.

పెద్ద వదిన - ఆ ఇంటి యజమానురాలు గబగబా పట్టుచీరతో, తలపిడపతో లోపలకి వస్తూ ఆగి,

"ఎవరక్కడ? నువ్వా భార్గవా? అరె, ఇక్కడున్నావేమిటి? అక్కడ అంత పూజా అదీ జరుగుతుంటే... రా! అన్నయ్య కేకలేస్తారు...." అనేసి హడావిడిగా వెళ్ళిపోయింది.

అటే చూస్తున్నాడతను. సహనము, ఓర్పు, సౌందర్యము వున్న వదిన ఈ ఇల్లు ఇలా వుండటానికి చాలా దోహదం చేసింది. ఇవ్వాళ వచ్చిన అందరికీ తన చేతుల్తో బాదంఘీరులు అందిస్తున్న వదినకు ఆనాడు అన్నయ్యతోపాటు తాగిన పదిహేను

పైసల చుక్క కాఫీ రుచి గుర్తుంటూనే వుంటుంది. ఆ విషయం ఎవరికీ అర్ధమవకపోయినా, చిన్నప్పటి నుంచీ ఆమె చేతుల్లో పెరిగిన భార్గవకు బాగా తెలుసు.

"ఏమిటి ఇక్కడే వున్నావు? రా!" ప్రసాదాలు పట్టించుకుని వెళుతు అన్నది.

"అదికాదు వదినా!" నసుగుతూ అన్నాడు.

"ఏమిటి?" అసహనంగా ప్రశ్నించింది.

"స్నానం చెయ్యలేదు." గబుక్కున అన్నాడు.

"ఊం! ఇదొక సాకు.... త్వరగా స్నానం చేసిరా. ఇంకా చాలా టైం ఉందిలే."

"వదినా!"

"మళ్ళీ ఏమిటి?"

"నీతో మాట్లాడాలి." గోళ్ళు చూసుకుంటూ అన్నాడు. తలకాయ వంచుకుని మాట్లాడుతున్న ఆ పాతికేళ్ళ పసిబిడ్డలాంటి మరిదిని చూసి ఆ హడావిడిలో కూడా నవ్వు వచ్చిందామెకు.

"ఇప్పుడా? వుండు, కాసేపు ఆగు, వస్తాను."

"ఇందిరా!" అన్నగారి గొంతు.

"వస్తున్నా!" అంటూ పరుగు పెట్టిందామె.

ముగ్గురన్నయ్యలు, వదినలు, ఇంకా చుట్టాలు. బంధువులు మొత్తం అందరూ ఈ ఇరుముడుల పూజ కోసం మూడురోజుల ముందునుంచీ వచ్చి, ఇల్లంతా హడావిడి చేసేస్తున్నారు. ఇంతమందిలో బాధ్యత మాత్రం పెద్ద వదినదే.

"ఆం! చేసే వాళ్ళకెప్పుడూ తప్పదులేవయ్యా!" అనేసి హడావిడిగా పనిలోకి వెళ్ళిపోతుందామె.

"ఊం - చెప్పుత్వరగా. ఏమిటి మాట్లాడాలన్నావు?" కొంగుకు చెయ్యి తుడుచుకుంటూ దగ్గరకు వచ్చిందామె.

"వదినా!"

"ఊం!"

"నాకొక కల వచ్చింది." గబుక్కున అన్నాడు భార్గవ.

ఏనాడు నవ్వనంత గట్టిగా నవ్వింది ఇందిర.

"ఏమిటి? మీ అన్నయ్య కెమెరాలో నుంచి కనిపించే కలర్ డ్రీమా.... ఇది చెప్పడానికేనా ఇప్పుడు ఇంత హడావిడిలో?"

"అదికాదు వదినా! కొంచెం సీరియస్‌గా విను." ఆవేదనగా అన్నాడతను.

"ఊం - చెప్పు...."

"ఆ కలలో...."

"ఊ.... ఆ కలలో?"

"దేముడు కనిపించాడు వదినా!"

"ఏమిటీ.... నీకా? పారాసైకాలజీ చదివి నీకు బుర్ర పోయిందయ్యా!"

"ఏం వదినా, కనిపించదంటావా?" పరీక్షగా చూస్తూ అన్నాడు.

"ఇంకా నయం –" తలపిడప విప్పి ఆరబెట్టుకుంటూ అన్నది ఇందిర.

"మరి ఆ కనబడని, లేడనేవాడికోసం ఈ పూజలన్నీ దేనికి వదినా?"

రక్కున తిరిగింది ఆమె.

"అదా నాయనా, నీ ప్లాను! సంతోషించాంలే నీ తెలివికి. నీకు ఇదంతా జోక్‌గా కనిపించినా, ఈ నలభై అయిదు రోజులన్నా వీళ్ళు మిగతా 320 రోజులు ఎలా బ్రతుకుతున్నాము అని ఆలోచించుకుంటారు భార్గవా! దయచేసి ఈ పూజ గురించి తప్పుగా మాట్లడకు. ప్లీజ్...."

"అదికాదు వదినా!"

"ఇంకేం చెప్పకు." వెళ్ళిపోతోంది.

"వదినా!" ఆ గొంతులో ఆర్తికి వెనక్కు తిరిగింది.

"వదినా! నిజం. నా కలలో అటు వెలుతురూ, ఇటు చీకటీ కాని ఒక రేఖ లాంటి బాక్‌గ్రౌండ్‌లో నీలం రంగులో – వుందు, అది నీలం కాదు వైలట్ కూడా కాదు. ఓహో.... ఆ రెండు రంగుల మధ్య వుండే ఊదారంగు అనుకో. విచిత్రమైన ఆ కాంతిలో ఒక ఫిగర్ కనిపించింది వదినా! కనిపించి–" కళ్ళు మూసుకుని ఆగిపోయాడు భార్గవ.

గబగబా దగ్గరకు వచ్చింది ఇందిర.

"భార్గవా!" అని రెక్క పట్టుకుని కుదిపింది.

కళ్ళు తెరచి, "నిజం వదినా! ...." అన్నాడు. అతని కళ్ళల్లో తమాషాగా తడి వుంది.

"ఏమిటిది భార్గవా? పిచ్చా, చాదస్తమా? ఇదంతా సైకలాజికల్ నాన్సెన్సు అనే నువ్వేనా ఇదంతా మాట్లాడేది?"

అతడు మాట్లాడలేదు.

"ఊఁ! కనబడి...." అసహనంగా అన్నది ఇందిర.

"నీ చుట్టూ మనుష్యులు భగవంతుడి పేరుతో చేసే ఈ న్యూసెన్స్ అంతా నమ్మలేరు నీవంటివారు. కానీ, 'కాస్మిక్ ఎనర్జీ'నీ నమ్ముతారు కదూ! దాన్ని టాప్ చెయ్యడానికి, దానితో ఇన్స్టాకనెక్షన్ ఏర్పడడానికీ ఈ మెడిటేషన్, కాన్సన్‌ట్రేషన్ వగైరా. చూడగలిగిన కళ్ళు నీకున్నప్పుడు ఆ ఎనర్జీ కాసేపు 'ఫిజికల్ ఫాం'లో కనబడుతుంది. అంటే – నీలో ఎక్స్ట్రా సెన్సుయరీ పవర్ (E S P) నిద్ర లేవాలన్నమాట.... అంతే!" అన్నాడు.

"ఇంగ్లీషులో మాట్లాడాడా?" వచ్చే నవ్వు ఆపుకుంటూ అడిగింది ఇందిర.

"అది భాష కాదు వదినా! ఏదో కోడ్‌లా... జస్ట్ 'థాట్ ట్రాన్స్‌ఫరెన్స్....' చాలా విచిత్రమైన అనుభవం....

"అంటే, నీకు ఇంగ్లీషులో ఫ్లూయన్సీ ఉన్నది కాబట్టి అలా అర్థమైందంటావా?" ఆలోచిస్తూ అడిగింది.

శ్రావణ శుక్రవారం నాడు వదిన అమ్మవారికి బేసరి, పూలజడ, కాసుల పేరుతో అలంకరిస్తూంటే-

"అమ్మవారు నీకు అచ్చు ఇలాగే, నీలాగే ఉంటుందని ఎలా తెలుసు వదినా?" అనేవాడు చిలిపిగా భార్గవ.

"ఏమో... నాకు ఇలాగే కనిపిస్తుంది..." అనేది నవ్వుతూనే ఇందిర.

"అదే మరి.... పంజాబీ ఆవిడకు పంజాబీ డ్రస్‌లో రెండు జళ్ళతో, యూరోపియన్ లేడీకి ఫ్రాక్‌తో బాబ్డ్ హెయిర్‌తో ... ఇలా ఎవరికి కావలసినట్లు వాళ్ళకు కనిపిస్తుంది కాబోలు పాపం. అమ్మవారు పాపం, ఫాన్సీ డ్రస్సులు వేసుకోవాలి పండగ పండక్కీ" అనేసి తిట్లు తిని పారిబోయే చిలిపి భార్గవ గుర్తుకు వచ్చాడు.

"ఓ! గాడ్' చూశావా రాత్రి వీడియోలో...."

"జోక్ కాదు వదినా!... అది సరే... చాలా విచిత్రమైన విషయం చెప్పాడు."

"అదేమిటి?"

"ఇవ్వాళ మీ ఇంట్లో పూజకదా. నేను వస్తాను. గుర్తుపట్టు. ప్రయత్నించు. అన్నాడు వదినా!"

"భార్గవా!" ఖంగారుగా అన్నది ఇందిర.

"అవును వదినా! మళ్ళీ టాల్‌స్టాయ్ కథ చదివావా? అనకు. నిజం." అతని గొంతులోని నిజాయితీకి కదలిపోతోంది ఇందిర. కానీ, ఎలా? ఎలా నమ్మడం?

"అన్నిట్లోకి విచిత్రం. అది కల కూడా కాదేమో వదినా! ఏదో విజన్ లాగా....."

"అదేమిటి మళ్ళీ?" ఉలిక్కిపడుతూ అన్నది.

"అవును. ఎందుకంటే, నేను అప్పుడు నిద్రపోవడం లేదు. చాలా సెన్సుబుల్‌గా ఉన్నాను. వాతావరణంలో ఒక్కసారిగా విభూది వాసన."

"అదేముంది? దేముడి గదిలోనుంచి వచ్చి వుంటుంది," తేలిగ్గా అనేయాలని ప్రయత్నిస్తూ అన్నది ఇందిర.

"ఏమో. అప్పుడు నా వెన్నెముకలో ఏదో జలదరింపు."

"భార్గవా!" అతని రెండు భుజాలు పట్టుకుని కుదుపుతూ అతని కళ్ళల్లోకి చూస్తూ అన్నది భయంగా ఇందిర.

"ఏదో భగవంతుడు అనేవాడు కాసేపు పూజ చేసుకోవడానికీ, మనస్సు పవిత్రంగా అట్టే పెట్టుకోవడానికీ పనికివస్తే బావుంటుంది కానీ, ఇలా కనబడి...."

"ఏమిటి వదినా! నీలో నువ్వే మాట్లాడుకుంటున్నావు?"

"చూడు భార్గవా! స్నానం చేసి దేముడి గదిలోకిరా ముందు. తరవాత చూద్దాం." గబగబా ఆలోచించుకుంటూ వెళ్ళిపోయింది ఇందిర.

ఆలోచిస్తున్నాడు భార్గవ. అతనేం చిన్నవాడు, అమాయకుడు, జ్ఞానం లేనివాడు కాదు. ఈ దేముళ్ళు, దేవతలు, ఆచారాలు, మడులు, తాయత్తులు, యంత్రాలు - వీటిని అడ్డం పెట్టుకుని భగవంతుడి పేరుతో గుడి, చర్చి, మసీదు ఇలా రకరకాల విధానాలతో మనిషి మీద, అతని ఆత్మ స్వతంత్రత మీద చలాయించే జులుం అంటే మొదటి నుంచీ విపరీతమైన జుగుప్స అతనికి. అందుకే ఎలాగూ నిత్యజీవితంలో కొంత న్యూసెన్సును తప్పించుకోలేమని తెలిసే, అదేమిటో తెలుసుకోవాలని చాలా ప్రయత్నించాడు. పారా సైకాలజీ చదివాడు. వేదకాలం నాడు భగవంతుణ్ణి ఇలా భయంకర విగ్రహారాధనతోనూ, పూజారి ఇచ్చే అర్చన టిక్కెట్లతోనూ చూడాలని ప్రయత్నించలేదు ఆనాటివారు, కారణం, వారిలో సర్వ చైతన్యంలోనూ సర్వేశ్వర సందర్శన చెయ్యగలిగిన జ్ఞానం ఉండేది. ఇప్పుడు ఆ వెలుగు ఎలా మరుగున పడిందో అతనికి అర్థమవలేదు. స్వార్థపరుడైన మనిషి సర్వేశ్వరత్వం తన ఆశయం అనుకోక, సర్వేశ్వరుణ్ణి తన స్వప్రయోజనాలకు ఉపయోగపడేలా మార్చుకోవాలని ప్రయత్నం చేసి పతనంలో పడ్డాడని అర్థమైంది అతనికి.

ఇంత తెలిసి, చదివిన అతనికి తన 'విజన్' తనకే అర్థం కావడం లేదు.

స్నానం చేసి పూజ హాల్లోకి వెళ్ళాడు.

"ఓరి నువ్వా!" అన్న భావం అందరి ముఖాలలోనూ కనిపించింది. "అసలీ భగవద్భక్తి ఏమిటి?" అనే ఆలోచించే భార్గవ, కళ్ళు మూసుకుని చెప్పిన మాట వినడు కాబట్టి నిరీశ్వరవాది' అని చాలామంది ఉద్దేశం.

పెద్దన్నగారు కెమెరామాన్... విభూది పట్టీలు పెట్టాడు. చిన్నన్న వీడియో కెమేరాను అతని అనుగుణంగా తిప్పాడు.

విభూది పళ్ళెం, మధ్యలో హారతి, అరటి దూటలతో కట్టిన మండపం, పద్దెనిమిది మెట్లు చుట్టూ ఎలక్ట్రిక్ బల్బులు, ఆపకుండా వేస్తున్న ధూపాల మధ్య అయ్యప్ప మెరిసిపోతున్నాడు...

చుట్టూ చూశాడు భార్గవ.

దాదాపు అందరూ తెలిసినవాళ్ళే.... ఇందులో మాల తీసి కోరికలు తీర్చుకుని, మళ్ళీ "మాల" వేసుకునే బలహీనులు, తప్పులు చేస్తూ "సర్వం పరబ్రహ్మార్పణమస్తు" అనుకునే లౌక్యులు.... చాలా నిష్ఠగా వ్రతనియమాలు చేస్తూ, దాని వెనకాల వుండే సర్వేశ్వరతత్వం మర్చిపోయేవారు - ఇలా చాలామంది వున్నారు.

వద్దనుకుంటూనే ఆలోచిస్తున్నాడతను.

"ఇవ్వాళ మన మతం సైన్టిఫిక్‌గా ప్రూవ్ అయిందండీ.... విభూది ధరించడం వల్ల శరీరంలో ఎలక్ట్రో మాగ్నెటిక్ వేవ్స్ ఎఫెక్ట్ అవుతాయట!" అబ్‌స్ట్రాక్ట్ సబ్జెక్ట్ మాట్లాడడం కూడా ఒక ఫాషనే అనుకునే ప్రొఫెస్సర్ కాబోలు అంటున్నాడు.

"మతం సంగతి నాకు తెలియదు కానీ బాబూ, ప్రస్తుతం మాత్రం మీ ఇజాలకు, సైన్సుకూ భగవంతుడు అందడయ్యా! సైన్సు భగవంతుణ్ణి వెతుక్కోవాలి. సత్యాన్ని తెలుసుకోవాలి. దానికి చాలా కాలం పడుతుంది." ఎవరో పెద్దాయన చెబుతున్నారు.

సత్యం... అదంటే ఏమిటసలు?

That which kept before your mental mind, your spiritual mind. will continue to develop you upwards" అన్న ఎడ్గర్ కెయిసీ గుర్తుకు వచ్చాడు.

ఫలహారాలు ప్రారంభమైనాయి. చాలా గందరగోళంగా వుంది. గురుస్వాములు కొందరు సాక్షాత్తు భగవంతుడిలా ప్రవర్తిస్తుంటే, మరికొంతమంది అహంకారం మూర్తీభవించినట్లున్నారు.

"ఇవ్వాళ వాళ్ళ కాల్‌షీట్ - ఇలా కానిచ్చెయ్యండి..." ఎవరో సర్దేస్తున్నారు." నిజమే మరి. ఇటువంటప్పుడే వారి 'అహం' సంతృప్తిపడేది.

కానీ భార్గవకు ఇప్పుడవన్నీ మామూలుగా ఆలోచించే సమయం లేదు. అందరి ముఖాలూ పరీక్షగా చూస్తున్నాడు.

"ఎలా కనిపిస్తాడు?"

ఇదంతా నిజమా? మనసు ప్రశ్నిస్తోంది.

కానీ, ఎందుకో ఏదో తెలియని నమ్మకం ఒక అలలా వచ్చి, అతని సందేహాన్ని ముంచేస్తోంది.

అతనికి ఆ గోలలో తృప్తిగా లేదు. వాళ్ళందర్నీ తప్పించుకుని వచ్చి బైటకు నడిచాడు భార్గవ. పిల్లినీ, కుక్కనూ కూడా పరీక్షగా చూస్తున్నాడు. చుక్కల్నీ, చంద్రుణ్ణీ కూడా పరిశీలిస్తున్నాడు.

చీకట్లో గేటు దగ్గర నీడలా ఎవరో .... గబాల్న పరిగెత్తాడు. రాత్రి దాదాపు పదిగంటలైంది.

ఎవరో వీధి బిచ్చగాడు... పరమ వృద్ధుడు.

సత్తుగిన్నె పట్టుకుని నిలబడి ఉన్నాడు.... చలికి ఒణుకుతున్నాడు.

"బాబూ! ఆకలి...." అన్నట్లు ఎండిపోయిన కడుపు, ఖాళీ గిన్నె చూపించాడు.

"కొంచెం అన్నం పడెయ్యండతనికి...." ఎవరో పనివారు కనబడితే చెప్పాడు భార్గవ.

"ఉండండి బాబూ! చెయ్యి తీరికెక్కడిది? అయ్యప్పలు ఫలహారాలు చేస్తున్నారు." వెళ్ళిపోయాడు పనికుర్రాడు.

ఆ బిచ్చగాడు అలాగే నిలబడి ఉన్నాడు. భార్గవ రెండు చేతులూ వెనక్కు పెట్టుకుని పచార్లు చేస్తున్నాడు కానీ, ఏదో ఇబ్బందిగా ఉంది ఆ బిచ్చగాడు అలా నిలబడితే. విసుగొచ్చి. లోపలికి వచ్చి చిన్న వదినకు చెప్పాడు.

"ఉండవయ్యా! అయ్యప్పల విస్తళ్ళెత్తితే పుణ్యమట." వండకపోతే మానే, వడ్డించడానికికూడా రాని చిన్న వదిన విస్తళ్ళెత్తితే వచ్చే పుణ్యం కోసరం ప్రలోభపడుతోంది.

మిగతావాళ్ళు 'ఇదుగో వస్తున్నాం' అన్నారే కానీ, రాలేదు. పెద్ద వదిన కోసం వెతికాడు... కనిపించలేదు.

అక్కడ దాదాపు వందమంది మనుష్యులు, ఆకలితోకాక, మర్యాదకో, భక్తికో, తప్పనిసరయ్యో, నియమానికి కట్టుబడో భోజనాలు చేస్తున్నారు. కానీ, ఆకలితో అలమటించిపోతున్నవాడికి, నిజంగా అవసరమైనవాడికి అన్నం పెడదామంటే దాదాపు అరగంట అయింది....అతీగతీ లేదు.

దేముడి గదిలోకి తొంగిచూశాడు. దేముడి నైవేద్యం కాబోలు, రెండు అరటిపళ్ళు ఉన్నాయి. గభాల్న పట్టుకుని బైటకు నడిచాడు.

అలాగే, ఆ గోడకానుకుని నిలబడి ఉన్నాడు ఆ బక్కచిక్కిన వృద్ధుడు.

అరటిపళ్ళు సత్తుగిన్నెలో వేశాడు.

ఆత్రంగా ఒలుచుకుని తినబోతున్నాడు. ఎవరో పసిపిల్లవాడు ఒంటిమీద బట్టలు కూడా సరిగ్గాలేవు, చలిలో రోడ్డుకు అడ్డంగా పరిగెత్తుకు వచ్చాడు.

"ఆకలి....." అంటూ అతి దీనంగా చెయ్యి చాచాడు. తలెత్తి ఒక్కసారి భార్గవ వంక చూసి, ఎండిపోయిన పెదవులు, మాసిపోయిన తెల్లటి గెడ్డంలోనించి విషాదంగా, సన్నగా ఒక చిన్న నవ్వు నవ్వి ఆ అరటిపళ్ళు ఆ పిల్లాడి చేతులో పెట్టాడు ఆ వృద్ధుడు.

ఆ కుర్రాడి కళ్ళల్లో తృప్తి... ఆ ఆప్యాయతా దీపాలు, మణికంఠుడికి వెలిగించే మకర జ్యోతుల్లా వెలిగాయి.

"పిలిచావా భార్గవా?" పెద్ద వదిన వరండాలో నించి అరిచింది.

"ఆఁ! అవును వదినా! కొంచెం ప్రసాదం పట్రా! పాపం, ఎవరో ముసలివాడు." అతని వంకే చూస్తూ అన్నాడు భార్గవ.

తెచ్చింది ఆమె.

చినుకులు పడుతున్నాయి. మెరుపులు మెరుస్తున్నాయి. గేటు దగ్గర నుండి వచ్చి ఇందిర చేతులలోని ప్రసాదం తీసుకుని వెనక్కి తిరిగి వచ్చాడు భార్గవ... ఏముందక్కడ? ఎవ్వరూ లేరు. చుట్టూ చూశాడు. ఒక్క సెకను కూడా కాలేదే... రోడ్డుకి అటు ఇటూ చివరివరకూ ఆ ప్రసాదం గిన్నె పట్టుకుని పిచ్చివాడిలా పరిగెత్తాడు.

"ఏమైంది భార్గవా?" ఖంగారుగా అడిగింది, ఇందిర గేటు దగ్గరకు వస్తూ.

"ఎవరో ముసలివాడు వదినా, పాపం...." ఏదేదో చెప్తున్నాడు అటూ ఇటూ చూస్తూ.

"ఇంతకీ నీ విషయం ఏమైంది భార్గవా? ఏవరైనా కనబడ్డారా?"

"ఆ...." తెల్లబోయాడతను. ఆ గందరగోళంలో అసలు విషయాన్నే మర్చిపోయాడు.

"వదినా! ఇప్పుడు వచ్చినతను....." నోట మాట రావడం లేదు. తడబడుతూ జరిగిందంతా చెప్పాడు భార్గవ.

నిశ్చేష్టురాలై వింటూ ఉండిపోయింది ఇందిర.

"భార్గవా! నేను పిచ్చిదాన్ని అనుకోకుండా ఉంటే ఒక నిజం చెప్పనా?" సాలోచనగా గేటు వంక చూస్తూ అన్నదామె.

ఆమె అప్పుడు మామూలు వదినలాగా అనిపించలేదు భార్గవకు. మంచి ఇల్లాలైన ఆడదానిలో మరుగున దాగుండే వ్యక్తిత్వం ఎంత అపూర్వమైనదో తెలిసినా, ఆ క్షణంలో దాన్ని గురించి ఆలోచించే స్థితిలో లేదు భార్గవ.

"భారతం మొత్తం మీద ఎన్నిసార్లు కృష్ణుడు విశ్వరూప దర్శనం ఇచ్చాడంటావు?"

"నాలుగైదుసార్లు అనుకుంటా..... ఏం?" సాలోచనగా అన్నాడు.

"అవునా! భీష్మడితోపాటు, విదురుడితోపాటు దుర్యోధనాదులతో సహా చాలామందికి ఆ దర్శన భాగ్యం లభించినా, ఆయన భగవంతుడని, ఆయన చేతిలో 'నియతి' ఉన్నదనీ మిగతావాళ్ళు ఎందుకు గ్రహించలేకపోయారంటావ్? సాక్షాత్తు సర్వేశ్వరుడే సారథ్యం వహిస్తున్నాడని తెలిసినా, ధృతరాష్ట్రుడు ఏం మారాడంటావ్? కారణం? మాయ.... కాబట్టి సర్వేశ్వర దర్శనమైనంత మాత్రాన సర్వం తెలుస్తుందనుకోకూడదేమో!...."

ఆశ్చర్యంగా ఆమెవంక చూస్తున్నాడు భార్గవ. తెలివిగలవాడు కాబట్టి ఆమెను మాట్లాడిస్తున్నాడు.

"వదినా! ఈ నిష్ఠాగరిష్ఠులనబడేవాళ్ళు. నియమ నిష్ఠలతో గురుత్వంతో భయపెట్టే వీళ్ళు నిజజీవితంలో ప్రతి అల్ప విషయానికీ స్వార్థపరులైపోతూంటే ఎలా భరించమంటావ్? అని పోట్లాడేవాడివి గుర్తుందా? నిజం అది .... జిలుగు వెలుగులాంటి ఆ ఆనందానుభూతి ఏ కాసేపో వీళ్ళను పునీతుల్ని చేసినా, మరుక్షణం నించీ వీళ్ళు మాయలో పడిపోతారన్నమాట. దేముడు కనిపించడేం అనే ఈ మనుష్యులు సర్వేశ్వరుడు ఎదురుపడితే గుర్తుపడతారంటావా? నైవేద్యాలు తినిపోతే పోషిస్తారంటావా?...."

"మరి ఈ గందరగోళం అంతా దేనికి వదినా?"

"అదే నేను చెప్పేదీను... ఆ లోపల గందరగోళంలో దేముడున్నాడా లేదా అన్నది కాదు ప్రశ్న.... శరణు ఘోషలో, ఆర్తితో కూడిన ప్రతి పిలుపులో నాబోటిదానికి సర్వేశ్వరుడి ప్రతిధ్వని వినిపిస్తూనే ఉంటుంది. కానీ మామూలుగా వింటే అది గోలే. ఆర్తితో, ఎన్నో అడ్డంకులు దాటి, ఏడుకొండలు నడిచి ఎక్కి, వెంకటేశ్వరసన్నిధిలో ఐదునిమిషాలు నిలబడ్డా చాలు అనుకునే భావన ఆ సన్నిధికి పవిత్రత నిస్తుంది. విలువ నిస్తుంది. అక్కడ గార్డు డ్యూటీలో ఉన్నవాళ్ళు ప్రతిక్షణం భగవంతుడి సన్నిధిలోనే ఉన్నా పనికిమాలినవన్నీ మాట్లాడుకుంటారు భక్తుల్ని, ఆర్తుల్ని చూసి. 'అక్కడ భగవంతుడున్నాడంటావా? వీళ్ళందరినీ చూసి' అం ఇక్కడేం దేముడు? అనుకుంటావా?"

అక్కడ ప్రశ్నించేది వదినకాదు వివేకం. ఏమనగలడు?

అందుకే కూరను పదిసార్లు కలియబెట్టే గరిటకన్న, ఒక్క పిసరుతో రుచి చెప్పగలిగిన నాలుక గొప్పదన్నాడు భర్తృహరి... ఏమంటాడు భార్గవ?

"సర్వేశ్వరుడు కనబడతాడనుకున్న నువ్వు, అతనికోసం వెతుకుతున్న నువ్వు, ఆకలి, ఆర్తి అంటున్న అతణ్ణి భిక్షగాడనుకున్నావు. కారణం. భగవంతుడి గురించి నీకు నువ్వే కల్పించుకున్న ఊహ...."

"వదినా!" ఆమెలో ఏదో కొత్తవ్యక్తిని చూసినట్లుంది భార్గవకు.

"ఇన్ని వందల మందికి మర్యాదలు చేస్తున్న మనం పిడికెడు అన్నం అవసరమన్నవాడికి పెట్టలేకపోయాం... భగవంతుడే వస్తే మనం ఏమివ్వగలమయ్యా రిక్తహస్తాలు, శూన్యహృదయాలు తప్ప...." కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నది ఇందిర. దూరంగా ఎక్కడో మెరుపు మధ్య ఎవరో నీలి ఊదారంగు వ్యక్తి నడిచిపోయినట్టు అనిపించింది అతనికి. అటు పరిగెత్తపోయి ఆగిపోయాడు అతను.

"ఇందిరక్కా! వచ్చి పనివాళ్ళకు అన్నాలు పెట్టుబాబూ! ఆ వెధవగోలంతా ఎవరుపడతారు?" అరిచింది చిన్న వదిన.

"వస్తున్నానమ్మా!" అంటూ కొంగు బిగించి పరిగెత్తింది ఇందిర.

అటేచూస్తూ ఆలోచిస్తూ నిలబడిపోయాడు భార్గవ. వదిన అమాయకత్వంతోనూ, ఆర్తితోనూ చాలా అందమైన నిజాలు చెప్పింది. బహుశ ఎడ్గర్ కెయిసీ చెప్పిన ఆ 'పాయింట్' ఇదేనేమో!....

భార్గవ మేధస్సు పదునెక్కుతోంది.

గాలిలో విభూది వాసనలు....

అవి అయ్యప్ప భజన మందిరం నుంచో, లేక విశ్వవ్యాప్తి అయిన సర్వేశ్వరుడి విభూది విలాసమో కానీ, గాలిలో వ్యాపిస్తూనే వున్నాయి.

*(వనిత మాసపత్రిక – ఏప్రిల్, 1985)*

# మజిలీ

"మామ్మా! నీ పుస్తకం ఏదో జారిపోయింది చూడు...."

సర్దుతున్న పుస్తకాలలోనించి తలెత్తిచూచింది వరూధిని, మనమరాలు ప్రజ్ఞను. ఆవిడ, ఆమె నిలబడ్డ భంగిమ.... అరవై ఏళ్ల వయస్సు.... అయినా ఆమెలో వ్యక్తికి వృద్ధాప్యంలేదు. బాధ్యతల బరువులు మోసిన ఆమెకు బలహీనత, ఒణుకు రాలేదు.

"ఏమ్మా! కాలేజీ లేదా? కుర్చీలో జారగిలబడుతూ అన్నారామె.... "లేదు.... హాలిడే... మామ్మా! ఇన్ని పుస్తకాలు ఎప్పుడు చదివావు?" కలరాఉండల పొడుం ఫిలాసఫీ పుస్తకాలమధ్య జల్లుతూ అడిగింది ప్రజ్ఞ. "ఇవన్నీ నాకు స్నేహితులు ప్రజ్ఞా..." ఆప్యాయంగా వాటిని స్పృశిస్తూ అన్నది వరూధిని. "నా జీవితంలో నాకు కావలసిన భాగమంతా వాటి మధ్యే గడిచిపోయింది... ఇంక వయసైపోయి రాలిపోతానేమో ప్రజ్ఞా! నా తరువాత మీకు ఇవి ఉపయోగించాలని నా ఆశ... మామ్మ మెళ్లో బంగారం, బ్యాంకు బాలన్సులకన్నా విలువైనవి ఇవి... ఈ విషయం మీకు తెలియాలి...."

ఆవిడ గొంతులో ఆర్ద్రతకు చలించిపోయింది పద్దెనిమిదేళ్ల ప్రజ్ఞ. "మామ్మా! ఈ పుస్తకం ఏమిటి?" అని మామ్మ దగ్గర పొదవిపట్టుకున్నట్లు కూర్చుంది. ఆ స్పర్శలోనే ఆమె జవాబుంది. అది ఆ ఇద్దరికీ అర్థమైపోయింది.

"ఫ్యూచర్ షాక్!" నవ్వుతూ అన్నది వరూధిని చిలిపిగా చూస్తూ.

"ఏది? ఇంకా నీకు?" ఫకాలున నవ్వేసింది ప్రజ్ఞ.

మెల్లిగా తన చేతిలో పుస్తకాన్ని ఏదో ప్రాణమున్నదానిలా తిప్పుతోంది ఆమె. "మామ్మ ఎప్పటికీ పెద్ద మిస్టరీ..." అనుకుని ఆరాధనగా ఆమెవంక చూస్తోంది ప్రజ్ఞ. ఆమెవయసుపిల్లలకు ప్రస్తుతం సెంటిమెంట్స్ పెద్దగా ఉండే అవకాశంలేదు. వాళ్ళ జీవనవిధానానికి ఒకటే ప్రత్యామ్నాయ పదం.... "ఫాస్ట్‌నెస్."

"మీ తరానికి మాకన్నా ఐ.క్యూ ఎక్కువ ప్రజ్ఞా! కానీ మనసు అప్పుడప్పుడన్నా మంచులో తడిసిన మల్లెపూవులా స్పందించాలమ్మా... అదే లేకపోయిన తరవాత పెద్ద చెప్పుకోదగ్గదేం మిగలదేమో...."

ఇలా మాట్లాడే మామ్మ అంటే పిచ్చిఇష్టం ప్రజ్ఞకు. పుస్తకం తిరగేస్తున్న ఆమెనే ఆనందంగా చూస్తోంది ప్రజ్ఞ.

అవును. వరూధిని అందరిలాంటి వ్యక్తి కాదు. "మా అమ్మ నాకు గురువు. ఫిలాసఫర్, గైడ్" అంటాడు కొడుకు రాఘవరావు. జీవనసమరంలో చాలా

పోరాటాలు సలిపి పైకి తెచ్చుకున్నదామె అతణ్ణి. "చాలా డబ్బుగలవాడివి అనడానికి కారణం ఏదన్నా అవ్వచ్చు నాన్నా! వ్యక్తిగా గొప్పవాడివవ్వడానికి నీ ఎఫర్ట్ అవసరం..." అనేది.

"ఆc! ఎవరి ఖర్మ ఎలావుంటే అలా అవుతుంది" అని దీర్ఘం తీసేది అత్తగారు. ఆవిడకు కోడల్ని చూస్తే ఇష్టంలేకకాదు, ఆమె ఆత్మస్థైర్యం చూస్తే మంట...

వరూధిని భర్త ఆమెను నానా హింసలూ పెట్టి, వదిలేసి, మరొక పిల్లను పెళ్ళిచేసుకుని, "అవతలవాళ్ళు నామీద కేసుపెడతానంటున్నారు వరూ! ఏమిటి దారి?" అని బిక్కమొహం వేసుకుని వచ్చినప్పుడు, "ఆస్తంతా తగలబెట్టావు. ఇప్పుడు దేవతలాంటిదాని ఉసురుపోసుకున్నావు...." అని మెటికలు విరిచినా, 'చూద్దాం కోడలేం చేస్తుందో' అనుకున్నదామెగారు.

నిర్లిప్తంగా, కళ్ళనీళ్ళను గుండెల్లోకి వంచేసి, 'అతనితో నాకు ఏ సంబంధం లేదు....' అని కాగితం రాసిచ్చి లీగల్‌గా అతన్ని రక్షించింది. కానీ అలా అసహ్యాకరమైన అనేక సంఘటనలతో తడిసి బరువెక్కిన ఆమె మనసు, జీవితంలో ఆమెను చాలా ఒంటరిదాన్ని చేసింది.

అదుగో, అల్లాంటి వ్యక్తిత్వాలంటే మంట ఆమె అత్తగారికి. ఆవిడ సంఘంలో ఒక వర్గానికి ప్రతినిధి.

"అయ్యో! మొగుడొదిలేసిన పిల్ల. దాన్ని చూస్తే కడుపు తరుక్కుపోతోంది" అని పదిమందికి చెప్పి కళ్ళనీళ్ళు తుడుచుకునే అవకాశం, కనీసం అలా చేసి చూపించే అవకాశం కూడా ఇవ్వని ఆడదంటే మండిపోయేది ఆవిడకు. అందుచేతనే రెండెకరాల కొంౖద మనుమడిపేర రాసేసి కచ్చతీర్చేసుకున్నా ననుకున్నది ఆవిడ.

వీటికి వేటికీ చెదర్లేదు వరూధిని. టీచరుగా ఉద్యోగంలో చేరి ఆ తరవాత ఎమ్.ఏ.కు కట్టి లెక్చరరైంది ఆమె. పరిణతిచెందని వ్యక్తిత్వంవల్ల పసిబిడ్డలా తప్పటడుగులు వేసిన తన భర్తకుండే అల్పత్వం తన బిడ్డకు ఉండకూడదని ప్రయత్నించింది.

పాఠాలు చెప్పడంలో, స్టూడెంట్స్‌ను దగ్గరకు చేర్చడంలో, ఓదార్చడంలో - అన్నింటిలోనూ ఆమె ప్రత్యేకత ఆమెకుండేది.

ఎంబ్రాయిడరీ చేసినా, గ్రీటింగ్స్ తయారుచేసినా, ప్రతిదాన్లోనూ ఆమె తాదాత్మ్యత కనిపించేది.

"మీరు భగవద్గీత చదువుతారా?" అడిగాడు తోటి లెక్చరర్, రోజూ ఆమె చేతిలో "ఫిలాసఫీ ఆఫ్ గీత" పుస్తకంచూస్తూ.

"అది బట్టీపట్టే టైం నాకెక్కడుందండీ? చేస్తున్నపనిలో అటాచ్‌మెంట్ విత్ డిటాచ్‌మెంటు లాగా ఉంటుంది నాబోటిదానికి. ఇదే గీతాతత్త్వమైతే ఇంక కావలసినదేమిటి చెప్పండి?" అన్నది నవ్వుతూ.

"ఇంత స్పందన, చక్కదనంతో భర్త దూరంగా ఉన్న ఆడది... మరీ అలా ఏ

ఎఫైర్ లేకుండా..." ఇలా ఆలోచించేవారు చాలామంది చాలా సహజంగా. కొంతమంది డైరెక్ట్‌గా అడిగేశారు కూడా.

"మన మేరేజ్ సిస్టం రక్షణకోసం ఏర్పడిందే కానీ, మీరు చెప్పినంత పరిణతి చెందలేదండీ... భర్త ఉన్నంతమాత్రంచేత ప్రతి కోరికా తీరిపోయి, లేనంతమాత్రంచేత సర్వం పోయిందనుకునేటంత అద్భుతమైన ప్రేరణ అనుభవించడం లేదు అందరూ, అందుకని నాకు ఒంటరితనం మరీ పెద్ద బాధేంకాదు..." మెల్లిగా చెప్పేసింది నవ్వుతూ.

"మావారు నేను లేకపోతే మంచినీళ్లైనా తాగరు, మావారు అసలు ఆడదీమనుకూడా చూడరు...." అని గందరగోళంగా చెప్పే హోంసైన్స్ లెక్చరర్ ఒక్కసారి ఉలిక్కిపడింది ఆ మాటకు. అందులో ఉండే పచ్చి నిజం, తన మాటల్లో ఉండే ఆత్మవంచన ఆమెకు అర్థమైనాయి. కానీ సగటుమనిషి ఎప్పుడూ పచ్చినిజాన్ని భరించలేదుకాబట్టి. ఆవిడ భయం కోపంగా, అది అసూయగా మారి, కొన్నాళ్లు ఇబ్బంది పెట్టింది వరూను.

ఆమెకు స్నేహితులుండేవారు.... కానీ, స్నేహంలో ఉండకూడనిది అసూయ అనీ, ఉండవలసినది నిజాయితీ అనీ ఆమె దగ్గరే నేర్చుకున్నారు వాళ్లు.

ఆమెకూ చిన్న చిన్న భ్రాంతులు, వ్యామోహాలు ఉండేవి. ఆమెలో పరిణతిచెందిన వ్యక్తికి, ఈ చిత్త చాంచల్యం ఉన్న వరూధిని చిన్నపిల్లలా కనిపించి నోరు మూయించగలిగేది.

"మిమ్మల్ని భార్యగా చేసుకోవాలనుకుంటున్నాను. మీరంటే నాకు చాలా ఆరాధన... మీరు ఒప్పుకోకపోతే....మిమ్మల్ని నా సహోదరిగా చూసుకుంటాను.... నాకు రీసెంటుగా భార్య పోయింది." గోళ్లు కొరుక్కుంటూ భయంభయంగా అడిగాడు ఒక ప్రొఫెసర్.

'ప్రపంచంలో ఆడా మగా మధ్య ఉండే సంబంధాల్లో కొన్ని సెక్సుకు అతీతమైన స్నేహాలుంటాయి. దాన్ని అన్నాచెల్లెలు సంబంధం అని ఆత్మవంచన చేసుకోనక్కర్లేదు. మనుష్యులమధ్య వేవ్‌లెంగ్త్ (Wave length) దూరమైనప్పుడు చిరునవ్వుతో తప్పుకోవడం తెలివైనపని. పెళ్ళాంగానో, చెల్లెలుగానో తప్ప ఆడదాన్ని మరొకరకంగా ఆలోచించలేరా ప్రొఫెసర్ సాబ్?" అని జవాబిచ్చేటప్పటికి బుర్రగోక్కుని, ఆలోచిస్తూ అదృశ్యమైపోయాడు ఆయన.

అలా కత్తిమీద సాములా జీవితాన్ని నెట్టుకువచ్చింది ఆమె.

"అమ్మా! నాకు నీలాంటి అమ్మాయి దొరికినప్పుడు చేసుకుంటాను...." అన్న బిడ్డను వాత్సల్యంతో చూస్తూ - "నాన్నా! నాలాంటి అమ్మాయి దొరకదు.... తయారవుతుంది పరిస్థితులవల్ల... ముందు పెళ్ళిలో ఉండాల్సింది స్నేహబంధం.... ఏ పిల్లనైనా స్నేహితురాలుగా నువ్వు గౌరవించగలిగినప్పుడే భార్యగా తెచ్చుకో" అనేదామె.

ఆమె జీవితం అలా సాగిపోయి ఈనాడు డెబ్బయ్యవ పడిలో పడింది.

"నాకు నువ్వే గతి..." అని కొడుకు ఇరవయ్యవ ఏట పుట్టెడు జబ్బుతో వచ్చాడు భర్త.

మాట్లాడకుండా సేవ చేసింది.

"నేనంటే నీకు ఎంత ప్రేమ? నీలాంటి పతివ్రతలు..." అని మాటలతో కోటలుగట్టే చాలామంది కోవకు చెందిన అతణ్ణి చూసి, "మీమీద నాకు జాలి.... ఎందుకు ఇలా అయిపోయారా అన్న బాధ.... ప్రేమ చాలా సున్నితమైందండీ.... దానికి చాలా పోషణ కావాలి... అలాంటిదేదో మన మధ్య ఏనాడో పోయింది" అని తేల్చి చెప్పేసింది.

అవన్నీ గుర్తుకు వస్తున్నాయి ప్రజ్ఞకు మామ్మను చూస్తుంటే.... ఆమెకు ఎంత ఇష్టమో మామ్మంటే... చాలా విషయాల్లో ఆవిడను ఇమిటేట్ చేస్తుంది ప్రజ్ఞ.

"ప్రజ్ఞా!" తల్లి కాబోలు పిలిచింది.

"ఆ – వస్తున్నా స్నానానికేనా... తాయమ్మా! నా అల్మరాలోనించి బట్టలు తెచ్చిపెట్టు...." అరుస్తూ లేచింది ప్రజ్ఞ.

"చూడు అమ్మలూ...." కళ్ళజోడులోనించి సూటిగా చూస్తూ అన్నది వరూధిని.

"ఏమిటి మామ్మా?"

"ప్రతిదానికీ పనివాళ్ళమీద ఆధారపడటానికి నేర్చుకోకు. నువ్వు చేసే పనులకు వాళ్లను సహాయం చేయడానికి పెట్టుకున్నాననుకో... అంతేకానీ, నీ బట్టలూ నీ తిండీ ఇల్లాంటివన్నీ వాళ్ళకు వదిలేస్తే, కొన్నాళ్ళికి వాళ్ళ టేస్టులు నిన్ను, నీ ఆలోచనలను డామినేట్‌చేసి, నీకంటూ ఏం మిగలదు. వాళ్ళు నిన్ను చూసి, వాళ్ళ స్థితినుంచి మరొక మెట్టు ఎదగాలి కానీ, నువ్వు వాళ్ళల్లో ఒకదానివవకూడదు. ఇది ఆర్థికపరిధిని దాటి ఆలోచించవలసిన సమస్య.... అర్థమైందా?"

ఒక్క క్షణం బిత్తరపోయి చూసింది ప్రజ్ఞ... వెంటనే "మామ్మా! యూ....యూ!" అని కౌగిలించుకొని ముద్దుపెట్టుకుని తూనీగలా పారిపోయిది.

అటే చూస్తూ, నవ్వుకుంటూ, బుగ్గ తుడుచుకుని చేతిలో పుస్తకంలో పేజీలు తిప్పింది వరూధిని.

"To love one self is the beginning of a life long romance-" Oscar Wild... అని రాసివున్నది.

అలా ఆ అక్షరాలవంకే చూస్తున్న ఆమె కన్నుల్లో నీటిపొర... ఆలోచనలు సుడులుతిరుగుతూ దాదాపు నలభై ఏళ్ళ క్రితానికి....

❀ ❀ ❀

ఏదో ఇంటర్వ్యూకోసం బైలుదేరింది వరూధిని. రైలు ప్రయాణం... బెర్త్‌దొరక్క సీటుతో అడ్జస్ట్ అయిపోయింది.

ఏదో మెగా పుస్తకం చదువుతోందామె.

'చూడండి' ఎవరో పిలిచారు.

ఉలిక్కిపడి తలెత్తి చూసింది.

ఎదురుగా ఎవరో వ్యక్తి... చాలా మామూలుగానే ఉన్నాడు. కళ్లుమాత్రం చాలా చురుగ్గా ఉన్నాయి.

"మీ కభ్యంతరం లేకపోతే కొంచెం మంచినీళ్ళు...."

ఇలా ప్రారంభమైన సంభాషణ కాసేపట్లో కొంచెం పరిచయస్తుల్ని చేసింది.

అతనికి చాలా వాక్చాతుర్యం ఉన్నది. ఒక సబ్జెక్ట్ గురించి మాట్లాడటం అయిపోగానే, ఆ ముగింపునుంచే మరొక కొత్త సబ్జెక్టులోకి తప్పనిసరిగా ఎదుటివాళ్ళను లాక్కెడతాడతను.

కాసేపైన తరవాత ఆ మాటే చెప్పింది అతనికి

"చూశారా మేడం!.... ఇంత గొప్ప విషయాన్ని ఈ భారతదేశపు రైలు కంపార్ట్‌మెంట్‌లో మీరు కాబట్టి కనిపెట్టారు. ఇంతవరకూ నా చుట్టూవుండే ఎవ్వరూ ఆ విషయం గుర్తించలేదండీ!..." అన్నాడతను అల్లరిగా.

నవ్వేసింది ఆమె....

ఉన్నట్టుండి, ఒక పెద్ద కుదుపుతో, హాహాకారంతో ఆగిపోయింది రైలు.

దాదాపు ఐదారుగంటలు.... అటు అడవి, ఇటు ఊరు మధ్యలో....

సగం రైలుజనం దిగారు. నానాగందరగోళం.... అంతటి జనారణ్యంలో వీళ్ళిద్దరూ మరింత సన్నిహితులైపోయారు.

ఆ కాస్త పరిచయంలోనే, విపరీతమైన పరిశీలనా జ్ఞానం ఉన్న వరూధినికి, అతనుకూడా ఏదో తెలియని ఒంటరితనంతో బాధపడుతున్నాడనిపించింది. కానీ అతడు ఎక్కడా బైటపడటంలేదు.

పొద్దుపోయినతర్వాత రైలు కదిలింది. అలసిపోయిన ప్రయాణీకులు నిద్రకు జోగుతున్నారు.

ఆమె, అతను మాత్రం మేలుకొనేవున్నారు.

"మేడం!"

"ఊc."

"మీకు పామిస్ట్రీ చెప్పనా?" చాలా ఉత్సాహంగా అడిగాడతను.

"ఈ డిమ్ లైట్లోనా?"

"భలేవారే.... రేఖలు నాతో మాట్లాడతాయండీ!"

నవ్వుతూ చెయ్యి చాచింది ఆమె.

"వెరీగుడ్...." ఫుల్ హాండ్స్ పైకి మడుస్తూ చాలా ఉత్సాహంగా ముందుకు వంగి ఆమె చేతిమీద టార్చివున్న బాల్‌పాయింట్ పెన్ను ఫోకస్ చేస్తూ చూస్తున్నాడతను.... అతని చేతికివున్న రవ్వల ఉంగరం చటుక్కున మెరిసింది.

"ఎవరితనూ?" ఒద్దన్నా మనసు ఆలోచిస్తోంది.

"మీరు చాలా సెంటిమెన్టలిస్ట్! అవునా?"

"నిజమే." నవ్వేసింది.

"ఏ చిన్న బాధకూడా పెద్దదిగా చేసేసుకుని, ఎదటివాళ్ల ఆలోచనలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి, అది మీలోమీరే ఇముడ్చుకుంటారు... అవునా?"

చటుక్కున తలెత్తిచూసింది.

ఆ చూపులో తెలియని చురుకుతనమున్నది. హాయిగా నవ్వేశాడతను.

"క్షమించండి మేడం!... మీ "ఎగో" దెబ్బ తీసినట్లున్నాను. మంచి స్నేహితుడిగా మిగిలిపోవలసినవాణ్ణి అలా చేసుండకూడదేం?"

"ఉ.... ఇంకా....?" నవ్వుతూ అన్నది.

"మీకు కోపం రాదంటే చెప్తాను...."

"ఫరవాలేదు...."

"అందులో రెండు మూడు పొగడ్తలు కూడా ఉండచ్చు..." చాలా సీరియస్‌గా, కొంచెం చిలిపిగా అన్నాడతను.

మాట్లాడలేదు... నవ్వాపుకుని తలెత్తి చూసింది ఆమె.

"మీరు చాలా ప్రత్యేకమైన వ్యక్తి... మీ టేస్ట్, మీ మాటలు, మీ చూపులు, మీ జీవితం.... అది బాధాకరమైనప్పటికీ, చాలా చాలా అద్భుతంగా ఉంటుంది."

చెయ్యి చూస్తూ చెప్పేస్తున్నాడతను. అరిచేతిలో అతని బాల్‌పాయింట్ పెన్ను ఒకరకమైన గిలిగింతలు పెడుతోంది.

ఒంట్లో సన్నటి ఒణుకు వచ్చింది.

ఎవరితను? ఈ రైలు కదుపులో, చుట్టూ చీకటి, నీలిరంగు దీపకాంతి తప్ప మరేం లేనిచోట, ప్రపంచమంతా నిద్రపోతున్నవేళ... ఏం జరుగబోతోంది? సాటి ప్రయాణీకుడైనవాడు తన మాటలతో, చేతలతో అతి దుఃఖభాజనమైన, ఎడారి అయిన ఆమె జీవితంలోకి మాధుర్యపు జల్లులు కురిపిస్తున్న ఇతనెవరు?

"మీకు మొనాటమీ ఎందుకో తెలుసా మేడం?"

ఉలిక్కిపడి 'ఎందుకు?' అన్నట్లు కళ్ళతో ప్రశ్నించింది.

"అదెవరూ గుర్తించరనే...."

సన్నగా నవ్వేసింది ఆమె.

"మీ పర్సనల్ లైఫ్ నాకు తెలియదు. కానీ మీరు అంటే ఏమిటో ఎవరికీ తెలియదు. అదిమాత్రం తెలుస్తోంది...."

రాత్రి పన్నెండుగంటలు... చలికాలం... ఒంటినిండా చీర కప్పుకుని ఒద్దికగా కూర్చున్నట్లుంది ప్రకృతి... బైట చుక్కలమధ్య చంద్రుడు సాక్షిగా వస్తున్నాడు ఈ పరిచయానికి.

అతని గొంతులో ఒక స్థాయి, సాత్వికత ఉన్నాయి. ఆ మాటలు పన్నీరు పుష్పాల్లాగా, చల్లదనంతో, తెలియని పరిమళంతో కేవలం వింటున్నవారికి వినాలనిపించేవే అర్థమయ్యేట్లున్నాయి.

'విచిత్ర వ్యక్తి'

"ఈ ఫ్రస్ట్రేషన్‌తో కొన్నాళ్ళకి మీరు పిచ్చివారైపోవచ్చు. మీకు మీమీదే చాలా కోపం ఉంది.... అందరిలా బ్రతకలేకపోవడంవల్ల, ప్రపంచంతో రాజీపడలేక పోవడంవల్ల వచ్చే కసివుంది. అవునా?..." సీరియస్‌గా చెప్పేసుకుంటూ పోతున్నాడతను.

నిజం ఆ మాట... ఎలా తెలుసు ఇతనికి? ఎవర్నీ ఏమీ చెయ్యలేక తన ఆలోచనల ధాటికి తట్టుకోలేక, తనను తాను శిక్షించుకుని, హింసించుకున్న రోజులున్నాయి.

ఎలా చెప్పగలుగుతున్నాడు? ఫ్రాయిడ్‌లాంటి సైకో ఎనాలిసిస్టా?.... కాలి అంజనం పారేసుకుని, ఖర్మకాలి భారతదేశపు రైల్లో ప్రయాణంచేస్తున్న ప్రవరాఖ్యుడా? కానీ ఇతని చురుకుదనం అతనికెక్కడిది? ఉంటే స్వారోచిష మనుసంభవం మరోరకంగా పరిణమించేది.

బెథోవెన్ సంగీతంలా, ఆస్కార్ వైల్డ్ కొటేషన్లా.... ఒక మత్తులో పడేస్తున్నాడు. అతని వంకే చూస్తూ, చెంపన చెయ్యిపెట్టుకుని ఆలోచిస్తోంది ఆమె.

"మేడం! ... మీరు కొంచెం కిందికి చూస్తే నా పని సులువౌతుంది... మీవి ఎక్స్‌రేల్లాంటి కళ్ళు... Most unforgetable eyes.... ఎదటి మనిషిని మాట్లానియ్యవవి...."

ఉలిక్కిపడి చటుక్కున కిందికి చూసింది.

ఆమె అర్థంకాని అడవిలో, హరిచందన సుగంధాల మధ్య గురివిందగింజల పొదరింట్లో చిక్కుకుపోయినట్లుగా ఉంది.

"మనసా? నువ్వెంత భయంలేనిదానివి?" కోప్పడింది ఆమె.

"మీ జీవితం హాయిగా ఉండాలంటే చిన్న ట్రిక్ ఉంది మేడం!... వెరి సింపుల్ ట్రిక్...."

"చెప్పండి..."

"లవ్ దై సెల్ఫ్"

"ఆఁ!" అన్నది ఉలిక్కిపడి.

"అదేమిటండీ, అలా ఉలిక్కిపడతారు? నేనేదో ఎట్టెదటవున్న మొట్టమొదటి వ్యక్తిని ప్రేమించెయ్ అన్నట్లు... మిమ్మల్ని మీరు ప్రేమించుకోవటం నేర్చుకోండి ముందు... కొంత ఓదార్పు వస్తుంది.... మీ మీద మీకు పెరిగిన ప్రేమ, మీలాంటి మనిషిని బ్రతకనిస్తున్న ఈ ప్రపంచం మీదికి విస్తరిస్తుంది. మీరు చాలా తెలివిగలవారు. పైగా, నాకు అర్థమైనంతలో చాలా దెబ్బతిన్న వ్యక్తి... అవునా?"

మాట్లాడలేదామె.... రెండేళ్ళ పసిబిడ్డతో, మొగుడు ఒదిలేసిన ఆడదని ముద్రపడి, భయంకరమైన సాంఘిక కట్టుబాట్లున్న వ్యక్తులమధ్య బ్రతుకుతున్న ఆమె ఏం మాట్లాడగలదు?

"అందుకే మీ ప్రేమను ఉచ్చుచేసి మనిషిని బాధపెట్టరు...."

ఇబ్బందిపడిపోతోంది ఆమె.... చాలా మామూలుగా, కొంచెం మందలిస్తున్నట్లుగా ఏదో బిజినెస్ వ్యవహారాలు చెప్తున్నట్లుగా మాట్లాడుతూ అతను పొగడ్తలతో అభిషేకం చేస్తున్నాడు.

అది తప్పించుకోనూ లేకుండా ఉన్నది... ఇష్టపడలేకుండానూ ఉన్నది.

బైటకు చూసింది కిటికీలోనుంచి...

ఉషస్సు రెక్కలు విప్పుకొంటున్నది... మరొక నాలుగు అయిదుగంటల్లో గమ్యస్థానం చేరుకుంటాము. అప్పుడు ఇతనెక్కడో.... నేనెక్కడో?....

"మీకొక డిఫెక్ట్ ఉన్నది..." పెన్ను బుగ్గకానించుకుంటూ అన్నాడు.

గభాల్న కనుబొమలు ముడిపడ్డాయి. సీరియస్‌గా చూసింది.

"మీరు రేపటి గురించిన భయాల్తో, ఇప్పటిక్షణాన్ని చెయ్యిజారవిడుచు కుంటారు.... అవునా?"

నీలిరంగుకాంతిలో ఒక కిరణం అతని జుట్టుమీద నుంచి వక్రీభవించి, కనురెప్పలమీదుగా జారి, పెదవి నునుపుమీద నిలిచింది. చాలా ఉత్సాహంగా, చిన్న పిల్లాడిలా ఉన్నాడతను.

"ఫ్యూర్ షాక్" చదివారా?"

"లేదే?"

"అమ్మయ్య! ఇప్పటికి మాట్లాడారు... అదయినా నేను మాట మారిస్తే... అబ్బే....చాలా మంచిగా కనిపించే మీలో బొత్తిగా ఎదుటివారి అనుభూతులపట్ల సానుభూతి లేదు మేడం!... ఒ.కే. అది చదవాల్సిన పుస్తకం...."

"అవును... విన్నాను.... నాకు దొరకలేదు."

"నా దగ్గర ప్రస్తుతం ఒకటే కాపీ ఉన్నది... నేను కొని పంపుతాను... అడ్రసివ్వండి....."

చాలా మామూలుగా డైరీ తీస్తూ అన్నాడతను.

అంతరాంతరాల్లో ఈ క్షణం కోసమే ఎదురుచూస్తోంది ఆమె. ఈ చక్కటి స్నేహపరిమళానికి ఒక ముద్రవేసి, దాన్ని పెంచి.... పెద్ద....

"నేనొక విషయం చెప్పనా?" సూటిగా చూస్తూ అన్నది.

"అరె బాప్‌రే... అంతకన్నానా? నేను బోలెడు విషయాలు చెప్పేశాను అప్పుడే...."

ఆమెకు నవ్వు వచ్చింది... పెదవి నొక్కిపెట్టి ఆపుకున్నది. అటే చూస్తున్నాడని తెలుసు ఆమెకు. అందుకే ఎటో చూస్తూ....

"మన ఈ పరిచయం... ఎందుకో తెలియదు - స్నేహంగా మారింది... అవునా.... దీన్ని ఇలాగే ఉండనివ్వండి...." దెబ్బతిన్నట్లు చూశాడతను.

ఆమె గమనించనట్లుగా మాట్లాడింది.

"రేపు అన్నది చాలా చెడ్డ నాకెప్పుడూ... నన్ను ఇంత బాగా స్టడీచేసిన మీరు రేపు నాకు పరిచయస్థులై, స్నేహితులై... ఆ తర్వాత మీతో స్నేహానికి నా ఇంటి పరిస్థితులు అనుకూలించకపోతే.... అస్సలు భరించలేను నేను... అర్థమౌతోందను కుంటాను మీకు...."

రెండు అరిచేతుల మధ్య మొఖం పెట్టుకుని వింటున్న అతను తలకాయ ఊపాడు.

"పోనీ! నా అడ్రస్..." ఒక్క క్షణం తరువాత అన్నాడతను.

"నో ప్లీజ్... అడ్రస్ తెలిసీ, మిమ్మల్ని కలుసుకోలేకపోవడం మరీ దారుణం.... తెల్లారిపోయినట్లుంది... వాష్ చేసుకుని వస్తాను..." టవల్ తీసుకుని, అతని వంక చూడకుండా బాత్‌రూమ్ పక్కకు వెళ్ళిపోయిందామె. కావాలనే స్టేషన్ దగ్గరపడేదాకా అక్కడ ఎవరితోనో మాట్లాడుతూ ఉండిపోయింది.

తిరిగి వచ్చేటప్పటికి అతను డ్రస్ ఛేంజ్ చేసుకుని మామూలుగా ఉన్నాడు.

ఆమెను చూడగానే, "వెరీగుడ్ మేడమ్ - మీరు చెప్పిన దాంట్లోనూ పాయింట్ ఉంది. ఇదుగో... నా జ్ఞాపకార్థం ఈ పుస్తకం అట్టేపెట్టేసుకోండి. వస్తాను, స్టేషన్ వచ్చేసింది..." అన్ని వస్తువులూ సర్దేసుకుంటూ అన్నాడు.

అతణ్ణి వెతుక్కుంటూ ఒక డ్రైవర్, మరొక పనివాడు వచ్చారు. ఇంతమంది మార్బలం ఉన్న వ్యక్తి ఇంత నిరాడంబరంగా, మామూలుగా స్లీపర్‌లో...

గబగబా నడుస్తూ, జనంలో కలిసిపోతూ, వెనక్కుతిరిగి ఒక్క క్షణం ఆమెను కళ్ళతో ఫోటో తీసి మనసులో దాచుకున్నాడేమోనన్నట్లు చూసుకుని వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయాడు.

మెల్లిగా చెయ్యి ఊపిందామె, కళ్ళల్లో ఉబికి వస్తున్న నీరు దాచుకుంటూ.

❀ ❀ ❀

ఇంటర్వ్యూ అయ్యి, తెలిసిన బంధువులింటికి వెళ్ళి, విశ్రాంతిగా అతనిచ్చిన పుస్తకం తీసింది.

అందులో ఎక్కడైనా అడ్రస్ రాశాడేమోనన్న ఆశ ఆమెకు తెలియకుండానే పుస్తకం వెతికిస్తోంది.

పేజీలు తిప్పుతూ ఆగిపోయింది.

ఉత్తరం....

"పేరు తెలియని మీకు?-

క్షమార్పణలు.

ఈ మాత్రం చనువుకూడా తీసుకోవడం మీకు ఇష్టం లేదని తెలుసు నాకు. కానీ, ఇదే క్షణంలో నేనెంత కుతూహలంతో బాధపడుతున్నానో అంతకి రెట్టింపు తపన మీకు ఉంటుందని తెలుసు నాకు.

కానీ, ఫ్రెండ్!.... మన పరిచయం ఇంతటితో ఆగిపోవాలని మీరు విధించిన ఈ శిక్ష... సామాన్యమైనది కాదు... కానీ జీవితంలో అత్యంత ఇష్టమైనవాటికి అతి దూరంగా బ్రతకడంలో ఉన్న బాధలో తెలియని ఓదార్పు ఉన్నది. దీన్ని మీరు ఏమన్నా అనండి.... "సినికల్ హాలోనెస్" కావచ్చు... ఇది నిజం.

మై పార్డన్స్ టు యు... నాకు అసలు పామిస్ట్రీ రాదు. కానీ, దాదాపు పదిగంటలు మిమ్మల్ని మీకు తెలియకుండా స్టడీచేసే అవకాశం వచ్చింది నాకు. ఎదటివారిని పుస్తకంలా చదవగల శక్తి భగవంతుడు నాకు ఇచ్చాడు. అదే నా పాలిట శాపంకూడానేమో.... ఎందుకంటే, నా చుట్టూ ఉన్న మనుష్యులు నటించే ప్రేమ, ఆప్యాయతల అసలు రూపాలు నాకు తెలిసిపోతూంటాయి. కొంచెం అజ్ఞానం, కొన్ని అమాయక సత్యాలు ఈ జీవితం ఇది అని చెప్పకుండా బ్రతకనిస్తాయేమో!

మేడం! నా గురించి కొంచెం చెప్పుకోవాలనుంది, మీరు అడక్కపోయినా... నాకు తెలుసు, ఒద్దనుకుంటూనే మీరు నా గురించి తెలుసుకోవాలనుకుంటున్నారు.

నేను నిన్న ఎ.సి స్లీపర్ దొరక్క మీ కంపార్టుమెంటులో ఎక్కాను... పుట్టిన దగ్గరనుంచీ నా జీవితంలో అడుగడుక్కి ఆడంబరాల మధ్యతప్ప ఉండకూడదన్నట్లు బ్రతికాను నేను. కానీ... కానీ, వీటిలో మొనాటనీ నన్ను అందర్నించీ విడదీస్తోందన్న భావం ఈమధ్య ఎక్కువైంది నాకు.

కారణం ఏమిటో తెలుసా? ఈ 28 ఏళ్ల జీవితంలో జీవన సత్యం చాలా ఆలస్యంగా తెలిసింది నాకు. అదేమిటంటారా?

ఆరునెలలకన్నా నేనుండనని... మేడం!... ఆశ్చర్యపోకండి... డాక్టర్లు చెప్పేశారు. నా రోగకారణాలు చెప్పి భయపెట్టను మిమ్మల్ని. విషయం ఏదన్నా అవ్వచ్చు. "నేను చచ్చిపోతాను" అని తెలిసిన తరువాత మనుషులు చాలా బాగా అర్థం అవడం ప్రారంభించారు నాకు... నా పేరన ఉండే షేర్లు, నా కార్లు అప్పుడే మానసికంగా పంచేసుకుంటున్నారు. మా వాళ్ళు. పైకి మాత్రం నీకేం తక్కువ - మేమున్నాము అన్నట్లు ప్రవర్తిస్తారు. ఈ తెచ్చిపెట్టుకున్న అరిస్టోక్రసీతో మనిషి పడే బాధ ఇదే మేడం!... వీళ్ళకు దేనిమీదా నమ్మకం లేదు... అన్నింటినీ అందరికోసం నటిస్తారు... ఎందుకు చేస్తారీ దురదృష్టం? అనుభవిస్తే తెలుస్తుంది. మా ఇంట్లో వారానికి ఒక డిన్నరు జరుగుతుంది. వందమంది వస్తారు. ఏ ఒక్కరూ గట్టిగా మాట్లాడరు.... హాయిగా నవ్వరు.... ఆడవారైతే మరీ అన్యాయం... కాగితం పూవులే... లేటెస్ట్ మూవీ, పిల్లల ఆరోగ్యం, ఎన్ని కిలోలు తగ్గారు - ఇలాంటి కొలత ప్రకారం పలకరించుకోవడానికి కొన్ని మాటలుంటాయి. ఎన్నిసార్లు విన్నా ఇవే....

ఒకప్పుడు నేనూ వీరిమధ్య మనిషినే.... ఈ ప్రపంచం నుంచి శాశ్వతంగా సెలవు తీసుకుంటున్నానని తెలిసినప్పటినుంచీ, ఇదంతా భరించలేకపోతున్నాను.

మనస్ఫూర్తిగా మాట్లాడేవాళ్ళు కావాలనిపిస్తోంది. ఈ స్థితినుంచి మమ్మల్ని ఎవరూ రక్షించలేరు.

అల్లాంటి నాకు మీరు రైల్లో చాలా విచిత్రంగా ఎదురయ్యారు. సాయంత్రం రైలు ఆరుగంటలు ఆడవిలో ఆగిపోయినప్పుడు మిమ్మల్ని పరీక్షగా చూస్తూ కూర్చున్నాను. తోటివారి పట్ల మీకు సహృదయత, కబుర్లు, మీరు... ఇదంతా ఏదో సృష్టిలయలో భాగంగా... అనిపించింది... హాయిగా మాట్లాడుతూ, హాయిగా నవ్వుతూ ఉన్న మిమ్మల్ని చాలా స్టడీ చేశాను.... మీ నవ్వే కళ్ళ వెనక నైరాశ్యం, బెదురు చాలా చెప్పాయి నాకు.... అందుకే పామిస్ట్రీ అంటూ నేను మీ గురించి చెప్పినదంతా సైకలాజికల్ స్టడీ... కంగ్రాట్యులేట్ మీ....

ఇంక చక్కటి స్నేహాన్ని మీరు మామూలుగా ఆలోచించి ఆపుచేశారు. కానీ మేడం.... ఒక్క సలహా.... మృత్యు ముఖంలో ఉన్న నేను మీకు మంచి స్నేహితుడిగా ఒక మాట చెపుతాను:

మిమ్మల్ని మీరు మరీ అంత బాధ పెట్టుకోకండి... ముందు మిమ్మల్ని మీరు ప్రేమించుకోండి. మీలాంటి వ్యక్తిని బ్రతకనిస్తున్న ఈ ప్రపంచాన్ని ప్రేమించండి. దాని తప్పుల్ని చూసి జాలి పడండి. క్షమించడం వస్తే ప్రపంచంలో ప్రతిదీ ప్రేమించ తగ్గదిగా అనిపిస్తుంది మేడం.

ఈ అంతిమ ఘడియల సంగతి అయిదేళ్ల క్రితం తెలిసింది నాకు. అప్పటినుంచీ మృత్యువును అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాను. After death what happens? అని చాలా చదివాను. జీవితం అందరికీ సుదూర ప్రయాణం. ఈ ప్రపంచంలో గడిపే కొద్ది రోజులూ ఒక మజిలీ లాంటిది. అది తెలిసిన తరవాత మృత్యువు గురించి అంత బాధగా లేదు.... నా ఈ చిన్న మజిలీలో మీ పరిచయం ఒక అందమైన పిక్నిక్ లాగా అనిపించింది.

అంతిమ ఘడియల్లో ఇష్టమైనవారు దగ్గరుండాలనిపిస్తుంది. కానీ అడ్రస్ ఇవ్వనని మీరు నాకు ఆ అవకాశం కూడా దూరం చేశారు. తీరని కోరిక ఉంటే మరొక జన్మలో మనకు ఇష్టమైనవారి దగ్గర పుడతామట... చూద్దాం.... నేను సహజంగా ఆశాజీవిని.

చచ్చిపోతూ కూడా ఆశలో బ్రతికే నన్ను చూసి నవ్వుకోకండి మేడం.... గుడ్‌బై మై ఫ్రెండ్.... విత్ రిగార్డ్స్

ఒణికిపోయింది వరూధిని... ఆమెకు తెలియకుండానే ఆ ఉత్తరం గుండెలకు ఆనించుకుని వెక్కి వెక్కి ఏడ్చింది..... మృత్యుముఖంలో ఉన్నాడా అతను?!

ఆ విషయం తెలిస్తే? తెలిస్తే ఏం చేసేది?! తింటున్న మెతుకు మెతుక్కు పరాధీనమైన బ్రతుకుతో, అడుగడుక్కు కట్టుబాట్ల పేరుతో ఉరివేస్తున్న తన సాంఘిక పరిస్థితుల మధ్య ఇతని చనువు ఎంత దూరం పోతుందోనని భయపడి.... ఈ అందమైన స్నేహాన్ని చాలా చాలా మామూలుగా ఆలోచించి ఆపుచేసింది.... నిజమే.....

కానీ.....

ఆ రోజు నుంచీ వరూధిని జీవితాన్ని తెలియకుండానే ఆ అపరిచిత శ్రేయోభిలాషి ప్రభావితం చేశాడు. ఆమెలో ఆమెజీవితంలో చాలామార్పు, ఆత్మస్థైర్యం. జీవితం పట్ల ఆసక్తి పెరిగాయి. జీవితాన్ని ప్రేమించింది. తద్వారా, చుట్టూ ఉన్న ప్రపంచం కొంచెం ఆకుపచ్చగా, అందంగా కనిపించింది. అకారణ కోపం, ఉక్రోషం, తన మీద తనకు కచ్చ పోయాయి. అలా శిథిల శిల్పం లాంటి ఆమె జీవితాన్ని, తెలియకుండానే నగిషీలతో ఒక అద్భుత కళాఖండంగా మార్చుకున్నది.

కానీ ఏ వెన్నెలవేళో, ఆకాశంలో చుక్కలు లెక్కపెట్టుకుంటూ, 'అజ్ఞాన స్నేహితుడా! ఎక్కడున్నావు నువ్వు?' అని కదిలిపోతున్న మేఘాలను, సుదూర తీరాల్లో రాలిపోతున్న నక్షత్రాల్ని చూస్తూ అడుగుతూనే ఉంటుంది ఆమె.

❀ ❀ ❀

"ఎందుకు మామ్మా, కళ్ళంబడి నీళ్లు? ఏమిటి ఆలోచిస్తున్నావు?" తలార బెట్టుకుంటూ వచ్చింది ప్రజ్ఞ.

"ఏం లేదమ్మా! జీవితం గురించి... దశాంగం పట్రా... పొగ వేస్తాను..." అన్నది వరూధిని.

ఆమెనే చూస్తూ ఆలోచిస్తూ లోపలికి అడుగువేసింది ప్రజ్ఞ.

*(ఉదయం - 27-11-1986)*

# స్థితప్రజ్ఞత

అది ఒక పెద్ద బంగళా... ఎక్స్‌పోర్ట్ గార్మెంట్సు బిజినెస్‌లో లక్షలు ఆర్జించిన వారి బంగ్లా అది. అందులో పనిచేస్తున్న పనివాళ్లని వాళ్ల చుట్టూ ఉన్న గుడిసెల వాళ్లు "బంగళా పని" వాళ్లని మహా మర్యాద యిస్తారు. పండగలు, పబ్బాలు, పుట్టిన రోజులు జరిగిననాడు ఆ యింటి నుంచి తెలిసి అమ్మగారు ఇచ్చేవి తెలియకుండా వంటవాడు మెహర్బానీకి ఇచ్చేవి - యిలా అన్ని రకాల ఆహారపదార్థాలూ అక్కడ పది పదిహేను గుడిసెలకు చేరుతూ వుంటాయి. దానికి కారణం పనివాళ్ల ఔదార్యంకన్న తామెలాంటి హోదావున్న ఇంటిలో పనిచేస్తున్నామో తమ చుట్టూ వున్న పనివాళ్లకి తెలియచెప్పాలనే తపన కావచ్చు. ఏ లెవెల్‌కు ఆ లెవెల్ 'ఎగో' వుంటుంది మరి.

ఆ రోజు రాత్రి ఎనిమిదిన్నరకి బంగళాలో పంచాయితీ జరుగుతోంది.

కారు డ్రైవరు సుబ్బారావు తలకాయ వంచుకుని నిలబడి వున్నాడు.... పరిశీలిస్తే, అతను తప్పు చేసినందుకు తల వంచుకోలేదని, తప్పనిసరి పరిస్థితుల్లో అనవసరంగా మాట్లాడడం యిష్టం లేక మౌనంగా వున్నాడని అర్థమౌతుంది మనకి.

"అయినా నీకు యిలాంటి దుర్బుద్ధి ఎలా పుట్టిందయ్యా?... చేరేటప్పుడు కాళ్లు, గడ్డాలు పట్టుకుని చేరటం, కాస్త అయినింటి వంటకాలు వంటబట్టగానే యిదిగో యిలాంటి వెధవ బుద్ధులు, ఎవత్తె అది? ఎట్లాంటి సంబంధం నీకూ దానికీ? నిన్నే నువ్వు పోషించుకోలేవు. నీకొ..." ఆ యింటి అమ్మగారు స్థూలకాయం కుర్చీలో యిరికించి, కూరుకుపోయిన మెడలో చంద్రహారాలు సవరించుకుంటూ కాస్త గట్టిగానే గద్దిస్తోంది.

పెద్ద బొట్టు. ఐదు వేళ్ల వెడల్పు జరీ చీర, రెండు చేతుల నిండా బంగారు గాజులు ఆవిడ ఆ మాత్రం దబాయించకపోతే ఈ ఆరుగురు పనివాళ్లూ వుంటారా? అనుకుంటున్నారు కొత్తగా చేరిన తోటవాళ్లు.

సుబ్బారావు తలకాయ ఎత్తి ఒకసారి సూటిగా చూసి అలవోకగా మళ్లీ తల వంచుకున్నాడు. అతని చూపు, దాని అర్థం ఏమిటో కనుక్కోవలసిన అగత్యం అమ్మగారికి లేదేమో కానీ, సుబ్బారావు నైతిక పతనావస్థ గురించి మెహర్బానీ కోసం అమ్మగారికి చెప్పిన, అయ్యగారి అసిస్టెంట్ నరసింహం మాత్రం కొంచెం ఉలిక్కిపడ్డాడు.

"అదెవర్తో దిక్కులేంది... పోనీండమ్మా, తెలియక చేశాడు...." సర్దేద్దామని ప్రయత్నించాడు.

"నరసింహం!" కొంచెం తీక్షణంగానే అన్నాడు సుబ్బారావు. ఆగిపోయాడతను ఆ గొంతు విని. కాని అమ్మగారు వదిలిపెట్టలేదు ఆ విషయాన్ని. మరింత పెద్ద గొంతుతో ఝుంఝూమారుతంలా ఝాడించి వదిలిపెట్టింది. ఒక అరగంట యింట్లో గాలి దుమారం లేచింది. నీతి, అవినీతి, వెధవ బుద్ధులు, ముఖం చూస్తేనే పాపం చుట్టుకోవడాలు - ఇలా చాలా మాటలు దొర్లాయి.

ఏం మాట్లాడలేదు సుబ్బారావు.

"అసలు నీకు దేవుడంటే భయం, పాపభీతి ఛస్తేగా!" క్లైమాక్స్‌కు వెళ్లిపోతున్నాయి ఆవిడ మాటలు

అంతకు ముందురోజు అభిషేకం చేయిద్దామని దేవాలయానికి వెళితే, అయ్యగారు వున్నారన్న భయమన్నా లేకుండా, లోపలకి రాను అన్న సుబ్బారావు, యింట్లో ఆర్భాటంగా తను వ్రతాలు, నోములు నోస్తే నిర్లక్ష్యంగా అతను చూసే చూపు... యివన్నీ చాలా రోజులుగా అమ్మగారి కడుపులో కాలుస్తున్నాయి. "ఏదన్నా భరిస్తాను కానీ, దైవచింతన లేకపోతేమాత్రం...." అని చేతులు ఝాడించుకుంటూ ఆమె చెప్పే మాటలు చాలామంది నోరు తెరుచుకుని వింటూ వుంటారు.

"అయ్యగార్ని చూడు - ఆ భక్తి, ఆ పూజ, అందుకే ఆయన అంత ఐశ్వర్యంతో, అంత సలక్షణంగా వున్నారు. మీరు దరిద్రంలో ఇట్లా..." విపరీతమైన నీతిభక్తి అక్షరం అక్షరంలోనూ మందుతూందేమో!

"ఆయనెందుకు మధ్య.... " అంత వేడిగానూ అక్షరాలను ఒత్తి పలుకుతూ జేబులో తాళాలు తీసి టేబులుమీద పెడుతూ అన్నాడు సుబ్బారావు.

"ఎవర్ని, అయ్యగార్నే!..." అతని చర్యకు కాస్త ఉలిక్కిపడుతూ అన్నదా యిల్లాలు.

"కాదు, భగవంతుణ్ణి! నేవస్తానమ్మగారూ... వేరే డ్రైవరును చూసుకోండి...."

గుండె గతుక్కుమంది అమ్మగారికి. అసలే ఆవిడ దగ్గర ఏ డ్రైవరూ రెండు నెలలకన్నా ఎక్కువ పనిచేయలేరని ప్రతీతి. కారణం ఆవిడ దగ్గర చెయ్యి చాచి జీతం తీసుకునేవాళ్లందరూ 'దేహి' అంటున్నారనుకుంటుంది. కానీ, వాళ్ల పని, తనిచ్చే జీతం సమానమని ఆమె ఎప్పుడూ ఆలోచించలేదు.

"మేమే నయం... పనిచేస్తున్నాం, డబ్బులు తీసుకుంటున్నాం. నీ సంగతేమిటి? నువ్వు తాళి బొట్టు కట్టించుకుని లక్షలు అనుభవిస్తున్నావు.... నువ్వేం చేస్తున్నావ్?" అని, ఎడాపెడా అడిగిపోయింది రేచులాంటి పనిపిల్ల. మరి దాన్ని ఆమె అనకూడని మాటలన్నీ అంది.

గతిలేనితనం దొంగతనానికి, దిక్కులేనితనం రంకుతనానికి అంటగట్టడం ఆవిడ కేటగిరీ మనుష్యులకు అలవాటు మరి!

కానీ, ఆవిడ యిప్పుడు సుబ్బారావు పద్ధతి చూసి ఉలిక్కిపడటానికి కారణముంది. అతను వచ్చి ఆరు నెలలైంది. ఒక్క కంప్లైంట్ లేదు. ఎదురుచెప్పడు.

మనిషి చదువుకున్నవాడేనని వింది. కాని ఆ మాట బైటకు ఎప్పుడూ అనడు. ఆవిడ హజానికి అతను ఏనాడూ అడ్డూ రాలేదు. తమాషా, ఏమిటంటే, భర్త కూడా అతన్ని గౌరవించడం చూసి ఆమె భయపడేది కూడా.

అటువంటివాడిని, ఏదో నరసింహం వచ్చి ఎవర్తెనో అనాధను తన గుడిసెలో పెట్టుకున్నాడన్నమాట వినగానే, అనవసరంగా తొందరపడ్డానేమోననిపించింది ఒక్క క్షణం ఆవిడకు.

అడుగులో అడుగు వేసుకుంటూ గేటు తలుపు తెరచి వెళ్లిపోతున్న సుబ్బారావుని చూస్తూ నిలబడిపోయింది అమ్మగారు.

❀ ❀ ❀

"ఇప్పుడు చూడు... నా వల్ల నీ ఉద్యోగం పోయింది...."

తలుపుకు అలవోకగా ఆనుకుని నిలబడ్డ రమణమ్మను చూశాడతను.

నవ్వొచ్చింది సుబ్బారావుకు.

"ఎవరు చెప్పారు పోయిందని?...."

"మరి?"

"ఇంకాసేపట్లో కబురొస్తుంది... వెళతాను...."

"అంత ధైర్యం ఏమిటి నీకు?" ఇంతింత కళ్లల్లో, ఆ మాటల్లో అతనిపట్ల ఆమెకు ఉన్న ఆరాధన, గౌరవం. అది ఖరీదుకు ఆడదాన్ని కొనుక్కునే ఏ మగవాడికీ ఎప్పటికీ అర్థంకానిది.

"ధైర్యం ఏముంది? వాళ్ల అవసరం... నా సొంత ఆలోచనలు, వ్యవహారాల్లోనూ కల్పించుకోనంటే నాకూ అభ్యంతరం లేదు... అంతే... నాలాంటి డ్రైవరు వాళ్లకు కావాలి. ఇప్పటిదాకా మర్యాదగా చూశారు కాబట్టి నాకూ అభ్యంతరం లేదు... కారణం ఇలాంటి సమస్యలు వ్యక్తుల వల్ల కాదు, వ్యవస్థ వల్ల వచ్చినవి కాబట్టి ఎక్కడా తప్పవు. కాదూ కూడదంటే నాకు వేరే ఉద్యోగం దొరక్కపోదు. చూద్దాం!" ఆలోచిస్తూ అన్నాడతను.

మాట్లాడకుండా గుడిసె లోపలికి వెళ్ళిపోయింది రమణమ్మ. అటే చూశాడతను. రోడ్డు లైటు నీడ మెరుస్తున్న ఆమె నడుం మీద ప్రతిఫలించింది వెలుగు చారలా... ఆమెలో లావణ్యం కన్న ఆ మనిషిలో లాలిత్యం మెరిసినట్లనిపించింది అతనికి.

ఆరు బయట మంచం మీద తలకింద రెండు చేతులూ పెట్టుకుని పడుకున్న అతని చూపులు చుక్కల్ని చూస్తూ గతాన్ని చీలుస్తున్నాయి.

❀ ❀ ❀

ఆరు నెలల క్రితం... అయ్యగారి ఫ్యాక్టరీలో రోజు కూలీకి వచ్చింది రమణమ్మ. ఆమె స్వతహాగా కూలీ మనిషికాదు. ఆ మాటకొస్తే అదొక కులం, జాతి,

వర్గం కాదు. రాజకీయాలు, అవగాహన లేని ఆర్థిక వ్యవస్థ యిలా కుటుంబాలను తల్లకిందులు చేసి కూలీ వాళ్ళుగా మార్చేస్తుంది. ఒక్క మనిషి సంపాదిస్తుంటే, ఆరుగురు కూర్చుని తినే అవకతవక పరిస్థితి తెచ్చే సాంఘిక, నైతికమైన మార్పులు సామాన్యమైనవి కావు. కానీ ఆ విషయం మరొక తరం ఆర్థిక శాస్త్రవేత్తలు చెప్పేదాకా ఈ తరం వుండరు మరి.

ఎలిమెంటరీ స్కూలు మాస్టారు మూడో కూతురు రమణమ్మ. కష్టపడి, అప్పులు చేసి పెళ్లి చేశాడు పై ఇద్దరమ్మాయిలకు. ఒక పిల్ల అత్తింటి బాధ పడలేక పారిపోతే, మరొక అమ్మాయి కట్నం చెరకు బలైపోయింది. తెచ్చిన అప్పు తీర్చనేలేదు, చేసిన పెళ్లిళ్ల అవలక్షణాలకి గుండాగి చచ్చిపోయాడాయన.

మూడవ కూతురు రమణమ్మ. సెవెన్తు క్లాసు దాకా చదివిన రమణమ్మ, 18 ఏళ్ల యవ్వనం ఒద్దన్నా సుకుమారాలు శరీరానికి సంతరించుకున్న రమణమ్మ... సంపాదిస్తే కానీ... తప్పని పరిస్థితిలో అయ్యగారి ఫ్యాక్టరీలో రోజు కూలీకి అడుగు పెట్టింది.

చాలా మందిలాగానే, ఒక రోజు చీకటి రాత్రి, రాయల్ సెల్యూట్ బాటిల్‌కి సెల్యూట్ చేసిన అయ్యగారికి ఆహుతి అయిపోయింది. ఆర్థిక సమస్య, పరిస్థితుల ఒత్తిడి, చాలామందిని అలా కాటేసి, చీకటి తెరల వెనకాల చిక్కదేట్లు చేస్తాయి. తప్పదు. కానీ అమాయకురాలు రమణమ్మ తన మీద అయ్యగారికి ప్రేమనుకుంది. అందలమెక్కిస్తారనుకుంది. కాదని తెలియగానే ఎదురు తిరిగింది. 'ఇది న్యాయమా?' అన్నది. 'నీ కూతురికి, నీ చెల్లెలికి ఇలా జరిగితే....' అని కథల్లో మాటలు మాట్లాడింది.

అది అయ్యగారి హజానికి, ఆయన కింది వందిమాగధులకు ఎదురు దెబ్బ. చావగొట్టి అసుర సంధ్యవేళ రోడ్డు మీదకు తోసేశారు.

అయ్యగార్ని తీసుకు వెళదామని వచ్చిన డ్రైవరు సుబ్బారావు క్రోటన్స్ పక్కన తెగిన పూలదండలా పడివున్న రమణమ్మ కళ్లబడింది. 'ఏమిటి?' అని వెంటనే అడగలేదు... ఎందుకో మెల్లిగా తెలుసుకున్నాడు... తనింట్లో ఆశ్రయం యిచ్చాడు.... ఇది అన్యాయం అంటూ ఎవరి మీదా ధ్వజమెత్తలేదు. ఆశ్చర్యపోయింది. రమణమ్మ.

"అయ్యగారు చేసిన అన్యాయం ఏమిటి అన్నది కాదు ఇప్పటి ప్రశ్న. కారణం డబ్బు, హజం, అట్లా చాలా పాపాలు చేయిస్తాయి ఆయనలాంటి వాడిచేత. నీకు నేను చెయ్యగలిగిన న్యాయం ఏమిటి? అన్నదే నా సమస్య..." అన్నాడు.

"నేను వెళ్లిపోతాను మా యింటికి." ఏడుస్తూ అభిమానంగా అన్నది రమణమ్మ. అతను ఓదార్చాలన్న కోరిక వుంది ఆమెలో.

"ఎందుకు? ఎలాగూ చెడ్డావు కదా.... అని నిన్ను వృత్తిలోకి దింపడానికా?" సూటిగా ఏమాత్రం వుద్రేకం లేకుండా అన్నాడు.

బెబ్బులిలా పడింది మీద... "ఏమనుకుంటున్నావు మా కుటుంబం గురించి?" అతని మొఖం నిండా గాట్లు,

మంట పుట్టిన చెంప మీద చెయ్యిపెట్టి రాసుకున్నాడు. తడైంది.... రక్తం.... సన్నగా నవ్వాడు అతను.

నాలుక కొరుక్కుంది రమణమ్మ. ఈ వారం, పదిరోజుల్లో తన కుటుంబం గురించి ఎంక్వయిరీ చేశాడతను అని ఆమెకు తెలుసు. రాత్రి తొమ్మిది గంటల వేళ ప్రతిరోజూ రిక్షాలో వెళ్లే తన చెల్లికి ప్లాస్టిక్ పువ్వు అని పేరు పెట్టాడనీ గుర్తుకు వచ్చిందామెకు.

తన తొందరపాటుకు క్షమించమన్నట్లు చూసింది. లోపలకి వెళ్లి గొబ్బరి నూనె తెచ్చి రాసింది. మాట్లాడలేదతను.

"మరి నన్ను ఇంట్లో పెట్టుకుంటే నిన్ను...." ఆమె గొంతులో మార్దవత్వానికి మరొకడైతే కరిగిపోయుంటాడు. కానీ అతను సుబ్బారావు. జీవితాన్ని చాలా ఏంగిల్స్‌లో చదివినవాడు.

"నువ్వు యిక్కడ ఖాళీగా వుండవు, వుండబోవు. వుంచి నిన్ను పోషించడానికి నేను నవాబునూ కాను. ఒకవేళ అయినా, అది నా పాలసీ కాదు...."

"అలా నీ మీద ఆధారపడటం నాకూ అసహ్యమే." మరొకసారి ఎదురు తిరిగింది ఆడపులిలా.... ఆ పంజా విప్పిన పౌరుషం ఎంతసేపు ఆగుతుందో అతనికీ తెలుసు.

మళ్లీ నవ్వాడతను.

"అదీ మంచి మాట.... నీకే కాదు ఎవరికైనా అది అసహ్యమనిపించాలి."

"అవకాశముంటే అందరూ అలాగే ఉంటారు...." ఆలోచిస్తూ అన్నది రమణమ్మ.

"ఉండరు. నిన్నే తీసుకోరాదూ ఉదాహరణకు. ఈ క్షణంలో నువ్వు ముట్టుకోగానే నేను కరిగి ప్రవహిస్తే నా చేత తాళి కట్టించుకుని, నా మీద ఆధారపడిపోవడానికి మానసికంగా సెటిల్ అయిపోయావు నువ్వు.. అది ఆధారపడటం అనుకోవు నువ్వు. కారణం అది పెళ్లి... అవునా?"

"ఛీ!" దూరంగా జరిగింది రమణమ్మ. కానీ, ఆమెకు తెలియకుండానే ఈ వ్యక్తి పట్ల స్పందన కలుగుతోంది. తలెత్తి అతణ్ణి చూసింది.

"నా తల్లి చక్కదనానికి కలెక్టరొస్తాడే...." అని చెప్పుకునేవాడు తన పిచ్చి తండ్రి. అవి గాలి మాటలని తెలిసినా దాని అర్థం ఆమె హోదాలో వుండాలనే.... కానీ ఇతడు? ఆర్థిక పరిధుల్లో అనామకుడు, సామాన్యుడు. కానీ మనిషి ఉన్నతుడు.

"నాన్నా! చచ్చి ఏ లోకాన వున్నావో నాకు తెలియదు. నిజంగా నీకు నా మీద ప్రేముంటే నాకు కలెక్టరు రావాలనీ, అయ్యగారులాంటివాడు కావాలనీ కోరుకోకు. హృదయము, ఆలోచన, తనలాంటి నలుగుర్ని ఉద్ధరించగల వ్యక్తి కావాలని కోరుకో.... నువ్వే కాదు - ప్రతి తండ్రి అదే కోరుకోవాలి నాన్నా!" కళ్లు మూసుకొని తనలో తాను ప్రార్థిస్తోంది రమణమ్మ. కానీ, కానీ... దేవుడులాంటి ఇతనికి తను....

"నేను చెడిపోయినదాన్ని...." కన్నీరు తుడుచుకుంటూ గభాల్న అన్నది.....

ఆమె ఆలోచనలు చదివినట్లు నవ్వాడతను. "ఆ మాటకు నా దృష్టిలో అర్థం లేదు. నేను చాలా జీవితం చూసినవాడిని, శీలం మనిషి ప్రవర్తన వల్ల వస్తుంది. దాన్ని శరీరానికి, గుప్పెడు బూడిదైపోయేదానికి అంటగట్టడం నా పద్ధతికాదు నేను పనిచేసే యింట్లో పెద్దమ్మాయి నా వంక చూసే చూపుల్తోనే ఆ పిల్ల శీలం ఏనాడో పోయిందని నా ఉద్దేశం. ఇవన్నీ నీ నీతుల పరిధికి అందవు... అర్థమైందా?"

మాట్లాడలేదు రమణమ్మ.... ఇంతంత కళ్లతో చూస్తోంది.

ఏమిటీ మనిషి? ఎన్నోసార్లు యితన్ని ఫ్యాక్టరీలో అంతకుముందు చూసింది. కానీ సూటు, బూటు, కారు, కళ్లజోడు వున్న అయ్యగారి ముందు తనకెవరూ కనిపించే వారు కాదు. తెలియకుండానే తన కళ్లల్లో అయ్యగారికి ఆహ్వానం వుండే, తనకీ గతి పట్టిందా? ఉలిక్కిపడింది రమణమ్మ.

ఇలా తను ఏనాడూ మామూలు పరిస్థితిలో ఆలోచించేది కాదు. ఈ మనిషి సన్నిధిలో తన తప్పు తనకు అర్థమౌతోంది. ఎవరితను?

"రేపు ఇన్‌స్టాల్‌మెంటు మీద నీకు మిషను కొనిపెడతాను. చుట్టు పక్కలవాళ్లకి కుట్టి పెట్టు. ఇద్దరికి పాఠం చెప్పు, ఇది నీకు సమ్మతమైతేనూ, సంతోషమైతేనే చెయ్యి. లేదా డబ్బు, అదిచ్చే సుఖం ముఖ్యమనిపిస్తే మాట్లాడకుండా నీ చెల్లెలు జీవితంలోకి వెళ్ళిపో నీతి, దేముడు, సంఘం - వీటికి నీ ఆకలి, నీ మనసు అక్కరలేదు. ఒక వేళ ఇవ్వాళ నా మెహర్బానీ కోసం నువ్వు నీ మనసు చంపుకున్నా, రేపైనా మనస్సు నీకు ఎదురు తిరక్కూడదు. బాగా ఆలోచించుకో. వెళ్లి పడుకో...."

మంచం మీద వెల్లికిలా పడుకుని వెన్నెలకు అడ్డమా అన్నట్లు కళ్ల మీద చేయి పెట్టుకుని పడుకున్నాడతను.

చుట్టూ గుడిసెల్లో తాగుబోతుల కోలాహలం. వెన్నెల ఏ యింట్లోకి ప్రవేశించడం లేదు. ఆడవాళ్ల కేకలు, పిల్లల ఏడుపులు, కుక్కల రొద....

గుమ్మం పట్టుకుని చాలాసేపు ఆలోచిస్తూ నిలబడింది రమణమ్మ. నిశ్శబ్దంగా కంచంలో అన్నం, పులుసు వడ్డించి, అతని ముందు పెట్టి, లోపలికి వెళ్లిపోయింది.

❀ ❀ ❀

"ఆ ఆడది ఎవరైతే నీకెందుకు? అతని పర్సనల్ విషయాలు మనకెందుకసలు? తీరి కూర్చుని అందరితో తగాదా నీకు. చాలా మంచివాడతను...." అయ్యగారు అమ్మగారు తగాదా వేసుకున్నారు - సుబ్బారావు యింటిలో వున్న "ఆడది" ఎవరో ఆయనకు తెలియకపోయినా.

"అలగా జనం, అలగా బుద్ధులు...." విసుక్కుంటూ వెళ్లిపోయింది లోపలికి అమ్మగారు - అలగా జనం, అలగా బుద్ధులు ఎవరివో తెలియకపోయినా.

అంతే! మర్నాడు బంగళా నుంచి సుబ్బారావుకు కబురొచ్చింది. మాట్లాడకుండా వెళ్లి పనిలో చేరాడతను.

❀ ❀ ❀

కానీ అమ్మగారు ఆ విషయాన్ని అంత తేలిగ్గా మర్చిపోయే వ్యక్తి కాదు. కూపీలు లాగింది కాలక్షేపానికి. అసలు విషయం తెలిసేటప్పటికి ఆ పిల్ల మీద కక్ష ఏర్పడిపోయింది. 'ఆమె అందగత్తేనా' అని వాకబు చేసింది. తన భర్త దోషం కన్న దానికి సుబ్బారావు ఆశ్రయం యివ్వడం భరించలేకపోయింది ఆమె ఇల్లాలితనం.

"చూడు.... మా వైపు నుంచి ఒక మంచి పిల్లను తీసుకు వస్తాను. పెళ్లి చేసుకో. పనిమంతురాలు, గుణవంతురాలు. అది మా యింట్లో పనిచేస్తుంది. నువ్వు డ్రైవరుగా ఉండు. ఇద్దరూ అవుట్ హౌసులో వుందురుగాని, చెడిపోయిందట - అది నీకెందుకు? ఆc! ప్రసాదం ఇందా, చెయ్యి పట్టు.,..." కాళ్లనిండా పసుపు రాసుకుని పట్టుచీరతో నిలబడ్డ ఆమెవంక సన్నగా నవ్వుతూ ఒక చూపు చూశాడు సుబ్బారావు.

అతని చూపుకు అప్పుడు ఆవిడకే అర్థం తెలిస్తే, "అయ్యగారు మీకు పనికిరాగాలేంది, రమణమ్మ నాకెందుకు పనికిరాదు అమ్మగారూ?" అన్న ప్రశ్నకు ఆవిడే కాదు, అందరు యిల్లాళ్లూ గజగజవణికి పోయుండేవారు. ఆ ప్రశ్న ఊహించకుండానే బ్రతికేస్తున్నారు కాబట్టే ఇంకా "పెళ్లి" అనే శిధిలాలయం కూలిపోకుండా మిగిలివుంది.

ఫ్యాక్టరీలో ఏవో ఉత్సవాలు చేశారు.... పెద్దవాళ్లంతా పార్టీలు చేసుకుంటే, వర్కర్లు అందరికీ అమ్మగారు పురాణ కాలక్షేపం పెట్టించారు. ఆ తినే డబ్బులు నాలుగూ మావూరివాడే తిననీ అని పుట్టింటినుంచి పిలిపించినాయన భగవద్గీత చెబుతున్నాడు, ఎవరికీ ఏ మాత్రం అర్థం కాకుండా....

"స్థితప్రజ్ఞుడు అంటే ఏమిటి?" సుబ్బారావు చెయ్యి పట్టుకుని కళ్లల్లోకి చూస్తూ అడిగింది రమణమ్మ.

డ్రైవరు పక్కన, పూచిన తంగేడులా ఎర్ర చీరతో, పెద్ద కుంకుమ బొట్టుతో, మెళ్లో పసుపుతాడుతో నిలబడ్డ ఆ అమ్మాయిని చూసి ఉలిక్కిపడ్డాడు అయ్యగారు.

"ఎవర్రా అది?...." నరసింహాన్ని అడిగాడు.

ఈ ప్రశ్న ఎప్పుడో ఒకప్పుడు వస్తుందని తెలుసు నరసింహానికి. కానీ, చిత్రం అయ్యగారికి మందునూ, మానినినీ సప్లైచేసే నరసింహంలో కూడా నరుడు నిద్ర లేచాడు. ఈ మధ్య సుబ్బారావుతో పరిచయం ఎక్కువైన తర్వాత తాము ప్రపంచానికి చేసే చెడుపును గురించి అతడు ప్రశ్నించలేదు. 'ఎందుకు ఇలా చేస్తున్నారు? మీ తలకాయలు నరకాలి...' అని ఎదురు తిరిగి అహంకార దర్పానికి అహుతి అయిపోలేదు. మౌనంగా, తాము పాడు చేస్తున్న ప్రపంచాన్ని తన పద్ధతిలో బాగు చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు. ఇదేం పని అని అడగలేదు. 'ఇది నా పద్ధతి' అని చెప్పాడు.

"పెళ్లి చెయ్యాలంటే బోలెడు డబ్బు కావాలి.... లేకపోతే పిల్ల పక్కదార్లు పడుతోందని భయం" అని ఒక రోజు కష్టం, సుఖం చెప్పుకున్నాడు సుబ్బారావుతో నరసింహం.

"పెళ్ళి చెయ్యదలచుకుంటే, యిచ్చే డబ్బుతో వాచీ, ఉంగరం, చెంబు యివన్నీ పెట్టకు – ఏ తాగుడో, పేకాటకో తాకట్టు పెడతాడు నువ్వు అనుకునే పెళ్ళి కొడుకు. కాదు కూడదంటే అసలు అలాంటివాడికి పిల్లనివ్వకు. ఆ డబ్బుతో ఏ కిల్లీ కొట్టో పెట్టించు.... యిద్దరూ కష్టపడి నాలుగు డబ్బులు కళ్ల చూస్తారు. పెళ్లి పేరుతో యిద్దరికీ ఖర్చు పెట్టుకోవడం నేర్పించడంకన్న సంపాదించుకోవడం నేర్పిస్తే, మంచిది...." అని సలహా యిచ్చాడు సుబ్బారావు.

కానీ, నరసింహం అందరి తండ్రుల్లాగానే వినలేదు. ఫలితం అనుభవించాడు. అందుకే ఈమధ్య అతడిలో జంతువు నిద్రపోయి, నరుడు నిద్ర లేస్తున్నాడు.

"పోన్లెండి బాబూ! వెధవ గోల... విషయం బయటకొస్తే బోలెడు గోల...." అన్నాడు సర్దేస్తున్నట్లు.

లౌక్యుడు అయ్యగారు... అందుకనే అర్థం చేసుకొని ఊరుకున్నాడు.

పెద్ద వెంకటగిరి చీరతో, రవ్వల నగలతో, ఆడంబరంతో, ఒక పెద్ద వివిధాలంకారాల బంగారు ధ్వజంలా వచ్చింది అమ్మగారు. ఆవిడ ఆశ్రయం కావాలనుకున్న వాళ్లందరి నమస్కారాల మధ్య తననే పరిశీలనగా చూస్తున్న డ్రైవరు పక్కన "అది" కళ్లబడింది ఆవిడకు. ఒళ్లు దహించుకుపోయింది. చుర చుర చూసింది. క్రూరత్వం ఆవిడ మొఖానికి వికారాన్నిచ్చింది. కానీ, ఆవిడ చూపు ఆశ్చర్యంగా మారింది. కాసేపటికి భయంకరంగా చూస్తున్న చూపు, భయంగా రెప్పలు వాల్చుకుంది.

ఆ మార్పు గమనించినవాళ్లు చాలా తక్కువమంది. సూక్ష్మగ్రాహ్యత వున్న సుబ్బారావు దృష్టి ఆ చూపును తప్పించుకోలేదు.

అదే అడిగాడు యింటికి వచ్చిన తరువాత రమణమ్మను – "ఎందుకలా అయిపోయింది ఆవిడ? కోపంగా చూసావా?"

"నేనా" చల్లగా నవ్వింది రమణమ్మ. సుబ్బారావు సాహచర్యంలో చాలా మారింది ఆ పిల్ల? ఖరీదు, విలువ. ఈ తేడా తెలిసిన మనిషి నవ్వే నవ్వు అది.

"జాలిగా చూశాను ఆవిడ వంక. ఓసీ పిచ్చి తల్లీ! నీకన్న నేనెంత అదృష్టవంతురాల్ని... ఇంత కట్నంపోసి, అంత ఆర్భాటంగా పెళ్లి చేసే నీ అయ్య నీకు, కనీసం మానవత్వం వున్న వాడినన్నా మొగుడుగా తేలేకపోయాడు. అందుకే రాతి బొమ్మలో దేముణ్ణి వెతుక్కుంటున్నావు. మరి నాకో.... దేముడే దొరికాడు. చూశావా? నిన్ను చూస్తే జాలేస్తోంది.... అనుకున్నాను మనసులో. ఆ మాటలే నా చూపుల్లో కనిపించేయి కాబోలు, తలొంచుకుంది ఆవిడ...." నవ్వుతూ లేచి అతని దగ్గరకు వస్తూ–

"నీ కొకటి తెలుసా?.... నాకు "స్థితప్రజ్ఞుడు" అంటే అర్థం తెలిసింది" అన్నది.

ప్రకృతి నిశ్శబ్దంగా నవ్వింది.

వెన్నెట్లో మల్లెపూల దుప్పటి దులిపింది.

*(వనిత – ఆగష్టు, 1987)*

# ఉప్పెన

వర్షం.... ధారాపాతంగా కుంభవృష్టిగా కురుస్తోంది వర్షం.... సన్నటి చినుకుల ధారలపై అప్పుడప్పుడు మెరుపు తుంపరలు పడి, వక్రీభవించి, వెండి చినుకులు పడుతున్నాయా అన్నట్లుంది చీకట్లో వర్షం....

అద్దాల కిటికీల్లోంచి ఇంతింత కళ్లతో బైట వర్షాన్ని చూస్తోంది శ్రీదేవి. ముచ్చటగా ముడుచుకున్న ముంగాళ్లకు కొత్త వెండి పాంజేబు పట్టాలు, శంఖు పూవుల్లా ఉన్న మట్టెలు, పారాణి వేళ్లమీద చీకటిలో పడే కొవ్వొత్తి వెలుతురికి వక్రీభవించి విచిత్రమైన అందంతో మెరుస్తున్నాయి.

కట్టుకున్న పట్టుచీర... చల్లచల్లగా, వెచ్చవెచ్చగా తమాషాగా వుంది.... మెల్లగా లేచి తన కిష్టమైన చిన్న బాల్కనీలోకి వచ్చి చుట్టూ చూసింది.... చీకట్లో వర్షం.... మెరుపులు.... ఎందుకో భలే త్రిల్లింగ్‌గా ఉన్నదామెకు.... చెయ్యి చాచింది వర్షంలోకి. మెహందీ పెట్టిన చేతులు మీదుగా... కొత్త పెళ్లికూతురు రంగుల గాజుల మీదుగా వర్షం.... గాజులు కొత్త రకంగా.... అదొక రకంగా మోగాయి. చిలిపిగా చేతులు అటూ ఇటూ తిప్పింది... పెట్టుకున్న డైమెండ్ ఉంగరం తళుక్కుమన్నది.

ఆమె కొత్త పెళ్లి కూతురు శ్రీదేవి... బారెడు జడ, బంగారు జడకుప్పెలు చామంతి పూవులు... తల్లో మల్లెపూవుల మత్తు.... భారంగా, దిగులుగా.... మెల్లగా జడ కుప్పెలు విప్పి, పాయపాయలుగా... ఆలోచనల చిక్కుముడి విప్పుతున్నట్లు... ఆలోచిస్తూ విప్పుతోంది.

శ్రీదేవి పోస్ట్‌గ్రాడ్యుయేట్.... కమీషన్ వ్యాపారస్థుడు రామనాధంగారి ఏకైక కుమార్తె.... పదేళ్లల్లో దాదాపు అరకోటి రూపాయల ఆస్తి సంపాదించిన ఆయన కూతురు శ్రీదేవికి భోగాలు కాలికింద మెత్తటి ఖరీదైన కార్పెట్‌లా, వేసవికాలంలో ఏసీలా అలవాటైపోయాయి. అటువంటి ఆమెకు ఆశ్చర్యకరంగా, పెళ్లైన వారంలో చాలా విషయాలు. ఇంతకు ముందు ఆలోచించనివి చాలా సంచలనాన్ని కలిగిస్తున్నాయి.... అవి, అత్తగారు, అడబడుచులులాంటి మామూలు సమస్యలు కావు.... 'అమ్మ' - ఆమె అంటే ఏమిటో అని ఎప్పుడూ ఆలోచించని శ్రీదేవి ఇప్పుడు ఆలోచిస్తోంది.

మౌనంగా, బిత్తర చూపులు చూస్తూ మాట్లాడే ఆమె తల్లి, ఆంధ్రదేశంలో ఒక చిన్న టౌన్‌లో మూడు గదుల ఇంటి కాపురంలో అడుగు పెట్టిన సామాన్యమైన ఇల్లాలు. "కిరసనాయలు రాదు. కూరలు మండిపోతున్నాయ"ని తిట్టుకుంటూ, కురుస్తున్న వంటింట్లోనే, మరదులకు ఇష్టమని వేడి వేడి బజ్జీలు వేసి పెడుతూ,

అత్తగారు కేకలేసినప్పుడల్లా "నా బ్రతుకింతే, హాయిగా బతికే ప్రాప్తం లేదు" అని గుడ్ల నీరు కుక్కుకుంటూ, పండక్కి కట్టుకునే కొత్త జరీచీరే పెద్ద విలాసంగా తిరిగేది ఆమె ఒకప్పుడు, శ్రావణ శుక్రవారం సాయింత్రం కాళ్ల నిండా పసుపు రాసుకుని, జరీచీర కట్టుకుని కళ్ల కాటుకతో, తలనిండా పూవులతో ఎప్పుడూ దొరకదని తెలిసిన ఏదో హాయిని గురించి ఆలోచిస్తూ ఉన్నా చీర బావుంది అని భర్త అంటాడేమో అని, ఆ చీర ఎంత పొదుపు చేసుకుని కొనుక్కుందో చెబుదామని కాటుక కళ్లతో, ఓరచూపులు చూస్తూన్నది.

"రాజేశ్వరీ! ఎనిమిదైంది.... కొత్త చీర మార్చుకుని అన్నాలు ఒడ్డించు...." అని అత్తగారు కేకబెట్టగానే. రాజేశ్వరి, పాత చీర మార్చుకుని, కుచ్చెళ్లు నడుముకు దోపి పనిలో పడిపోయేది. అలా ఆ ఇల్లాలు ఎప్పుడూ ఎదుటి వారి ప్రశ్నకు జవాబుగా, భర్త కోరికలకు ఆస్వాదనగా బతికేసింది.

కానీ ఇప్పుడో...."గవర్నరొస్తున్నారు ఆ ఫంక్షనుకు... అదేం అవతారం?.... మంచి చీరకట్టుకో...." అనే భర్తను మాములుగా చూస్తుంది ఆమె.

అకారణంగా మీకు డబ్బు వచ్చింది...." అనుకునేది పాపం - అప్పుడప్పుడు.

జత స్టీలు కంచాలు కొనడానికి ఎంచి, షాపువాడి దుంపతెంపి, రకరకాలుగా తర్జన భర్జనలతో రెండు రూపాయలు తగ్గించి, ఆ బేరం, తన లాభం నలుగురికీ చెప్పుకుని ఆనందించే ఆ ఇల్లాలికి ఒక్కసారిగా జీవితంలో మార్పు వచ్చి, భర్త పెద్ద బిజినెస్ మాగ్నెట్ అయి సెట్‌లో రెండు ప్లేట్లు పగిలిపోతే, డిన్నరు సెట్ మొత్తం మార్చేసే ప్రయత్నాలు, చాప కొనుక్కోవడానికి ఆలోచించే జీవితంలోకి కార్పెట్ క్లీనర్లు ప్రవేశించి, ఆవిడను బొత్తిగా సామాన్య స్త్రీ జీవితానికి దూరంచేశాయి.

వర్షం వచ్చినప్పుడు ఒళ్లంతా దుప్పటి కప్పుకుని, గువ్వ పిట్టలా ఒదిగిపోయి కూర్చుని, తప్పాలారొట్టెలో ఆవకాయ, నెయ్యి వేసుకుని "ఎంత బావుందో!" అంటూ తినే కూతురు, బ్రెడ్, శాండివిచ్చెస్, సలాడ్స్అని మాట్లాడుతూ ఎదుగుతూ తనకు దూరమైపోతుంటే, మామూలుగా ఇంతింత కళ్లతో చూడటం తప్ప ఏమీ చెయ్యలేకపోయేది ఆమె.

జీవితంలో వస్తు సమృద్ధిగా ఉండటం అసలు, పెద్దవెలితేమో,... ఆలోచించడానికి, బాధపడటానికి మనిషికి చిన్న చిన్న కష్టాలు, బుల్లి బుల్లి బాధలు, నరాల్లో కంపన కలిగించి, రక్తం వేడెక్కించి బ్రతకాలనే జీవంపోస్తాయేమో.... అని భర్త లెక్క ప్రకారం 'ఏ పనికిరాని భావుకుడో చెపితే, అదంతా నాకు తెలియదు అనేస్తుందేమో కానీ, 'అవునేమో' అని ఆలోచిస్తుంది కూడా. అందుకే ఆవిడ శ్రీదేవి పెళ్లి ఫారిన్ రిటర్న్‌డ్ డాక్టరుతో కుదిరి, మంది మార్బలం ఇల్లాంటివన్నీ అతనికి అతి సామాన్య విషయాలని విన్నప్పుడు ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగు అన్నట్లు పెళ్లి జరిగినప్పుడు కూడా ఏం మాట్లాడలేదు కానీ, పెళ్లి పేరుతో షాంపైన్ వరదలై పారినప్పుడు, దూరపు బంధువు ఒక కుర్రవాడు మధ్యతరగతివాడు పాపం,

షాంపైన్ బాటిల్‌కు కక్కుర్తి పడి దాచబోతూంటే, మరిది చేతుల్లో దెబ్బలు తినడం విన్నప్పుడు మాత్రం –

"మామూలుగా సుఖంగా హాయిగా బతికేవాళ్లంతా మనల్ని చూసి చెడిపోతున్నారండీ! కేవలం ఖాళీ బాటిళ్లు అమ్ముకుంటే రెండు వేలు వచ్చేట్లున్నాయి! ఎందుకొచ్చిన హోదాలివి?" అంది ధైర్యం చేసి భర్తతో...

"ఛీ! ఛీ! ఎదగని మనస్తత్వం నీది... పోయి ఆ రూమ్ క్లీన్ చేయించు..... అల్లుడుగారు వచ్చేస్తున్నారు...." అని విసుక్కుంటున్న భర్తను మౌనంగా ఒక చూపు చూసి, ఒళ్లంతా కొంగు కప్పుకుని పనివాళ్లతో పైకి వెళ్లింది ఆమె.

"పొద్దుట నుంచీ ఉపోషం ఉండి, దైవిక మంత్రాలతో జరగవలసిన ఔపోసన కార్యక్రమం... ఏమిటే ఇది?" అంటున్న అత్తగారి మాటలకు –

"సరే... అదెంత తంతో, ఇదీ అంతే తంతులే అత్తయ్యా! ఏదీ మనసుకు సంబంధించిన విషయం కాదుగా?" అనేసి, చరచరా పైన ఉండే బెడ్‌రూమ్‌లోకి వెళ్లింది. అప్పటిదాకా ఆ గది పెళ్లికొడుకు, అతని స్నేహబృందం ఉపయోగించారు.

'ఎక్కడ చూసినా వెధవ వాసన' అని తిట్టుకుంటూ కార్పెట్ శుభ్రం చేయించి బెడ్ షీట్సు మార్పించింది. కూతురు గురించి ఆలోచిస్తోంది ఆమె.

చదువుకున్నదే కాని దానికి ఇష్టాలంటే ఏమిటో తెలుసా? ప్రత్యేకతలంటే ఏమిటో తెలుసా?

వట్టి వేరు అత్తరు గదంతా స్ప్రే చేసింది. కట్‌గ్లాస్ ఫ్లవర్‌వాజ్‌లో రోజా పువ్వులు పెట్టింది.

తను కష్టపడి ఈ రోజుకోసరం అల్లిన ఎర్ర రోజా పూవుల దిండు గలేబులు తొడిగింది. దుప్పటి చుట్టూ రెడ్ హార్ట్స్ అల్లించింది. ఈ విద్యలన్నీ ప్రతి మధ్యతరగతి ఆడబడుచుకూ వచ్చు. వచ్చే అవకాశం ఉన్నది. కానీ, చిన్న చిన్న పనులతో సామాన్యమైన విషయాలను సౌందర్యవంతమైనవిగా ప్రత్యేకమైనవిగా మార్చగల ఓర్పు, నేర్పు చాలా తక్కువమందికి ఉంటుంది.

"మొఘల్ పానపాత్రలా వుంది" అని ముచ్చటపడి కొన్న వెండి నగిషీ చేసిన కూజాలో వట్టివేళ్లు, చందనం, యాలక్కాయలు కలిపిన నీరు పోసి వుంచింది.

గది అలంకరణ అంతా ముగించి, తిరిగి ఒకసారి చూసుకుని, మెట్లు దిగుతూ ఏ. సి. రూములో ఫ్రెండ్స్‌తో కబుర్లు చెపుతున్న కూతుర్ని చూసి అప్రయత్నంగా "పిచ్చితల్లి" అనుకున్నది.

పిలవాలని, మాట్లాడాలని, ఏదో చెప్పాలని ఉన్నదామెకు. కానీ.... సందేహించింది ఆమె.... "శ్రీదేవి చుట్టూ ప్రపంచమంతా మెకానికల్! ఏం చెప్పినా అర్థమౌతుందా?!"

మెల్లిగా మెట్లు దిగుతూ వెండి ట్రేలో ఐస్ బాక్స్. సీసా చూసి ఉలిక్కిపడింది.... అవి తను అలంకరించిన గదిలో ఎంత అర్థం లేకుండా

ఉంటాయో క్షణం చేసుకుని ఆలోచించకూడదనుకుంటూ చరచర మెట్లు దిగిపోయింది.

మంచినూనెలో రవ్వంత కచ్చురాలు, పచ్చ కర్పూరం వేసి తలంటి, పన్నీరుతో స్నానం చేయించి, చందనం, రోజా రేకులు, కస్తూరి, పసుపు, కర్పూరం కలిపి తయారుచేయించిన సున్నిపిండితో నలుగుపెట్టి, జవ్వాది ఒంటికి రాసి, తెల్లచీరతో, ముత్యాల జూకాలతో మల్లెపూవులతో అలంకరిం, కళ్లారా చూసుకుని, దృష్టి తగలకుండా అగరు చుక్కపెట్టి హారతిచ్చింది కూతురుకు.

"ఏమిటమ్మా ఇదంతా, అమ్మవారిలా?" విసుక్కుంటూనే ఒప్పుకుంది శ్రీదేవి దీనికంతా... ఆమెకూ సరదాగానే వుంది. పైగా ఊహ తెలిసిన తరవాత అమ్మకింత టేస్ట్ ఉందని గ్రహించలేదామె. అందుకే అనాదునుంచీ తల్లిని అశ్చర్యంగా గమనిస్తోంది.

ఇర్వింగ్ వాలెస్‌లు, షిడ్నీ షెల్డాన్‌లు, మైకేల్ జాక్సన్లు – వీళ్లంతా ఆడపిల్లలను వయస్సుకు మించి పెంచేస్తున్నారు. ఒకొక్కసారి వయస్సుకు మించిన ఉత్సాహం, ఉద్వేగం కూడా ఈ కాలం అడపిల్లలలో ప్రతిఫలిస్తోంది. అలా పెరిగిన అమ్మాయే శ్రీదేవి కూడా. ఆ ఉత్సాహానికి అందముంది, బాధ్యత లేదు మరి!

కానీ, ఆ రాత్రి....

"సారీ డార్లింగ్... అయాం డామ్ టైర్డ్...." అంటూ చెప్పగూడనివి కలవరిస్తూ రాత్రి ఒంటిగంట తరవాత తప్పతాగి, గదిలో అడుగుపెట్టి పక్కమీద ఒరిగిపోతున్న భర్తను చూస్తూ తన అలంకరణను ఒక్కసారి అద్దంలో చూసుకుని ఉలిక్కిపడింది శ్రీదేవి... ఆ గదిని అలంకరించిన పూవుల తోరణాల వెనకాల ఉండే ఒక పవిత్రమూర్తి గుర్తుకు వచ్చి భయపడింది. "ఇదంతా అమ్మకు తెలియకుండా ఉంటే బాగుండును..." అనిపించింది ఆమెకు ఆ క్షణంలో....

అగరువత్తులు, చందనపు రూం స్ప్రే వాసనలతోపాటు మరొక ఘాటైన వాసనతో ఉక్కిరిబిక్కిరై, ఏదో వెగటుతో గదినుంచి బయటపడి, చల్లటి గాలి కోసం వరండాలోకి వచ్చింది శ్రీదేవి.

అక్కడ మెట్ల మీద ఒదిగి కూర్చున్న వ్యక్తిని చూసి ఉలిక్కిపడింది. రవ్వల ముక్కుపుడక చీకట్లో తళుక్కుమన్నది.

"అమ్మా!" అంటూ చాచిన. చేతుల్లో ఒదిగిపోయింది. తల్లీ కూతుళ్ల మధ్య పెరిగి పోయిన ఇన్నేళ్లదూరం ఒక్కసారిగా తరిగిపోయినట్లయింది.

ఇదే తల్లీ జీవితం... అంటోంది తల్లి స్పర్శ.... కానీ.... ఆ కాస్సేపట్లో చాలా ఎదిగిపోయింది శ్రీదేవి.

"అమ్మా! ఈ మాత్రం ఓదార్పు, అర్థమున్న ఓదార్పు, అనంతమైన అనుభూతితో కూడుకున్న సముద్రంలాంటి ఓదార్పు ఈ కొంచెం ఉంటే చాలమ్మా బ్రతకడానికి... ఈమాత్రంలేకే హిస్టీరియా పేషెంట్లు అయిపోతున్నారు

మనుష్యులు...." మనసులో అనుకుంటూ అలాగే తల్లి ఒడిలో ఒదిగి పడుకుంది శ్రీదేవి.

❀ ❀ ❀

కట్టలు తెగి ప్రవహిస్తోంది వర్షం... అమ్మ తృప్తికోసం. పదహారు రోజుల పండగ దాకా అలాగే ఉంచుకుంటానన్నది అలంకారం... వెళ్లే చుట్టాలు, నిష్ఠూరాలు, పెట్టు పోతలు, హడావిడి – తల్లి సతమతమైపోతోంది... దానికితోడు ఈ వర్షం.

"తాజ్‌లో నా ఫ్రెండ్ దిగాడు... రేపు వెళ్లిపోతాడు. నువ్వు ఒద్దు ఆ వాతావరణంలోకి... ఓకే...." అని చెప్పి వెళ్లిన భర్త ఎప్పుడు వస్తాడో తెలియదు ఆమెకు.

నిట్టూర్చింది శ్రీదేవి. గత ఎనిమిది రోజులుగా ఈ తప్పనిసరి నిరీక్షణ. ప్రదానం నాడు తొడిగిన ఆరువేల రూపాయల రవ్వల ఉంగరం, ఆచేత్తో అతను పట్టుకునే వైన్ గ్లాసు – ఈ రెండూ ఆమె జీవితంలో తప్పనిసరి భాగాలైపోయినాయి. కానీ, విచిత్రం! ఆమెకు అనుకున్నంత బాధగా లేదు.... పెళ్లి అని తెలిసిన మూడు నెలల్లో ఆమె పెద్దగా ఆలోచించవలసిన అవసరం ఏర్పడలేదు. ఇది కాదు నాకు కావలసిన జీవితం... అని ఇప్పుడనిపిస్తోంది కానీ, అప్పుడు అనిపించలేదు... కారణం? అప్పుడు ఏం కావాలో, జీవితానికి విలువేమిటో అర్థం కాలేదు.

ఫ్రెండ్స్, ఎంజాయ్‌మెంట్స్ – ఇవి తప్ప, పెద్ద ఆలోచనలు లేవు ఆమెకు... ఎదిగిపోయాననుకున్న ఆమె ఏదైనా తట్టుకోగలను అనుకునేదేమో కూడా.

కానీ ఇప్పుడో?

ఆలోచిస్తూ చీకట్లో వర్షపు ధారలు గుప్పెటతో పట్టుకోవాలని వృథా ప్రయత్నం చేస్తోంది శ్రీదేవి.

మెరుపులు.... ఉరుములు... భయంకరమైన వర్షం....

ఉన్నట్లుండి... వర్షం ధారగా పడుతున్న ఆమె అల్లరి దోసిళ్లలోకి చటుక్కున కాంతి.... ఉలిక్కిపడింది ఆమె. ఒళ్లు ఝల్లుమన్నది. ఒంటినిండా నగలు... టైం పదకొండు దాటినట్లుంది.

"ఎవరది?" ఇంగ్లీషులో అరచింది.

"నేనే!" ఆ ఆగంతుకుడు దగ్గరైనాడు... ఆ వర్షపుధారల సడిలో ఆ గొంతు ఏమాత్రం పరిచితమైనదానిలా లేదు ఆమెకు.

"ఇంట్లో ఎవరూ లేరా? మీ వాకిట్లో ఎలక్ట్రిక్ తీగ కొబ్బరి చెట్టు మీదుగా వాలింది... ప్రమాదం ముట్టుకుంటే... చెప్పిపోదామని వచ్చాను...." అతను అప్పుడు గుర్తు తెలిసాడు... మూడో ఇంట్లో శంకరం.

"ఎలా మరి?" కంగారుగా అన్నది.

"ఫరవాలేదు... చిన్న గేటు మూసెయ్యండి చాలు... రేపు పొద్దున చూసుకోవచ్చు.... అక్కడే పడింది..."

అతడు తోట నుంచి బాల్కనీకొచ్చే మెట్లమీద నిల్చున్నాడు. పరీక్ష ఫీజు కోసం అప్పుడప్పుడు టైపింగ్ వర్క్ చేసి, డబ్బు సంపాదించుకోడానికి ఇంటికి రెండు మూడు సార్లు వచ్చాడు.

'అతడు వర్షంలో తడుస్తున్నాడు. పైకి రమ్మనాలా? వద్దా? ఆలోచిస్తోంది ఆమె. 'తమ ఇంటి ముందు ప్రమాదం గురించి చెప్పడానికి అతడు తడుస్తూ వచ్చాడే.... ఛీ! ఎలా ఆలోచిస్తున్నాను నేను?...' తనను తాను మందలించుకుంది.

"పైకి రండి...." సందేహిస్తూ అన్నది.

ఆ వరండాలో, అన్ని మెరుపుల నగలతో అభిసారికలా అలంకరించుకున్న యవ్వనవంతురాలి పిలుపు అది. తలెత్తి చూశాడతను. వర్షంలో చినుకులు అతడి చెంపల మీదుగా జారుతున్నాయి. కళ్లుమాత్రం మెరుస్తున్నాయి. అతడు అయిష్టంగా వెనక్కు తిరగబోయాడు. ఒక్కసారిగా ఉరుములు, మెరుపులతో భయంకర రూపం దాల్చింది వర్షం.

"అయ్యయ్యో.... పెద్ద వర్షం... పైకి వచ్చేయండి..." సన్నగా అరిచింది ఆమె.

ఇంక లాభం లేదన్నట్లు పైకి వచ్చి, వరండాలో ఆమె పక్కన వచ్చి నిల్చున్నాడతను.... ఒక్కసారిగా జల్లు ఫెళ్లున కొట్టింది.

"అయ్యయ్యో..." అంటూనే కిలకిలా నవ్వింది శ్రీదేవి. చేతులు చాచి నీళ్లతో ఆడుకుంటోంది.

ఆమె తెలిసి చేస్తోందో, తెలియక చేస్తోందో కానీ, ఆ అల్లరి, ఆ ఒంటరితనం, ఆ అందం, ఆ వాతావరణం..... అతను ఆలోచించకుండా ఉండేటందుకు ప్రయత్నిస్తున్నట్లు ఆకాశం వంక చూస్తున్నాడు. ఒక అడుగు వెనక్కు వేసి అతడినే పరీక్షగా చూస్తోంది శ్రీదేవి.

సామాన్యుడైన ఈ అందగాడు తనను తలవంచుకుని, ఏమాత్రం కళ్లు ఎత్తకుండానే పరీక్షగా చూడటం తను మర్చిపోలేని అనుభూతి ఒకప్పుడు. కానీ, ఆ వయసులో ఆ పసి ఆరాధనలు, ఆమెకు తెలియనివి కావు. కాసేపు అల్లరి పెట్టి, కవ్వించి, ఆడించి ఏం తెలియనట్లు పెళ్లి కూతుళ్లైపోవడం అలవాటే ఆడపిల్లలకు. అంతస్తులరీత్యా, ఇద్దరిమధ్యా హస్తిమశకాంతర మున్నది. కానీ—

ఈ ఒంటరితనంలో.... ఇప్పుడు—

తమ దగ్గరతనం, అతని ఇబ్బంది... ఆమెకు మహా ఆటగా వుంది.

పెద్దగా మెరుపు మెరిసింది... ఎక్కడో పిడుగు పడ్డట్లైంది.

"అమ్మో!" ఒక్క అరుపు అరిచింది శ్రీదేవి.

రెండు బలమైన చేతులు ఆమెను గట్టిగా పట్టుకున్నాయి. అదీ కొన్ని క్షణాలు.... అంతే... బిత్తరపోయి చూసింది శ్రీదేవి. ఒక్కసారి ఆమె కళ్లల్లోకి చూసి చటుక్కున వదిలేశాడు అతను.

"వస్తాను – కింద పనివాళ్లు కనిపించలేదు... నేనే చిన్నగేటు వేసిపోతాను...." చెప్తూ చరచర మెట్లు దిగి వెళ్లిపోయాడతను.

అటే చూస్తూ నిలబడింది శ్రీదేవి.

అతడు గేటు మూయడానికి తడుస్తూ చాలా ప్రయత్నం చేస్తున్నాడు. కానీ, ఎందుకో అది మూసుకోవడం లేదు.

'పనివాళ్లంతా ఏమయ్యారో...' అనుకుంటూ మెట్లుదిగి చరచర వెళ్లింది ఆమె.

మౌనంగా ఇద్దరూ కలిసి అతి ప్రయత్నం మీద గేటు వేశారు.... గేటు జరపడంలో ఊపిరి బరువు.... చుట్టూ వర్షపు జల్లుతో స్పందించే అర్థం లేని నిశ్శబ్దపు బరువు. అర్థంకాని పరిస్థితుల ఆలాపనలోని బరువు....

"అదుగో వైరు... జాగ్రత్త... " టార్చ్ వేసి వైరు చూపించాడు. ఆమె తలూపింది మౌనంగా

"వస్తాను..."

'ఇంత వర్షంలో ఎక్కడికి?" ఆమె గొంతులో అతన్ని మరికాస్తసేపు ఆపాలన్న ప్రయత్నం. ఈ కొద్ది క్షణాలు చాలా విలువలు మార్చాయి ఇద్దరిమధ్యా.

"లేదు వెళ్లాలి.... అదుగో, ఆ గుడిసెలు కొట్టుకుపోతున్నాయి.... వీలైనంతమందిని ఆ స్కూలుకు చేర్చాలి...." చెప్తూ నీళ్లల్లోకి అడుగు వేశాడతను.

ఈ వర్షంలో.... ఇతను... ఎదుటివారి కోసం.... ఏం వ్యక్తి?

"ఇంట్లో కంగారుపడరూ?" ఆ గొంతులో ఆప్యాయత.

నవ్వాడతను... లేని వెన్నెల విస్తరించినట్లైంది.

"మా ఇల్లు సగం కురుస్తోంది.... ఏదో ఏర్పాటు చేసి వచ్చాను."

"మరి మీవాళ్ల గురించి ముందు ఆలోచించాలి కదా?...."

మళ్లీ నవ్వాడతను.

"శ్రీదేవిగారూ! ఒక విషయం తెలుసా?... నిజమే.... వర్షం బాధ అందరికీ సమానమే.... మేము తప్పించుకోలేము. కానీ, రేపు మళ్లీ మాకు బ్రతుకున్నది. భయం లేదు. నష్టాన్ని కొంచెం కష్టపడ్డా పూడ్చుకోగలం కానీ, ఆ గుడిసెల్లో వాళ్ళకు జరిగేది?..... అది నష్టం అనరు – సర్వనాశనం అంటారు... కొన్ని జీవితాలు, ఎవరికీ విలువ లేనివి. ఏ మనిషీ పట్టించుకోనివి ఇవ్వాళ సమూలంగా కొట్టుకుపోతాయి. తేరుకోలేరు.... కాబట్టి రక్షణవాళ్ళకు కావాలి ఇప్పుడు మనిషి బతకడం చాతకాక చచ్చిపోతే వాళ్లకు అసమర్థత అని పట్టం కట్టొచ్చు కానీ, బ్రతకలేని పరిస్థితులు ఏర్పడితే?!.... మనమంతా ఊరుకోలేం కదూ?... వస్తాను... పైకి వెళ్లండి.... మళ్లీ వచ్చి దిగబెట్టనా?" అతని వంకే చూస్తోంది శ్రీదేవి రక్షణ సమూలంగా కొట్టుకుపోతారు.... తేరుకోలేరు అప్పుడు కావాలి ఆలంబన, ఆమె... తుపాను గురించి అన్న మాటలు, అర్థంలేని తన పెళ్లి గురించి అన్వయించుకుంటోంది ఆమె.

"నేనూ వస్తాను...." ఆవేశంగా గభాల్న గేటు తెరవబోయింది "మీరా?" గట్టిగా నవ్వాడతను. "ఇంకా నయం. ఇన్ని నగలతో, ఈ అలంకరణతో, మీలాంటి అందగత్తెను ఈ వర్షం రాత్రి వెంటబెట్టుకుని.... బాగుంది. త్రిల్లింగ్‌గా ఉంది ఊహించడానికి.... కానీ కొన్ని అదృష్టాలు ఊహలకే పరిమితం.... చిన్నపిల్లలా మాట్లాడకండి.... వెళ్లండి... నేనిక్కడే నిలబడి ఉంటాను, వెళ్లండి..." మరొకసారి కేకలేసినట్లు చెప్పాడతను.

మాట్లాడకుండా వెనక్కు తిరిగింది.

ఆమె వరండాలోకి వెళ్లేదాకా టార్చ్‌తో ఫాలో అయ్యాడతను. ఆ చీకట్లో కలిసిపోయాడు ఆ తరువాత.

అటే చూస్తూ నిలబడింది ఆమె.... దూరంగా గుడిసెలు సమూలంగా లేచిపోతున్నాయి నిజమే.... కానీ. ఎంతమంది శంకరాలు ఈ ప్రళయాన్ని ఆపగలరు... ఆ ఆశోపహతులకు ఎంతని చెయ్యగలరు? ఒక రకంగా అర్థం లేని జీవితమనే శూన్య సముద్రంలో చిక్కుకున్న నేనూ ఆశోపహతురాల్నే... కానీ, ఇది ఎవరూ రక్షించలేని పెనుతుపాను.... భయంకరమైన ఉప్పెన...

'వాళ్లకు నేనేం చెయ్యలేనా?' కన్నీరు తుడుచుకుంటూ అనుకున్నది శ్రీదేవి. ఏం చెయ్యగలదు? ఈ రాజప్రాసాదం లాంటి ఇంట్లోకి దారిలేదు వాళ్లకు.

తన నగలు, అలంకరణ, అర్థంలేని ఈ నిరీక్షణ, రాగానే భర్త ఓపెన్ చెయ్యబోయే ఖరీదైన విదేశీ విస్కీ బాటిల్.

ఆమెలో ప్రళయం... ఏదో గర్జన... ఈ ఉప్పెన, ఆలోచనల తాకిడి... శూన్యంలోకి, వర్షంలోకి చూస్తూ అట్లాగే నిలబడిపోయింది ఆమె.

"అమ్మగారూ! లాంతరిదిగో..." పనివాడు వచ్చాడు.

"ఏమయ్యారు మీరంతా? చచ్చారా? ఆ శంకరంగారు వచ్చి వైరు పడిపోయిందని గేటు మూసి వెళ్లారు, పాపం...." ప్రళయంలా విరుచుకుపడింది.

"కుక్కలు తడుస్తాయని, అయ్యగారు కేకలేస్తారని వెనకాల అవుట్ హౌస్‌లో పెట్టడానికి వెళ్లానమ్మా... గేటు తాళం వేసి వస్తానుండండి.... ఇంకా నయం... ఆ బాబు చెప్పారు" తడుస్తూ వెళుతున్న అతణ్ణే చూస్తోంది శ్రీదేవి.

కుక్కలు... మనుషులు... గుడిసెలు... శంకరం... ఈ వర్షం అందరికీ తలోరకంగా... తనకు ముఖ్యంగా మరొక రకంగా అనుభవాన్నిస్తోంది. దూరంగా తనకు తెలిసిన కారు హారన్.

భర్త వస్తున్నాడు. నిట్టూర్చి వెళ్లిపోయింది లోపలికి ఆమె.

❀ ❀ ❀

ఆ మర్నాడు...

"వెధవ చెప్పులు... నూట యాభై పెట్టి కొన్నాను అప్పుడే నాశనం...." తిట్టుకుంటూ కారు దిగింది షాపింగ్ నుంచి వస్తూ శ్రీదేవి. వరండాలో హడావిడి చూసి చటుక్కున ఆగిపోయింది.

వరద బాధితులకు సహాయం అంటూ వచ్చి తండ్రితో మాట్లాడుతున్నారు కొంతమంది. కానీ తండ్రి చాలా లౌక్యుడు.... పేరు ప్రతిష్ఠలేని దానాలు చేసేటంతటి అమాయకుడు కాదు. ఇలా వసూలు చేసి ఎంత ఎంత అన్యాయాలు చేస్తున్నారో, బీదవాళ్లకు అందులో పదో వంతు కూడా ఎందుకు వెళ్లదో చెపుతున్నాడు వాళ్ల ఎదురుగుండానే... బిత్తరపోయి చూస్తున్నారు వాళ్లు.

వాళ్లలో శంకరం.... స్తంభానికానుకుని, చేతులు కట్టుకుని, ఆలోచిస్తూ....

ఒక్క క్షణం ఆలోచించుకుని, చరచరా వెళ్లి –

"హల్లో, శంకరంగారా! నాన్నా!... వీరే ఆ రోజు వైరు పడిపోయిందని చెప్పారు.... లేకపోతే ఎంత ప్రమాదం జరిగిపోయేది – మీ అల్లుడు ఆ దారే వస్తారు అసలు..." గబగబ ఏదేదో మాట్లాడేస్తోంది శ్రీదేవి.

ఒక్కొక్క అక్షరంలో ఒక్కొక్క రూపాయి కమిట్‌మెంటు తండ్రికి పెంచుతున్నానని ఆమెకు తెలుసు.

"నాన్నగారికి ఇల్లాంటి చందాలంటే ముందే ముందు నిలబడతారు...." భర్తకు చెప్పింది.

తప్పనిసరి పరిస్థితుల్లో, చాలా పెద్ద మొత్తం చెక్కుగా ఇచ్చాడు తండ్రి.

"చాలా థాంక్స్...." అంటూ వెళ్లిపోతున్నవాళ్లవంక చాలా మామూలుగా చూసింది శ్రీదేవి... గేటు మూస్తూ తలెత్తి సూటిగా చూశాడు శంకరం.

ఒక్కసారిగా చటుక్కున తలెత్తి చూసి, లోపలికి వెళ్లిపోయింది ఆమె.

'ఇంతకన్నా నేనేం చెయ్యగలను?' మెల్లిగా వచ్చి తన కిష్టమైన వరండాలో నిలబడి చూస్తోంది ఆమె వెళ్లేవారివంక.

ఒళ్లంతా కొంగు కప్పుకుని, చేతిలో బట్టలమూట, ఏవేవో సామాన్లు శంకరం చేతిలో పెట్టి చరచరా అడుగులు వేసి, ఏమీ తెలియనట్లు వస్తోంది ఒక స్త్రీమూర్తి.

మెట్లెక్కగానే–

"అమ్మా!" అన్నది శ్రీదేవి. ఆశ్చర్యం, అనురాగం ఆమె గొంతులో.

"ఉష్... గట్టిగా మాట్లాడకు.... మనింట్లో ఖాళీ విస్కీబాటిళ్లు అమ్మితే రెండు గుడిసెలు లేస్తాయి. నువ్వు వదిలేసి అత్తగారింటికెళ్తానన్న బట్టలు కొన్ని వాళ్లకి ఇచ్చి వచ్చాను...." తల తుడుచుకుంటూ అన్నదామె.... "అందులో ఒక పిల్ల బాలింతరాలు కూడా పాపం....."

"నాన్న డబ్బిచ్చారమ్మా!.... నువ్వు ఇలావెళితే... వాళ్లు రేపు నిన్ను ప్రతిదానికీ ఉపయోగించుకుంటారమ్మా!" తండ్రి లౌక్యం పుణికిపుచ్చుకున్న కూతుర్ని పరీక్షగా చూసింది రాజేశ్వరి.

"డబ్బు... అది ఎన్నో చేతులు మారి దాని విలువ పోగొట్టుకుంటుందమ్మా! నీ చేత్తో, నువ్వు మనస్ఫూర్తిగా చేసేదాని విలువ వేరు... నువ్వు నాలుగు వందల చీర కట్టుకోగలిగే, నువ్వు విడిచేసిన చీర ఇచ్చి దానం చేశాననుకోవడం ఆత్మవంచన...

అది మంచిది కాదు. తల్లీ! మరొకళ్ల గురించీ ఆలోచించడం నీ కర్తవ్యం. అది నీ గొప్పతనమనుకుని ఆనందించకమ్మా!" తీక్షణంగా చిక్కుతీసుకుంటూ తల్లి అన్న మాటలు ఆమెను కొన్ని క్షణాలు నిలబెట్టాయి.

"కానీ మనమిచ్చేది మనకు తక్కువేగానీ, వాళ్లకు ఎక్కువేగా అమ్మా!"

తిరిగి చూసింది తల్లి.... "నిజమే.... దానివల్ల వాళ్లకు జరిగేది ఎక్కువేమో... కానీ, మిగతావారిలో ఉండవలసిన మానవత్వం లేకపోవడం, ఏ కొద్దిపాలో మనలో ఉండటం మన ప్రత్యేకత అనే ఆత్మవంచనకు దిగకూడదుగా శ్రీ... అప్పుడు వాళ్లది ఆర్థిక దారిద్ర్యమైతే. మనది మానసిక దారిద్ర్యం... సుఖం, శాంతి నటిస్తూ బ్రతికేస్తున్నాం మనం... ఇల్లాంటి మనసుకు సంబంధించిన కొన్ని పనులన్నా నేర్చుకుంటేనేకానీ, ఒక్కరోజన్నా మనశ్శాంతిగా బ్రతకలేమేమో!..."

'నా ఇల్లు తడవడం లేదని కాదు... అవతలి గుడిసెల్లో జీవితాలు సమూలంగా నాశనమైపోతాయి...' అన్న శంకరం గుర్తుకు వచ్చాడు శ్రీదేవికి.

కొన్ని వందల పుస్తకాలు, పోస్ట్‌గ్రాడ్యుయేషన్ డిగ్రీ, బ్రతికేసిన 23 ఏళ్ల జీవితంలో అనుభవాలు - ఇవేవీ చెప్పలేనివి ఒకరకంగా శంకరం, మరొకరకంగా అమ్మ చెప్పారు ఆమెకు.

వందమంది చెప్పలేని ఒక జీవన సత్యం ఒక ఫలాపేక్షలేని మంచిపని, ఒక స్వచ్ఛమైన భావన చెప్పగలదా?

ఆలోచిస్తోంది శ్రీదేవి....

ఆమెకు జవాబు జీవితమే చెప్పాలి!

*(వనిత - నవంబరు 1987)*

# శ్రద్ధాంజలి

"అన్ని గ్రహాల్లోకి అనుగ్రహం పెద్దది....

జీవితంలో 'విధి' అన్నది మన బలహీనతను, చేతకానితనాన్ని, బద్ధకాన్ని సూచించే మాట. గ్రహదోషం ఉండొచ్చు. కానీ, నివారణా ఉంటుంది... 'ఇది నా ఖర్మ... ఇంతే...' అనుకుంటూ అనుభవించడానికే అలవాటు పడ్డారు జనం..."

ఇలా మాటల్లో జ్ఞానానికి మించినదేదో పొదిగి చెపుతున్నాడు, ఆ నది ఒడ్డున ఆ వ్యక్తి.

"తాంత్రికత వేరు... మాంత్రికత వేరు... యాంత్రికతవేరు. ఆధ్యాత్మికత వేరు... వీటన్నింటినీ కలపకండి... కోరిక అనేది వీటన్నింటికీ మూలం. దాన్ని ఆధ్యాత్మికత జయిస్తుంది. మానవుడు అధి మానవుడై పరిపక్వతవైపు పురోగమించడం అనేది మూల సూత్రమైతే అన్నీ ఫలిస్తాయి. అటువంటి వ్యక్తి వలన పరిసరాలు ప్రభావితమౌతాయి.

"అలా కాకపోవడం వలన... 'నా'.... 'నాకోసం' మాత్రమే అన్న ఆలోచన వలననే ప్రకృతి నుంచి మానవుడు విడిపోతున్నాడు. దాని పిలుపు, తరంగ స్పర్శ అతనికి అందడంలేదు. అహం అసూయకు దారి తీస్తుంది. అజ్ఞానం ఆ తరవాతి మెట్టు. ఇంక ఇవి జారుడుమెట్లు... ఒక జీవిత కాలంలోనే వంద నరకయాతనలకు దారి వెతుక్కోగల సమర్థులం మనం. అందుకే....

"ఈ జీవితాన్ని ఒక పాఠశాల అనుకోండి... పాంథశాల అనుకోండి. ఇక్కడికి వచ్చింది మనం మనలోని వ్యక్తి మరింత ఎదగడానికి కానీ, వచ్చిన పాఠాలు మర్చిపోయి వెనక తరగతులకు వెళ్లిపోవడానికి కాదు."

పై అర్థం వచ్చే మాటలు చిన్న చిన్న పదాల్లో పొదుగుతున్నాడాయన....

అజ్ఞానం ఆవహించిన ఆ ఊరిలో ఆచారాల పేరుతో కుంచుకుపోయి ముడతలు పడ్డ ఆ వాతావరణంలో మతం మానవత్వాన్ని, మంచితనాన్ని కాలికింద మెట్లుగా మార్చేసిన ఆ ఊరిలో – ఈ కొత్త వ్యక్తి సువార్తా వాణి... 'చింతచెట్లకు, గేదెలకు, ఆవులకు, పచ్చటి పైర్లకు, ముక్క వంటబట్టని పశువుల కాపర్లకు తప్ప మరెవ్వరికీ అర్థం అయ్యే అవకాశం ఉందా?' అన్నట్లు అనిపిస్తుంది.

అతడు ఆ ఊరు వచ్చిన మొదట్లో మహనీయుడనీ, మహత్తులు కలవాడనీ, ఎదుటి మనిషి ఆలోచనలను గ్రహించే శక్తి కలవాడనీ, ఆయనకు సూక్ష్మదృష్టి ఉందనీ, అణిమ, గరిమ శక్తులు ఉన్నాయని... ఇలా మనలో ఉండాలని కోరుకుని,

సాధించలేనివన్నీ ఆయనకు అంటగట్టి, వాళ్లే గొప్పతనం అపాదించుకుందామని వచ్చారు జనం.

కానీ ఆ ఊరి బ్రాహ్మణ్యం, కామందులు, రెడ్డి ప్రభువులు, వ్యాపారులు... ఈ రకంగా డబ్బు ఆడంబరం ఉన్నవాడు తలవంచిన చోట తప్ప సామాన్యులు తలవంచని బలహీనత అక్కడి సంఘానికీ ఉన్నది.

అందుకే వాళ్లు శాసించేదే న్యాయం, వాళ్లు విన్నదే వేదం అయి, వాళ్ల సగటు భావాలు సమాజాన్ని శాసించే అస్త్రాలై, ఆ తరవాత దిగజార్పుడు ప్రారంభమయ్యేది.

ఆ యతికి పాద పూజలు చేస్తామంటూ డబ్బుతో ఆయనను కొని తమ పార్టీ మనిషిగా మార్చుకుందామనుకున్నవాళ్ల ఆలోచనలు ఆయన దగ్గర ఫలించలేదు.

"డబ్బున్నవాడు తల వంచినంత మాత్రాన రాతి విగ్రహం దేముడవదు. దేముడులాంటి వ్యక్తి తనలో జ్ఞానశక్తిని, తేజస్సును ధారపోసి ప్రాణ ప్రతిష్ఠచేస్తే అది కళలతో ఊపిరి పోసుకుంటుంది. ముందు మహోన్నతులైన మనుష్యులుగా మారండి. ఆ తరువాత మీరు ఊహించే దైవం మీ మధ్యకు దిగివస్తాడు...."

ఇలా ఆయన ఉపన్యాసం సాగిపోతోంది.

"ఇదెక్కడి గోలంట.... ఒక ఉపనిషద్వాక్యం లేదు. ఒక్క వేదంలో మాటలేదు." వాపోతున్నాడు కుండలాల శాస్త్రి.

"సంస్కృతమే మాటాడ్డు.... ఓ మాట్టాడతాడు మళ్లీ...." యాస కూడా పోని పెద్దరెడ్డి శలవిచ్చాడు.

"మానవత్వం... మట్టిగడ్డ వగైరా అంటున్నాడు.... కొంపదీసి కమ్యూనిస్టు ఇట్లా ఈ రూపంలో...." ఐక్కపలచటి సందేహప్రాణి కనుబొమ్మలు ఎత్తుతూ అన్నాడు.

"ఏమో.... దెయ్యాలు వేదాలు వల్లిస్తాయంటే ఇదేనేమో...." అన్నాడు ఓ అసంపూర్ణ జ్ఞాని.

మొత్తానికి ఇలా తలొకరూ తలొక మాట అంటున్నారు. అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. అవునంటున్నారు.... కాదంటున్నారు... కానీ తమాషా... ఆయనను ఏం చెయ్యాలో ఆ ఊరి పెద్దలకు అర్థం కాలేదు. కారణం అతను తన అవసరాలకు ఎవర్నీ దేహీ అనలేదు. ఎవరేది ఇచ్చినా తీసుకోడు. పైగా.... తనే ఇస్తాడు... ఏది ఎవరికి అవసరమో... మంచిదో...

"ఖర్మ... ఏ స్మగులరో ఇట్లా యతి వేషంలో...." చేతినిండా బంగారపు గాజుల్తో, పెద్ద బొట్టుతో, స్థూలకాయం నరసమ్మ సందేహం.

కానీ లక్ష్మి.... దానికి ఇవన్నీ వినిపించడం లేదు.

మొదట్లో ఆయనను ఆశ్చర్యంగా చూసేది. తరవాత ఇదెక్కడి నాటకమో.... అని తప్పుకు తిరిగేది. మరికొన్నాళ్లకు ఆయన మాటలు కొన్ని విని ఆశ్చర్యపోయింది. ఆయన ఎవరినించీ ఏదీ ఆశించడం లేదని తెలుసుకుని

నమ్మకమొచ్చి చెరువునించి నీరు తీసుకుంటూ చెరువు ఒడ్డున పాకలో ఉన్న ఆయనను చూసి దణ్ణం పెట్టి వచ్చింది.

ఆ ఊరికి నీటి ఎద్దడి... అందుకే లక్ష్మిలాంటి దిక్కులేనివాళ్లు బిందెకింత అని చెరువు నించి ఇంటింటికీ నీళ్లు మోస్తారు. ఆ మూలనించి ఆరు కోసుల దూరం నడిచి రెండు బిందెలు మోసుకెళితే రూపాయి డబ్బులు చేతులో పడడం గగనం.

ఆ ఊరి చెరువు లక్ష్మికి చిన్ననాటి నుంచీ పరిచయం. ఆ ఒడ్డునే ఆడుకుని పెరిగింది. అమ్మ, అయ్య - ఎలక్షన్ల కక్షల్లో ఊళ్లు తగల బెట్టుకుంటే అందులో మాడి మసయినప్పుడు - పిలక జడతో, ముఖమంతా కాటుకతో, ముక్కు ఎగపీలుస్తూ తొమ్మిదేళ్ల పిల్ల అక్కను కౌగిలించుకుని ఏడ్చింది. కానీ, చాలామంది ఆ స్థితిలో వాళ్ళలాగే, దానికి ఆ దృశ్యం - కథల్లోలాగా కళ్లముందేం నిలిచిపోలేదు.... ఆ తరవాత ఆ ఇద్దరు అనాథలూ ఎలా పెరిగారు? అంటే చెప్పలేం.

కానీ, లక్ష్మి అక్క చుక్కమ్మ ఎదిగింది. చక్కనిదైంది. పాచిపని చేస్తోంది. బతుకీడ్చుకొస్తోంది. తోడేళ్ల నీడల్లోనించి అలిసిపోయిన గుండెలతో ఎప్పటికప్పుడు పారిపోయి వస్తోంది. ఇవన్నీ ఎదుగుతున్న లక్ష్మికి అర్థమయ్యేవి కావు కానీ, అక్క తన వంక చూసే జాలిచూపులతో ఎక్కడో గుండెల్లో మెలిబెట్టినట్లయ్యేది.

కానీ.... ఒక రోజు ఏటి ఒడ్డున మెట్ల మీద కూర్చుని "లచ్చీ! మనిద్దరం చచ్చిపోదాంటే...." అన్నప్పుడు ఆశ్చర్యపోయి భయంగా అక్క చెయ్యి పట్టుకుని-

"అక్కా! ఒద్దే.... నాకు చచ్చిపోవాలంటే బయ్యం...." అన్నది.

ఉలిక్కిపడింది. చుక్కమ్మ... "చావు బయమే... కానీ బతుకు? అది మరింత బయంకరం కదే..." అందామనుకుందేమో.... కానీ ఎందుకో జాలిగా చూసి, కళ్లనీళ్లతోనే తళుక్కున నవ్వింది.

ఆ మర్నాడు చుక్కమ్మ శవం నదిలో తేలింది. గుండెలవిసేలా ఏడ్చిన లక్ష్మికి నిజం తెలియదు కాబట్టి గుండె పగిలిపోలేదు మరి.

చుక్కమ్మ నమ్ముకున్న టీకొట్టు రంగడు పెళ్లి చేసుకుంటానని మాటిచ్చి దాన్ని లొంగదీసుకున్నాడు. గర్భవతినని కలల్లో తేలుతూ చెప్పడానికి వెళ్లిన ఆమెను పెద్దరెడ్డికి నైవేద్యం పెట్టాడు.

గొల్లుమంది చుక్కమ్మ.

"ఇప్పుడేమైందే, పది నిమిషాలు కళ్లు మూసుకునే దానికి నీతేందే? నీతి? అయినా దిక్కులేనివాళ్లకు నీతేంటి? నిజాయితీ ఏంటి? ఆ మాటలు ఉన్నోళ్లకు ఎలానూ లెఖ్ఖలేదు. లేనోళ్లకు అవి ఎట్టాగూ ఉపయోగించవు. ఇంకెందుకు చెప్పు ఆ అర్థంలేని మాటలు? నా మాట ఇని నువ్వూ నీ చెల్లీ నాలుగు డబ్బులు వయసులో ఉండగానే ఎనకేసుకోండి...."

ఈ మాటలు అన్నది పంచభూతాల సాక్షిగా తనను మనువాడుతానన్న రంగడివి... బహుశ చుక్కమ్మ తను పాడైపోయానన్న బాధకన్న తను నమ్ముకున్న ఏ

సిద్ధాంతాన్నీ ఎవరూ ఆచరించరనీ, అవి తమబోటివారికుంటే అగౌరవిస్తారనీ, జీవితానికి ఆ మాటలకు సంబంధం లేదనీ తెలిసి.... అవి అక్కర్లేదనుకున్న ఈ ప్రపంచంలో ఎలా బతకాలో తెలియక ఆత్మహత్య చేసుకుని ఉంటుందిపాపం.

కానీ, లక్ష్మికి ఇదంతా వివరంగా తెలియదు. దిక్కులేనిదాన్ని పక్కింటి పార్వతమ్మ చేరదీసింది - చాకిరీ కోసం. బలవంతురాలు, డబ్బుగలది అయిన ఆవిడంటే ఊరందరికీ భయం కాబట్టి ఆవిడ పంచలో ఉన్న లక్ష్మి ఇంకా నీతి అవినీతి గడుల్లో పులి జూదం మొదలుపెట్టలేదు.

కానీ, ఆ పిచ్చి తల్లికి ఒక కోరికున్నది. అది ఎలా తీరుతుందో అక్క చచ్చిపోయిన ఇన్ని రోజులకన్నా తెలియలేదు. అక్కకు అంత్యక్రియలు సరిగ్గా జరగలేదు మరి.

అది నీళ్లు మోసే వాళ్లింట్లో సంకురాత్రి పండక్కి ఆర్భాటంగా గంగానమ్మకు చల్ది నైవేద్యం పెట్టి వారపోసి, చచ్చిపోయినవాళ్ల పేరుతో ముత్తయిదువుల్ని పెట్టుకుంటున్నారు. అది ఆనవాయితీ మరి.

"ఓయమ్మా.... అట్టా నీళ్లు పారబొయ్యమాకు. అంత దూరంనుంచి తెస్తున్నాం... నీకేం.... అర్ధ రూపాయ పెట్టి కొనుక్కుంటావ్... అయినా అవసరానికి మేం మొయ్యాలి గంద..." లక్ష్మితోపాటు నీళ్లు తెచ్చే నడివయస్సామె ఆ ఇంటి కొత్త కోడల్ని నీళ్లు ధబేలుమని ఒంపుతూంటే మందలించింది.

"అవసరమైతే కొనుక్కోగలం.... అడ్డమైనవాళ్లూ చెప్పొచ్చేవాళ్లే...." కొత్త పాంజేబు పట్టాల పాదం ఝాడించి నేలకేసి కొట్టి పట్టుచీర విస విసతో ఛర్రున లోపలికి పోయింది ఆ అమ్మాయి.

"ఓయమ్మ.... నీళ్లాడితే కానీ నిదానం ఆడదంటారు.... ఇదెక్కడి అడది?" బిత్తరపోయింది ఆ నీళ్లుమోసే ఆడది.

అనాడు ఇంటి కోడళ్లను తెచ్చుకుంటే సాముద్రిక లక్షణాలు చూసి తెచ్చుకునేవాళ్లు. ఆ నడక, ఆ విరగబాటు ఇంక ఈ ఇంట్లో సిరి నిలబడ్డట్టే... కట్నాలకు కక్కుర్తి పడితే. ఇంతేమరి" తిట్టిపోసింది మెటికలు విరుస్తూ వంటకు వచ్చిన ముసలమ్మ. కానీ ఈ రభస అంతా పట్టించుకోవడం లేదు లక్ష్మి. మామిడాకు తోరణాలతో పసుపు గడపల్లోంచి తొంగిచూస్తోంది.

ఇక్కడ పెద్ద వంటింట్లో ఓరగా ఆ ఇంటి నలుగురు అడబడుచుల్నీ కూర్చోపెట్టి, పోయినవాళ్లను తలుచుకుని కోడలిచేత వాయినాలు ఇప్పిస్తోంది, ఆ ఇంటి యజమనురాలు.

"మామ్మా! అదేంటి?" అడిగింది లక్ష్మి వంటమామ్మను.

"ఆ కుటుంబాల్లో ఎవరైనా సుమంగళులుగా పోతే వాళ్ళ పేరు చెప్పి పసుపు కుంకుమ చీరా జాకెట్టు కట్టుకుంటారు... బతికున్నంతకాలం ఆ తల్లి ఆడబడుచును దుమ్మెత్తి పోసి, ఆఖర్లో గుక్కెడు మంచి నీళ్ళన్నా పోయకుండా చంపింది. ఇప్పుడు

దెయ్యమై తిరుగుతుందని ముత్తైదువుకు పెట్టుకుంటోంది.... ఇదొక సంబడం.... అయినా అట్టాంటివి ఏ బీద ముత్తయిదువుకో ఇస్తే పుణ్యం, పురుషార్థం కానీ, ఇలా కూతుళ్లకు, కావలసిన వాళ్లకూ, పెట్టుకోవడమా? చచ్చినవాళ్ల ఆత్మల సంగతి భగవంతుడెరుగు. ముందు వీళ్లల్లో వీళ్ళు ఇస్తినమ్మ వాయనం పుచ్చుకుంటినమ్మ వాయనం... అంటూ అంతా వాళ్లల్లో వాళ్లకే..." ఆవిడ కడుపు మంటేమిటో కానీ అలా వెళ్లగక్కింది.

అట్లా చూస్తూ, వింటూ, ఆలోచిస్తూ నిలబడ్డ లక్ష్మి ఆమాటలు సగమే విన్నది. మనసులో మెదిలింది కన్నెముత్తయిదువుగా వెళ్ళిపోయిన అక్క చుక్కమ్మ ఆమెకుదినం చెయ్యలేదు. ఏ రకమైన క్రతువూ చెయ్యలేదు.

"బలవంతంగా చచ్చివాళ్లు దెయ్యాలై తిరుగుతారట." చుక్కమ్మ అంటే అసూయపడే పక్కింటామెమాటలకు ఎప్పుడూ ఒళ్లు జలదరించిపోయేది లక్ష్మికి.

అందుకే.... ఆ క్షణంలో ఆ పిల్లకు ఒకటే ఆలోచన. అక్కయ్య ఆత్మతృప్తికి ముత్తయిదువును పెట్టుకోవాలి. అ దొక్కటే లక్ష్మి ధ్యేయం.....

మెల్లిగా శాస్త్రిగారింటి గోడనానుకుని 'ఎట్టా చెయ్యాలి అదంతా?' అని అడిగింది....

ఉయ్యాల బల్లమీద కూర్చుని ఊగుతూ, నస్యం పట్టిస్తూ, తాంబూలం నములూ, "ఏమిటీ? నువ్వే నయం! మా వాళ్లల్లో ఆస్తి పంచుకోవడమే దినవారమైపోయింది... అయినా శ్రద్ధా భక్తితో చేసేది శ్రాద్ధం... ఏమిటి! పార్వతమ్మ దగ్గరే ఉంటున్నావా? ఆ గంజి అన్నంలో ఏముంటుందే పూల పొట్లాల్లా తయారౌతారు మీరు.... మా ఇళ్లల్లో అన్నీ వేసి పెట్టినా గడకఱ్ఱల్లా ఉంటారు...."

ఆ మాటలన్నీ వినిపించుకోకుండా పరిగెత్తుకొచ్చేసింది లక్ష్మి. తనకు శ్రద్ధ, భక్తి ఉండి చేస్తే చాలు... అక్క" చుక్కమ్మకు చేరుతుంది అది.

ఆనాటి నుంచీ ఆ పిల్ల అడుగులు మరింత బలంగా పడేవి. చేతులు కందిపోతున్నా బిందె దించేది కాదు...

"ఏంటే ఎర్రిమొహవా? ఆ కష్టం దేనికీ? ఆపై నాలుగు రూపాయలూ వేనిస్తాలే ఆ చీరేదో కొనేసుకో...." అన్నది పార్వతమ్మ, మూటల వాడి దగ్గర చీర లక్ష్మికే అనుకుని.

చీర కొన్నది లక్ష్మి.

పసుపు కుంకుమ పొట్లాలు కట్టింది.

మెల్లిగా తను నీళ్లు మోసే వాళ్లింట్లోకి అడుగు పెట్టింది. దాని దృష్టిలో ఒక వెర్రి ఆలోచన ఉన్నది. ఎదిగీ ఎదగని దాని మనసుకు సంఘం విధించే కొన్ని నియమాలు అర్థం కావు మరి.... అందుకే.... "ఆ ఐశ్వర్యవంతులింటి ఆడబడుచులు పీట మీద కూర్చుని తనచేత కాళ్లకు పసుపు రాయించుకుని, బొట్టు పెట్టించుకుని సలక్షణంగా వాయనం తీసుకుంటారు. అక్క చుక్కమ్మ ఆత్మ శాంతి పొందుతుంది.

'దెయ్యమై పోతుంది!' అన్న ఆ పక్కింటి ముదనష్టపుదాని శాపం ఫలించదు." ఇదే లక్ష్మి ఆలోచన.

అందుకే అజ్ఞానం ఇచ్చిన ధైర్యంతో అడుగు ముందుకు వేసింది, ఆ ఇంట్లోకి.

కాని.....

అవి ఇళ్లు కావు... సంఘంలో అరలు కట్టుకుని ఎవరికి వాళ్లు ఏర్పాటు చేసుకున్న జైళ్లు; ఏకాకితనం మనసుకు పట్టించుకుని, స్వార్థం మేసే నిప్పుకోళ్ల గూళ్లు.

ఆ ఇంట్లో అందరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. పేరంటం జరుగుతోంది. అందమైన జలతారు చీరలతో ఖరీదైన నగలతో మెరిసిపోతున్నారు, ఆ ఇంట్లో మనుష్యులు. పాపం, వచ్చేటప్పుడు ముఖం కడుక్కుని తల దువ్వుకునే వచ్చింది లక్ష్మి. కానీ, వాళ్ల మధ్య ఆ పిల్ల అలుగ్గుడ్డలా అనిపించింది వాళ్లకు. మానసిక అశుభ్రత దాచుకుని కడిగిన ముత్యాలమనుకునే ఆ నాగరికులకు ఆ పిల్ల కిలుంగ్లాసులా కనబడింది. అంతకన్నా భరించలేనిది ఆ పిల్ల కోరిక.

వికటంగా నవ్వారు.... ఏ మాత్రం సిగ్గుపడకుండా వెక్కిరించారు. తామెంత దిగజారిపోతున్నామో, ఎదుటివారి కన్నీటి బొట్టు ఏ రకమైన శాపంగా మారుతుందో తెలియనితనంతో వేళాకోళమాడారు.

అక్కడే చాపమీద బొమ్మల పేరంటానికి వచ్చి కూర్చుని ఉంది పెద్దరెడ్డి భార్య తులసమ్మ.

గుడ్లల్లో నీళ్లు గుడ్డలో కుక్కుకుంటూ భోరున ఏడ్చే స్వతంత్రం, జరిగిన అవమర్యాద చెప్పుకునే దిక్కూ లేకుండా వెళ్లిపోతోంది లక్ష్మి గడపదాటి.

"లక్ష్మీ!" ఎవరో పిలిచారు రోడ్డుమీద.

అరచేత్తో కళ్లంబడి నీళ్లు తుడుచుకుంటూ, బెక్కుతూ తలెత్తి చూసింది లక్ష్మి.

సొంత రిక్షాలో పెద్దరెడ్డి భార్య.

"రా! మా ఇంటికి పోదాం రా! నేను తీసుకుంటాను వాయనం...." ఆశ్చర్యపోయింది. లక్ష్మి.

భావోద్వేగం వగైరా మాటలు అర్థం కావేమో కానీ ఎదటివారి బాధను, తమ దృష్టితో కొలవడంలాంటి గుణాలు కొంతమంది సంస్కారవంతులకు జన్మతః ఉంటాయి.

అందుకే అంతటి ఇల్లాలు... ఆ ఊరంతటికీ మహారాణి.... చెయ్యి చాచకలిగింది లక్ష్మిని రిక్షాలోకి ఎక్కించుకోడానికి. బెదురుతూనే బండి ఎక్కింది లక్ష్మి.

మాటల్లో అక్కమీద ప్రేమా, చుక్కమ్మ చుక్కల్లో కలిసిపోవడం, పక్కింటి ముగ్గు మాసింది అక్కను తిట్టే తిట్లూ... ఇవన్నీ చెప్పేస్తోంది, వింటోంది ఆవిడ సోగకళ్లతో. ఇంతింత ఆ కళ్లల్లో ఎంతో ఆలోచన. చుక్కమ్మ ఎందుకు

చచ్చిపోయిందో, చక్కదనాన్ని తన భర్త ఎలా కాటేస్తాడో తెలిసిన ఇల్లాలు ఆవిడ.

"రా!" లోపలికి తీసుకువెళ్లి కుర్చీలో కూర్చోపెట్టి కాఫీ ఇచ్చింది. కాళ్లకు పసుపు రాయించుకుని, కుంకుమ తీసుకుని, ముత్తయిదువు వాయనం తీసుకున్నది. ఆనందంగా ఆశ్చర్యంగా విచిత్రంగా చూస్తూ బోలెడు సంబరపడిపోయింది లక్ష్మి.

ఇప్పుడు చుక్కమ్మ ఆత్మ స్వర్గానికి నేరుగా వెళ్లిపోయిందనుకున్నది.

చేతుల్లో చీర చూస్తూ కూర్చుంది తులసమ్మ.

"లక్ష్మీ! నేనొకటి చెపుతాను, వింటావా?" మెల్లిగా అడిగింది ఆ ఇల్లాలు.

"ఏంటమ్మా?" అనుమానంగా అడిగింది లక్ష్మి.

"ఇదుగో, ఆ తురాయి చెట్టుకింద పచ్చి బాలింతరాలుంది... చుక్కమ్మలా అన్యాయమైపోయిన పిల్ల... ఈ చీర పాపం, ఆమెకు కప్పిరా... చలిలో బాధ పడుతోంది...."

"అదేంటమ్మగారూ?" తెల్లబోతూ అడిగింది లక్ష్మి.

"అదంతే.... చూడు. నువ్విచ్చిన చీర నాకున్న వందచీరల్లో ఒకటి. అవునా? ఇది నా చీర కాబట్టి, నువ్వు నాకిచ్చేశావు కాబట్టి, నేను ఎవళ్లకైనా ఇవ్వచ్చు.... కానీ, నువ్వు నీ చేత్తో ఇచ్చి చూడు. ఆ ఎండ వానలో అవస్థపడుతూ చిరిగిన చీరలో ఆ పచ్చి బాలింతరాలికి.... కలిగే సంతోషం.... అదుగో, అదే ఆత్మతృప్తి పడటం అంటే.... అర్థమైందా?"

సందేహంగా చూస్తోంది లక్ష్మి.

"కావాలంటే.... ఆ చెరువు ఒడ్డున ఉన్నారే మహానుభావులు... ఆయనను అడుగు...." మెల్లిగా మాటలు పేరుస్తూ అన్నదామె.

అప్పుడు ఉలిక్కిపడింది లక్ష్మి.

"ఆరు మీకు తెలుసా? ఆయన గొప్పోరా అమ్మగారూ?" అడిగింది మేకకళ్లతో.

ప్రపంచం అంతా చాలావరకు మేకలే. బలవంతులు ఐశ్వర్యవంతులూ తోలే త్రోవలో పోవడానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటారు. మాట్లాడలేదు తులసమ్మ.

ఏమని చెప్తుంది? అతను తన మేనబావ అని చెప్తుందా? అతని పేదరికం తనను అతనికి దూరం చేసిన విషయం చెపుతుందా? డబ్బుతో, ఎకరాలతో, చక్కెర ఫాక్టరీ షేర్లతో తన చక్కదనాన్ని మంగళ సూత్రం అనే లైసెన్సు బిళ్లతో దోచుకున్న భర్తను గురించి చెపుతుందా? తను దొరకలేదని వేదాంత్రె, తిరిగి ఇక్కడ జనానికి జ్ఞానం చెప్పాలని వచ్చిన ఆ యతి గురించి చెపుతుందా? తన భర్తలాంటివారు ఊరును దోచుకుంటూంటే ఊరిమధ్య మూగదేవత భోగాలతో తృప్తిపడుతూంటే, ఊరి చివర చెరువు ఒడ్డున ఉండి, మందలాంటి మనుష్యులకు తెలివి నేర్పి రెచ్చగొడుతున్నాడన్న అసూయతో అతన్ని అంతమొందించాలన్న పెద్దల గురించి చెప్తుందా?

కళ్ల నుంచి ధారపాతంగా కన్నీరు కురుస్తూంటే. తలుపుకానుకుని శూన్యంలోకి చూస్తున్న ఆ అభాగ్యురాలైన సౌందర్యవతిని చూడగానే పాపం, ఎందుకో లక్ష్మికి జాలేసింది.

"అట్లాగే.... మీరు చెప్పినట్లే చేస్తా అమ్మగారూ!...." అన్నది.

ఆ మాటల్లో ఆవిడకు ఓదార్పు, ఉద్ధరింపు రెండూ వినిపించాయేమో ఉలిక్కిపడింది ఆవిడ.

"చూడు లక్ష్మీ! నీకేం కావాలన్నా నా దగ్గరకురా, ఏం? ఒకవేళ ఈ అమ్మగారు పోయిందనుకో... అప్పుడు మా ఇంట్లో నాకు శ్రాద్ధాలు క్రతువులూ చేస్తారు, దానాలిస్తారు... అయినా నువ్వు మాత్రం మీ యతినడిగి డబ్బు తీసుకుని ఒక మనిషికి ముత్తైదువుగా పెట్టేం...." కళ్లనీళ్లు ధారాపాతంగా కారుతూ సర్వైశ్వర్య సంపన్నురాలైన ఆ అభాగ్య యువతి కోరికకు అర్థం ఏమిటో..... ఆ ఎదిగీ ఎదగని పిల్లకు అర్థం కాలేదేమోకానీ చీర తీసుకుని మెల్లగా చెట్టు కిందకు నడిచింది....

"పశుపతి అంటే ఎవరు? గొడ్డూ, గోదా కాచుకునేవాడు కాదు... మనుష్యుల్లో పశుత్వం అణిచి, దైవత్వాన్ని ప్రతిష్ఠింపచేసేవాడు.... ఉపవాసం అంటే మనలో బలవత్తరమైన కోరికలకు అడ్డు వేయడం.... అంతేకానీ అన్నం మానుకుని, ఇష్టమైన వన్నీ తినడం కాదు...." ఇలా చెపుతున్నాడు యతి జనానికి. ఇతని ఉపన్యాసంవల్లో, జనాన్ని ఆలోచింప చెయ్యడంవల్లో మందలాంటి మనుష్యుల్లో అలజడి ప్రారంభమైంది. ధన బలం, అధికార మదం ఉన్నవాళ్లు ఇది భరించలేకపోయారు. యతి తమ స్థానాలకే ఎసరు తెస్తాడన్న భయంతో అతణ్ణి చంపడానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

పెద్దరెడ్డి ఇంట్లో జరిగే ఈ సమావేశం తెలిసింది తులసమ్మకు. ఎదురు తిరిగింది, భర్తకు మొదటిసారిగా.

"నువ్వు పొరపాట్లు చేస్తే నేను పట్టించుకోలేదు. తప్పులు చేస్తే నిన్ను క్షమించమని దైవాలకు మొక్కాను. నువ్వు పాపాలు చేస్తే, నీ బదులు నన్ను శిక్షించమని ఏడ్చాను. కానీ, ఇప్పుడు నువ్వు చెయ్యబోయేది వీటన్నింటికీ మించింది" అన్న ఆమె మాటలకు ఆశ్చర్యపోయాడు పెద్ద రెడ్డి. ఎప్పుడూ ఎదురు తిరగని ఆ మామూలు ఇల్లాలు మహిషాసుర మర్దనిలా చూసేటప్పటికి పంతం వచ్చింది అతనికి. గొడ్డును బాదినట్లు బాదాడు.

"ఈ రాత్రే వాడి అంతు చూస్తాను." అని ప్రతిజ్ఞ చేశాడు. అందుకే పదేళ్ల తరవాత మొట్ట మొదటిసారిగా, అడుగులు తడబడుతూ అతణ్ణి చూడ్డానికి వచ్చి, తురాయి చెట్టు చాటునుంచి అతని మాటలు వింటోంది ఆమె ఆమెకు తోడుగా వచ్చిన లక్ష్మి ఆశ్చర్యంగా ఇద్దరివంక మార్చి మార్చి చూస్తోంది.

కళ్లెత్తి చూడలేక తలవంచి నమస్కరించింది తులసమ్మ. తడబడుతూ విషయం చెప్పింది.

ఆశ్చర్యపోలేదతను. హాయిగా నవ్వాడు.

"నేను నమ్మినవి శ్రీ చరణాలు. సర్వేశ్వర చరణాలు. అవే నన్నాదుకోకపోతే, మనుష్యులు, పలాయన మార్గం కాపాడతాయనుకోవడం కల్ల...." స్పష్టంగా చెప్పాడు.

ఆశ్చర్యపోయిందామె. అతని ఆత్మస్థైర్యానికి. భయపడిపోతోందామె, అతని ప్రాణాలకోసం.

'ఎక్కడో ఒకచోట, ఎలాగోలాగ బ్రతికుంటే చాలు' అన్న పిచ్చి బేల ప్రేమికురాలైపోయింది.

రెండు వందల ఎకరాలు, నాలుగు కిలోల బంగారం ఉంది. ప్రపంచపు దృష్టిలో మహారాణి అయిన ఆ యువతి ఆయన కాళ్లమీద తెగిన పూదండలా పడి ఏడ్చింది. ఆ దృశ్యానికి లక్ష్మి ప్రేక్షకురాలిగా మిగిలిపోయింది.

అఖరి అస్త్రం.... "నా కోసం... నా కోసం పారిపో..." అని రెండు చేతులూ జోడించింది.

నవ్వాడతను. వెన్నెల్లో అతని నవ్వు కాంతికిరణమై... భూమినించి ఆకాశానికి ప్రయాణించింది. చంద్రుడు మరింత ప్రకాశవంతంగా వెలిగాడు, చుట్టూ నది... వెండి వెన్నెలా... సాక్షీభూతంగా తురాయి చెట్లు, అమాయకురాలు లక్ష్మి. "నువ్వు లేని ప్రపంచంలో సర్వం పోయిందనుకున్నాను నేను. కానీ సర్వంలోనూ నువ్వు, నేనూ, మనందరం కూడా ఛాయామాత్రంగా చూసే స్థితికి వెళ్లాను నేను... నువ్వు, నేను వేరనే స్థితి వెళ్లిపోయింది ఎప్పుడో. ఈ జీవన్నాటకంలో నీ పాత్ర నువ్వు పూర్తి చెయ్యి. నా పాత్ర నేను వేస్తాను. నీ భర్త పాత్ర అతను పూర్తి చేస్తాడు. ఎటొచ్చీ తుది మొదలు తెలిసి ఏదీ నన్ను అంటకుండా నేను ప్రవర్తిస్తున్నాను. అర్థమయీ అర్థమవని స్థితిలో నువ్వున్నావు.... అజ్ఞానంలో అతడున్నాడు – అంతే...."

అవాక్కైపోయింది ఆమె. ఆశ్చర్యంగా చూసింది. అతను ఏదో తననుంచి దూరమై విరక్తితో 'యతి' అయ్యాడనుకుంది. ఇన్నాళ్లూ తన అహం ఆ రకంగా సంతృప్తి పరుచుకొని బతుకుతోంది.

కానీ అతనూ? తననూ, తన భర్తనూ, ఈ ప్రపంచాన్ని – వీటన్నింటినీ కూడా ఒకే రేఖలో చూడగలిగినంత ఎత్తుకు ఎదిగాడు... తనొక పాత్రధారినంటూ, తనేమిటో అసలేమిటో చెప్తున్నాడు.

అహం, అభిజాత్యం, తన స్త్రీత్వానికుండే సౌందర్య గర్వం – ఇవన్నీ పొరలు పొరలుగా ఆమెను వదిలిపోతున్నాయి. మానవత్వం, పరిపూర్ణ స్త్రీత్వం నిండిన ఆ స్త్రీ మూర్తిలో ఏదో వెలుతురు.... వెలుగు... చెంపన చెయ్యి పెట్టుకుని ఆ ప్రశాంత సమయంలో అతని పాదాలవంక చూస్తూ కూర్చున్నది. ఆ తురాయి చెట్టు చీకటి నీడలో, ఆ వెలుతురులో ఆ ముగ్గురూ ఏదో అదృశ్య హస్తం వెలిగించిన దీపాల్లా ఉన్నారు.

కానీ పరిపూర్ణత అజ్ఞానాన్ని భరిస్తుందేమో కానీ, అజ్ఞానం, మూర్ఖత్వం సౌందర్యాన్ని సత్యాన్ని నిశ్చలత్వాన్ని భరించలేదు.

తన మూర్ఖపు పట్టుదలతో యతిని చంపక తప్పదంటున్న భర్తను ఆపలేక ఆత్మార్పణ చేసుకున్నది పెద్దరెడ్డి భార్య - తులసమ్మ.

తన అసూయకు కారణమైన అసలు వ్యక్తి పోగానే, అసలు ఆమే, తనకు ఏమిటో తెలుసుకుంటున్న రెడ్డి చల్లబడ్డాడు. ఆ సంవత్సరం ఎలక్షన్లలో అతను నిలబడలేదు. వడ్డీ వ్యాపారం మూసేశాడు. అదివరకు పటాటోపం లేదు. ఇప్పుడిప్పుడే ఆలోచిస్తున్నాడు.

ఆవిడ సంవత్సరీకాలు మరెవ్వరూ చేయించలేనంత ఆర్భాటంగా చేయించాడు రెడ్డి. వెండి గ్లాసులు, జరీ ఉత్తరీయాలు ఇచ్చాడు. తొమ్మిది మంది ఖరీదు గల ముత్తయిదువులకు పట్టు చీరలు పెట్టించాడు.

కానీ - నది ఒడ్డున చింకి గుడ్డల లక్ష్మి, డబ్బంతా దాచుకుని మిల్లు చీర కొన్న లక్ష్మి, ఏటి ఒడ్డున పడుకున్న ముసలిదానికి ఆ చీర ఇచ్చి, అమ్మగారి పేరు చెప్పి, కన్నీళ్లతో దణ్ణం పెడుతున్నది... సాక్షీభూతంగా నిలబడి చూస్తున్నాడు యతి. రెడ్డిగారి భార్య రూపంలో వచ్చి మౌనంగా అతని పాదాలు తడుపుతోందా అన్నట్లున్న ఆ నదీమతల్లి.... ఆమె కన్నీటి ఆశీర్వచనాలా అన్నట్లు రాలుతున్న తురాయి పూవులు.....

ఈ అద్భుత సౌందర్య దృశ్యాన్ని సర్వేశ్వరుడనే మహా చిత్రకారుడు తప్ప రచించలేడేమో!

*(వనిత - మార్చి, 1988)*

# నల్లబట్టలు

మత మౌఢ్యం నల్లమందు లాంటిది. ఆ మాటంటే నిజమే ననిపిస్తుంది.

అహంకారం అజ్ఞానానికి నాంది. అవునవును. ఆ మాటా నిజమే ననిపిస్తుంది.

బాధ్యత చాలా బరువైంది....

అది మనం మోసేటప్పుడు నిజమనిపిస్తుంది.

కానీ, జీవితం?.... అది వేరు... ఈ మాటలన్నింటి మధ్యనుంచీ సాగిపోయి అది ఒక కొత్త స్వరూపాన్ని సంతరించుకుంటుంది.

నేను ఈ దేశంలో పుట్టి పెరిగిన సామాన్యపు ఆడపిల్లను. దేశభక్తితో అన్యాయాన్ని ఎదిరించాలని ఆకలి చావుతో చచ్చిపోయిన నా తండ్రి నాకు పెట్టిన పేరు "ప్రియభారతి."

నా వాతావరణంలో తులసి పూజలు,. ఖడ్గ సృష్టులు, రైలు రొఖోలు, లెక్క పెట్టి రోజుకు ఇంతమందిని కాల్చాలన్న మాస్ హిప్నాటిక్ సజెషన్స్, మతాల మారణహోమాలు, మిరపకాయలు అరవై రూపాయిలు అయినా 'అయ్యో....' అని దవడలు నొక్కుకుని, మళ్లీ పది నెలలకు సరిపడ పచ్చళ్లు పెట్టే వృద్ధ పిడివాళ్ళు, వాళ్ళను కాదన లేని రుచుల నాలుకలు, ప్రతి ఒక్కడూ కష్టపడి పనిచెయ్యాలని గంటలు కొద్దీ ఏ పనీ చెయ్యకుండా కబుర్లు చెప్పే కర్పూర వసంతరాయుళ్లు – ఇలా ఇదేమిటి అనేక రకాల చీకాకుల మధ్య, అర్థం చెప్పలేని ఐడియాలజీల మధ్య పెరుగుతున్నదాన్ని నేను.

మర్చిపోయాను.... ఆడదానికి ఐడియాలజీ ఏమిటి?! అర్థం అయినా కాకపోయినా ఆచారాల్ని కాదనడమేమిటి?

అందుకనే, ఆలోచించకుండా, ఆలోచించనీయకుండా రేషన్ కార్డుల దగ్గర నుంచి, బలవంతంగా ఓటు వేయించడం వరకూ సకల చికాకులు తేగల సమర్థమైన పాలకులకు ఓటు వేసేస్తాను నేను.

ఇప్పుడు సమస్య నా ఆడబడుచు. పద్దెనిమిదేళ్ల అరుణ. అందమైంది. "నా రక్తం ఎరుపు.... నా ఆలోచనే పిలుపు..." అంటూ స్లోగన్లు చెబుతూంటుంది,

మా అత్తగారి దౌష్ట్యానికి భయపడి, అన్నీ ఎవరో ఒకరం సర్దిపెడుతూంటే, ఏది ఎలా వస్తోందో కూడా తెలియని ఒక రకమైన అమాయకురాలు. కానీ వాదనలో ధైర్య సాహసాల్లో....

మా అత్తగారి కుటుంబంలో మొదటి పాంటు షర్టు, పులి పంజా, ఏ పంజాబులోనో పుట్టి వుంటే పిస్తోలు పట్టుకు తిరిగేదేమో... అప్పుడప్పుడు ఆ పిల్లను చూసి నోరావలించడం తప్ప ఎవరం ఏం చెయ్యలేము. కారణం ఇంట్లో అడిగే హక్కున్న అన్నయ్య మెతక. "ఎప్పుడో ఎవడితోనో లేచిపోతుంది ఈ పింజారిది" అని ఒణుకుతూ వుంటారు మా అత్తగారూ, ఆవిడ అత్తగారూ కూడా.

పరాయి పిల్ల అయితే ఏమనేవారో కానీ, సొంత పిల్ల కాబట్టి "దానికి సాహసం ఎక్కువ. కానీ, చూశావుటే... ఛస్తే పరాయివాడి వంక చూడదు...." అని సమర్థించుకుని బతికేసే వృద్ధ జంబుకాలు వాళ్ళు.

"అయినవాడుంటేగా.... పరాయి వాడెవడో తేల్చుకుందుకు" అనేసి బూట్లు టకటకమనిపిస్తూ వెళ్లిపోయేది అరుణ. అరుణ ఆలోచన లేని ఆవేశం, అర్థం చేసుకోలేని ఉద్యమం, ఎవరేది చెబితే. అది విని సుడిగాలికి కొట్టుకుపోయే ఆదర్శం... ఇవన్నీ చూస్తే నాకు కొంచెం భయంగానే వుండేది.

అదే నిజమైంది ఆ రోజు.

అరుణ ఈడ్చి లెంపకాయ కొట్టింది నడి రోడ్డు మీద. ఒక మొగాడిని... ఆడపిల్ల అయి వుండి మొగాడిని కొట్టడమే కాకుండా, చాలా డబ్బున్న, డబ్బిచ్చిన మదమాత్సర్యాలున్న రావుగారి అబ్బాయిని కొట్టింది! కారణం - అసభ్యకరమైన వాగుడు, చెయ్యి పట్టుకుని లాగడం లాంటి అతనికి చాలా మామూలైన ఆట. "కొట్టడంతో ఆగాను.... నడిరోడ్లో ఉప్పుపాతర వేయాలసలు...." పళ్లు పటపటలాడిస్తూ 'సగటుమనిషి'లో హీరోయిన్లా అరచింది.

కానీ .... ఆ సాయంత్రం శ్రీముఖం వచ్చింది.

"ఏమనుకుంటోంది అది... ఈ రాత్రి పన్నెండు గంటలకు దాన్ని ఎత్తుకు పోయి..." అక్షరాలు ముదతలుపడ్డాయి అసభ్య వాక్యనిర్మాణంలో....

నా గుండెలు మోకాళ్లలోకి జారిపోయాయి ఆ ఉత్తరం చూడగానే.

"సమయానికి అన్నయ్య కూడా లేరూ!" మెల్లిగా అన్నాను.

"ఆc! అంటే తల తీసి మొలేస్తాడు మొగాడు. మీ ఆయన సమర్థతే చెప్పు ఒంట్లో తెల్ల రక్తం మనిషి...." అవేశంతో ఊగిపోతోంది అరుణ.

"ఆడపిల్లకు అణకువా, వినయం...." ఎలాగూ ఏ కంట్రోలూ చెయ్యలేనని తెలిసిన వృద్ధాప్యపు జులుం ఇంట్లో సణుగుతోంది.

తెల్లారితే? చీకట్లోకి చూశాను....

పక్క ఫ్లాటులో కొట్లాట... "అన్నం పెట్టొద్దు వాడికి, సంపాదించి తేకపోతే... జులాయి తిరుగుళ్లు...." అని చేతికి ఎదిగొచ్చిన కొడుకు, చేతికి అంది రాలేదని బైటకు తోసేస్తున్నాడు ట్యూషన్లు చెప్పి సంపాదించే మాష్టరు. గుడ్లనీరు కుక్కుకుంటోంది. మాతృత్వం.

"అమ్మా! అమ్మా!" పసి చేతులు, పసి మాటలతో మూసి వున్న పక్కగదిలో, తండ్రి లైసెన్సుడు కామానికీ, బలవంతపు కోరికకు బలైపోతున్న తల్లిని పిలుస్తున్నాయి.

"పిల్లండీ... పిలుస్తోంది.... ప్లీజ్...."

ముందు ఎవరైనా వింటారని మెల్లగా, ఆ తర్వాత భరించలేక గట్టిగా అంటోంది పాతివ్రత్యాన్ని మరుగుపరుస్తూన్న - మాతృత్వం.

కింద ఫ్లాటులో మంగళ తోరణాలు .... మధ్య ఫ్లాటులో తండ్రి పోయిన బిడ్డల ఆక్రోశాలు....

అంతా గందరగోళం. ఒకళ్లింట్లో కాలింగ్ బెల్లుకు పక్క వాళ్లు తలుపు తీయడం, పైన ఫ్లాటులో "పాలు" అని అరుపు వినిపిస్తే కిందవాళ్లు గిన్నె తీసుకుని బైటకు రావడం సర్వసామాన్యమైపోయినాయి. అందుకే ఇల్లాంటివి వేటికీ రియాక్ట్ కారు. రేషను మీద ఏమిస్తారో కలిసి ఆలోచిస్తారు. నీళ్లు రాకపోతే కలిసి పోట్లాడుతారు. కానీ, పక్కింట్లో బియ్యం లేకపోతే పట్టించుకోలేరు. ఎవరి జీవితం వారిదే. ఈ కలగాపులగాల గందరగోళపు ఫ్లాటు నాగరికతలో ఎవరి గొంతు వారే వినాలి....

మరి ఈ జనారణ్యపు ఒంటరితనంలో ఈ పిల్ల గురించిన మధన నేను ఎవరికి చెప్పాలి?

చీకట్లో మేడ మీద నుంచి తొంగి చూశాను. భయం.... గుండెలు పట్టుకుపోయినట్లైంది. ఇంటి చుట్టూ మూక.

స్కూటర్ల మీదా, సైకిళ్ల మీదా.... కొంచెం దూరంగా కొంతమంది చెదురు మదురుగా... అక్కడక్కడ .... రావుగారి అబ్బాయి గాంగు.... నలుగురైదుగురు నాకు తెలుసు.

ఆ రోడ్ల మీద వాడిదే జులుం... వాడి గాంగు చిరపరిచితులు అందరికీ... వాడి బలానికి భయపడీ, ఆ భయానికి భయపడీ రావుగారిని కౌన్సిలరును చేసిన సచ్చరిత్రులు మా కాలనీవాళ్ళ బలం. భయం తెలుసు నాకు డబ్బు బలం, శారీరక బలం, పదవి బలం.... అర్థమైన అజ్ఞానపు బలం వాడిది. నైతిక బలం, ఆధ్యాత్మిక బలాల గురించి వినడమే కానీ, అనుభవం ఎరగని జనం, వాటి గురించి మాట్లాడుకుని తృప్తిపడుతున్నంతకాలం రావుగారి అబ్బాయి రాజ్యం సాగుతూనే వుంటుంది. తప్పదు.

దేనికీ అర్థం లేని, స్వార్థానికి మాత్రం ఉపయోగపడే సాంఘిక, నైతిక సూత్రాలు కొన్ని సృష్టించుకుని బతికేస్తున్నారు జనం. "నేను సైతం...." పాడుకుంటూ పిల్లల్ని దేశానికి ప్రసాదిస్తున్నారు. ఈ పెరిగే జనం, పెంచడం చేతగాని తల్లిదండ్రుల చేతుల్లో పెరుగుతున్న జనం దేనికి భయపడతారో, ఎందుకు ఒణుకుతారో తెలిసినవాళ్లు రావుగారి కుటుంబస్థులు.

బతిమాలి చెపితే వినని విషయాలు, సైకిలు చైన్లు, సోడా బుడ్లు, బలాత్కారాలు, నోట్ల కట్టలు కనిపించి, ఒప్పిస్తాయని తెలుసు వాళ్ళకు. అదొక విడికులం. ప్రత్యేక మతం... వాళ్ల గోత్రం మాత్రం "జులుం."

అందుకే ఎదురుతిరిగిన 'అరుణ'ను అంతటితో వదలకూడదని తెలుసు రావుగారి అబ్బాయికి.

"ఇది ఊరా వల్లకాడా? అలా రౌడీ వెధవలు ఇంటి చుట్టూ చేరితే మాట్లాడరేం ఒక్కరైనా?" ముసలమ్మగారి సణుగుడు.

భయాలకు, జ్వరాలకు, గవదబిళ్లలకు దడుపు విభూది పెట్టే ఈ ముసలమ్మ చిటికెడు ఆశీర్వాదం పెట్టదేం? పెట్టదు, పెట్టలేదు. కారణం – ఈ భయం అర్థాలకు అతీతమైంది కాదు కాబట్టి. ఎదుట చీకట్లో వెలుగుతున్న సిగరెట్టు నిప్పు, సైకిలు చైను, కళ్లల్లో కసి చాలా అర్థమైనవి కనుక. ఇవి వాటిలా గుండెల్లో ఏదో దడుపు కాదు. నరాలు చల్లబరిచే భయం. నిర్జీవతతో జీవితాన్ని పారలైజ్ చేసే ఏదో గుబులులాంటి భయం.

ఏం చెయ్యాలిప్పుడు? పోలీసులకు ఫోను చేస్తే.... వెంటనే వాళ్ల "లంచాలు, చందాలు, వంకర చూపులు, ఫిర్యాదు ఇవ్వడానికి వచ్చిన ఆడపిల్లను లాకప్పులో వుంచి ఉరెయ్యగల రావుగారి ఇన్ఫ్లుయన్స్ గురించి గత చరిత్ర....

అమ్మో... ఆ తద్దినం పిలిచి తెచ్చుకోవద్దు... డబ్బులున్నవాళ్లకే పోలీసులు... మనకు కాదు...

ఏం చెయ్యాలి? అరుణను ఎత్తుకుపోతే? ఆ భయంకరమైన ఉత్తరం కళ్ళముందు... మానభంగం, చిత్రహింస..., అమ్మో! కళ్ళు మూసుకుని ఆలోచించాను.... ఏం జరిగితే ఏం చేస్తాం?

అయితే ఏం!? డి. కామేశ్వరిగారి కథ గుర్తుకు వచ్చింది... అసలు, ఈ మానాలకు ఇంత గౌరవాలిచ్చి, ఆ అమ్మాయిలను సాంఘికంగా పొడిచి చంపి మనమే ఛండాలురకు ఇంత క్రేజు పుట్టిస్తున్నామేమో! ఏమవుతుంది!? ఒంటికి బురదైతే కడిగి తలంటిపోసి లోపలికి తెచ్చుకోమూ?

అమ్మో! ఏమిటి ఇలా ఆలోచిస్తున్నాను. కానీ, ఆ ఆలోచనతో ఏదో ధైర్యం వచ్చింది. అరుణ భుజం మీద చెయ్యి వేశాను.

"వదినా!" అరుణ గొంతులో వణుకు ఏదో బెదురు.... గుండెల్లో తలదాచు కుంది పద్దేనిమిదేళ్ల పసిపిల్లలా. కష్టంలోనూ నవ్వొచ్చింది నాకు ఒకొక్క మనిషిని ఒకొక్క రకంగానే ఊహించడం ఎంత తప్పు? ఎన్ని కోణాలు ఈ మనుష్యుల్లో!?

మెల్లగా రాత్రి ఆవహిస్తోంది.

"ఏమిటి గోల? ఇంటి చుట్టు ఈ రౌడీ గాంగేమిటి?" అంటూ ఇంటి చుట్టు పక్కలవాళ్లు ప్రశ్నిస్తున్నారు. కొంత మంది సమాధానం తెలిసీ, ప్రశ్నించి తలుపులు వేసుకుంటున్నారు మాట్లాడిన ప్రతి ఒక్కరూ–

"ఆడపిల్లకు అంత దుడుకా! పైగా రౌడీ వెధవతోనా కాలు దువ్వడం!? అని అరుణను తిట్టి, అలా పెంచినందుకు మమ్మల్ని తిట్టి, ఎవరిళ్లల్లోకి వాళ్లు దూరిపోయారు.

ఏం చెయ్యాలి?.... ఇద్దరు ముసలమ్మలు, ఇద్దరు ఆడవాళ్లం. ఏమిటి దారి? అర్ధరాత్రి రౌడీ గాంగ్ ఇంటిమీదకు రైడ్ చేస్తే...? వాళ్లు ఇలా చేసి పిల్లల్ని ఎత్తుకుపోయిన కథలు చాలా వున్నాయి.

వెంకట రమణమూర్తికి ముడుపులు కడుతోంది ముసలమ్మ ఏడుస్తూనే ఏవో మొక్కులు మొక్కుతోంది.

"అమ్మా! దణ్ణం పెట్టుకోవే తల్లీ దీర్ఘాలు తీస్తోంది. అలవాటుగా దణ్ణం పెట్టాను నేను. అరుణ కూడా కన్నీళ్ళు తుడుచుకుంటూ చేతులు జోడిస్తోంది. అంత టెన్షన్‌లోనూ, నవ్వొస్తోంది నాకు

'దేముడా! నువ్వు భక్తవశంకరుడివో కావో కానీ కొంతమందికి నీ పేరు మాత్రం 'భయం?'

బయట ఏదో కలకలం.... ఉలిక్కి పడ్డాను నేను....

మా చిన్న కిటికీ చీకటిలోనుంచి బోలెడంత భయాన్ని లోపలికి మోసు కొస్తోంది.

స్ట్రీటు మొత్తం కనబడని భయం వరదలా ముంచెత్తుతున్నది. గుంపులు గుంపులుగా జనం.... విడ్డూరంగా చూస్తూ, చేతులు వెనక్కు పెట్టుకుని మా రోడ్డు తప్పుకుని పక్కరోడ్డు మీదుగా పోతున్నారు వాళ్లు.

"ఒక్కరూ ఆలోచించరేం.... ఏం భయపడకండి, మేమున్నాం అనరేం" ఒణుకుతోంది అరుణ.... ఆ పిల్లకు తెలుసు రావుగారి పరపతి, అతడి కొడుకు రాక్షసత్వం... నా చేతుల్లో ఆమె వున్న అరిచేతులు ఐసుగడ్డల్లా వున్నాయి.

'పిచ్చితల్లీ! గుండెల్లో నిబ్బరం, జీవించే ధైర్యం - కేవలం ఫాంటు, షర్టు, నోటిదురుసుతనం, కేర్‌నాట్ సైకాలజీ ఇవ్వవు. దానికి కావలసిన ధైర్యం వేరు...' ఆలోచిస్తూ ఆ పిల్లను దగ్గరకు తీసుకున్నాను.

"దేశంలో ఆకలి కరాళ నృత్యాన్ని చూసి, అందరికీ ఆకలి తీర్చాలని విప్లవ కారిణిని అయ్యాను. నా మానాన్ని, ప్రాణాన్ని తృణప్రాయంగా త్యజించి, మంచులాంటి ఒంటిరితనం గుండెలనిండా ఆవరిస్తున్నా అలాగే తిరిగాను. కానీ, నా ఆకలి బాధ.... దాన్ని తట్టుకోలేక పోలీసులకు లొంగిపోయాను...." పేపర్‌లో లొంగిపోయిన విప్లవకారిణి కథ గుర్తుకు వచ్చింది.

ఏకాస్త కలకలమైనా ఒంట్లో ఏదో కుదుపు.

ఆలోచించకుండా వుండాలని ప్రయత్నిస్తున్నాను.

నిశ్శబ్దం.... అది ప్రశాంతమైనది కాదు... టెన్షన్‌కు ప్రతిరూపంగా వుంది.

"డామిట్! ఒక్కళ్లు కూడా ఇదేమిటని అడిగేవాళ్లు లేరా? వెధవ దేశం.... ఏదైతే అదవుతుంది? నేను బయటకు వెళ్లిపోతాను వదినా.... ఏం చేస్తారో చెయ్యనీ .... నా వల్ల ఇంతమందికి టెన్షన్!" హిస్టీరికల్‌గా అరుస్తోంది అరుణ.

అది ఆ అమ్మాయి త్యాగం, ఆవేశం చూసి సంతోషించే సమయం కాదు. అది ఫక్తు హిస్టీరియా.

"ఊరుకో అరుణా!"

ట్రింగ్ ట్రింగ్... నిశ్శబ్దంలో టెలిఫోన్!

"మీకు ఫోనోచ్చింది...." పక్కింటి అమ్మాయి భయంగా చెప్పి తుర్రుమన్నది.

"హల్లో!"

"నేను రమణని. ఏమిటక్కడ గోల... మీ ఇంటికి వద్దామని బయలుదేరి వస్తూంటే.... మీ ఇంటి చుట్టూ జనం... అందుకనే మెయిన్ రోడ్డు షాపు నుంచి ఫోను చేస్తున్నాను.'

నా దూరపు తమ్ముడు, ఆ మాత్రం అడిగినవారు లేరేమో మమ్మల్ని... గబగబ చెప్పేశాను విషయమంతా...

"ఏదన్నా చెయ్యరా తమ్ముడు!...." నాకు ఏడుపు ఆగడంలేదు. "వాడిని ఎలా, ఏదీ, ఏమీ చెయ్యలేం ప్రస్తుతం..." రమణ అన్నాడు.

"వాడు నీ స్నేహితుడు కదరా!"

"అవును... కానీ .... చూద్దాం...."

ఆలోచిస్తున్నట్టున్నాడు రమణ అటు ఇటు టెన్షన్‌తో ఒణుకుతున్నాను. నేను.

"ప్రతి మనిషికీ ఏదో వీక్‌నెస్ వుంటుంది. ఈ రాక్షసుడికీ వుంటుంది. ఊ! సరే.... అరుణను బైటకు పోనీయకు. నేను ఏదో ఒకటి చేస్తాను...." రమణ మాటలు దేముడి మాటల్లా వున్నాయి ఫోనులో.... అంతకన్నా దిక్కులేని స్థితి అది.

"ఇదుగో స్లీపింగ్ టాబ్లెట్... వేసుకుని నిద్రపో. రమణ ఏదో ఒకటి చేస్తానన్నాడు..." ఇంటికి వచ్చి అరుణను కదిపాను.

"ఏమిటి వదినా చేసేది? ఒక్క మొగాడు.... ఒక్క మొగాడంటే ఒక్క మొగాడు..." అరుస్తూనే వుంది అరుణ.

కొంతసేపటికి,

ముసలమ్మ గోడకు ఆనుకుని

అత్తగారు మంచానికి అడ్డం పడి,

అరుణ కిటికీ దగ్గరనుంచి కిందికి జారి,.

నేను గుమ్మం దగ్గర....

తెలియకుండానే నిస్పృహలోకి స్పృహతప్పిపోయాము.... అది నిద్రకాదు. అన్నీ మర్చిపోయి విశ్రాంతి తీసుకోమని సబ్‌కాన్షస్ సంధించే సమ్మోహనాస్త్రం.

❀ ❀ ❀

కాలింగ్ బెల్.... ఉలిక్కిపడి లేచాను.

తెల్లవారింది.... పాల పేకెట్లు.

రోడ్డు మీదకు బెరుగ్గా చూశాను. అంతా మామూలుగా వుంది. ఏమయ్యారు వీళ్లంతా? ఏమైనట్టు?

టెన్షన్‌తో మరింత తెల్లవారింది

అప్పుడు వచ్చాడు రమణ.

చుట్టూ మూగాం అంతా, ఏమైందని....

"ఏమైందా? అటుచూడు ...." నవ్వుతూ కిటికీలోనించి చూపించాడు.

నల్లబట్టలతో, మాలతో రావుగారి అబ్బాయి స్కూటర్ స్టార్ట్ చేస్తున్నాడు.

"అదేమిటి? ఆ త్రాష్టుడికి మాలేమిటి?" పళ్లు పటపట కొరుకుతూ అన్నది అరుణ. వెలుగు పెరగడంతో వెరపు తగ్గిపోయినట్లుంది అమ్మాయికి.

"చిన్న ట్రిక్ చేశాను. మిమ్మల్ని రక్షించాలంటే ఏం చెయ్యాలో అర్థం కాలేదు నాకు. అర్థరాత్రి అరుణను ఎత్తుకుపోదామన్న ప్లానుతో వున్నాడని తెలిసింది. ఏం చెయ్యాలా అని ఆలోచించాను. వీడికి చదువు ఎలాగూ అబ్బలేదు. వాడికి ఏదో ఫ్యాక్టరీ పర్మిట్ తెప్పిస్తానన్నాడు వాళ్ల నాన్న. ఆ విషయం జ్ఞాపకం వచ్చింది. దానికి లంచాలు తినే మధ్యవర్తి నాకూ తెలుసు. ఆయన దగ్గరకు వెళ్లి చెప్పవలసినదంతా చెప్పాను. రాత్రి ఆయన కబురు పెట్టాడని వీడ్ని మీ రోడ్డు దగ్గరనుంచి నేనే తీసుకుపోయాను."

"ఎలా వచ్చాడు? నీ మాట ఎలా నమ్మాడు?"

"ఆయన తాలూకు మనిషిని వెంటబెట్టుకు వచ్చాలే. ఇంటికి తీసుకువెళ్లిన తరవాత బ్రెయిన్ వాష్ చేశాను కొంచెం. ఆ మధ్యవర్తి అయ్యప్ప భక్తుడు. మాల వేసుకున్నాడు. 'నువ్వు తెల్లవారుఝామునే మాల వేసుకుని ఆయనకు కనబడు. పొద్దున్నే నీ పని అయిపోతుంది' అని చెప్పాను.

"స్వార్థం ముందు అరుణ సమస్య, పౌరుషం నిలవదని నాకు తెలుసు. పైగా ఎంత దుర్మార్గుడైనా లౌక్యం, డబ్బు మీద పేరాశ వున్నవాడెప్పుడూ ప్రియారిటీలు తెలిసినవాడవుతాడు. అర్థరాత్రి టైలరును లేపి బట్టలు కుట్టించాను. పొద్దున్నే ఆ మధ్యవర్తిగారిని కలిసాం. ఆ లోపలే మాల వేశాం. ఎలాగూ లంచాలు తిన్నాడు.

"రెండు రోజుల్లో నీ పని అవుతుంది బాబూ! స్వామి శరణం" అన్నాడు. అది ఎలాగూ అయ్యేపనే. కానీ, ఆ క్షణం దాన్ని, నా పరిచయాన్ని అలా ఉపయోగించుకున్నాను.... మిమ్మల్ని రక్షించా నంతే...." రమణ సన్నగా, వంకరగా నవ్వుతూ చెప్పాడు.

"నా నాయనే - నా తండ్రే...." ముసలమ్మ, అత్తగారూ హడావుడి చేసేస్తున్నారు. అరిటాకు, వేడివేడి ఉప్మా, బోలెడంత ఆప్యాయత, అరుణ కళ్లల్లో మెరుపు.... నవ్వొచ్చింది నాకు. మొత్తానికి బ్రతకనేర్చినవాడు రమణ.

"ఆ అయ్యప్ప ఉన్నాడో లేదో కానీ, ఒరే రమణా! ఈ ఆచారం మాత్రం బావుందిరా! అర్థరాత్రి నిద్రపోయి, ప్రొద్దెక్కి నిద్రలేచే జనం అంతా చక్కగా స్నానాలు

చేసి, పొద్దున్నే పనుల్లోకి దిగిపోవడం, వెకిలి చూపులు, పిచ్చి లక్షణాలు మాని, కాస్త భయం భక్తి.... కానీకి గతిలేనివాడికి కూడా నల్లబట్ట లుండగానే పాదాభివందనం.... ప్రతి నీ ఈడు వెధవా తాగి తందనాలాడడమేనాయె. అల్లాంటిది దీని పుణ్యమా అని ఒద్దిగ్గా, తలకాయ వంచుకుని తప్పుకుపోతున్నారు..." సహం డిగ్రీ చదువుతూ మానేసిన మా అత్తగారు మాట్లాడేస్తున్నారు.

"అవును.... మాల వేసుకున్నాడని రావుగారి డ్రైవరు కాళ్లకి ప్రొద్దున్నే యువరాజావారు దణ్ణం పెట్టారు. బోలెడంత కాబట్టే "మార్పులే...." హుషారుగా అంటున్నాడు.'

ఆలోచిస్తున్నాను నేను.

❀ ❀ ❀

మర్నాడు ఒక తమాషా జరిగింది.

నడిచి గుడికి కాబోలు వెళుతున్నాడు రావుగారబ్బాయి, చెప్పులు లేకుండా.

ఎదురుగా పుస్తకాలు పట్టుకుని స్పీడుగా దూసుకుపోయింది బూట్లు టకటకలాడిస్తూ అరుణ.

ఇద్దరూ చూసుకోకుండా ఢీకొట్టుకున్నారు.

"సారీ! స్వామి శరణం...." లెంపలేసుకుంటూ పక్కకు జరిగిపోయాడు రావుగారబ్బాయి. ఆ తొలగిపోవడంతో రేపు లైసెన్సు రాదన్న భయం వుంది. రూల్సు సరిగ్గా పాటించకపోతే మొక్కుతీరదన్న భయం వుంది. అందర్నీ చూసి నేర్చుకున్న ఆదర్శం వున్నది. "స్వామి అయ్యుండి...." అని నలుగురూ నాలుగు అంటారన్న కన్నెస్వామి భీతి వున్నది.

అదేదన్నాకానీ... అతని రాక్షసత్వాన్ని కంట్రోలు చేసింది. అతనిచేత సారీ చెప్పించింది. అది ఎవరికీ? అరుణకు!...

ఆశ్చర్యపోతూ చేతులు జోడించింది అప్రయత్నంగా అరుణ. అరుణ నల్లబట్టలకు నమస్కరిస్తోంది. ఆమెలో బెరుకు వుంది. కొంత ఆశ్చర్యముంది. అతని మార్పు గురించిన అపనమ్మకమున్నది.

అయినా సరే.... అన్నది. "సారీ! స్వామి శరణం" అన్నది మెల్లిగా.

అటే చూస్తూ ఆలోచిస్తున్న నాకు అర్థమైంది కొంత.

ఆచారానికి వెనకాల వున్నది అందమైన అవసరం. దాన్ని కాపాడేది పేరు పెట్టిన భగవంతుడనే భ్రాంతి. అందుకే ఎంతమంది ఎన్ని స్లోగన్లు చెప్పినా నా దేశం నుంచి మతం పోవడం లేదు. దానికి కారణం మార్మికత, ధార్మికత, కార్మికతకు గౌరవం వుండో అగౌరవం వుండో కాదు. ఇక్కడ అహింస, ధర్మం, సత్యం. సమానత్వం ఏదో ఒక మతాన్ని దాని పాలికాపనుకునే భగవంతుణ్ణి అడ్డం పెట్టుకుని బతుకుంది. మొట్టిన ఉంగరాల చేతిని ముద్దుపెట్టుకునే అలవాటున్న ఈ మనిషి భయం, భక్తి అన్న బావుటా లేనిదాన్ని నమ్మడు.

ఇక్కడ సెన్టిమెంటు కావాలనుకున్న వ్యక్తికి, ఆప్యాయత ఆదరణ వేలి కొనల స్పర్శలో పొందాలనుకున్న వ్యక్తికీ, అవసరంలో ఆదుకునే ఆప్యాయతా పరిమళాలు కావాలనుకునే వ్యక్తికీ వేటికి వాటిగా పొందే అదృష్టం లేదు.

కార్తీక మాసం అడ్డం పెట్టుకుంటే కానీ అన్నదానాలు చెయ్యరు ముత్తైదువులు. పేరంటాళ్ళ పేరు చెబితే కానీ అవసరానికి చీర, జాకెట్టు పెట్టరు. పాపం, నరకం పేరు చెబితే కానీ, దేవాలయాలు పోషించబడవు.

విడిగా అన్నం పెడితే దండగ. దుబారా పండుగనాడు అన్నం పెడితే సంతర్పణ. ప్రతి నవ్వుకు పాతివ్రత్యపు ముసుగు కావాలి.

లేకపోతే అది బజారున పడిపోతుంది. ఉద్వేగానికీ, ఉద్రేకానికీ, ఆనందానికీ ఆమోదపుముద్ర కావాలి.

పిక్నిక్‌లకు వెళ్లి సముద్రంలో దిగితే అది విచ్చలవిడితనం.

శ్రీరామ నవమి నాడు వసంతాలాడితే అది పరమ పవిత్రం.

కామితార్థాలు తీరడానికి కాముడిపున్నమి చేసే దేశం ఇది.

ప్రతి దానికీ లైసెన్సు "అర్థం తెలుసుకోనక్కర్లేని ఆచరణ"లో వుంది.

ఇక్కడ ట్రాన్స్‌మిషన్ థియరీ చెప్పాలన్నా తాయత్తును, తీర్థాన్ని, తాంబూలాన్నీ, తత్వజ్ఞానాన్ని, తర్పణను ఆలంబనంగా తీసుకోక తప్పదుమరి

ఇది ఈ దేశపు జీన్స్‌లోనే వుంది.

"ప్రవక్ష్యామి గీతార్థేన" అన్నాడు కాళిదాసు.

బహుశా అంతకుమించిన క్థోనిజమే వుండదేమో! (Chthonism - Humansism) లు

ఈవిల్, సిన్ మొదలైన పదాలను వాడేటప్పుడు
న్యాయం ధర్మం నీతీ త్యాదుల చర్చించేటప్పుడు
ఎవరికి తోచిన అర్థం వారలు చెప్పక తప్పదు:
పరమార్థం సామాజిక సామూహిక సద్వర్తన.
అన్నారు శ్రీశ్రీ

బుద్ధుణ్ణి దేముణ్ణి చేసి 'బుద్ధిక్ ప్లేన్'ను మర్చిపోగలరు జనం. రేపు చరఖాకు దండ వేసి, హారతిచ్చి, గాంధీగుడి కట్టించినా ఆశ్చర్యపోనక్కర్లేదు. శ్రీశ్రీకి మఠం కట్టి, పాలరాతి గోడలనిండా ఆయన కవితలు చెక్కి పవిత్రత ఆపాదించి, ఆ పదాల మధ్య వేడిని, వాడిని, విషాదాన్ని, విప్లవాన్ని మెల్లిగా మరిచిపోగలరు ఈ జనం....

దేనిని దానిగా చూడగల కనువిప్పు నా దేశం ప్రజలకు కలిగే రోజుకోసం వెల వెలా పోతున్న ఆకాశంలో వెలుగు రేఖకోసం ఎదురుచూస్తున్నాను. నేను ప్రియ భారతిని.

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక - 30-12-1988)*

# మహాగాయని

అద్భుతమైన స్వాంతన ఏదో కలిగేది ఆమె పాట వింటే, అది "ఇది" అని చెప్పలేని తీయని అనుభవం. గొప్ప కళాకారిణి అయిన ఆమె కమర్షియల్‌గా కూడా విజయం సాధించడం చాలా ఆశ్చర్యకరమైన విషయం.

దేవాలయాల్లో, నవాబుల ముఖమల్ మందిరాల్లో, రెడ్ కార్పెట్స్ పరిచిన ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో - ఎక్కడైనా ఆవిడ సక్సెస్... వాతావరణంలోని మార్పు, బరువు, ఆమె వైబ్రేషన్స్‌ను ఏనాడూ సంచలనపరిచి ఎరగదసలు.

ఇది చాలామందికి ఆశ్చర్యం.

కూవం నది పక్కన, తాజ్‌మహల్ దగ్గరా, అందమైన సైద్రస్ చెట్లలోనించి విస్తరించే వెన్నెల నీడల మధ్య ఒకే అనుభూతి ప్రదర్శించగలగడం, ప్రతి "నోట్"లోనూ, అనూ అనుకున్న భావం పలకగలగడంలోనూ ఏ "మార్పూ" చూపించేది కాదు ఆమె.

మూడ్స్, వాతావరణంలోని డిప్రెషన్, నచ్చని మనుష్యుల మధ్య పాడలేకపోవడం, రాంగ్ వైబ్రేషన్స్ - ఇవన్నీ ఏవీ ఆమెను అంటకపోవడం చూసి ప్రపంచం, సాటి కళాకారులు కూడా ఆశ్చర్యపోయేవారు.

నేను జర్నలిస్టును... వెంటనే "సరేలే" అనకండి ఆ మాట విని "నువ్వు సెన్సిటివ్‌వా, క్రిటిక్‌వా, సమీక్షకుడివా, ప్రేక్షకుడివా? ఇవన్నీ క్రోడీకరించి మథించి, విషయాన్ని చిలికి వెన్నపూసలా తేల్చి చెప్పి జాతిని జాగృతి చెయ్యగలిగితే ఆ మాట అనుకో" అనకండి.

ఒకనాడు మాకు జర్నలిస్టు మీటింగ్ అయింది.

కొంచెం నెరిసిన తలకాయలు, కళ్ళజోళ్ళు, చేతికర్రలు ఏమిటేమిటో మాట్లాడాయి.

ఆ మాటల్లో కోటంరాజు పున్నయ్య, పోతరాజు రామారావు, జి. వి. కృపానిధి, రామానంద ఛటర్జీ.... వీళ్ళందరూ, మరికొందరూ మాటల్లో కాసేపు జీవించారు.

కానీ, మాకు... కుర్రకారుకు వారెవరో తెలియాలని పెద్ద రూలేం లేదు.

జె. టి. సన్డర్‌లాండ్ అనే అమెరికన్ గురించి వచ్చినప్పుడు మాత్రం కొంచెం కుతూహలంగా విన్నాం.

"ఆయన ఎవరు?" పక్కనున్న ముసలాయనను చాలా మామూలుగా అడిగాను.

మహానుభావుడు. ``Gathered the Indian resources for Indian Nationalism in., U.S.A." అన్నారు ఆయన. ఆ ధ్వనిలో అకుంఠితమైన గౌరవం. ఆ ఒక్క క్షణం ఆ భావాన్ని మనిషిగా నేనూ గౌరవించాను.

ముందు డ్రింక్స్, తరవాత డిన్నర్లు, ఆ తరవాత గిఫ్ట్స్‌కు అలవాటు పడిపోయిన మాకు న్యాపతి నారాయణమూర్తులు, ఖాసా సుబ్బారావులు గుర్తుకు రానక్కర్లేదు.

"అయినా మనం ఆనాటి వృద్ధాప్యపు గోడ మీద నిలబడి కూలిపోనక్కర్లేదు. మనది మోడ్రన్ జర్నలిజం...." అని మాలో సహం ఎదిగిన వ్యక్తులు వాదిస్తారేమో కానీ, అందరం ఆ మాట అనలేం.

మేమిప్పుడు మనుష్యుల్ని, పరిస్థితుల్ని చదివి వ్యాఖ్యానిస్తే చాలు. సమీక్షించక్కర్లేదు. విమర్శలు అసలు పనికిరావు. ఎవరి మైనస్ పాయింట్లన్నా చెప్పి, వాళ్ళను బాగుచెయ్యాలన్న తపన మాకొద్దు. అంత పాజిటివ్ ఆటిట్యూడు. "ఎదగాలి" అన్న తపన ఏ రాజకీయ వేత్తకూ, కళాకారుడికీ – అందులో ముఖ్యంగా సినిమాలో ప్రముఖులకు అసలు లేదు గాక లేదు. అంతరంగం వెలిగించే ఏ మూగ గొంతో అక్షరంగా పలకాలని ప్రయత్నించినా, దండలూ, పొగడ్తలూ వెంటనే ఆ అక్షరాలను తిరగేస్తాయి. జర్నలిజం అదృష్టవంతుడికి పబ్లిసిటి స్టంటుగా మారిపోయింది. ఇవన్నీ ఇప్పుడు బయటకు చెప్పలేకపోయినా, మా 'మోటో' ఇదే! కాలం ఇప్పుడు నిజాయితీ పరుడుదీ, మేధావిదీ కాదు. మనసులో మాట బైటకు చెప్తే మమ్మల్ని శిక్షించగల బ్యూరోక్రసీది. ఇక్కడ లౌక్యుడికే కాలం.

అందుకని మౌనంగా ఆత్మవంచన చాటున ఏవో కొన్ని వార్తలు సేకరించి పంపేసి, ఒక గొప్ప చిత్రం చూసో, ఒక చక్కటి సంగీత కచేరీ వినో, అప్పుడప్పుడు స్పందించి రాసే మామూలు జర్నలిస్ట్‌ను నేను.

కానీ వృత్తిని గౌరవించే కొందరి హృదయాల్లోనైనా, నిద్రాణమైన భావుకత వుంది. వుండి తీరుతుంది.

అలా నా వ్యక్తిగతమైన స్పందనతో, ఆ మహాగాయకురాలితో పరిచయం చేసుకున్నాను.

ఆవిడ చాలా విచిత్రమైన వ్యక్తి!

ఏ మాత్రం ఆర్టిస్టిక్‌గా వుండని ఆవిడ గది, రూపాయిలు అణాలతో సహా లెక్క పెట్టుకునే సహధర్మచారుడు, దండలు కూడా వీలైతే మళ్ళీ అమ్ముదామనుకునే సెక్రటరీ... వీళ్ళందరి మధ్యా బ్రతుకుతూ –

. లతామంగేష్కర్‌లాగా లక్షల రూపాయిల దేముడి మందిరం కట్టి పూజలు చెయ్యదేమో కానీ –

"ఏదో అతీతశక్తి నాకు ప్రేరణ...." అంటుంది.

అది ఒక లెవల్ మనుష్యులకు ట్రాష్‌గానే కనిపిస్తుంది కాబట్టి ఆవిడను నమ్మే ప్రసక్తిలేదు.

అందుకే నేను వదిలిపెట్టలేదు.

ఆవిడతో స్నేహం చేశాను. కానీ నా స్నేహంలో ఏ దురాశా లేదని ఆవిడకు తెలిసేటట్లు, నాతో స్నేహం చెయ్యడంలో ఏదో న్యూనత ఆవిడకు అంటకట్టకుండా వుండేటట్లు నా ప్రవర్తనద్వారా జాగ్రత్తపడ్డాను.

మా పరిచయం ఎదిగింది.

అందుకే, ఆవిడ నమ్మి తన "రహస్యం" చెప్పిందేమో!

"ఇంత గందరగోళాల మధ్య, చీకాకుల మధ్య ఎలా పాడగలుగుతున్నారు?" అంటే, అప్పుడు ఏదో సమాధానం చెప్పేసింది కానీ -

ఆ తరవాత, కొంత పరిచయం తరవాత నన్ను గురించి మనిషిగా నమ్మకం కుదిరిన తరవాత -

"నేను ఇక్కడ పాడుతున్నానని ఎవరు చెప్పారు? నా వరకు నేను అతని దగ్గర కూర్చునే పాడుతున్నాను" అంటే -

కొంచెం ఉలిక్కిపడ్డాను.

కారణం. అవతలి వ్యక్తి నాకు బాగా తెలుసు. అతి సామాన్యుడైన మామూలు అసిస్టెంట్ డైరెక్టరు. భార్యా పిల్లలూ, రోగిష్టి తల్లి, వెస్ట్ మాంబళంలో చిన్ని పెంకుటింట్లో నివాసం, సవ్యసాచిలా నీళ్ళ కరువు రోజుల్లో రెండు చేతులతో బక్కెట్లు మోస్తూ కనబడ్డ వ్యక్తి మామూలుగా చూస్తే అతనిలో ఏ ప్రత్యేకతా కనబడదు మరి.

మాటల్లో నాకు అర్థమైంది. వాళ్ళకు పెద్ద పరిచయం ఏం లేదు. దాన్ని గురించి ఆవిడకు గుర్తున్నట్లు కూడా అవతలి వ్యక్తికి గుర్తుండే అవకాశం లేదు. మరి దీనికి అర్థం?

ఇదంతా ఏదో సైకలాజికల్ నాన్సెన్స్.... ఏదో ఒక ఇన్స్పిరేషన్ కోసం అతణ్ణి వాడుకుంటుందేమో, నటిస్తోందేమోనని తృప్తిపడ్డాను నేను.

ఇది మా సినిమా జనానికి, ముఖ్యంగా కవులకు చాలా ఎక్కువ.

కథ వండి వార్చడానికి, ఆఖరికీ ఇన్స్పిరేషన్‌ను కూడా కావాలంటే ఖరీదు కట్టి కొనివ్వగలం అని మభ్యపెడతారు వారిని ప్రొడ్యూసర్స్.

కానీ పరిచయం పెరిగినకొద్దీ, ఆవిడ ధోరణిలో ఏదో ప్రత్యేకత గమనించిన కొద్దీ, ఆమె మాటల్లో ఏమాత్రమన్నా నిజముందేమోనన్న అనుమానం కలిగి, ఆ వ్యక్తిని చూడడానికి వెళ్ళాను.

అతి సామాన్య గృహస్థు. విరిగిపోయిన కుర్చీలో చేరగిలబడి, మాసిన గోడకు తల ఆనించి కూర్చుని, ఒళ్ళో ఆఖరి పిల్లను పడుకోపెట్టుకుని తలకు అమృతాం. జనం రాస్తూ మాట్లాడుతున్న ఈ వ్యక్తికి ఏదో గొప్పతనం మామూలు పరిస్థితుల్లో ఆపాదించడం జరిగే పనికాదు.

కానీ, కుతూహలం చాలా సమస్యలకు కారణం... అప్పుడప్పుడు కొన్ని పరిష్కారాలకు కూడా.

మెల్లగా "ఆమె" గురించి మాట్లాడాను. అడిగాను.

"ఎలా వుంది ఇప్పుడు?" నవ్వుతూ అడిగాడు. ఆ మాటలకు అతనిలోని చాలా చీకట్లు, మామూలుతనం పోయినట్లయింది.

"సీత ఇచ్చిన పెన్ను..." పెట్టెలో అడుగు నుంచి తెచ్చి చూపించాడు. ఆవిడ "కీర్తి" అన్న పేరు పెట్టుకోకముందు అదే పేరు "సీత."

"ఎలా పాడుతుంది ఆవిడ?" ఈ ప్రశ్నకు ఎంత చప్పటి సమాధానం వస్తుందో ఊహించుకుంటూనే అడిగాను.

నవ్వాడు హాయిగా....

"ఎలా పాడుతుంది? మీకు తెలియదా? ప్రతి పాటా నా కోసమే పాడుతున్నట్లుంటుంది.... ఆ "నేను" ఈ వాతావరణంలో, ఈ మనుష్యుల మధ్య వ్యక్తిని కాను. ఆవిడ చూపు చూడగలిగిన వ్యక్తిని"

ఆశ్చర్యపోయాను నేను. తెల్లారగానే పదిసార్లు హిట్ డైరెక్టర్లమనిపించుకునే వారిచేత తిట్లు తింటూ, స్క్రిప్ట్ తిరగరాసే వ్యక్తిగానే అతను తెలుసు నాకు.

ఈ మనిషిలో మనిషి ఏమిటి?!

"మరి?" ప్రశ్నార్థకంగా అన్నాను.

"అడగండి ఫరవాలేదు." స్టీలు గ్లాసుతో కాఫీ అందిస్తూ అన్నాడు.

బయట వర్షం, ఆ పెంకుటిల్లు, కాలు తుడుచుకునే గోనె పట్టా, ఈ మనిషితో ఈ సంభాషణా నాకు మరీ ఏదో పాతకాలం బెంగాలీ సినిమా చూస్తున్నట్లుంది. నేను చూస్తున్న రంగుల ప్రపంచంలో ఎక్కడా ఇమడలేని ఈ వ్యక్తి ప్రత్యేకత నన్ను ఇబ్బంది పెడుతోంది. కానీ, నాలో భావుకుడు అంత తేలిగ్గా ఇంత గొప్ప పరిస్థితిని మిస్ అవడుగాక అవడు.

అందుకే అన్నాను:

"ఆవిడకు సన్మానం చేసిన ప్రతిచోటా ప్రతి ఉపన్యాసకుడూ చెప్పేది ఒకటే మాట... ఆవిడ సక్సెస్‌కు కారణం ఆవిడ ప్రతి మనిషికీ తన కోసమే పాడుతోందా అనిపించడం అని. అదెలా మరి? మీ లెక్క ప్రకారం ఆవిడకు ఒక పరిధి పడి కుంచుకుపోవాలే?"

సాధారణంగా జర్నలిస్ట్‌గా నేను ఇంత లోతుగా ఎవరితోనూ మాట్లాడను. కారణం మమ్మల్ని అసలు ఇలా మాట్లాడించే "డెప్త్" వున్న మనుష్యులు దొరకడమే కష్టం మరి.

నవ్వాడతను హాయిగా.

"మేమిద్దరం ఒకర్నొకరు చూసుకుని కొన్ని ఏళ్ళయింది. ఇందాకే చెప్పాను. మా స్నేహం మామూలు పరిచయాలు బాంధవ్యాలకన్న ఎదిగింది. ఆవిడ పాడేది వ్యక్తినైన నా కోసం కాదు. నేను ఇచ్చే సుందరమైన అనుభూతి కోసం... ఇది ఎంతో కొంత అందరిలోనూ వుంటుంది. ఆ సున్నితమైన భావాన్ని ఆమె నిద్ర

లేపగలుగుతోంది. కాబట్టే ప్రతి ఒక్కరికీ ఆమె తన కోసమే పాడుతోంది అనిపిస్తుంది." చంటిపిల్లను ఆరుబైట నవ్వారు మంచంమీద పడుకోపెడుతూ చెప్తున్నాడతను.

నేను నోరు తెరిచేశాను. ఈ వాతావరణంలో ఈ మామూలు మనిషి, రవ్వల నగలతో, పట్టు చీరలతో కళకళలాడే ఆ మహాగాయకురాలు - ఎక్కడుంది సామ్యం?

"ఆవిడ అప్పుడు ఎలా వుండేవారు?"

సన్నగా నవ్వాడతను.

"సీత పెద్ద అందమైన మనిషి కాదు, మామూలు లెక్కల్లో. కానీ పెద్ద జుట్టు, గొప్ప కళ్ళు... ఎప్పుడైనా గమనించారా? పాడుతున్న భావం ఆ పెదవులదా, ఆ కళ్ళదా అనిపించదూ?" - ఆ మాటల్లో గొప్ప భావన నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది.

"ఈమధ్య మీరెప్పుడైనా చూశారా ఆవిడను?" ఏదో విచిత్రమైన కథకు నేనే ప్రేక్షకుడిని అనే ఫీలింగుతో అడిగాను.

"ఆ! టి.వి.లో... అలాగే వుంది. ఏం మారలేదు." ఏదో ప్రశ్నిస్తున్నాను. కానీ అతణ్ణే పరీక్షగా చూస్తున్నాను నేను. ప్రపంచం దృష్టిలో చాలా మామూలు మనిషి ఇతను. కానీ ఇతనిలో వ్యక్తి వేరు. అది స్వార్థాలకు, భ్రమలకూ, ప్రాపంచికతకూ అందనిది.

❀ ❀ ❀

అందుకే-

అతను అవుట్‌డోర్‌లో ఏదో కొండ మీదనుండి జారిపడిపోయి చచ్చిపోయాడని తెలిసినప్పుడు-

నేను పరిగెత్తుకుంటూ వెళ్ళాను. ఆవిడ భావాలు రికార్డ్ చేద్దామని పత్రిక కోసం కాదు... వ్యక్తిగా నా కోసం.

ఆవిడ చెక్కుచెదరినట్లు లేదు. ఏదో పెద్ద ఫంక్షన్‌లో అపరంజి జిలుగులు చెక్కుతున్నట్టు గజల్స్ ఏవో పాడుతోంది. రాళ్ళ నగలతో, టిష్యూ చీరతో మెరిసిపోతోంది.

"నాకు కావలసినది వ్యక్తి కాదు, అనుభూతి" అంటున్నాయి నా చుట్టూ వెన్నెలదారాల్లా అల్లుకుంటున్న రాగఝరులు.

కానీ, ఎక్కడో ఆ గొంతులో ఏదో ఒక్క విషాదచ్ఛాయ, ఆ గీతంలో ఒక నిరాశాక్షరపు ముగింపు, వెన్నెలంతా ఓ రాగదీపంగా ఆకాశం నుంచి చీకటి లోయల్లోకి జారిపడినట్లుండే ముక్తాయింపు.

గాయం గేయంగా మారుతోందా?

గేయం గాయంగా మారి ఆమె గుండెల్ని కాలుస్తోందా?!

ఇవన్నీ నాకు అర్థమైపోతున్నాయనిపిస్తోంది; నేను కొంత అర్థమైన మనిషిని కాబట్టి.

ఆ తరవాత స్టేజీ వెనకాల మెరిసే పెదవులు, తడిసిన కళ్ళతో ఆమెను చూడగానే-

నాకు అనిపించింది ఆమే మనిషేననీ...

భావన ఎంత ముఖ్యమో, ఉపాధి అంతే ముఖ్యమనీ.

అందుకే,

ఆ తరవాత,

గొప్ప పేరు వచ్చిన తరవాత వారు ఏది చేసినా బావుందనే అరసికశిఖామణులు ఎక్కువగా వున్నా, కొంచెం సున్నితత్వం, మరి కాస్త స్పందన వున్న ఏ ఒకరిద్దరో-

"ఆమె పాట అదోలా వుందేమిటో...." అన్నప్పుడు-

నాకు అర్థమయింది. ఆమెకి ఏమిటి కాదోలా అనుకున్నప్పుడు నాకు గుర్తుకు వచ్చేది అతని నవ్వే.

ఆ తరవాత కొద్దికాలానికి....

ఆమె అతడి కుటుంబానికి చేసిన గొప్ప సహాయాలు, తయారుచేసిన గొప్ప గొప్ప సంస్థలు. ఎంతోమందికి ఉపాధికి కావలిసిన ఏర్పాట్లు.

ఇవన్నీ వింటూనే వున్నాను. ఆమెకు మళ్ళీ ఇంటర్నేషనల్ అవార్డే వచ్చిందని తెలిసి వెళ్ళాను.

"ఏమిటిదంతా?" అడిగాను. ప్రపంచం కోసం, ఫోటోల కోసం దానధర్మాలు చేసే "నైచ్యం" ఆమెలో లేదు. అందుకే అడిగాను "ఏమిటిది?" అని.

"రిహాబిలిటేషన్.... ఇదంతా నా కోసమే..." "అంటే?" ఆలోచిస్తూ అడిగాను. ఆమె ట్రస్టులన్నీ ఏవో పొడక్షరాల పేరుతో వున్నాయి. నాకు తెలుసు - అవన్నీ విప్పితే దానికర్థం అతని పేరేనని.

"అతను బ్రతికుండగా ఎక్కడో వున్న అతని భావన నాకు గొప్ప అనుభూతి నిచ్చేది. కానీ ఆ తరవాత 'లేదు' అన్న ఆలోచన నుంచి ఎదిగి గాలిలోనించి ఆ భావం పొందే శక్తి నాకు లేదు.

అందుకే, అతని భావనను నా గుండెల్లోనించి విస్తరింపచేసి నా చుట్టూ ఈ రకంగా పరుచుకుంటూ వస్తున్నాను. ఇది నాలోనించి ప్రవహించి, వెన్నెల్లా విస్తరించి మళ్ళీ నాలోకి వచ్చి నా నరనరాల్నీ తడుపుతోంది ఆ తృప్తి.... అది మీకు అర్థమై వుంటుంది.

అదే... మళ్ళీ అనుభూతిగా మారి నా గొంతులోని మామూలు తీయదనాన్ని, నమ్మకాన్ని కలిగిస్తోంది.

అందుకే నా గొంతు మళ్ళీ మామూలుగా పాడుతోంది." నవ్వుతూ చెప్పింది ఆవిడ. కొంత డబ్బు ఇలా వినియోగించడానికి తన ఇంట్లో ఎంత పోరాడి వుంటుందో నాకు తెలుసు. ఆవిడ కోసం ఆవిడ బ్రతకడం ప్రారంభించింది.

నాకు అర్థమైంది ఆమె పోగొట్టుకున్నదేమిటో. అది మామూలే. చాలా మందికి ఈ "సలుపు" తెలుసు.

కానీ ఆవిడకు అర్థమైంది దాన్ని తిరిగి ఎలా పొందాలో.

తలవంచి నమస్కరించాను-

ఆవిడలో మహా గాయకురాలికే కాదు, ఎదిగిన మనిషికి కూడా!

అందుకే....

ఆ మర్నాడు ఆవిడ గురించి న్యూస్ రాసి కంటెయ్‌నర్‌కు ఇవ్వలేదని తిట్లు తిన్నాను ఎడిటర్‌గారి చేత.

కానీ....

ఎలా రాయను? ఏమి రాస్తే అదేమిటో ఎవరికి అర్థమౌతుంది?... మామూలు తడిలేని మాటలు.... ప్రాణం లేని శబ్దాలు... ఎలా రాయను ఆమె గురించి?!

*(ఆంధ్రజ్యోతి, 21-7-1989)*

# రత్నాక్షతలు

"వలపుల పల్లకీతో పిల్లివాటంగా ఉంది నీ వ్యవహారం బాలా!" విసుగ్గా చేతిలో పుస్తకం పక్కన పడేస్తూ అన్నది కామేశ్వరి.

"అంటే గోడమీద పిల్లివాటం అనా నీ ఉద్దేశ్యం.. వలపుల పల్లకీ అని అందంగా అన్నదానివి మళ్ళీ పిల్లేమిటి... పద భ్రష్టత్వం నువ్వూనూ...." మాట్లాడుతోంది శశిరేఖ.

మౌనంగా నేలచూపులు చూస్తూ అప్పుడప్పుడు తలకాయ ఎత్తి అంతంత కళ్ళతో కన్నీళ్ళ సుళ్లతో స్నేహితురాళ్ళను చూసుకుని మళ్ళీ తలకాయ వంచి... మోకాలు మీదగ చుబుకం ఆనించి తనే చాలా "విషాదాంత కథ" లా ఉన్నది బాల.

"ఇది ఉత్తి బేల...ఎలాగే దీంతో. ఇప్పుడు ఆంటీ వస్తే చంపేస్తారు..." గట్టిగా అంటోంది కామేశ్వరి.

"ఏమైంది పెద్ద? ఉత్తరం వచ్చింది... అంతేగా, అది తప్పా..." దబాయిస్తోంది భయంగానే శశిరేఖ.

"ఉత్తరాలు రావచ్చే...కానీ ఇంత భయంకరంగానా?..." కామేశ్వరి అంటోంది.

చేతిలో ఉత్తరం చూస్తోంది బాల.

ఎన్నోసార్లు ఆ అబ్బాయి "నువ్వంటే ఇష్టం" అన్నాడు. తన మెప్పుకోసం స్కూలు ఫస్ట్ వచ్చాడు. అప్పుడప్పుడు కవిత్వం రాశాడు. అవన్నీ వేరు.

ఇప్పుడు...

ఉత్తరం రాశాడు. ఇంకుతో కాదు. పోనీ కామేశ్వరి కవిత్వంలో అన్నట్లు "కన్నీళ్ళ"తో కాదు.. మరీ ఘోరంగా..రక్తంతో..

అది చూసే అంతా ఒణికిపోయారు.

చాలా చిన్నారి పొన్నారి చిట్టితల్లిలా "నాకంత ప్రేమకు అర్హత ఉందా?" ఏడ్చింది బాల.

అదే భయంగా వుంది శశికి, కామేశ్వరికి.

బాల తల్లి డాక్టర్ దేవి. గొప్పపేరు, ఆర్జన రెండూ ఉన్నాయి ఆవిడకు. మాట్లాడకుండా చూపులతో భయపెట్టగలదు. ఆవిడ ఏరకమైన నాన్సెన్స్ కూడా భరించదు. చాలా ప్రాక్టికల్ మనిషి అని పేరు. ఆ విషయంలో ఆవిడమీద ఆవిడకే చాలా గౌరవం కూడా.

బాల ఆవిడ ఒక్కగానొక్క ముద్దుల కూతురు.

ఆవిడకి ఇదంతా తెలిస్తే!?

అదే ఆ పదహారు పదిహేడు ఏళ్ల పిల్లల భయం...బాలనేమంటుందో?! "అది దాచెయ్యి" లేకపోతే చించెయ్యి. అని సలహా చెప్పేశారు శశి, కామేశ్వరి మామూలుగా.. కానీ బాల ఈసారి సెన్టిమెంటు మాట్లాడుతోంది. కళ్లంబడి నీళ్ళు పెట్టుకుంటోంది... కాసేపట్లో ఆ కాస్త మాటా... "అతణ్ణి నేను ప్రేమిస్తున్నానే..." అంటుందేమోనన్న భయం వాళ్లిద్దరికీ సంపూర్ణంగా ఉంది.

కానీ ఆ మాట తమతో అంటే పరవాలేదు. ఈ పిచ్చిపిల్ల తల్లితో అనేస్తుందేమో... ఆ తరవాత.. ఆ బీభత్సం అసలు భరించడం కష్టం.

"ఇప్పుడు ఏమిటి దారి?" అబ్బాయిల్ని ఏడిపించి, ఎంకరేజ్ చేసి, ఇవన్నీ మామూలు ఆటలు ఆ వయస్సులో కానీ, అవి సీరియస్ మలుపు తీసుకుంటే?!

"ఇప్పుడు ఈ అబ్బాయి చాలా అజ్ఞానంలో ఉన్నాడు..." పొడుగాటి జడ విప్పి మళ్ళీ వేసుకుంటూ స్టేట్‌మెంట్ యిచ్చేసింది కామేశ్వరి.

"ఇది అజ్ఞానమా? ప్రేమించడం అజ్ఞానమా.. మంచం కోడులా మొహం నువ్వూనూ... రానురాను భావుకత తగలడి పోతోంది జనంలో...ఛా!ఛా!" కొంగుతో ఏ.సి. రూంలో కూడా విసురుకుంటూ అన్నది శశి.

"ఏమన్నావ్? మంచంకోడులా ఉందా నా మొహం.... నీ బొంద ఉపమానం నువ్వూనూ. మళ్లీ నువ్వు మాట్లాడతావు భావుకతలగురించి సంకర సమాసాల గురించి.." అరుస్తోంది కామేశ్వరి.

ఇంక ఆ తగూ తీరేది కాదు.. అది తెలుసు బాలకు. వాళ్లంతా నాలుగోక్లాసునుంచీ బెంచిమేట్స్, క్లాస్‌మేట్స్ కూడా. ఎప్పుడూ, ముగ్గురిలో ఇద్దరు పోట్లాడుకుంటూ ఉంటారు. ఇద్దరే ఉంటే, మూడోవాళ్లు లేరే అని బాధపడుతూ ఉంటారు.

కళ్లు మూసుకుని తల గోడకానించి ఆలోచిస్తోంది బాల. ఆమె గుండెల్లోపల తీయటి తలపు.

తనతో ఒక్కమాట కూడా ఎప్పుడూ మాట్లాడని ఆ అబ్బాయి పేరు విరించి.. పుస్తకం.. అడిగాడు నోట్స్ కోసం

తిరిగి వచ్చిన పుస్తకంలో ప్రతి పేజీలో ఖాళీ ఉన్నచోట అల్లా "బాల" నామం రాశాడు.

చచ్చేట్లు తిట్టింది బాల "స్టుపిడ్, ఇడియట్, మానర్స్ లేదు" వగైరా అని. లేత కపోలాలు కోపంతో కందిపోయాయి. తిడుతోందే కానీ, మొగ్గ విరుస్తున్న స్త్రీత్వం గర్వంతో పడగవిప్పింది. ఆ వయస్సులో పొగడ్త, ఆరాధన చాలా హాయిగా, గొప్పగా, తీయగా ఉంటాయి.

కానీ ఆ విషయం అతడికి తెలిసిపోతే భరించలేదు మళ్లీ.

"నిజం చెప్పు, నేనంటే నీకు ఇష్టంలేదూ?" ఎర్టీటి గుండెల్లో రోజాపువ్వు గుచ్చి ఆమె పుస్తకాల పైన పెట్టి ఉంది.

"ఎంత కార్డ్‌బోర్డ్ అయినా మరీ అంత హార్ట్‌షేపులో ఎలా కత్తిరించి, ఎర్టీపేపరు అతికించాడు!" ఆశ్చర్యపోతూ కళ్లు తిప్పుతూ అన్నది శశి.

"ఆఁ - వాళ్ళ అన్నయ్య ఆర్టిస్ట్‌లే...గీయించి ఉంటాడు. వాళ్లంతా చాలా ఆర్టిస్టిక్ ఫామిలీ..." చెప్పేసింది కామేశ్వరి.

"నిజమా!" ఇంకా వివరాలు ఎవరైనా అడగకుండా చెబితే బావుంటుందనిపిస్తోంది బాలకు.

"అయినా అసలా ప్రశ్న ఏమిటి? బాలకు తనంటే ఇష్టమని వ్యుత్పత్తా?" దీర్ఘంతీస్తూ అంటోంది కామేశ్వరి.

ఆఁ! దెబ్బతిన్నది బాల అహం. అందులో నిజం ఉందేమోనన్న భయంతోనూ, అది అందరూ గ్రహిస్తారేమోనన్న జంకుతోనూ "ఆత్మగౌరవం" వగైరా పదాలు వాడేసి హెడ్‌మాస్టర్‌కు విరించి మీద రిపోర్ట్ ఇచ్చింది.

ఆ కథ రకరకాల మలుపులు తిరిగింది. విరించికి చాలా శారీరక, మానసిక వ్యధ కలిగింది.

అదంతా ఆఖరికి రక్తాక్షరాల ఉత్తరంగా రూపుదిద్దుకున్నది. ఆ ఉత్తరం చూసి బాల ఏడుస్తోంది. బాధపడుతోంది. నిట్టూరుస్తోంది. ఈ గందరగోళం అంతా స్నేహితురాళ్లకు కొంచెం సరదాగా ఉన్నా, డాక్టర్ అంటే భయం చాలా ఎక్కువగా ఉంది.

ఆవిడ ప్రసిద్ధి చెందిన గైనకాలజిస్ట్. చాలా ప్రాక్టికల్‌గా ఉండే ఆవిడకు విచిత్రమైన సెన్టిమెంట్స్ ఉన్నాయి. హాస్పిటల్‌లో బైట అమ్మవారి విగ్రహం, చుట్టూ కొవ్వొత్తుల లాంటి బల్బుల మధ్య వెలిగిపోతూ ఉంటుంది. అమ్మవారు మొదటి సెన్టిమెంటు. రెండవ సెన్టిమెంటు బాల.

"ఆవిడ చిన్నప్పటినుంచీ దేవీ భక్తురాలుట... మనిషిలో ఆ తేజస్సు, నిర్భయత్వం.. ఆవిడ ఎదురుగా నిలబడి మాట్లాడలేరు ఎవరూ! ఆవిడ అంటే ఇష్టం ఉన్నవాళ్ళు ఇలా చెప్పుకుంటారు:

"ఆఁ! అసలు మొదటినుంచీ మహా పొగరు ఆవిడకు. ఎవర్నీ కేర్ చేసేది కాదుట. ఇటువంటి వాళ్లకి స్నేహితులుండరు. ఇదుగో, ఏదో ఒక అవుట్‌లెట్ కోసం ఇలా దైవిక శక్తిమీద ఆధారపడతారు ఇల్లాంటివాళ్లు. ఆ విగ్రహమైతే బాధపెట్టదు. ప్రశ్నలు వెయ్యదు.. అహం మీద దెబ్బ తీయదు. వీళ్లకు మనుష్యులంటే భయం. చులకన, కసి. ఇదంతా సైకలాజికల్ పాయింటు".. ఇలా మాట్లాడేవాళ్లలో లెనిన్ శాస్త్రి ఒకడు. పాపం, వాళ్ల నాన్నకు లెనిన్ అన్నా, భార్య అన్నా సమానమైన భయం. వాళ్ల ఆవిడ తండ్రి పేరు సుబ్బుశాస్త్రి. దాంతో తన ఆదర్శాలవల్ల, పెళ్లాం భయంవల్ల ఒక్కగానొక్క కొడుకు పేరు అలా రూపుదిద్దుకుంది. ఏది విచిత్రంగా

ఉంటే, అది చాలా గొప్ప విషయంగా భావించే లెనిన్‌శాస్త్రి కావాలనే ఆ పేరు అట్లాగే ఉంచుకున్నాడు.

అతనికి ఉన్న వీక్‌నెస్‌లో ఆడవాళ్ల గురించి మాట్లాడ్డం మొదటిదైతే, తరవాత వీక్‌నెస్ మైక్.

ఒకరోజు ఏదో ఫార్మల్‌గాదరింగ్‌లో ఎవరో పాడుతుంటే జోక్స్ చెపుతానని మైక్ లాక్కుని లెక్చర్ ప్రారంభించాడు అతను. ప్రారంభం అయితే చేశాడు గానీ, ఆ తరవాత మాట్లాడేమాటలమీద అతనికి కంట్రోల్ పోయింది.

"షటప్!" ఒక్కసారి గర్జించింది డాక్టర్ దేవి.

"ఆడవాళ్ళకు అనాటమీ, కొలతలు, రక్తప్రసరణ తప్ప మరేం లేవా? శృంగారం షోడశ కళలు ఇవన్నీ ఉత్ప్రేక్షాలంకారాలా?! షటప్. ముందు అతని చేతుల్లోనించి మైక్ తీసుకోండి..." ఆ గొంతుముందు హిమవన్నగాలే తలవంచుతాయేమో అన్నంత పదును ఉంది.

అంతే, ఆరోజునుంచీ ఆవిడ ఉన్నప్పుడు లెనిన్ శాస్త్రి ఉట్టి "కవి", "కొ"నబడదు. "వి"నబడదు. ఆవిడ లేనప్పుడు విజృంభించి మాట్లాడేస్తూ ఉంటాడు పాపం. అప్పుడు వీలైనంత వరకూ ఆవిడ సెన్టిమెంటు మీద దెబ్బకొడుతూ ఉంటాడు. ఇప్పటిదాకా అమ్మవారు టార్గెట్ పాపం.. ఇప్పుడు అదే కాలేజీలో చదువుతున్న మేనగోడలు వల్ల బాల విషయం తెలిసింది అతనికి.

"మొగతోడు లేని పెంపకం పాపం. ఏంచేస్తుంది? కూతురు బాల ప్రేమలో పడితే ఇప్పుడు ఆ 'బాలా త్రిపుర సుందరి' రక్షిస్తుందా? చూద్దాం.." ఆ రోజూ ధైర్యంగా, ఆవిడ వినాలనే వాగాడు రెస్ట్‌రూంలో.

అంతే, సివంగిలా వచ్చింది దేవి ఇంటికి.

ఒక్క అయిదు నిమిషాలు బాల గదిబైట నిలబడింది. అప్పటికే ఆడపిల్లలు, ఎవరూ వినడంలేదనుకుంటే ఏమేమి మాట్లాడతారో అవన్నీ మాట్లాడుకుంటున్నారు.

లోపలికి వెళ్లి ఫట్‌ఫట్‌మని బాలను ఆ లెంపా, ఈ లెంపా వాయించింది. ఆవేశంతో నోటికి వచ్చినట్టల్లా తిట్టింది.

"ఏం స్నేహాలు మీవి?" బాలస్నేహితురాళ్లిద్దర్నీ చివాట్లు పెట్టింది. "ఎవడేవాడు?" జవాబు వినకుండానే చెంపలు వాయించి పారేసింది.

దుర్గాదేవిలా విజృంభించి, ఇల్లు రణరంగం చేసి, అలసిపోయి సోఫాలో జారగిలబడి కూర్చుంది దేవి.

ఏడ్చి, ఏడ్చి సొమ్మసిల్లి పడిపోయిన బాలను చూడగానే జాలేసింది. అప్పుడు చూసింది, బాల పువ్వుల్లాంటి చేతుల్లో దాచుకుని గుండెలకు హత్తుకుని ఉన్న కాగితం.

"ఏమిటి బాల చేతుల్లో?" అనుమానంగా అడిగింది. "ఉత్తరం.." బిక్కచచ్చిపోతూ అన్నారు ఇద్దరు ఆడపిల్లలూ, మెల్లిగా తీసుకుంది ఆవిడ..

"కాళమ్మా! పిల్లలు ముగ్గురికీ జ్యూస్‌పట్రా..." పనిమనిషిని పిలుస్తూ మెల్లగా ఉత్తరం విప్పుతోంది డాక్టర్ దేవి.

ఒణికిపోతున్నారు కామేశ్వరి, శశి..

"ఏమిటి అక్షరాలు ఇలా.." ఉత్తరం వెలుతురులో పెట్టి చూస్తూ అన్నది ఆవిడ.

"రక్తం.." గభాల్న నోరు జారింది కామేశ్వరి.

"రక్తం..." ఆశ్చర్యంగా అంటూ ఆ కాగితం అలా ఒదిలేసింది దేవి...

❀ ❀ ❀

"రక్తం...."

ఎందుకో ఆ మాట కార్ డ్రైవ్ చేస్తున్నా, హాస్పిటల్‌లో పని చేసుకుంటున్నా వేటాడుతూనే ఉన్నది. డెలివరీ కేసు ఒకదాన్లో ఓవర్ బ్లీడింగ్...కాలికి ఎదురుదెబ్బ తగిలి ధారగా రక్తం... ఎక్కడ చూసినా రక్తం..

ఏదో హిప్నటైజ్ అయినట్లు అయిపోతోంది డాక్టర్ దేవి. అదివరకు ఆమెకు తెలియని రక్తం కాదు. మరి?! ఎందుకో ఆ అమాయకుడైన కుఱ్ఱాడు తన రక్తంతో రాసిన అక్షరాలు ఆమె గుండెల్లో ఎక్కడో దాక్కున్న అతి సున్నితమైన భావనను, ఇంతకాలం "ఇగో" కింద అణగదొక్కిన జ్ఞాపకాల్ని నిద్రలేపుతున్నాయి.

పుష్యమీ నక్షత్రం, పౌర్ణమి కలిసి వచ్చాయని అమ్మవారికి పూజ చేయిస్తోంది.

*రత్నాక్షతైర్వా పరిపూజయామి ముక్తా ఫలైర్వా రుచిర ప్రవాళైః ।*
*అఖండితైర్దేవి యవాదిభిర్వా కాశ్మీర పంకాంకిత తండు లైర్వా ॥*

అమ్మవారికి కుంకుమాక్షతలు వేస్తూ మంత్రం చదువుతున్నాడు పూజారి.

రత్నాక్షతలు రక్తాక్షతలుగా వినబడ్డాయి దేవికి.. అమ్మవారిమీద జల్లున రాలాయి.

అంతే-సడెన్‌గా కుర్చీలో వాలిపోయింది దేవి. ఆ తరవాత ఏసిరూంలో, నీలిరంగు కాంతిలో, ఇండోర్ ప్లాంట్సు మధ్య ఎంత ప్రశాంతమైన వాతావరణం ఉన్నా ఆమెను వెన్నంటుతూనే ఉన్నాయి...రక్తాక్షతలు.

ఆనాడు ముద్దుగా పెంచిన బాలమీద చెయ్యెత్తడం. రక్తంతో రాసిన ఆ ఉత్తరం, ఆ తరవాత ఎక్కడ చూసినా రక్తం దర్శనమివ్వడం, ఆఖరికి అమ్మవారి సన్నిధిలో కూడా ఎఱ్ఱటి అక్షతలు మంత్రపూతమవ్వడం...ఏదో తెలియని బలమైన ఆలోచనాకెరటం మెదడును తప్పించుకుని హృదయంమీద నొక్కుతున్నట్లుంది.

'ఏమిటీ నాన్సెన్స్? ఈ ఆలోచనల పీడ ఏమిటి?' విసుక్కున్నది డాక్టర్ దేవి. కాని, ఆలోచనలు మనసును వంచించేది బలహీన క్షణాల్లోనే..ఆమె శారీరకంగా, మానసికంగా కూడా అలసిపోయింది.

"నా పేరు రుద్ర..నీ పేరు దేవి..బావుంది కదూ!" గర్వంగా ఒకింత ఒంకరగా నవ్వుతూ విన్నది అతని మాటలు. అమ్మమ్మతోపాటు నీళ్లకు వెళ్లి కృష్ణలో స్నానం చేసి, ఎఱ్ఱటి ఇసుకలో పాంజేబుపట్టాల పాదం పెట్టగానే కందిపోతాయేమోనని గభాలున నాలుగు తామరాకులు తీసుకువచ్చి పరిచే ఆ బలమైన చేతులు.. అమ్మమ్మగారి ఊళ్లో ఉన్నంతకాలం రోజుకు ఒకరకం పూవులు తన అమ్మవారి అష్టోత్తరానికి వచ్చి చేరేవి. వాటి వెనకాల పూవులాంటి మనస్సు.

దేవి సన్నగా, గీరగా నవ్వుకునేది - తనకోసం ఒక మనిషి పడే కష్టం తలుచుకుని.

తను ఏటి ఒడ్డున కూర్చుంటే దూరం నుంచి చూసే చూపులు, తనకు జ్వరం వస్తే దడుపు వీబూదులు, ఆంజనేయస్వామికి ఆకుపత్రి పూజలు, వడమాలలు...

"నా జ్వరం సంగతి సరే... వడలు చాలా బావున్నాయి. అసలు నీకు తినాలి అని ఉంది, నన్ను అడ్డం పెట్టుకున్నావు. అవునా?" అని ఉడికిస్తే తెలిసీ తనను ఆట పట్టిస్తున్న మేనమామ కూతుర్ని ఎలా నమ్మించాలో తెలియని బేలకళ్లతో చూసే రుద్ర...

తను కాలేజీలో చేరింది. అతని ఉత్తరాలు చూసి నవ్వుకునేది. ఏదో చెప్పాలనీ, అది మాటలమధ్య దాచాలనీ అతని ప్రయత్నం. సాధించే ఓపికలేదు దేవికి. ఒక్కొక్కసారి చూడకుండా చింపేసేది.

"ఏమిటి పాపం, ఆ పిల్లాడు?" అనేది అమ్మమ్మ కొడుకు బిడ్డ గురించి.

"పెళ్లి పిచ్చి..పల్లెటూళ్లో పనిలేక, తిని కూర్చోలేక..." ఇలా చాలా మోటుగా మాట్లాడేది దేవి, తను చాలా నాగరికురాలనుకుని.

ఎమ్.బి.బి.ఎస్. స్టూడెంటు ఆమె, ఎస్.ఎస్.ఎల్.సి. ఫెయిల్ అయిన రుద్ర. ఎలా కలవగలరు తామిద్దరు?!

"ఆడదానిలో కాస్త మృదుత్వం, ఆడతనం ఉండాలి ఎంత ప్రొఫెషనల్స్ అయినా".. స్నేహితురాలు కేకలేసేది.

"అదుగో, అవి ఎక్కువ అయ్యే వాటిని కాపాడుకోడానికి చేతికి గాజుల సంకెళ్ళు, కాళ్లకు మట్టెల సంకెళ్లు, మెడకొక ఉరితాడు.." తపీమని మాట్లాడి నోరుమూయించేది-అందర్నీ.

ఆమెకట్టు, బొట్టు, నడక, మాట అంతా చాలా కొలిచినట్లుండేవి. "ఈ సమయంలో ఇలా మాట్లాడాలి. ఇలా ఉండాలి" అన్నది చాలా జాగ్రత్తగా అలవరుచుకున్నది ఆమె.

బాధలో ఉన్నవారిని నవ్వుతూ ఓదార్చడం, పనికుఱ్ఱాడు కూరలు లెఖ్ఖ తప్పు చెప్పాడని వెంటనే ఉద్యోగం నుంచి తీసి వెయ్యడం - రెండూ చాలా మామూలుగా చేసేదామె.

"పక్కా ప్రొఫెషనల్" అనుకునేవారంతా.

"నా ఉత్తరాలకు జవాబు ఇవ్వలేదేం?" అమ్మమ్మతో తోడువచ్చి అడిగాడు రుద్ర.

"నాకే వ్యవహారం హద్దు మీరడం ఇష్టం ఉండదు..." సూటిగా చెప్పింది.

అతను బాధపడ్డా బైటపడలేదు. "ఇలా ఎప్పటికప్పుడు ఎలా బ్రతకాలో ఊహించుకుని బ్రతకడం నటనగా; ఆర్టిఫిషియల్‌గా లేదూ?! చీర కొంగు మడతల దగ్గర నుంచి, నువ్వు చేసే సర్జరీలో కత్తుల వరకూ అంతా కొలిచినట్లు బతికితే జీవితం మొహం మొత్తుతుంది, హాయిగా, ఎవరికోసం కాకుండా, మనకోసం మనం నవ్వుకోవడం, కావలసినంత తిని, కంటినిండా నిద్రపోవడం, ఎదటివాళ్ళను హాయిగా ఉంచడం-ఇవ్వన్నీ అసలు నీకు అర్థం కావనుకుంటాను!" నిర్భయంగా అన్నాడు ఒకరోజు రుద్ర.

"మోటు మనిషి. ఇతనికేం తెలుసు బ్రతకడం? ఇంటికి వచ్చిన మేనమామ కొడుకును అవమానించావని అమ్మమ్మ బాధపడుతుంది." చాలా కష్టపడి కోపం కంట్రోల్ చేసుకున్నది దేవి.

"వాడికి నువ్వు తప్ప ప్రపంచంలో ఏం కనిపించడం లేదే. అంత ప్రేమించిన మనిషిని తృణీకరించకే... రుద్రకు చదువులేకపోయినా, ఆస్తి ఉన్నది," బ్రతిమిలాడింది అమ్మమ్మ.

"ఇంకా నయం... నేనూ రుద్రా పెళ్ళి చేసుకోవడం అసంభవం అమ్మమ్మా! కేవలం ఆడది, మొగవాడు ఒక కప్పుకింద బ్రతకడం కాదు పెళ్లి అంటే... వంట చేసి, వేరుశనక్కాయ ఉడకబెట్టి, ఎండబోసి, పొడి చెయ్యడం చేతనైన పిల్లకావాలి రుద్రకు. నేను, నా స్టేతస్కోపు, ఉద్యోగం.. ఒక్కసారన్నా ప్రాక్టికల్‌గా ఆలోచించు..." అని చివాట్లు పెట్టింది.

ఊరినించి ఎవరైనా వచ్చినప్పుడల్లా రుద్ర "నీకిష్టమని నాకు తెలుసు' అని పంపించే వెన్నకాచిన నెయ్యి, బెల్లం ఆవకాయ, పూతరేకులు-ఇవన్నీ ఆమెకు నవ్వులాటగా ఉండేది. కానీ తన ఇష్టాలు ఎదటి వ్యక్తి గ్రహించడం ఇష్టంలేదు ఆమెకు.

"ఎంత ప్రేమ ఆ పిచ్చి వెధవకు?!" అని అమ్మమ్మ అన్నప్పుడల్లా,

"ఆc! డాక్టరు పెళ్లికూతురు కోసం ఏమన్నా చేస్తాడు!" అని వెక్కిరించేది.

కానీ, ఒకసారి అమ్మమ్మ మంచం పట్టిందని తెలిసి, చూసిరావాలని ఆ ఊరు వెళ్లింది దేవి. ఉన్న ఆ పదిహేనురోజుల్లోనూ ఆమె తెలియకుండానే ఆ జీవితంలో ఎంతో ప్రశాంతత ఉందనిపించింది. వాళ్లకు సంస్కారం లేదనుకునేది. కానీ వాళ్లకు లేనిది వస్తుభ్రాంతి అనిపించింది. అనవసరమైన కోరికలు లేకపోవడమే అమ్మమ్మ కుటుంబపు సంస్కారం అని అర్థమైంది. ఆ ఆహ్లాదత, ఆరాధించే వ్యక్తి ఎంత కరుకు మనిషినైనా కదిలించి రాగరంజితం చేస్తాయి.

చాలా దగ్గరైంది దేవి రుద్రకు. అతని ప్రేమ సమ్మోహనాస్త్రంగా పనిచేసింది

ఆమెమీద, అతను తనకు ఎంత ముఖ్యమో అతనికి అర్థమయినట్లు ప్రవర్తించేది. అతని మాట గౌరవించేది. అతని హృదయపు కోవెలలో దీపంలా మిగిలిపోయింది.

"మా నాన్నతో చెపుతాను... పెళ్ళికొడుకులా మా ఇంటికి వద్దువుగాని.." అని చెబుతూ అతని కళ్లల్లో నీళ్లు మునివేళ్లతో సుతారంగా తుడిచి బస్సు ఎక్కింది దేవి.

కానీ, తమ గేటులో అడుగుపెట్టగానే, ఆ నాగరికత, ఆ వాతావరణం ఆమెలో నిద్రలేచిన సున్నితత్వాలని ప్రాక్టికాలిటీతో సమాధి చేశాయి.

మూడునెలలు తిరక్కుండానే ఎవరో ఫారిన్‌లో ఉన్న డాక్టర్‌తో సంబంధం కుదిరింది. వెంటనే పెళ్లికి ఒప్పుకున్నది దేవి.

ఏమాత్రం మొహమాటం లేకుండా "మిష్టర్ రుద్ర" అని పెళ్లి ఇన్విటేషన్ పంపించింది.

పెళ్లి పందిట్లో అమ్మమ్మ కన్నీళ్లు చూడనట్లే నటించింది.

పైగా, "రాలేదేం మీ మనవడు?" అని ఎక్కిరించింది గౌరీపూజ చేస్తూ.

"నోర్ముయ్... నీకు నీమీద గౌరవం తప్ప, గౌరవించతగ్గ వేటిమీదా గౌరవం లేదు. వాడిని నువ్వు ఆశపెట్టి మభ్యపెట్టావు. అమ్మవారికి పూజ చేస్తున్నావు. అది కూడా నిన్ను నువ్వు వంచించుకోవటమే. ధ్యానాధ్యాతృ ధ్యేయరూపమైన ఆ తల్లితో మమైకం అయ్యేవారి గుండెలు గుడి అవుతాయి. ప్రేమ, ఆప్యాయత, దయ, జాలి వీటితో అష్టోత్తరం చెయ్యాలి... నీకు ఏవే ఆ గుణాలు?! ఎంతసేపూ కనబడని ప్రపంచపు మెప్పుకోసం బతుకుదామనుకుంటున్నావు ముందు నిన్ను నువ్వు అర్థం చేసుకొని నీకు నువ్వు సమాధానం చెప్పుకో... ఆ రోజు రావాలని కోరుకుంటున్నాను..." ముత్తవకట్నం అక్కడ పెట్టేసి బండెక్కింది అమ్మమ్మ.. మొట్టమొదటిసారిగా ఉలిక్కిపడింది దేవి..

అప్పుడే వచ్చింది రిజిస్టర్ పార్శిల్..రుద్ర పంపిన పెళ్లి కానుక!

బంగారు తామరపూవులాంటి కుంకుమ భరిణ. అందులో ఎఱ్ఱటి అక్షింతలు.

"దేవీ... ఇవి నా రక్తాక్షతలు. నేను ఇంక బ్రతకను. నీకు నా ఆశీస్సులు..." ఆ ఉత్తరం చూసి అవాక్కైపోయింది దేవి. అతనిది ఆత్మహత్యా?! ఇవి అతడి రక్తంతో తడిసిన అక్షింతలా?!

కానీ..

"అఁ - అసలు అతనికి ఏదో జబ్బు ఉన్నది. ఆ పల్లెటూరు వాతావరణంలో ఉండి ముందరబెట్టుకున్నాడు. పోయేసమయానికి ఈ మెలోడ్రామా ఎందుకు?!" అనేసి మనసుని సరిపెట్టేసుకుంది ప్రాక్టికల్ మనిషి దేవి.

ఆ తరవాత దేవి ఫారిన్ వెళ్ళిపోయింది.

కాని, ఎప్పుడూ ప్రతిదీ డాలర్లతో ముడిపెట్టి, .ఎవరి క్షేమం, అటు తనవారి క్షేమం, ఇటు భర్త తాలుకు వారి క్షేమం-రెండూ-ఆలోచించని దేవిని భరించడం ఎంతకష్టమో అర్థమైంది ఆమె జీవితేశ్వరుడుకి.

అందుకే రెండేళ్లలోనే ఆమె పెళ్లి కోర్టుకు ఎక్కింది. ఏమాత్రం అధైర్యపడకుండా, "ఛా! వెధవ మొగాళ్ళు" అని తిట్టుకుని, తన కడుపున పుట్టిన పిల్ల "బాల"ను పెంచుకుంటూ, చాలా ప్రఖ్యాతి చెంది డాక్టరుగా పేరూ ప్రతిష్ట, డబ్బూ సంపాదించుకున్నది దేవి. ఇదంతా అమెరికాలోనే సాధించుకోవాలనుకున్నా ఒంటరి జీవితం, ఆత్మీయత లేని జీవితం ఎంత కష్టమో అర్థమై తిరిగి ఇండియా వచ్చి, అనుకున్నది సాధించింది దేవి.

కళ్ళు మూసుకున్నా ఆమె ముందు గతం ఒద్దన్నా పరదాలు చించుతోంది. నిద్రరాదు... గుండెల్లో మంట, దుఃఖం..రక్తాక్షతలు..ఒద్దన్నా ఆమె కళ్లముందు రుద్ర, అతని మాటలు, అమ్మమ్మ అనిపోయిన దీవెనలు-అన్నీ గుర్తుకు వస్తున్నాయి.

ఆ రోజు అంతా ఆలోచిస్తోంది...

తన జీవన సమీక్షలో ఏదో లింకు తెగింది...అది ఏమిటి? తను ఎంతసేపూ ఒకపక్కనుంచే ఆలోచించిందా?! అటువైపునుంచి చూస్తే, ప్రేమ, గౌరవం, జాలి, ఆరాధన ఇవన్నీ ఉండేవా?! ఏమో...అమ్మమ్మ అన్నట్లు తనను తను తప్ప వేటిని గౌరవించిందని?!

లాభనష్టాల బేరీజుమధ్య సున్నితమైనవి ఎన్ని చచ్చిపోతాయో?! అమ్మమ్మ ఎంత సరిగ్గా అన్నది?!

"ఓర్యాణ పీఠ నిలయా..శృంగార రస సంపన్నా.."

లలితా సహస్రనామం మెల్లిగా ఆహ్లాదకరంగా టేపులోనించి వస్తోంది.

సహస్రనామాలు, శతనామాలు పెదవులు ఉచ్చరించడమే కానీ, తన భక్తిని తను శ్రద్ధతో ఏనాడైనా గౌరవించిందా?! తను పూజచేసే అమ్మవార్ని తన ప్రత్యేకతకు, గొప్పతనానికి ప్రతీకగా నిలిపింది కానీ, ఏనాడైనా తనలోని శక్తిని పుంజీభూతం చేసి పంచపూజలతో అమ్మవారికి అర్పించి "ప్రేమరూపా ప్రియంకరీ" అని అర్చించిందా?!

ధ్యాన్నాధాతృధ్యేయరూపం-అమ్మమ్మ అన్నట్లు తను పూజ చేసేది, పూజా విధానం, పూజ చేస్తున్న తను-మూడూ ఒక వెలుగుగా మారలేకపోవడానికి కారణం తన "అహం" కాదా?!

అన్నీ పట్టుపట్టి సాధించాననుకున్న తనను, అహం తను కోరుకున్నది సంపాదించుకోనిచ్చింది కానీ, తనకు కావలసినది దొరకనియ్యకుండా చేసింది.

వనుపాశ విమోచనీ...ప్రాపంచికత, కోరికలతో స్వార్థంతో ఏర్పడిన పాశవిముక్తి చెయ్యమని తను ఏనాడైన కోరుకుందా?!

ఆలోచిస్తూ లేచింది దేవి.

❀ ❀ ❀

బాల, ఆమె స్నేహితురాళ్ళు ఆశ్చర్యపోయారు. విరించిని రమ్మనమన్నది దేవి.

తనచుట్టూ భయంభయంగా కూర్చొన్న ఆ ఎదుగుతున్న పిల్లల కళ్లల్లో తనను చూస్తే దడుపు... ప్రేమ, నమ్మకం లేవు... ఏం సంపాదించుకోగలిగింది తను?!

మెల్లిగా, నిట్టూర్చింది దేవి. మృదువుగా చెప్పింది.

"వయస్సులో సెన్టిమెంట్సుకు పునాదులు పడతాయి. అవి కాపాడుకోవడం గొప్ప వరం. విరించీ, నువ్వూ చాలా మంచి స్నేహితులుగా ఉండండి. మీ ఆకర్షణల మధ్య కాలం అడ్డురాకుండా ఉండి, మీలో మార్పు రాకుండా ఉంటే, ఐదేళ్ల తరవాత ఆలోచిద్దాం... ఈ లోపల మీరు బతుకుతున్న ప్రపంచంలో గౌరవంగా బ్రతికే చదువు, పద్ధతులు నేర్చుకోండి. కానీ... కానీ.. అందుకని, మీ ప్రేమల కోసం జీవితాలు బలి చేసుకోకండి... ప్లీజ్..." ఆమెగొంతులో జీర... జారుతున్న ప్రతి కన్నీటి బొట్టులోనూ రుద్ర....

ఆ పిల్లలకు ఎంత అర్థమయిందో ఆ సర్వేశ్వరికి తెలియాలి.

కానీ, మారుతున్న దేవి మాటలు కారుణ్యారుణిమతో అమ్మవారి చరణారవిందాలపై కాశ్మీర తండులాలై మెరుస్తున్నాయి... అవి మరో దృష్టికి కానీ అందనివి.... ఆమెలో నిజమైన పూజ అప్పుడే ప్రారంభమైంది!

*(వనిత - నవంబరు, 1989)*

కట్టిన రంగురంగుల గాజు గొట్టాలు, పూసలతో అల్లిన తెర అల్లల్లాడింది. వాటి సందునుంచి తొంగిచూస్తున్నారు. ఎవరో?

"ఎవరది?"

"నేనండి! శ్యామలను. నా ఫోటో తీస్తారేమోనని అడుగుదామని వచ్చాను..."

ఆ వ్యక్తి ఎదురుగా వచ్చి నిలబడింది. ఆ అమ్మాయిని, ఆకారాన్ని ఆ గొంతుకను విని ఉలిక్కిపడ్డాడు సుధాకర్ నల్లటి ఛాయ, బక్కచిక్కిన శరీరం, లోతు బుగ్గలు మెల్లకన్ను, బిగించి కట్టిన ఉంగరాల జుట్టు... కరణంగారి అమ్మాయి శ్యామల. "ఖర్మరా బాబూ." అనుకున్నాడు! సుధాకర్. ఎలాంటి ఎలాంటివాళ్ళో ఫోటోలు తీయించుకుందామనుకుంటారుగాని, ఇలాంటి పిల్ల కూడా ఫోటో తీయించుకుంటుందని అతని ఊహకు తట్టలేదు.

"మాట్లాడరేమండి... నేను ఫోటోకు బావుండననేగా! అందరూ అందంగా ఉంటారా ఏమిటీ? నా కెన్నాళ్ళ నుంచో ఫోటో తీయించుకోవాలని ఉంది... నీ ముఖానికి అదొక్కటే తక్కువ, అంటుంది మా అమ్మ. ఏమండీ.. నేను బావుండనా!" వెలిసిపోయిన వాయిలు ఓణీ వేలుకు మెలిపెడుతూ, మెల్ల కన్నుతోనూ, భయంకరమైన గొంతుతోనూ మాట్లాడే ఆ అమ్మాయిని చూసి దడుసుకున్నంత పనైంది అతనికి.

'అబ్బే..అదేం లేదు.. తప్పకుండా తీస్తాను..' అన్నాడు తడబడుతూ.

"ఎప్పుడు తీస్తారూ?" అంది గొంతు సాగదీస్తూ

"ఎప్పుడేమిటీ? ఎప్పుడైనా తీద్దాం..రేపు..లేకపోతే.." ఎవరైనా తనను చూస్తారేమో, నవ్వుతారేమోననిపించి అని తత్తరపడ్డాడు.

"అయితే ఎల్లుండి తీయండి. సాయంత్రం వస్తానేం...ఎల్లుండి మంచి రోజు– ఏం?" అంటున్న ఆ అమ్మాయిని చూసి నవ్వాలో ఏడవాలో అర్థంకాలేదు అతనికి.

"అలాగే..అలాగే" అంటుండగా వాళ్ళక్క లోపలికి వచ్చింది హమ్మయ్య అనుకున్నాడు.

"ఏమిటీ శ్యామలా, ఇలా వచ్చావు?" అంది నవ్వుతూ, ఆ పిల్లను చూడగానే ఎవరికైనా నవ్వూ, వేళాకోళం, విసుగూ అన్నీ.

"లేదు పిన్నిగారూ! మీ సుధాకర్ ఫోటో తీస్తాడేమోనని ఆపకుండా మాట్లాడుతోంది శ్యామల. అక్కడినుంచి మెల్లిగా దాటుకున్నాడు సుధాకర్.

"ఏమిటక్కయ్యా! ఆ అమ్మాయి..." భోజనాల దగ్గర కదిలించాడు మెల్లిగా ఎందుకో ఎంత మర్చిపోదామన్నా ఆ అమ్మాయే గుర్తుకు వస్తోందతనికి.

"ఆః – ముది వయసులో పుట్టిన పిల్లరా! ఎదుగూ లేదు, బొదుగూ లేదు. పైగా అనాకారి తను... పోనీ కాస్త శుభ్రంగా అన్నా ఉంటుందా అంటే ఆ తల్లికే లేదు శ్రద్ధ. వచ్చిన కొత్త కోడల్ని చూసి మురిసిపోవడంతోనే సరిపోతోంది, సాయంత్రం అయ్యేసరికి తట్టెడు మల్లెపూలు ఇంటిల్లిపాదీ పెట్టుకుంటారు. ఆ పిల్లకు

తలన్నా దువ్వరు, 'పోనీ, ఏ టానిక్కన్నా ఇవ్వరాదా వదినా' అని చెప్పానురా! శ్రద్ధేదుస్తేనా? ఆస్తి ఉంటే చాలనుకుంటున్నారు. కాస్త అందమన్నా ఇవ్వకూడదా భగవంతుడు! అబ్బే...పగలు చూస్తే రాత్రి కల్లోకి వచ్చేటట్లుంటుంది. ఏం రాత రాసుందో ఆ పిల్లకు.." పులుసు వడ్డిస్తూ అక్క చెప్పిన విషయాలకు జాలేసింది సుధాకర్‌కు.

"ఇంతకూ నీ దగ్గరకెందుకు వచ్చింది మామయ్యా!" పిల్లలు అడిగిన ప్రశ్నకు 'ఫోటోకోసమర్రా' అని సమాధానమిచ్చాడు. ఫకాల్న నవ్వారు పిల్లలు.

"ఆc! దాని ముఖానికి ఫోటో ఒకటి తక్కువ" అంది కంచాలెత్తుతూ అక్కయ్య.

"అయితే బావా! శ్యామల నిన్ను ఫోటో అడిగిందా?" మర్నాడు మామిడి తోటలో నవ్వాపుకుంటూ అడిగింది అనూ. అమె వెనకాల వున్న మిత్రబృందం ఆశ్చర్యంగా చూశారు. అంతమంది ఆడపిల్లలు తనను అలా చూసేటప్పటికి రెచ్చిపోయి నిన్నటి దృశ్యాన్ని చిలవలు, పలవలు కలిపించి చెప్పి, వాళ్ళను నవ్వించాడు సుధాకర్. ఇంక ఆ మర్నాడు శ్యామలను ప్రత్యేకంగా పిలిపించి, కూర్చోబెట్టి, అతి అమాయకత్వం నటిస్తూ, "మా బావ నిన్ను ఫోటో తీస్తానన్నాడటగా..." అంటూ ప్రారంభించి, చాలా సేపు శ్యామలను వాగించి, వాగించి ఆనందించారు అనూరాధ, ఆమె స్నేహితురాళ్ళు.

అదే రోజు సాయంత్రం లేతాకు పచ్చని పట్టుపరికిణీతో సోగకళ్ళతో సంపెంగ దండలాంటి అనూ దూసుకు వచ్చింది తోటలోకి.

"బాబోయ్! నీకో విషయం తెలుసా? నీకొక ఆరాధకురాలుంది ఈ ఊళ్ళో.." ఫకాల్న నవ్వుతూ అంది.

ఎవరబ్బా! ఆలోచిస్తూ మెల్లగా, "నువ్వా" అన్నట్లు కొంటెగా చూశాడు సుధాకర్.

"ఆశ పాపం..నిన్నెవరు నమ్మార్లే..నవ్వులాటకాదు నిజంగా..."

"నీ ముఖం.."

"నిజం..ఎవరో తెలుసా? ఊర్వశి శ్యామల!"

ఉలిక్కిపడ్డట్టు నటించాడు సుధాకర్,"పాపం శమించుగాక!" అని చెవులు మూసుకున్నాడు.

"నిజం.మేము నిన్ను గురించి బాగా ఉన్నవీ, లేనివీ నమ్మేటట్లు చెప్పేశాం. పిచ్చిది కదా, నిజం అనుకుంది. ఇంక చూడు, రోజూ నువ్వు తననే చూస్తున్నావట. పొద్దున్న ముఖం కడుక్కునే సాకుతో మేడ మీదకు వస్తావట. అసలు నువ్వే 'ఫోటో తీస్తాను శ్యామలా' అని అడిగావట. నిజమా బావా?" చక్రాల్లా కళ్ళు తిప్పుతూ అమాయకత్వం నటిస్తూ అడిగింది శ్యామల.

"ఛా! నోర్ముయ్యి. అసలు ఆ అమ్మాయితో నేను.."

"నాకు తెలుసులే బావా! ఏడిపించడానికి అన్నాను. విను మరి.. ఇంకా చాలా చెప్పింది. విని విని మన పూజారిగారి రాధకు ఒళ్ళుమండి 'నువ్వేం పెద్ద ఊర్వశి ననుకుంటున్నావా? జరిగింది మాకు తెలియదా ఏమిటి? మొన్న ఆయనే చెప్పాడులే' అని నువ్వు మొన్న ఆ అమ్మాయి ఫోటో తియ్యమని అడిగిన ఫార్సంతా చెప్పావే- అదంతా నీభాషలోనే వర్ణించింది. ఇంక చూడు. దాని నల్లటి ముఖం మరీ మాడిపోయింది. పారిపోయిందనుకో.." ఇంకా ఏదో చెప్తూతోంది అనూ.

ఎందుకో సుధాకర్ మనస్సు కలుక్కుమన్నది. పాపం, ఏమనుకుందో అమాయకురాలు- అనిపించింది. అందవికారమైన ఆడపిల్ల తన 'గొప్ప' వుందని తృప్తి పరుచుకోడానికి ఊహించుకున్న తీయని ఊహలన్నీ నిజాలుగా బైటకు చెప్పిందనే విషయం తెలియకపోయినా ఎందుకో జాలేసిందతనికి.

"అయినా, ఆ పిల్ల కెన్నేళ్ళుంటాయి అనూ. నాలుగడుగులు కూడా ఉండదు!" అన్నాడతను.

"ఎన్నేళ్ళేమిటి బావా! నా వయసే. పద్దెనిమిది. నేను కార్తీకంలో పుట్టాను. అది పుష్యమాసంలో పుట్టింది. అయినా బావా, నువ్వు మేడెందుకు ఎక్కుతున్నావో నాకు తెలియకనా? కరణంగారి కొత్తకోడల్ని చూట్టానికేగా?.." అంది నవ్వుతూ.

"ఏయ్ అనూ! తంతాను. వాళ్ళ మావ విన్నాడంటే మక్కెలిరగగొడతాడు మనవి" అన్నాడు చెయ్యెత్తుతూ.

నాలుకతో ఎక్కిరించి గోరింటాకు చేతులతో టాటా చెప్పేసి, అందకుండా దూసుకుపోయింది అనూ.

మర్నాడు మధ్యాహ్నం నిన్న సాయంత్రం మర్చిపోయిన నవల కోసరం భోజనం చేసి మేడెక్కాడు సుధాకర్. ఎర్రని ఎండలో నోరూరించేటట్లున్న వడియాలు తీసుకుని రెండు నోట్లోవేసుకుని వెనక్కి తిరగబోయి ఆగిపోయాడు సుధాకర్. అవతల మేడ మీద ఎర్రటి ఎండలో, గోడ కానుకుని కూర్చుని మోకాళ్ళలో తలదాచుకుని ఏడుస్తోంది శ్యామల. ఆశ్చర్యపోయి ఇవతలి గోడకానుకుని "శ్యామలా!" అని పిలిచాడు తనను తాను మర్చిపోయి.

తలెత్తి చూసింది. ఎంతసేపటినుంచి ఏడుస్తుందో కళ్ళు - ఎర్రబడి వాచి ఉన్నాయి.

"మీరా? పోండి! నాతో మాట్లాడకండి" అంది బెక్కుతూ చేతుల్లో ముఖం దాచుకుంటూ.

"ఏం? ఎందుకని? ఏమైంది?" మెల్లిగా అడిగాడు. అతనికి తెలియకుండానే అతని గొంతు మృదువుగా మారిపోయింది.

మరి కాసేపు బ్రతిమాలించుకుని అసలు విషయం చెప్పింది శ్యామల:

"మీరు నన్ను గురించి ఇష్టం వచ్చినట్లు మాట్లాడారట కదా! నిన్న అనూ, దాని స్నేహితురాళ్ళు నన్ను గుళ్ళో ఎలా ఏడిపించారో తెలుసా? నేను ఫోటో

తీయించుకుంటానని దానికెందుకు చెప్పారు? ఇష్టం లేకపోతే అప్పుడే చెప్పాల్సింది. అందరికీ తెల్సిపోయి నన్ను ఏడిపిస్తున్నారు. మా అమ్మ 'సిగ్గు లేనిదానా? నీ ముఖానికి ఫోటో ఒకటే తక్కువ. సిగ్గూ, ఎగ్గూ లేకుండా పరాయి మొగాడ్ని అడుగుతావా?' అని కొట్టింది. ఏమండీ! నేను ఫోటోకు అంత పనికిరానిదాన్నా?" బెక్కుతూ చేత్తో కళ్ళు నులుపుకుంటూ అడుగుతున్న ఆ పిల్లను చూడగానే అతనికి ఆ అమ్మాయి అందవికారం కాని, బొంగురుగొంతుకానీ వినిపించలేదు, కనిపించలేదు. గుండె తరుక్కుపోయినట్లనిపించింది. వెంటనే తనను తాను మర్చిపోయి–

"ఛీ! ఛీ! అదేం లేదు శ్యామలా! ఎవరన్నారు అలా? అదంతా అబద్ధం. ఇంకా నువ్వు ఇవ్వాళ ఫోటో తీయించుకుంటానికి రెడీ అవుతావనుకుంటున్నాను. వాళ్ళ ముఖం.. వాళ్ళ మాటలేమిటి? రేపు నీ ఫోటో చూడు. ఎంత బావుంటుందో.." అన్నాడు.

నమ్మనట్లు తలెత్తి చూసింది శ్యామల, "నిజం... అబద్ధం కాదు... సాయంత్రం మరి రెడీగా ఉంటావా? ఫో! ముఖం కడుక్కో.. అన్నం తినలేదు కదూ.. పిచ్చి పిల్లా.. వెళ్ళు" అన్నాడు.

మెల్లిగా లేచి పరికిణీతో ముఖం తుడుచుకుని, వెనక్కు తిరిగి చూసుకుంటూ వెళ్ళిపోయింది శ్యామల. ఆమె వెళ్ళిన అయిదు నిమిషాలకు కానీ, తను చేసిన పనేమిటో అర్థం కాలేదు అతనికి. "ఇదెక్కడి కొత్త జంజాటం పెట్టుకున్నానురా దేముడా!" అనుకుంటూ కిందికి వెళ్ళాడతను.

"ఏమండోయ్.." సాయంత్రం పడకగది కిటికీ దగ్గర నుంచి శ్యామల గొంతు వినబడి ఉలిక్కిపడి నిద్ర లేచాడు.

"నేనేనండీ! మా ఇంట్లో అందరూ పస్తలో ఉన్నారు. మీ అక్కావాళ్ళు మామయ్యగారింటి కెళ్ళారు. మరి నేను తయారవ్వనా? ఫోటో తీస్తారా?" ఆ గొంతులో ఆశ, ఆ వికృతమైన ఆకారం రెండూ చూసి ఏం మాట్లాడలేక 'ఊఁ' అని, ఖర్మరాబాబూ అనుకుంటూ కెమెరా తీసుకుని మేడెక్కాడు అతను. అంత ఖరీదైన కలర్ ఫిలిం శ్యామల మీద దండగ చెయ్యడం ఏమాత్రం ఇష్టం లేదతనికి. 'ఊరికే క్లిక్ మనిపిస్తే సరి!...నమ్మేస్తుంది...పిచ్చిది...' అనుకున్నాడు. 'భగవంతుడా! ఈ ఫోటో తీసే సమయానికి మా అనూ, దాని బృందం రాకుండా చూడు' అని మనస్సులోనే దేముణ్ణి ప్రార్థించాడు. అయినా అతనికి బెరుకు వదల్లేదు.

"ఏమండీ!" ఆ గొంతు మళ్ళీ వినబడగానే ఉలిక్కిపడ్డాడు. ఎదురుగా శ్యామల! ఆమెను, ఆమె అలంకరణనూ చూస్తే నోటమాట రాలేదతనికి. ముదురు ఎరుపురంగు పరికిణీ, కనకాంబరం రంగు ఓణీ, వాళ్ళ అమ్మది కాబోలు – లూజుగా ఉన్న పట్టు జాకెట్టు, మెళ్ళో ఏవేవో రకరకాల నగలు, చేతినిండా నానా రంగుల గాజులు, ముఖానికి అరంగుళం పౌడరు, కళ్ళు మూసుకుపోయేలా కాటికా, ఎర్రటి అమ్మవారి బొట్టు.... అసలే అందవికారమైన శ్యామల, ఆ అలంకరణలో

"బావున్నానా అండీ?" అని నవ్వేసరికి దడుసుకున్నాడు సుధాకర్. ఉన్నపళంగా చేతులో ఉన్న కెమెరా కిందపెట్టి పారిపోవాలనిపించింది అతనికి.

"ఏమండీ! మాట్లాడరేం... నేను బాగాలేనా?..." ఆ గొంతు వినగానే మధ్యాహ్నం ఎండలో కూర్చుని ఏడుస్తున్న శ్యామల జ్ఞాపకానికొచ్చింది. ఒక్కసారిగా జాలేసిందతనికి!

"ఏమండీ! ఫోటో తీయరూ?" ఏడుపు గొంతుకతో అంది శ్యామల.

అటూ ఇటూ చూశాడు అతను.

"నేను ఎవరికన్నా చెప్తానని భయపడుతున్నారా? నేనెవరికీ చెప్పనులెండి. ఒట్టు..." ఆశగా అంటున్న ఆమెగొంతు వినగానే-

"ఛా!ఛా! అదేంలేదు. అదిగో ఆ పిట్టగోడకానుకుని నించో" అని తోచిన అయిడియా చెప్పి, నిజంగానే ఫోటో తీశాడు సుధాకర్. కెమెరాలో రీలు తిప్పుతున్న అతన్ని చూస్తూ "ఏదండీ ఫోటో.." ఆశగా చెయ్యి చాచింది.

"ఇప్పుడే రాదు. మా ఊరు వెళ్ళిం తరువాత పంపుతాలే. సరే నువ్వెళ్ళు ఇంక..." అని వెనక్కు తిరగబోయాడు అతను.

"ఏమండీ!"

మళ్ళీ ఏమిటన్నట్లు వెనక్కుచూశాడు.

"అందర్నీ ఫోటో తీస్తారు, మీరు తీయించుకోరా? మీరు ఆ ఫోటోలో ఎంత అందంగా ఉంటారో తెలుసా?..."

ఆ అమ్మాయి మాటలకు అదిరిపోయాడు. ఇంత వరకు కెమెరా కొన్న తరువాత ఫోటో తీయించుకునేవాళ్ళే కానీ, అతన్ని గురించి ఆలోచించినవాళ్ళులేరు. ఈ శ్యామల... ఈ అనాకారి పిల్ల... నా ఫోటో గురించి ఆలోచిస్తోందా? అనిపించింది. ఏదో చెప్పాలని మాట్లాడబోయాడు.

"శ్యామలా"! అని వాళ్ళమ్మ గొంతు వినగానే పరుగెత్తింది శ్యామల. దూరమౌతున్న ఆమె పాంజేబు పట్టీల సవ్వడి వింటూ అలాగే చాలాసేపు నిలబడి కిందికి వచ్చేశాడు సుధాకర్.

ఆ తరువాత రెండు రోజులు అతనికి ప్రయాణసన్నాహాలతోనూ, బంధువుల ఇళ్ళల్లో భోజనాలు, అనూ వాళ్ళతో వనభోజనం.. వీటితోనే సరిపోయింది. ఆ మూడోసాయంత్రం గూడుబండిలో రైల్వేస్టేషనుకు వెడుతున్న అతనికి కరణంగారి వాకిట్లో తారాడిన నీడ శ్యామలలా అనిపించినా, మిగతా అనేక విషయాలలో అదేం పట్టించుకోలేదతను.

బొంబాయి వచ్చిన నెలరోజులకు-

"బావా! నీకీ విషయం తెలుసా? కరణంగారి శ్యామల చచ్చిపోయింది. ఏదో డిఫ్తీరియాట, పాపం, ఇరవైనాలుగు గంటల్లో ప్రాణం పోయింది. అది పోయినందుకు వాళ్ళింట్లో ఎవరికీ విచారం లేదనుకో. పోయేముందు నన్ను పిలిచి 'మీ బావను నా

ఫోటో అడుగు' అని రాసి చూపించింది. దానికి నువ్వు ఫోటో తీశావా? మాకెవరికీ చెప్పలేదేం బావా! పాపం, అమాయకురాలు..." ఈ రకంగా ఉన్న ఆ ఉత్తరం చూడగానే కళ్ళ నీళ్ళు తిరిగాయి అతనికి. ఆ రోజే ప్రింటు అయివచ్చిన ఫోటోల కవరు తీసి మెల్లిగా అన్ని ఫోటోలు చూస్తూ, శ్యామల ఫోటో దగ్గర ఆగిపోయాడతను. చాలా క్లియర్‌గా వచ్చింది బొమ్మ! శ్యామలలాగా ఉంది. "ఏమండీ! నా ఫోటో బావుందా?" ఎవరో అన్నట్లనిపించింది. అలాగే దాన్నే చూస్తూ కూర్చున్నాడతను చాలాసేపు.

❀ ❀ ❀

"ఇంత అందవికారమైన అమ్మాయి ఫోటోకి ప్రైజ్ ఎలా వచ్చిందా అని చూస్తున్నావా? ఆ ఫోటో పరిశీలించి చూడు. అందులో ఏం కనబడుతోంది? లైఫ్...జీవితం, జీవితం మీద ఆశ... ఆ అలంకరణ, ఆ శ్రద్ధ చూడు. అదొక విచిత్రమైన అనుభూతి... ఆ కళ్ళు.... ముఖ్యంగా ఆ కళ్ళు చూడు..... ఎంత స్త్రీత్వం? ఎంతో కోరిక ఎంతో ఇష్టమైన వ్యక్తిని ఎవర్నో ఎంత ఆరాధనగా చూస్తోందో చూడు ఆ పిల్ల... అందుకే అన్నారండీ 'కెమెరా ఐ' అని.

జీవితంలో మామూలుగా ఉండేవాటిని కెమేరా అద్భుతంగా కనిపెడుతోంది. ఏం ఫోటో అండీ? ఊరికే ఇచ్చారటండీ ప్రైజూ?" ఎవరో ఇద్దరు నడివయస్సు వ్యక్తులు ఇలా ఆ ఫోటో ముందు నిలబడి మాట్లాడుకుంటున్నారు.

అక్కడే కొద్దిదూరంలో ఒక స్తంభానికి ఆనుకుని, చేతులు కట్టుకుని నిలబడి, వారి మాటలే వింటూ ఆ ఫోటో వంకే చూస్తున్నాడు ఒక యువకుడు.

అది ఫోటో ఎగ్జిబిషన్.

ఆ యువకుడు సుధాకర్!

*(వనిత – జనవరి, 1990)*

# స్నేహ

సుందరరావు మొదటిసారిగా కన్నీరు పెట్టుకున్నాడు. తెలిసీ తెలియని వయస్సులో అల్లరి చేసి దెబ్బలు తిన్నప్పుడు, కర్రాబిళ్ళా ఆడుకుంటూ నేలమీద పడి డోక్కుపోయినప్పుడు దుఃఖం కాదది...

మనసు బాధ పడినప్పుడు... అదీ మరొకరి బాధకు, సాదా సీదా మొగవాడు అపూర్వంగా రియాక్టై కార్చిన కన్నీరు అది.

అతనికే ఆశ్చర్యంగా వున్నది, అది సాధ్యమా అని.

కంప్యూటర్ ఇంజనీరు అయిన అతనికి పెరిగిన వాతావరణంలోకానీ, కాలేజీ జీవితంలోకానీ, ఎక్కడా కన్నీరు కార్చేటంతటి స్పందన కలగలేదు. కాళిదాసు మేఘ సందేశాన్ని కూడా పరీక్షలో ఏం జవాబు రాయాలన్న పాయింట్ ఆఫ్ వ్యూతో చదివేడు. మంచులో తడిసి కొత్త పెళ్ళికూతురులా తలకాయ వాల్చి అలవోకగా మొట్టమొదటి సూర్యకిరణాల స్పర్శకు పులకించిపోతున్న జూకా మందారాన్ని చాలా మెర్సిలెస్‌గా హైబిస్కస్ బొటానికల్ ఫామిలీ... వగైరా చెప్తూ, నోట్సు రాస్తూ, ఏ రేకు కారేకు ఊడగొట్టి వాటిని ఎక్స్‌పరమెంటు చేసేవాడు.

కంప్యూటర్స్ ఎగ్జిబిషన్‌లో పరిచయమైన బి.ఎస్‌సి. అమ్మాయి చెమ్కి చీరతో, రాళ్ళ జూకాలతో మారాడని ఏరాడ కొండ నీడల్లో అతనితో చిరునవ్వులు జిలుగుమాటలు అల్లుతుంటే, వింటూనే "ఎక్స్‌క్యూజ్‌మీ...ప్లీజ్... నా చెప్పులు అక్కడ మర్చిపోయి వచ్చాను... ఎవడైనా ఎత్తుకుపోగలడు. మొన్న 75 రూపాయల 95 పైసలు పెట్టి కొన్నాను" అంటూ ఇసుక దులుపుకుంటూ ఆ సౌందర్యమూర్తి మీద నుంచి చూపు నల్ల చెప్పుల మీదికి మరల్చి చూస్తూ నడవగలడతను. అక్షరాల్లో చెబుతూంటే ఇదంతా ఆడ్‌గా వుందేమో కానీ, ఇందులో అనాలోచిత మేమిటిట? ఆదర్శాలతో బతికెయ్యడం పెద్ద గొప్పేం కాదు. అదే కోవకు చెందిన సుందరరావుకు కన్నీరు పెట్టించేటంతటి విలువైనదేవీ కనబడలేదు మరి.

కర్మ సిద్ధాంతం ప్రకారం అతను చాలా పుణ్యాత్ముడు. అన్నీ అమర్చుకుని పుట్టాడు కాబట్టి. బాధ, దుఃఖం, ఆలోచన - ఇవన్నీ కొంచెం ఎదటి వాళ్ళ గురించి ఆలోచిస్తే వస్తాయి కానీ ఎవడి గోడు వాడు పడే వాడికి వచ్చేది తృప్తి, ఏదైనా లాభం లేనప్పుడు అసంతృప్తి తప్ప మధ్యలో సిరి వెన్నెలలు, వెలుగు పొరలు, రంగుల వలయాలు వుండవు... తెలియవు కూడా.

ఇలా చాలా మంది బ్రతికేస్తున్నారు. అందులో 'లేమి' ఎవరికీ తెలియదు- అక్కర్లేదు కూడా.

సుందరరావు అలా బ్రతికేస్తూ వుండేవాడు – ఆమె పరిచయం అయ్యేదాకా.

"మీకేమైనా బుద్ధుందా? కొత్త కంప్యూటర్‌కు అగరువత్తి, పూవులు పెడతారా? కొబ్బరికాయకొట్టి హారతి ఇచ్చెయ్యకపోయారా ఏకంగా?"

తన స్నేహితుడు పెట్టిన కంప్యూటర్ సెంటర్లోకి పనిమీద వెళ్ళిన సుందరరావు నిర్ఘాంతపోయాడు చూశాడు. స్నేహితుడి కేకలు విని ముందు ఆశ్చర్యం, తరువాత నవ్వు వచ్చాయి అతనికి.

మెల్లగా బేల చూపులు చూస్తూ, కొంగు మెలిపెడుతూ, బారెడు జుట్టు, సోగ కళ్ళు వున్న ఆ తిట్లు తింటున్న అమ్మాయి వంక దృష్టి సారించాడు.

"కొత్త కంప్యూటర్ కదా అని... " నట్టుతూ సమాధానం చెప్పింది ఆ అమ్మాయి.

"అయితే.... మిమ్మల్ని ఇన్‌ఛార్జ్‌గా వేశాం కదా అని ఇలా కొత్త కంప్యూటర్ వచ్చినప్పుడల్లా పూజలు, వ్రతాలు చేస్తారా? ఏకంగా సప్త గోదావరుల నుంచి నీళ్ళు పట్టుకొచ్చి అభిషేకం చెయ్యకపోయారా? పీడా వదిలిపోతుంది! మూర్ఖత్వానికీ, చాదస్తానికీ ఒక లిమిట్ వుండాలి....ఛా.."

స్ప్రింగ్ డోర్ ధమాలమని తోసుకుంటూ వెళ్ళి కుర్చీలో జారగిలబడి, కర్చీఫ్‌తో ఏసి రూంలో పట్టిన చెమట తుడుచుకుంటున్నాడు హేమంత్.

"ఏమైందిరా?" నవ్వు అణచుకుంటూ అడిగాడు సుందరరావు.

"ఏమైందా? నా బొంద్దైంది.. అసలే నాకు తిక్కరేగుతూంటే, మళ్లీ మొదలెట్టనీయకు..." సీరియస్‌గా ముఖం తిప్పుకుంటూ అన్నాడు హేమంత్.

అతని బుంగమూతి, రోషం చూసి నవ్వాలనిపించినా, సభ్యత కోసమూ, కొంత అతన్ని కించపరచినట్టుంటుంది అనీ నవ్వు ఆపుకుంటున్నాడు సుందరరావు.

కానీ... నవ్వు–అది రానేరాదు,కానీ ఒక మూడులో వస్తే అంత అలివి తప్పిపోయేది మరొకటి లేదు. రాకూడని సమయాల్లో వచ్చి సీను అభాసు చెయ్యగల శక్తి దానికి చాలా ఎక్కువగా వున్నది. పైగా సుందరరావుకు ఊహ లెక్కువ. కొన్ని వందల మంది తప్పట్లు కొడుతూంటే మాయాబజారులో లక్ష్మణకుమారుడి చేతుల్లా అతుక్కుపోతే....

ఆంధ్రప్రదేశ్‌లో విజయవాడ నగరంలో సోడా బాటిళ్లలో బ్లేడ్లు పెట్టి రౌడీలు ఎగరకొడుతుంటే, రష్యన్ సర్కస్‌లోలా ఎవరు విసిరిన బాటిల్ మూడు పల్టీలు కొట్టి వాళ్ల నెత్తే పగలకొడితే... ఇల్లాంటి దిక్కుమాలిన ఊహలు వచ్చీ రాకూడని సమయంలో నవ్వు వస్తుంది సుందరరావుకు, అలాగే ఇప్పుడు ఆ తిట్లు తిన్న అమ్మాయి పట్టు పరికిణీ, ఓణీ జాకెట్టు వేసుకుని మట్టి గాజుల చేతితో కంప్యూటర్‌కు పూజ చేసి హారతి ఇవ్వడం, కంప్యూటర్ లోనించి అమ్మవారు ప్రత్యక్షమై ఆశీర్వదించడం లాంటి దృశ్యం ఊహల్లోకి వచ్చి నవ్వాగడంలేదు అతనికి.

"ఏరా? పుక్కిలింతలుగా నవ్వు వస్తోందేం?" సీరియస్‌గా లేస్తూ అన్నాడు హేమంత్.

"అది కాదురా!".... నవ్వుతూ తనకు వచ్చిన ఊహ స్నేహితుడికి చెప్పాడు సుందరరావు. ఒద్దనుకుంటూనే ఆ ఊహా చిత్రానికి హేమంత్ కూడా నవ్వేశాడు.

"అదికాదురా! ఆ పిల్లకు అంత చాదస్తం ఏమిటసలు? చదువుకున్న పిల్ల పైగా.... ఛా! ఛా! మా ప్రొప్రైటర్‌గారి తమ్ముడి కూతురు కాబట్టి వదిలేశానుకానీ, మరొకర్నైతేనా?...."

"ఏమో పాపం... ఆ అమ్మాయి నమ్మకాలు ఆ అమ్మాయివి..." సీను లైటర్ చెయ్యడానికి ప్రయత్నిస్తూ అన్నాడు సుందరరావు.

"ఏమిటి? ఇంకేం.. హోమం పెట్టి సాంబ్రాణి పొగ వెయ్యమను కంప్యూటర్‌కు... తగలడిపోతుంది... ఛా ఛా! దేశం ముందుకు పోవాలంటే ఎలా పోతుంది? ఎప్పుడు అడ్వాన్స్ అవుతారు ఈ జనం?!"

హేమంత్‌ను డైవర్ట్‌చేసి, కబుర్లు చెప్పి ఏదో అఫిషియల్ వ్యవహారాలు మాట్లాడి ఆఫీసు రూం నుంచి బైటపడ్డ సుందరరావు అలవోకగా చూశాడు. టెలిఫోను దగ్గర కూర్చుని కిటికీలోనించి ఆకుపచ్చటి చెట్టుమీద వాలిన చిలకలగుంపును తదేకంగా చూస్తోంది ఆ అమ్మాయి...

"ఆకులో ఆకునై...." ఎక్కడో విన్న పాట గుర్తుకు వచ్చింది సుందరరావుకు.

గడపదాటుతూంటే మామిడాకు తోరణాలు తలకు తగిలాయి. కొత్తగా గృహ ప్రవేశం చేశారు. హేమంతుదే ఆ ఇల్లు. స్కూటర్ పక్కన నవగ్రహ హోమం కోసం చేసిన యజ్ఞవేదిక దాటుకుంటూ వెళ్ళిపోయాడు సుందరరావు.

❀ ❀ ❀

ఒక వారం రోజుల తరవాత..

ఏడున్నరకల్లా ఫస్ట్ బాచ్ స్టూడెంట్స్ వచ్చి నిలబడి వుంటే, వాకిట్లో ముగ్గు వెయ్యలేదని ఆ అమ్మాయి ఆపిందని, ముగ్గు వేసిన తరువాత కానీ లోపలికి రానియ్యలేదని తెలిసి మరొకసారి ఫైరై పోయాడు హేమంత్. ఖర్మకాలి, ఆసీనులోనూ అక్కడే వున్నాడు సుందరరావు.

ఆ సాయంత్రమే పాండురంగడి ఆలయం నుంచి బయటకు వస్తూ కనబడింది స్నేహ... ఆ అమ్మాయి పేరది.

ఆ అమ్మాయి ఆ ఒద్దిక చూసి పొద్దున సీనంతా గుర్తుకు వచ్చి జాలేసింది సుందరరావుకు.

ఎలా వున్నారు ఈ కాలం పిల్లలూ?! ఎం.ఎ. చదువుకున్న ఈ పిచ్చిపిల్ల చాదస్తం వల్ల ఎన్ని తిట్లు తింటోంది?!

ఆ కడుపుమంటలో ఆ రోజు పొద్దున ఆ అమ్మాయి గురించి చాలా వివరాలు చెప్పాడు హేమంత్. తల్లీ తండ్రీ పోతే బామ్మగారు పెంచింది ఆ అమ్మాయిని. పెద

తండ్రి పెద్ద దిక్కు. ఎం.ఎ. ఈస్తటిక్స్ చదివింది. నాలుగు నగలూనత్రా వేయించి, ఒక లక్షరూపాయలు కట్నం ఇచ్చి పెళ్ళి చేసి బాధ్యత వదిలించుకోవాలని చూస్తున్నాడు పెదనాన్న. పెదతల్లితోనూ, ఆవిడ పిల్లల జెలసీలతోనూ బాధపడుతోందని, ఈ కంప్యూటర్ డివిజన్‌లో ఉద్యోగం ఇచ్చారు ఆయన ఈ అమ్మాయికి.

"హల్లో!" పలకరించాడు సుందరరావు.

"హల్లో!..." గాలికి ఎగురుతున్న పయిట చెంగును బిగించి ముంగురులు సరిచేసుకుంటూ అతని కళ్ళల్లోకి సూటిగా చూసి నవ్వింది స్నేహ.. ఆ కళ్ళు.. ఎంత నిర్మలంగా వున్నాయి అనిపించింది చటుక్కున అతనికి.

"ఏమిటి, గుడికా?" ఏదో మాట కలపాలి కాబట్టి చచ్చు ప్రశ్నలాంటిది అడిగాడు అమె చేతిలో పూలసజ్జలో కొట్టిన కొబ్బరికాయ చూస్తూ కూడా.

అతని విషయం గ్రహించినట్టు చిన్నగా నవ్వి, అక్కడే మెట్టులాంటి గట్టు మీద కూర్చుంది స్నేహ.

"మీ సబ్జెక్ట్ ఈస్తటిక్స్‌టగా?..." మెల్లిగా మాటల్లో పెట్టాడు అతను.

చిన్నచిన్నగా మాటలు పేరుస్తూ, మధ్యలో సన్నసన్నగా నవ్వుతూ మాట్లాడుతున్న ఆ పిల్ల గొప్పగా మాట్లాడగలదని అర్థమైంది సుందరరావుకు–కొంచెం ఆశ్చర్యంకూడా వేసింది.

"మా ఫ్రెండ్‌కు మరీ షార్ట్ టెంపరు..నిజమే..కానీ, మీరు కూడా ఈ ఇరవయ్యొకటవ శతాబ్దంలో ఇంతదాన్నేమంటారు?! చాదస్తం..ఏమిటండీ మరీను.."

ఇసుక వంక చూస్తూ మాట్లాడలేదు కొంచెం సేపు స్నేహ. వున్నట్టుండి–

"మనం నమ్మనట్టు నటిస్తూ వాటిని మానమండీ మనం మీ ఫ్రండు హేమంత్ రోజూ కుంకుమ పెట్టుకోనిది బైటకురారు.. మా పెదనాన్న ఆదివారాలు గుమ్మడికాయ 'దిష్టి' తీయందే ఊరుకోరు. అరిటాకులు, మామిడి తోరణాలు, హోమాలు, పూజలు, నవగ్రహ దానాలు..ఏది ఎవరు మానారండీ?!"

"నిజమే..కానీ అవన్నీ ఎవరో పెద్దవాళ్ళు చెప్పారు కాబట్టి కానీ..." నసుగుతూ అన్నాడు సుందరరావు. అంతసూటిగా అడుగుతూంటే సమాధానం అతని దగ్గర లేదు మరి.

"నాది నమ్మకం..మూఢత్వం కాదు. మా ఇంట్లో వాతావరణం వల్ల నాకు కొన్ని అలవాట్లు వచ్చాయి. కానీ, వాటికి అర్థం తెలియకుండా నేను ఆచరించే రకాన్ని కాదు. గాలిలో మంచి, చెడు వైబ్రేషన్స్ రెండూ వుంటాయి సుందరరావుగారూ! కేవలం మంచిని వైబ్రేట్ చెయ్యగల 'ఏంటినా' లాంటి వస్తువులను ఆచారంగా చేశారు మన వాళ్ళు. మన చుట్టూ వాతావరణం అంతా ఏటమ్స్‌తోనూ, సబ్ ఏటమిక్ పార్టికల్స్‌తోనూ నిండి వున్నాయి అవునా?! సౌండు దానిని వైబ్రేట్ చేస్తుంది. మంత్రం, తంత్రం, స్తోత్రం వాటికోసరమే ఏర్పడ్డాయి...."

మంత్రముగ్ధుడిలా వింటున్నాడు సుందరరావు. ఏ కొత్త వస్తువు వచ్చినా, కొత్త బట్టలు కట్టినా పసుపు పెట్టి కట్టుకోమంటారు. పసుపు కేవలం ఏంటీ బాక్టీరియల్ అనేకాదు. థాట్‌కు గొప్ప వైబ్రేషన్ వున్నది. పాజిటివ్ థాట్‌తో ఎనర్జీని ట్రాన్స్‌ఫర్ చెయ్యగల మీడియంలు పసుపు, కుంకుమ, విభూది, అగరువత్తి వగైరా..., ఏ కొత్త వస్తువునైనా కానీయండి - బంగారు నగనుంచి, కంప్యూటర్ వరకూ, రకరకాల చేతులు మారి, వాళ్ల ఆలోచనలను, వైబ్రేషన్స్ కూడకట్టుకుని మన దగ్గరకు వస్తాయి. అవి మన జీవితంలోని హార్మనీని వాటి శక్తిని బట్టి డిస్ట్రబ్ చెయ్యగలవు. అది న్యూట్రలైజ్ చెయ్యడం కోసరమే మంచి సంకల్పంతో పెద్దవాళ్లు ఆశీర్వచనంలాంటి మాటలతో మనకు పసుపు పెట్టి మంచి గుడ్డలిచ్చినా... మరేమిచ్చినా అర్థం అదే. వీటన్నింటికీ సైన్టిఫిక్ బేసిస్ వున్నది. ఇప్పుడు కొన్నింటికి అర్థం తెలియకపోయినా, ఫ్యూచర్‌లో తెలుస్తుంది..."

నోరు తెరుచుకుని వింటున్నాడు సుందరరావు. ఆ అమ్మాయి.. అలా మాట్లాడుతుందని, అలా మాట్లాడగలదని అనుకోలేదు అతను. ఆ పిల్ల మాటల్లో అర్థంకన్నా, ఆ మాటల్లో స్థిరత్వం, ఆలోచనాజ్ఞానం అతణ్ణి ఆశ్చర్యపరచింది.

ప్రక్కన ఒక చిన్న రాయి వుంటే కొబ్బరికాయ కొట్టాలని ప్రయత్నిస్తోంది ఆమె. రెండు అరచేతుల మధ్య పెట్టి విరిచి ముక్కలు పెట్టాడు సుందరరావు.

అభినందిస్తున్నట్లు నవ్వింది కళ్లతో స్నేహ, స్నేహ కళ్లల్లో స్నేహం! ఆ క్షణంలో ఆ పిల్ల గొప్ప ఆత్మీయురాలిలా అనిపించింది అతనికి.

పక్కన ఇసుకలో ముగ్గులు గీస్తూ, చటుక్కున తలెత్తి, "ముగ్గు కోసరం పంతం పట్టానన్నారు మీ ఫ్రెండు. నాకు ఆ నాలుగు గీతల మీదా చాలా నమ్మకం. మన పాతతరం వాళ్లు దేముడి దగ్గర వేసే ముగ్గులు గమనించారా?! అటామిక్ స్ట్రక్చరల్ ఫిగర్స్ అవి. జనిటిక్ సైన్సు చెప్పే యంత్రాల్లాంటి ముగ్గులు అవి. ప్రతి క్షణం మన చుట్టూ వుండే నిత్య చైతన్యాన్ని సత్యమని మర్చిపోకుండా గుర్తుపెట్టుకునే సింబల్స్ అవి. మనం గొప్ప థాట్‌తో వేసిన ముగ్గు, దైవిక శక్తుల్ని ఆహ్వానిస్తుంది. ఓ దుష్టపు ఆలోచన వున్నవాడినైనా అక్కడే న్యూట్రలైజ్ చెయ్యగలదు. మీకు 'లక్ష్మణ రేఖ' గుర్తు లేదూ?! ముగ్గులు అలంకారం మాత్రం అనుకుంటే దాని పవరు వుండదు. పదిమంది వచ్చిపోయే కంప్యూటర్ ఇన్స్టిట్యూట్ అది. అసలే మనుష్యుల్లో కృత్రిమతా దాంభికత, మూర్ఖత్వం ఎక్కువ. అవన్నీ వాతావరణాన్నే మార్చేస్తాయి. బలమైన మన భావన వలయాలే మన వాతావరణాన్ని చాలా వరకు ఇన్‌ఫ్లుయన్స్ చేస్తాయి. కొన్ని ఇళ్లు చూడండి. ఆత్మీయతతో ఆహ్వానిస్తున్నట్లుంటాయి. కొన్ని ఎంతో ఖరీదైన పాలరాతి సమాధుల్లా వుంటాయి. ఎందుకంటే... ఇదే కారణం..." అన్నది.

ఏమిటీ పిల్ల?! ఆలోచనల మీద కంట్రోలు పోయింది సుందరరావుకు. ఆమె మాటల్లో తెలివితేటలు చూపించుకోవాలన్న అహం లేదు. తను నమ్ముతున్న సిద్ధాంతం మీద గౌరవం వున్నది. దాన్ని విడమరచి చెప్పగల ధైర్యం వున్నది.

"మీరు చాలా గొప్పగా ఆలోచిస్తున్నారు...." తెలియకుండానే అనేశాడు అతను.

చిన్నగా నవ్వింది ఆమె. "ఆలోచన ఒక్కటే కాదు, ఆచరణ కూడా నాది. జీవితానికి పనికిమాలిన జ్ఞానం వల్ల ఉపయోగం ఏమిటండీ?!"

ఆ క్షణంలో ఆ పిల్లలో హేమంత్ చేత తిట్లు తింటూ తలకాయ వంచుకున్న అమాయకురాలు కనిపించలేదు సుందరరావుకు. ఎవరో దేవతామూర్తి మాటల ప్రతి ధ్వని ఆమె రూపం దాల్చిందా అనిపించింది.

❀ ❀ ❀

చాలా త్వరగా వాళ్ల స్నేహం పెరిగింది. చాలా తమాషా అయిన విషయం ఏమిటంటే, సెన్టిమెంట్స్ లేని సుందరరావు అడవిలోని స్నేహితురాల్ని మాత్రం చూడగలగడం. దానికి కారణం నిజాయితీగా ఆలోచిస్తే, కేవలం తన సంస్కారం మాత్రం కారణం అనుకోవడం లేదు అతను. ఎందుకంటే ఆడపిల్ల కనబడగానే అతని నాలుక ఎంత అసహ్యకరమైన పదజాలం ఉపయోగించేదో తెలుసతనికి. కాబట్టే, ఈ పరిచయంలో స్నేహం నిలబెట్టింది ఆ పిల్ల సంస్కారమే ననిపించింది అతనికి.

కాస్మిక్ ఎనర్జీలు, గొప్ప పుస్తకాలు... ఇలా చాలా మాట్లాడేది ఆమె. ప్రతిదానికీ తనకు తెలిసినంతలో అర్థం చెప్పేది.

ఇంత విచిత్రమైన ఈ అమ్మాయికి 'పెళ్ళి' పట్ల అభిప్రాయం ఏమిటా? అని ఆశ్చర్యపడుతూండేవాడు సుందరరావు.

"ఒక మొగమనిషి, మరొక ఆడమనిషి పొరపాటునో బలవంతానో పెళ్లి అనే లైసెన్సుతో శారీరకంగా ఒకటైనప్పుడు ఫిజికల్ ప్లేన్‌లో మామూలు ప్రపంచం దృష్ట్యా దగ్గరైనా, కేవలం క్షణికావేశం వాళ్లను దగ్గరకు తీసుకువస్తుంది కానీ, అది శాశ్వతం కాదు. గొప్పదీ కాదు.

మెంటల్ లెవల్లో కలిసినప్పుడే దాని గొప్పతనం మనిషికి జీవితాన్నిస్తుంది. బ్రతుకును అమృతమయం చేస్తుంది. కానీ దురదృష్టవశాత్తు ప్రస్తుతం మన పెళ్లికి నిర్వచనం మరొక రకంగా వుంది. అందుకే ఆరుగురు పిల్లల్ని కన్నా, కలిసి బ్రతుకుతున్నా, నగలూ చీరలతో గడిపేసే మా అమ్మకు పెదనాన్న ఎప్పటికీ అర్థంకాడు. ఆయన ఇష్టాలేమిటో ఆవిడకు ఇప్పటికీ తెలియదు. ఆవిడ ఆలోచనలేమిటో ఈయనకు ఎప్పటికీ అర్థం కావు. పాపం, ఆయన ఓదార్పు కోరుకుంటూ ఎవరో స్నేహితురాల్ని వెదుక్కున్నాడు. అది బ్లాక్‌మెయిలింగ్ పాయింటుగా మా అమ్మ ఆయనను సాధించి, డైమండు నెక్లెస్‌కు అప్లికేషన్ పెడుతోంది. దీనిపేరు పెళ్లా? ఎంత నైచ్యం!"

ఇలా మాట్లాడే ఆ అమ్మాయి మీద రోజు రోజుకూ గౌరవం పెరిగిపోతోంది సుందరరావుకు. కానీ, ఒకనాడు ఆమె మాట్లాడేవన్నీ అవాకులూ చెవాకులూ అనాలన్నంత కోపం వచ్చింది ఆ విషయం వినగానే.

హేమంత్ చాలా పశ్చాత్తాపంతో మాట్లాడుతున్నాడు. "నాకేం చెయ్యాలో తెలియడం లేదురా.. ఆ రోజు పార్టీలో మరో రెండు పెగ్గులు ఎక్కువ పడ్డాయి.. వర్షం.. ఆఫీసులో నా గది తాళాలు మర్చిపోయాను. అర్ధరాత్రి తలుపులు తెరిచింది స్నేహ. ఆ చీకట్లో, ఆ మూడ్‌లో ఏమైందో తెలియలేదు..." హేమంత్ మాట్లాడుతున్నాడు... అది కన్ఫెషన్‌లా వున్నది. అందుకు మరీ ఆశ్చర్యంగా వున్నది సుందరరావుకు. గర్ల్‌ఫ్రెండ్స్, వాళ్లతో లావాదేవీలు-ఇద్దర్లో ఎవరికీ కొత్త కాదు. కానీ స్నేహ విషయం – 'ఆ.. మామూలే' అని ఎందుకు అనుకోలేకపోతున్నారు?! అయినా, ఆ అమ్మాయి ఎలా లొంగింది?! ఇన్ని కబుర్లు చెపుతుందే?!

ఏం చెయ్యాలి?! పోనీ హేమంత్ ఆమెను పెళ్లి చేసుకుంటే?! కానీ హేమంత్ కులం వేరు. పైగా, ఇరవై లక్షల కట్నంతో అతని కోసం మేనకోడలు సిద్ధంగా వుంది. అది మానుకుని ఈ దిక్కూమొక్కూ లేని పిల్లను చేసుకుంటాడా?!

"దీనికి ఏ వైబ్రేషన్ కారణం?" ఒళ్లు మండిపోతూంటే మహా వెటకారంగా అడిగాడు స్నేహను ఆ సాయంత్రం గుడిలో.

"ఆడది, చెడిపోవడం..." ఈ మాటలు మామూలు మగవాడికి చాలా ప్రత్యేకమైన అర్థాలతో కనబడతాయి మరి.

"అవును... అదే కారణం..." స్థిరంగా స్నేహ అన్న మాటల్లో పదును అతన్ని కొంచెం చిత్రంగా భయపెట్టింది.

"అంటే?"

"నా ఆలోచనలే అతణ్ణి ఆహ్వానించాయి. అతనంటే... అతనంటే నాకు చాలా ఇష్టం, ప్రేమ, ఆరాధన.." దోసిట్లో మొహం దాచుకుని ఏడుస్తూ అన్నది ఆ పిల్ల.

అదుగో, ఆ క్షణంలో మొదటిసారిగా కంట తడిపెట్టాడు సుందరరావు. అతనికే తెలియకుండా అతని గుండెల్లో వెచ్చని పొంగు. పసిబిడ్డల్లా, పాలవెన్నెలలా కనబడే స్నేహ రూపాన్ని దగ్గరకు తీసుకోవాలని, తల్లిలా, చెల్లిలా ఆదరించాలనీ, గౌరవించాలనీ ఎన్నో ఆలోచనలు.. సముద్రపు పొంగులాంటి భావాలు..

లౌక్యమూ ఆర్ద్రతా ఒకదానిమీద మరొకటి సముద్రపు కెరటాల్లా పొంగిపొర్లి విడివడుతున్నాయి.

"అయినా.. అతను తొందరపడి వుండకూడదేమో!..." అతని గొంతు గాద్గదికంగా వినిపించింది.

"లేదు.. అతని తొందరపాటుకన్నా, నేను అతణ్ణి కాదనలేకపోయానేమో!... ప్రేమంటే... ఎలా చెప్పను సుందరరావుగారూ? పదిమందిలో నాకు ఎంతో దూరంగా అతడు నిలబడి మాట్లాడుతున్నా నా అరచేతులు వెచ్చబడిపోతాయి. పాదాలు మొరాయిస్తాయి. తలకాయ ఎత్తి అతని కళ్లల్లోకి చూసి మాట్లాడతాను నేను. పారిజాతాలు కోస్తూ నేను మానసికంగా అతని పాదాలకు పూజచేసే పిచ్చిదాన్ని. ఎలా చెప్పను మీకు? నా అలంకరణ, నాలోని తియ్యటి ఆలోచనలు అన్నీ నాలో దాచుకున్నవి అతనికి చెప్పుకునేదాన్ని. అతనిలో అతనికే తెలియని కొన్ని గొప్ప-

గుణాలున్నాయి. స్నేహశీలి, మేధావి, గొప్పగా మాట్లాడగలడు. కార్యవాదీ, సౌమ్యుడు. అవసరం వస్తే తప్ప కనీసం ఎవరితోనూ కరుగ్గా మాట్లాడదు. అటువంటి వ్యక్తి నా వాడుగా ఆరాధించాను. అందుకని అతను నా దృష్టిలో తప్పు చెయ్యలేదు.. అది అంతే!..."

"మరి... ఇది రైటా? దీని పరిణామం?" వింటూనే చటుక్కున అన్నాడు సుందరరావు. గడిచిన గంటలోనూ అతనికి జీవితం గురించి చాలా ఎక్కువ తెలిసిపోతోందన్న భావన కలుగుతోంది.

"ఏముంది?" నిర్లిప్తంగా అన్నది స్నేహ.

"అతను మిమ్మల్ని పెళ్లి చేసుకోకపోతే..." కారణం, పరిస్థితులు అన్నీ వివరించి చెప్పాడు సుందరరావు.

తలకాయ వంచుకుని అన్నీ విన్నది ఆమె.

"ఇదేదో బ్లాక్‌మెయిలింగ్ పాయింటుగా అతణ్ణి పెళ్ళికి ఒప్పించాలని ప్రయత్నించడం నైచ్యం సుందరరావుగారూ! నాకు అతనంటే ఆరాధన వుండవచ్చు. కానీ, అతని కోరిక క్షణికం. దానికి అతణ్ణి బంధించి, శిక్షించడం అమానుషం. ఇవ్వాళ పెళ్లికి అతను ఒప్పుకోనంత మాత్రాన అతణ్ణి నీచుడనీ, దుర్మార్గుడనీ నేను ఆరాధించే ఆ వ్యక్తిని అనలేను, అనను. జీవితం చాలా గొప్పది. అతడు నాకు కాకపోయినా అతడి జ్ఞాపకాలతో బ్రతకగలను నేను."

"పోనీ, మరొకర్ని ఎవరినైనా పెళ్లి..." అసలు నేను ఇంత ఓవర్ ప్రొటెక్టివ్‌గా ఎందుకు ఫీలౌతున్నాను?! తనలో తను ప్రశ్నించుకుంటున్నాడు సుందరరావు.

"సారీ! మీరు హేమంతు గురించిన నిజాలకన్నా ఊహలకెక్కువ అనుకోండి. అప్పుడు?!" పట్టుదలగా అన్నాడు సుందరరావు.

"నో... నాకు అతను తెలుసు..."

అది ఆమె 'ప్రేమ' ఇచ్చిన మూర్ఖత్వమా, లేక ఆమెలోని ఆరాధన దాన్ని నిజంగా మారుస్తుందా?

ఏం మాట్లాడాలో అర్థం కాలేదు సుందరరావుకు.

"మరి మీ నిర్ణయాలవల్ల మీకు చాలా బాధలు కలగచ్చేమో?..."

"తప్పదు..దానికి మానసికంగా రెడీ అయిపోతాను. ఈ ప్రపంచంలో చిన్న ఇంటర్వ్యూ దగ్గర నుంచి, పెద్ద ఐ.ఎ.ఎస్. పరీక్ష దాకా టెన్షను, బాధ తప్పవు. మరి ఇది నా జీవన్మరణ ప్రశ్న. దీని కోసరం నిలబడతాను నేను."

అగ్నిప్రవేశం, దేశ బహిష్కారం చేసిన రాముణ్ణి సీత, రాయిని చేసిన గౌతముణ్ణి అహల్య ఎందుకు ఆరాధించారా? అన్న ప్రశ్నకు ఆ క్షణంలో సమాధానం దొరికిందనిపించింది అతనికి.

చాలా సేపు మౌనంగా ఆమె వంకా, సముద్రం వంకా మార్చి మార్చి చూశాడు సుందరరావు.

మెల్లిగా లేచాడు.

దూరాన గుడి దీపాలు.."సర్వేశ్వరా! నీ ఉనికిని ఏనాడూ నేను గుర్తించలేదు. కానీ, ఈ రోజు గుర్తించి అడుగుతున్నాను. ఎంతటి గొప్పవ్యక్తి ప్రేమను మిస్ అవుతున్నాడో హేమంత్‌కు తెలియజెప్పగల శక్తి నాకియ్యి.." మొట్టమొదటిసారిగా దేముణ్ణి ప్రార్థిస్తూ ముందడుగు వేశాడు సుందరరావు.

ఎందుకో వెనక్కు తిరిగి చూశాడు.

వెన్నెల వెలుతురుచ్ఛాయల్లో స్నేహ...

అది ఆమె నమ్మకాల్ని వెలుతురుగా మారుస్తున్న ఆరాధనా? అవును. అది కాలమే నిర్ణయిస్తుంది.

*(ఆంధ్రజ్యోతి, 23-3-1990)*

# నిర్మోహదర్పణం

"ఆ చిన్న పారాగ్రాఫ్ తీసేస్తే ఏమిటిట వచ్చిన ముప్పు?!"

కాలమ్స్ లెక్కకూ, ఎడిటోరియల్ తెలివితేటలకూ అలవాటు పడిన జనార్దన్ ప్రశ్నించాడు విశ్వాన్ని.

తలకాయ ఎత్తి చూశాడు విశ్వం. అది మామూలు చూపుకాదు. ఆ దృక్కు చాలా స్పష్టంగా వుంది. అర్థం చేసుకోనందుకు బాధకన్న, ఆ నిర్లక్ష్యం చూసి బాధతో పడే కోత వుంది... దుఃఖం వుంది. అది మాత్రం శబ్దాలకు అర్థం అయ్యే విషయం కాదు.

మాట్లాడకుండా చూపు తిప్పుకున్నాడు జనార్దన్. అంత "తడి" తెలియని మనసు కాదు అతనిది. అదే అయ్యుంటే ఇన్ని బాధలున్న ఈ ఎడిటోరియల్ ఉద్యోగమే అక్కర్లేదు బ్రతకడానికి. కానీ, "కొలతలలో ఇమిడిపోయి సుఖంగా బ్రతికే జీవితంలోకి అనవసరమైన ధోరణులు చొప్పించుకుని ఎందుకు బాధపడడం?" అనే అతను, ఈ దేశంలో పేరుకుపోయిన మేధావి వర్గానికి ప్రతీక.

ఒక మహా రచయిత తెలియచెప్పినట్లు ఈ దేశంలో మంచివారు, బుద్ధిమంతులు, కరుణాజీవులు–వీరందరూ మామూలు మనుష్యులుగా పుట్టిపోతారు. వారు ఏదైనా చెయ్యాలనుకున్నా వారి ఆలోచనలు ఆచరణలో పెట్టలేని స్థితిలో, ఉద్యోగాల్లో వుంటారు. మేధావులు ఉన్నతస్థానంలో వుంటే అధికారులూ వీరందరూ సినిక్స్ నిజాయితీ మీద నమ్మకం లేనివారు. సత్ప్రవర్తనమీద, ధర్మంమీద ఏదో పలచటి అభిప్రాయం కలిగినవారు అవుతున్నారు. అందువల్ల వీరు దేశానికీ, వర్తమానానికీ ఉపయోగపడరు. అందుకే ప్రోగ్రెసివ్ మీటింగ్స్‌లో మేధావి వర్గం వుండేచోట కూడా బొంబాయిలో 'కాంక్రీట్ జంగిల్' లా వుండే స్టాక్ ఎక్ఛేంజ్‌లో అనుభవంలోకి వచ్చే ఏదో ప్రతిష్టంభన, అక్కడ స్వార్థం డామినేట్ చేస్తే, ప్రోగ్రెసివ్ మేధావి వర్గ్‌లో 'అహం' డామినేట్ చేస్తుంది. అందుకే 'రవం' ఎక్కువై, నిశ్శబ్దత పలచబడిపోతుంది. ఊహ నిట్టూరుస్తుంది. తపన తమస్సులోకి జారుకుంటుంది, పక్కనే టైపిస్టు అమ్మాయి వేళ్లు చేసే ఒక వింత చప్పుడు. క్యూటెక్స్ వేసిన వేళ్లు, నరాలు ఉబ్బిన ముంజేతులూ, ఏదో ఫెమినిటీకి దూరం చేస్తున్నాయి.

"అలౌకికతకు ఇంగ్లీషు అర్థం ఏమిటి సార్?" పొట్టికురచగా, బిగించిన జడతో, పావలా అంత బేసరితో అడుగుతోంది ఒక అమ్మాయి.

"ఇంగ్లీషు అర్థం భగవంతుడెరుగు. అసలు దాని అర్థం నువ్వుకాదు, ఆ

ట్రైపిస్టు కాదు, మీరందరూ ఉన్న వాతావరణం కాదు" అనాలని వుంది విశ్వానికి. ఒళ్ళు మండిపోతోంది.

ఏనాడో చాలా ఉద్వేగాలతో, ఆదర్శాలతో, సౌందర్య విభ్రాంతులతో జర్నలిజం, రచనా వ్యాసంగంలోకి ప్రవేశించిన అతనికి ఏ ఫీల్డ్ వాటి ఉత్పత్తికి కారణమో, అందులో బొత్తిగా అవి తీవ్రతని అర్థమయ్యేటప్పటికి కాలాతీతం అయిపోయింది. అందుకే సినీకవిగా మారిపోయాడు ఇంతకాలం.

ఒక కథా సంపుటి ముందు మాటలో వ్యక్తీకరించినట్టు "రచన కూడా ఒక వ్యాపారం అయ్యాక, ఎవరు ఆర్తితో, ఆర్ద్రతతో మనసా స్పందిస్తారో, ఎవరు స్పందనను నటించి లబ్ధి పొందుతున్నారో తెల్సుకోవడం కష్టం..." ఈ విషయం అర్థం అయిన తరువాత ఈ ముడి పదార్థాల వ్యాపారం ఏమాత్రం నిజాయితీ వున్నవాడికన్నా విసుగు పుట్టిస్తుంది.

"అందుకే కత్తులకూ, రక్తానికీ, తుపాకీ గుళ్ళకూ ఆర్ద్రత, ప్రేమ, స్పందన మాట్లాడవు కాబట్టి హాయిగా నిజాయితీగా క్రైం సీరియల్ వేసుకుందాం. ఈ తద్దినం ఎవరు పడతారు?" అనే జనార్దన్ మాటలు చాలా కరెక్ట్ అనిపించేది.

అందుకే విశ్వం అతి మామూలు రైటర్‌గా, ఎడిటర్‌గా మారాడు. కానీ, మరీ నైచ్యాన్ని భరించవలసి వచ్చినప్పుడు మనిషిలో లౌక్యానికీ, అవసరానికీ అందమైన భావన బలైపోయినప్పుడు మాత్రం ఏదో అనుభూతుల వంతెన కూలిపోయినట్లు అనిపించేది విశ్వానికి. ఏదో ఉత్తుంగ తరంగంలాంటి అలజడి గుండెల్లో లేచినప్పుడు కృష్ణ ఒడ్డున పిచ్చిగా పెరిగిన బంతిపూల అరణ్యంలో కూర్చుని ఏ చలం మ్యూజింగ్స్, తిలక్ సౌందర్యాక్షరాలో కుప్పగా పోసుకుని ఆ భావనా వీధిలో ఒళ్ళు తెలియకుండా నిద్రపోయేవాడు. కానీ, అది ఏ కొద్దిసేపో... మళ్ళీ జీవితం చాలా మామూలుతనం అనే సంకెళ్లు వేసి బందీని చేసి లాక్కుపోయేది.

తన చుట్టుపక్కల వాతావరణంలో ఆలోచనలలో ఏదో ప్రతిష్టంభన, వున్నవాడి కళ్లల్లో కక్కుర్తి, లేనివాడి కళ్లల్లో దేవిరింపు... ఇవన్నీ వాతావరణంలో కలిసిపోయి, ఏదో ఊపిరాడని తనాన్ని కలిగిస్తోన్నాయనిపించేది.

తుప్పల మధ్య, ముళ్ల పొదల మధ్య, తడి, చీదరల మధ్య చీకటి వెలుగుల మధ్య పాకుతూ, మునగదీసుకుంటూ, వీలైనప్పుడు బారుసాగుతూ, మళ్ళీ మెలికలు తిరుగుతూ, ఎవరో తరుముకు వస్తున్నట్లు చరచర గమ్యం లేకుండా సాగుతున్న పసిరిక పాములా వుంది జీవితం.. అని విశ్వం విసుక్కున్నప్పుడల్లా నవ్వి "అసలు ఆలోచిస్తే కదా ఈ బాధంతా" అనేవాడు జనార్దన్.

అటువంటి విశ్వం-

"మనిషి భావనా బలం చాలా బలవత్తరమైనప్పుడు, ఛుట్టూ పంచభూతాత్మకమైన వాతావరణం యొక్క రాపిడ్డిని, వత్తిడిని జయించి, దాని లయతో లయించినప్పుడు చుట్టూ పరిస్థితిని మార్చుకోగలదు. కొంచెం ఎదిగితే.. ఈ

భావనను అనుభవించవచ్చు. ఎదటివారితో పంచుకోవచ్చు..." అని ఒక కథకు ముగింపు రాసినప్పుడు-

ఏమాత్రం ఆలోచించకుండా, అనుకున్నదానికన్నా కాలం దాటిందని ఆ పారాగ్రాఫ్ కత్తిరించాడు జనార్దన్,

అందుకే "కాస్తదానికి ఇంత పట్టుదల ఏమిటి?" అని జనార్దన్ ఆశ్చర్యపోతూ అడిగితే ఎలా చెప్తాడు విశ్వం? ఎంత రాసినా అక్షరాలు ఇముడ్చుకోలేని ఉద్వేగత, భావం పొంగి In between the lines వెలుగుతూ కనిపిస్తాయని, వ్యాఖ్యానించలేమని తెలిసిన విశ్వం ఎలా చెపుతాడు తనలో చలనాన్నీ, మార్పునీ, ఉద్వేగాన్నీ!

అందుకే సహనంగా, మెల్లిగా, జరిగింది చెప్పడం ప్రారంభించాడు:

❀ ❀ ❀

ఒక స్నేహితుడి పుట్టిన రోజుకు మంచి పుస్తకాలు ఇద్దామన్న ప్రయత్నంలో వున్నాడు అతను ఆ రోజు. ఎక్కడా బలివాడ కాంతారావు కానీ, ఇచ్ఛాపురపు జగన్నాథరావుకానీ, బుచ్చిబాబు, చలం కానీ, దొరకరేమోకానీ, కవిత్వం చెప్పడం కూడా కీర్తికండూతి తీరడానికి ఒక మహత్తర ఆయుధమని భావించే డబ్బున్న కుహనా మేధావుల చేత అచ్చొత్తబడి, విపరీతమైన కమీషను ఇవ్వబడ్డ పుస్తకాలు మాత్రం చాలా దర్శనమిచ్చాయి పుస్తకాల షాపులో. కొన్నేళ్ల తరువాత అసలు ఈ మహా రచయితలు ఎవరో తెలియకుండా మరుగు పడిపోయి, ఈ సాహిత్యమే తెలుగు సాహిత్యం అనుకునే స్థితే ఇంగ్లీషు మీడియంలో చదువుతూ, బలవంతంగా తెలుగు నుడికారాలు నేర్చుకునే తెలుగు పిల్లలకు గతేమో... అని ఆలోచిస్తూ, విసుక్కుంటూ, ఆఫీసుకు రాగానే, పత్రిక ఓనరుగారికి ఫ్యూచర్‌లో పనికివచ్చే రాజకీయవేత్త కవి అయ్యాడట – వారిని 'ఇంటర్వ్యూ' చెయ్యమని ఆర్డర్! చిర్రెత్తింది విశ్వానికి.

"జీవి వేరు... జీవితం వేరు..." చేతులో గ్లాసుతో, ఖద్దరు బట్టలతో ఉవాచిస్తున్నాడు, ఈ జన్మలో నిజమైన కవికాలేని ఆ రాజకీయవేత్త.

"అవును... జీవి వేరు.. జీవితం వేరు.. రాసుకుంటున్నారా? నేను చెప్పబోయే ఈ కవిత్వంలో మీకు చాలా పాత కవుల ఫెమిలియర్ మాటలు వినబడతాయి.. కానీ, వాటిని నాసొంత సహృదయంతో కవిత్వంగా మారుస్తానన్నమాట. ఆహా, ఏం చెప్తున్నాను? జీవి వేరు... జీవితం వేరు. ఒకటి మనది... మరొకటి మనదా? మనలో వుండేదా? ఆలోచించు అనేతత్వం చెబుతుందన్నమాట నా కవిత్వం..."

అంటూండగానే చిర్రెత్తి-

"అవును... జోలె మనది, ముష్టి మరొకరది... ఆలోచనలు మరొకరివి, అక్షరాల కత్తిరింపులు మాత్రం మనవి.. వేసేవాడికి జోలెమీద క్లైం లేదు. ముష్టి తీసుకునేవాడికి మాత్రం జోలెమీదా, ముష్టిమీదా కూడా క్లైం" అన్నాడు కచ్చగా. కానీ, విశ్వం రాసిన ఇంటర్వ్యూ విలువ తెలిసిన ఆ లౌక్యుడు "ఎంత గొప్ప

ఉపమానం చెప్పారండి..." అంటుంటే, దుఃఖం వచ్చి ఏదో కారణం చెప్పి బయటపడి చేతులో కాగితాలు చించి కృష్ణలో పడేసి నడుచుకుంటూ పడిపోయాడు ఒడ్డునే.

మొత్తానికి ఆ క్షణంలో ప్రపంచం అంతా చాలా అవకతవకగా, అర్థంకాని ముగ్గులా ఏదో బ్లాకు మర్చిపోయిన క్రాస్‌వర్డ్ పజిల్‌లా విసుగు పుట్టిస్తోంది అతనికి...

కాస్త దూరంలో ఏటిపాయకు ఒడ్డున సూర్యం మాష్టారి ఇల్లు.

ఒద్దనుకుంటూనే అడుగులు అటు వేశాడు. ఎందుకో సూర్యం మాష్టార్ని చూడాలంటే జంకు..ఆయన. కొన్నాళ్లు స్కూలు మాష్టారు, కొన్నాళ్ళు పత్రికలో పనిచేశారు. చెయ్యి తిరిగిన గొప్ప జర్నలిస్టు. మంచి విమర్శలు రాసేవారు. బాధ్యతలకు, అప్పులకు సత్యనారాయణపురంలో ఇల్లు అమ్ముకుని, బంధువులకు, పరామర్శలకు, ఆడంబరాలకు దూరంగా ఇక్కడ బ్రతుకుతున్నారు. ఆయన గురించి ఎవరూ ఆలోచించకపోదురు, అది బాధ్యత అవుతుంది కాబట్టి... కానీ, ఆయన గురించిన ఒక రసవత్తరమైన సబ్జెక్టు ఆయన జ్ఞాపకాలను సజీవంగా ఉంచగలిగింది. అదే ఆయన రెండవ భార్యగానో మరేదో రకంగానో చలామణి అవుతున్న అందమైన కుమారి.

కొన్ని గొప్పతనాలు చాలా విచిత్రంగా ఉత్సుకత కలిగించే విషయాల మధ్య కప్పడిపోతాయి. విలువలు జనం ఇచ్చేవే మరి.

అందుకే

మాష్టారి గొప్పతనం, మంచితనం, విజ్ఞానం, కొంచెం ఆత్మస్థైర్యం బిడ్డలవల్ల, బాధ్యతలవల్ల కలిగిన గౌరవించగలిగిన దుఃఖం మొత్తం ఇదంతా 'కుమారి' అనే ఒక గొప్ప మెరుపుల తుఫాను మధ్య చిక్కడిపోయి గుర్తించబడవు.

అందుకే మాష్టారంటే ఇష్టమున్న చాలా మందికి ఏదో ఇబ్బంది ఆ ఇంట్లో అడుగు పెట్టాలంటే...

"అయినా, ఆ మాష్టారుకు బుద్ధిలేదు... ఆ పిల్ల జీవితంలో దెబ్బ తినిందనో మరేదో అయిందనో ఈ వయస్సులో అంత అందమైన పిల్లను ఆదరించడమేమిటి, కొంగున నిప్పు కట్టుకోవడం కాకపోతే?!" హితులు, మిత్రులు, మాష్టారి ఫాన్స్ ఏదో ఒక వంకన రోజూ ఆయనను ఈ రకంగా తల్చుకుంటారు మరి.

ఆలోచిస్తూ, 'ఒద్దు' అనుకుంటూనే అటు అడుగువేశాడు విశ్వం.

వెదురు, రెల్లుతో అల్లిన విశాలమైన పాక, చుట్టూ బంతి, కరివేపాకు, మందారాలు, వాకిట్లో ముగ్గు, లాంతరు దీపం.... ఇదంతా కాదు అసలు వర్ణన అంటే... శుభ్రత.... ఏదో పరిశుభ్రత. అదీ ఆ ఇంట్లో అనిపించేదీ, కనిపించేదీ.

"మాష్టారూ!" మెల్లిగా తలుపు తట్టాడు... ఇత్తడి మువ్వలు ఘల్లుమన్నాయి.

"రండి..." నవ్వుతూ బుడ్డిదీపం తుడుస్తూ ఆహ్వానించింది ఆ అమ్మాయి. తళుక్కున మెరిసే కళ్లు, బుగ్గన సొట్ట, పెదవిమీద తేనెరంగు పుట్టుమచ్చ.... అలా వుంటే సాముద్రిక శాస్త్రంలో...

"లోపలికి రండి!" హాయి అయిన ఆహ్వానం ఆలోచనలను ఆపేసింది.

"మాష్టారూ..." నసుగుతూ అన్నాడు.

పాత పెట్టెలు వరుసగా పెట్టి, పైన చీరలతో కుట్టిన బొంత పరచివుంది. అదే సోఫాసెట్టు... హాయిగానే వుంది మరి.

"మాష్టారు స్నానం చేస్తున్నారు. కూర్చోండి..." మజ్జిగ తెచ్చింది.

"సారీ! పాలు లేవు.." చేత్తో కొంగు తుడుచుకుంటూ అన్నది.

'పరవాలేదు–' అన్నట్లు తల సారించాడతను.

పక్కన చిన్న వంటగది. ఈ గది... అంతే ఇల్లంతా... ఒక పక్కనమాత్రం మాష్టారి పుస్తకాలు చాలా వున్నాయి.

"పుస్తకాలేనా! ఇవన్నీ పాడైపోతాయని భయమండీ... చంటిబిడ్డల్లా చూడాలి... కెమికల్స్ అంటే మాష్టారికి ఎలర్జీ, అందుకనే కలరా వుండల పొడి, ఏవో మూలికలు పడేస్తారు..." చాలా ఏళ్లుగా తెలిసినట్టు మాట్లాడేస్తోంది ఆ అమ్మాయి.

కొంతమంది పరిచయమే పరాయితనాన్ని హరిస్తుంది.

ఈ స్థలం ఆమెదే... గవర్నమెంటు ఉద్యోగి అయిన ఆమె భర్త కట్నం గొడవల్లో నానా హింసాపెట్టి ఆమెను వదిలించుకున్నాడు. ఆ తరవాత చాలా చాలా జరిగాయి. మాష్టారి దగ్గర హాయిగా ఉంది. నవ్వుతూ చెప్తోంది కుమారి మాష్టరు వచ్చేటప్పటికి.

"నాకూ కుమారి ఆదరణ హాయిగానే వుంది విశ్వం! ఒప్పుకోవాలి. జీవితమంతా నా బాధ్యతలు, బరువులు, బాధలు గుర్తు చేసే జనమే కానీ, నా కోసరం, నా గురించి ఆలోచించొచ్చు అన్న ఆలోచనే లేదయ్యా నాకూ, నా వారికీ కూడా! అది తెలియడానికి కుమారి కావాల్సి వచ్చింది, ఇంత జీవిని అనుకునే నాకు..." నవ్వారు మాష్టరు బట్టతల తుడుచుకుంటూ.

ఏదో రమ్యత, ఆ వాతావరణంలో ఇది అని చెప్పలేనిది! చాలా మాట్లాడారు మాష్టారు. ఆయనకు పెన్షన్ వస్తోంది. కుమారి నగలు అమ్మి బ్యాంకులో వేసింది.

"అవసరాలు తగ్గించుకుంటే బాధలు కూడా తగ్గుతాయేమోనండీ! పరాయివాళ్లతో పోటీ పడి, మనం మన జీవితం చాలా గొప్పది అని మర్చిపోతాం. నా పాత సంసారంలో అది ఎంతో అనుభవం నాకు. ఇవ్వాళ రేషన్ బియ్యం బావుండవనిపిస్తే రవ్వ పట్టించి, దిబ్బరొట్టి కాల్చుకుని, తలా ఒక ముక్క తినేస్తాం.... సజ్జరొట్టి, రాగిగంజి గొప్ప ఆహారం – సరిపెట్టుకోగలిగితే...."

"మరి ఆరోగ్యం అనీ" విశ్వం భార్య కల్తీ వస్తువుల మీద, విటమిన్లు బలమైన ఆహారం మీద ఇచ్చే లెక్చర్లు గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు.

"అనారోగ్యమా! అది సహం వాతావరణం మీద ఆధారపడుతుంది. మిగతా సహం తోచక కొందరూ, లగ్జరీ అని కొందరూ తెచ్చుకుంటారు. మన శరీరం మనం

చెప్పిన మాట వినాలయ్యా! అది మన లోపలి వ్యక్తికి ఒక ఆయుధం అంతే! అరవై మూడేళ్ళు ఎలా వున్నాను నేనూ!" గలగలా నవ్వారు మాష్టారు.

వెన్నెల్లో చంద్ర కాంతలు ఆరుబయట తెల్ల దుప్పటి వేసిన మంచం మీద విశ్వమూ, మాష్టారూ. ఆవిడ ఎదురుగా గుమ్మానికి ఆనుకుని కొసరి గొసరి ఉల్లికారంతో సజ్జరొట్టెలు వడ్డిస్తూ, తన జీవిత కథ చాలా చెప్పింది. ప్రపంచం ఆమె విషయంలో అసహ్యంగా చిత్రీకరించిన ప్రతి మలుపూ ఆమె భాషలో మరొక రకంగా రూపుదిద్దుకుంది.

"జీవితంలో మాష్టారుతో ఇలా బ్రతికే అవకాశం ఉంటుందంటే మరిన్ని బాధలు భరించేదాన్నేమో విశ్వంగారూ!" అంటూ మజ్జిగ తేవడానికి లోపలికి వెళ్లిన ఆమెను చూస్తూ, "ఇదయ్యా జీవితం! చాలా పుస్తకాల మీద, జీవితాల మీద విమర్శలు పరామర్శలు రాశాను నేను. కానీ, నేను నేర్చుకున్నది ఇప్పుడే. జీవితం.. దీనికి కామా, ఫుల్‌స్టాపు, కొటేషన్ ఏదీ లేదు. తీరం లేని సముద్రం. దాని మీద కామెంటరీ లేదు, విశ్లేషణా లేదు, విమర్శా లేదు.

విశ్వానికి ఏదో గుండెంతా నిండిపోయిన అనుభూతి, తృప్తి...

కానీ విశ్వంలో విమర్శకుడికి ఇంకా సహజత్వం పోలేదు. అందుకే పది మందీ అనుకునే మాట–

"ఆమె ఒకవేళ వెళ్ళిపోతే..." అన్న ఆలోచన బయటపెట్టాడు.

"ఇది ఒకరకమైన దగ్గరతనం ఇచ్చిన స్నేహం. మనది అని ఏ వస్తువునన్నా, మనిషిని అన్నా అనుకోవడంలో ఏదో దాస్యం ఉందయ్యా! తెల్లవారితే, కుమారి నాకు కనబడకుండా ఇంతకన్న గొప్ప జీవితాన్ని వెతుక్కుంటూ పోతుందేమోనన్న భయం నాకు బంధనం, తద్వారా ఆమెను బంధించి అట్టే పెట్టాలన్న భయం, ఇదంతా భరించలేం. ఏమాత్రం జీవితం గురించి తెలిసినా, మాటలకు, సంకెళ్ళకు, మంత్రాలకు, నైతికమైన రూల్సుకు అందని ఏదో అద్భుతం మమ్మల్ని కలిపి వుంచుతోంది అంతే తేల్చిచెప్పేశారు.

ఆవిడ సౌందర్యం, స్నేహం, ఆవిడ నవ్వితే ముత్యాలహారం తెగినట్టు అనిపించడం, ఇవన్నీ స్నాప్నిక సందర్శనంలా ఉంది. బైట అనుభూతికి భావనలోఏదో గుండెంతా నిండిపోయిన పరిమళం తియ్యదనం హాయి అది. వాతావరణం ట్రాన్స్మిట్ చేస్తోంది."ఈ మనిషి ఆలోచనలతో వాతావరణాన్ని కంట్రోల్ చేస్తోందా?" అడిగాడు ఆశ్చర్యంగా.

"నిజం...అదేనేమో జరుగుతోంది. నేనూ అన్నీ తెలిసినదాన్నేం కాదు, విశ్వంగారూ! స్వార్థం, నాదన్న గోల చాలా చాలా అనుభవించి, పోరాడి, అరిచి, చాలా బాధలు పడ్డాను. కానీ నా బాధలకు కారణం నాకు అవగాహన లేకపోవడం అని ఎప్పుడూ అర్థం అవలేదు. మాష్టారి పరిచయంలో ప్రపంచంలో చల్లదనం, హాయి ప్రశాంతత ఉన్నాయి ఇంకా అనిపించింది. వాటిని కుంచింకుపోయిన మనస్సు దాని ముడతల మధ్య ఇముడ్చుకోలేదేమో ననిపించింది. ఇవన్నీ చుట్టూ

వాతావరణం నుంచి గ్రహించుకునే రిసీవర్ మనసువుంటే చుట్టూ వాతావరణం నుంచి సెన్సిటివ్‌గా తయారై ఏది పొందామో, అది చుట్టూ ఉండే వాతావరణంలోకి ట్రాన్స్మిట్ చెయ్యొచ్చు అనిపించింది. బహుశ చదివితే ఒకప్పుడు అర్థంకాని వేదాంతాలు – 'యద్భావం తద్భవతి' అంటే ఇదేనేమో ననిపిస్తున్నాయి."

ఆ అమ్మాయి మాట్లాడుతూ ఉంది. ఆ మాటలకన్నా నవ్వుతూ తృప్తిగా కూర్చున్న మాష్టారు ఆమెలో తన మేధస్సు విచ్చుకుని అక్షరాల తొడుగుతో విహంగాలవడం చూసి ఆనందిస్తున్నారంటే అది నిజం అవుతుంది.

చీకటిలో కీచురాళ్ళ రొదలో గుడ్డిదీపం వెలుగులో చమ్మలో, ఈదురుగాలి, వర్షంలో.

ఇవేవీ తెలియనట్టుగా గడిచిపోయింది కాలం. ప్రపంచం వాళ్ళిద్దరికీ అంటగట్టిన వ్యామోహం అనే జీవసమాధిలో నిర్మోహత్వాన్ని తద్వారా నిశ్చలతత్వాన్ని పొంది తాము పొందే హాయిని అందరికీ పంచగల తపస్వులు వారిద్దరు అనిపించింది విశ్వానికి.

"మహత్తరమైన అనుభవం సంభవించినప్పుడు తార్కిక జ్ఞానం, విమర్శనా బుద్ధి పనిచెయ్యవు., భావోద్వేగంలో నిమగ్నుడై చైతన్య ప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తి ఒక్కసారి మెరుపులా ఛేదించి మహా అవతారం దాలుస్తాడు. చచ్చి బ్రతకడం లాంటిది ఆ అనుభవం– అన్న మహా రచయిత బుచ్చిబాబు మాటలకు అర్థం అక్షరాల సందర్శించాడు విశ్వం.

అందుకే ఆ కథ రాశాడు. ఆ వ్యాఖ్యలు ముక్తాయింపుగా వాడుకున్నాడు. జరిగినదంతా విని ఆశ్చర్యపోయాడు జనార్దన్.

మేధావి కనుక విశ్వం అక్షరాల్లో అనుసరిస్తున్న ప్రక్రియను అందిపుచ్చుకోగలిగాడు.

ఆ కథను అక్షరం బీరుపోకుండా అచ్చువేశారు.

కథ అద్భుతం... అని కొన్ని వందల ఉత్తరాల మధ్య పునర్జన్మ ఎత్తినట్టున్న విశ్వానికి–

"నువ్వు నేర్చుకున్నది నిజాయితీగా, నీ అహం పరదాలు వెయ్యకుండా రాసినందుకు ఆశీస్సులు. ఈ నేర్చుకునే స్థితిలోని 'రససిద్ధి' నీకు అనుభవ మయినందుకు నాకు చాలా ఆనందంగా వుంది.

నీ కథలో కొన్ని ప్రశ్నలకు సమాధానం వెతుక్కుంటూ ప్రపంచం మీదికి విసిరేశావు. అది మంచి పద్ధతి. నాకు తోచిన జవాబు చెప్తున్నాను విను:

మనం ప్రపంచం నుంచి ఏదీ ఆశించకుండా, దూరంగా ఉండి చెయ్యగలిగిన పని చేస్తూ ఉంటే, ప్రపంచం మన పాదాక్రాంతం అవుతుంది. అదే దాస్యవిముక్తి. మన నుంచీ, మన ఆశలు, కోరికలు, కక్కుర్తుల నుంచీ మనని మనం రక్షించుకున్నప్పుడు ప్రతి వ్యక్తిలో మనని మనం దర్శించుకుంటాం. అప్పుడు

తేడాలు, బాధ్యతలు, అసహ్యతలు ఉండవు. ఇదీ నేను చెప్పగలిగిన జవాబు. ఈ నిర్మోహదర్పణంలో భ్రాంతి నుంచి కాంతిని విడిచేసి చూడగల శక్తి శాంతిని ఇస్తుంది.

కుమారి చాలా సంతోషంగా వుంది. నీ కథ చదివి ఆలోచించే ఏ ఒక్క పాఠకుడు దొరికినా, ఆ ఆనందం నాతో పంచుకోవడానికి వస్తావని ఆశిస్తూ ఆశీర్వచనాలతో-

నీ సూర్యం మాష్టారు..

ఆ ఉత్తరం చదివి తలెత్తి చూశాడు జనార్దన్ విశ్వం వంక... ఎన్నాళ్ళైంది, అతని కన్నుల్లో నీరు ఘనీభవించి? ఎన్ని రోజులైంది ఆర్తిగా అది చెంపల్ని తాకి?!

ఆ అక్షరాల్లో నించి ఏదో శాంతి పరిమళం-

అక్కడి వాతావరణంలోకి ట్రాన్సిట్ అయిందా అనిపించింది ఆ ఇద్దరికీ.

*('ఆంధ్రజ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక, 1990)*

# రక్షమైథిలి

"ఇవ్వాళ కొద్దిగా ఆలస్యం అయింది. అటెండెన్స్ రిజిస్టర్ హెడ్ మాష్టరుగారి రూంకు వెళ్లిపోయిందా?!"

తలెత్తి చూశాడు విరించి. విరబోసుకున్న పెద్ద జుట్టు. తలంటి జడ, కళ్ళు ఎర్రబడి బాగా వాచాయి. ఏడిచి వుంటుంది. ఏమాత్రం శోభస్కరంగా కనిపించని ఆవిడ మైథిలి, సోషల్ టీచరు.

మాట్లాడలేదు అతను. ఆమె వంకే పరీక్షగా చూశాడు. చేతుల మీద ఉబ్బెత్తున వాతలు. ఆ ఇల్లాలు భర్త చేతుల్లో అనుభవించే నరకం ఆ చుట్టు పక్కల వాటా వాళ్లకూ, ఆమె పని చేసే స్కూల్లోనూ అదరికీ తెలుసు.

"శుభ్రంగా ఆ మొగుణ్ణి వదిలిపారెయ్యరాదూ!" యాభై ఏళ్ళ బ్రహ్మచారి అయిన ఏ మాథమాటిక్స్ టీచరో ఉచిత సలహా ఇచ్చినా, "ఆలోచించు మైథిలీ! నీ ఇద్దరు పిల్లల్ని నువ్వు పోషించుకోలేవూ? మేమంతా లేమూ!? ఎప్పుడు ఈ మొగజాతికి బుద్ధి చెప్పగలమే?" అంటూ సన్నిహితురాలు సరోజా టీచరు క్లాసు తీసుకుంటున్నా మైథిలి మాట్లాడదు; అట్లాంటి ఊపు ఆమెకీ వస్తుంది. కానీ అది క్షణికం. ఎన్ని వందల సార్లో నారాయణరావు లేకుండా బ్రతకడాన్ని ఊహించుకుందామని ప్రయత్నించింది.

కానీ ఏదో భయం..

ఎక్కడో అగాథంలోకి దభీమని జారిపోయిన భ్రాంతి. ఎన్నిసార్లు తనకు తాను ధైర్యం చెప్పుకుని, హిప్నటైజ్ చేసుకుందామనుకున్నా జరగలేదా పని. దానికి కారణం మరి ఆమె సబ్‌కాన్షియస్‌లో ఆ పరిస్థితికి ఏదో తెలియని వ్యతిరేకత వుండి వుండాలి.

అసలు ఏ మనిషి అయినా, మంచో, చెడో విని ఆచరణ యోగ్యం చెయ్యాలంటే, దానిపట్ల మనిషికి ఏ ఒక్క అణువంతైనా ఇష్టమో నమ్మకమో వుండి తీరాలి. అటువంటి రూపు కట్టలేని భావనలు రూపం పోసుకుని బలం పుంజుకునే శక్తి ఆ వాతావరణం కలిగించడం లేదు మరి.

"రిజిస్టర్ ఎక్కడ వుందండీ అంటే మాట్లాడరేమిటండీ?" ఆ గొంతులో చికాకు, నిస్పృహ.

మౌనంగా చూపించాడు రిజిస్టర్... ఆమె వంకే చూస్తున్నాడు విరించి. అందరిలాగా అతను ఆమె పట్ల సానుభూతి మాటల్లో చెప్పి గాలిలో కలిపెయ్యడు. సాధారణంగా లేటుగా వచ్చే మైథిలి సంతకం పెట్టేదాకా మరీ కాలాతీతం అయితే

తప్ప ఆ రిజిస్టరు అతను పంపడు. హెడ్ మాష్టరు దగ్గర నుంచి ప్యూన్ దాకా ఆమె పరిస్థితి పట్ల సానుభూతి వున్నవారే.

గాజులు లేని చెయ్యి సంతకం పెడుతోంది.

ముంజేతుల మీద అక్కడ, అక్కడక్కడ రక్తం... బహుశ స్కూలుకు బయలుదేరేముందు ఏదో భయంకరమైన తగువు అయి వుంటుంది. గాజులన్నీ విరిగిపోయి గుచ్చుకున్నాయి. ఆమె వంకే చూస్తూ ఆలోచిస్తున్నాడు విరించి.

ఇరవయ్యవ శతాబ్దం ఉత్తరార్ధంలో ఒక విచిత్రమైన ఆర్థిక వ్యవస్థ, సామాజిక వ్యవస్థ ఏర్పడుతున్నాయి. పెళ్ళిళ్ళకు కట్నాలు, లాంఛనాలు డిటో. కాని పెళ్ళి ఇచ్చే సెక్యూరిటీ, దానిమీద నమ్మకం మాత్రం పలచబడిపోతున్నాయి.

ఏ చిన్న కారణం వల్లో, అమర్యాద వల్లో ఉద్యోగం మానేసే పురుష పుంగవులు "ఎలా అయినా బతకలేకపోలేం"- అన్న "పనికిమాలిన ధీమా" వుండే పురుష సింహాలు పెరిగిపోయారు. కానీ, వీరిలో చాలామంది ఏది తక్కువైనా బతకలేరు. అవన్నీ తమ గొప్పతనం గుర్తించి ఎవరైనా అమర్చిపెట్టాలని ఆలోచిస్తారు. వీళ్లకు "కన్నెచెర" కు బందీలయిన ఆడపిల్లలు పెళ్లిపేరుతో బలైపోవడానికి, భంగపడడానికి సిద్ధపడతారు. ఒక్కొక్క మొగవాడి దశ బాగుండడం వల్ల అక్షర జ్ఞానంవున్న భార్యలు, అందగత్తెలు, సంస్కారవంతులైన భార్యలు కూడా దొరుకుతారు. ఆ అమ్మాయిలలో చాలామంది ప్రపంచ జ్ఞానంతో బోలెడంత పుస్తక జ్ఞానంతో పెరుగుతారు. చాలా తొందరగా ఎదిగిపోతారు. అందుకే తలకాయ వంచుకుని పస్తులతో పడుకోలేరు. ముఖ్యంగా బిడ్డలుంటే వారిని బాధపడనివ్వలేరు. ఏదైనా సరే, తన ఆత్మగౌరవానికి భంగం రాని పనిచేసి, తన కుటుంబాన్ని పోషించుకోవాలన్న ఆత్మస్థైర్యంతో పోరాటం జరపడానికి సిద్ధపడతారు.

ఇటువంటి స్థితిలో సంఘం ఏ మాత్రం తెలివిగా వున్నా, ఈ స్థితిలో అటువంటి స్త్రీ మూర్తులకు ఏం సహాయం చెయ్యాలా? అని ఆలోచిస్తే, చాలా ఆర్థిక, సామాజిక సమస్యలు తగ్గిపోతాయి. కానీ, దురదృష్టవశాత్తు, బంగారుగాజుల జతలు, పట్టు చీరల రెపరెపలు, భర్త తాలూకు ఆస్తి, హోదా – ఇవన్నీ స్త్రీ పరిస్థితికి గౌరవం ఆపాదించే ఈ వ్యవస్థలో ఇటువంటి స్త్రీ మూర్తులు తలకాయ ఎత్తి ఆలోచించలేక పోతున్నారు. ఒక పిడికెడు సానుభూతి, గుప్పెడు ఓదార్పు వీళ్లను నిలబెట్టి బతికించగలదేమో!...

అటువంటి స్త్రీల కోవకు చెందిన అమ్మాయి మైథిలి. మంచి ఉద్యోగం దురభిమానంతో పోగొట్టుకున్న నారాయణరావు. కాంప్లెక్సును. బాధను మర్చిపోవడానికి తాగుడుకు అలవాటు పడ్డాడు. భర్త పౌరుషానికి, ఆవేశానికీ, కోపానికీ, రోషానికీ ఏకైక బలిపశువు ఆమె. పెళ్లిలో వీడియోలలోను, ఫోటోల్లోనూ దిగిన ఏ బంధువు కానీ, అప్పగింతల బట్టలు పెట్టించుకున్న ఏ ఆత్మీయుడు కానీ ఇప్పటి ఆమె స్థితికి కారణం అడగరు.

అతని పరిస్థితికి కారణం అతనీ భాషలో ఫ్రస్ట్రేషన్.... అది సంఘం అర్థం చేసుకోగలదు.

ఆమె స్థితికి మాత్రం కారణం ఖర్మ... అది అనుభవించక తప్పదు మరి - ఇది సంఘం చేసే శాసనం.

విరించి, మైథిలి ఒకే స్కూల్లో టీచర్లుగా పనిచేస్తున్నారు. అంతేకాదు, దాదాపు మైథిలి అద్దెకు వుండే పోర్షన్ వెనక పక్కగా ఒక చిన్న గదిలో అద్దెకు వుంటున్నాడు విరించి. అందుకే ఆ గోడ వెనకాల జరిగే చాలా గందరగోళాలకు అతను ప్రత్యక్ష సాక్షి.

విరించి మంచి రచయిత అవునో కాదో కానీ గొప్పగా ఆలోచించడం నేర్చుకుంటున్న మనిషి. ఆ చుట్టుపక్కల చాలా సంసారాల్లో అల్లకల్లోలాలు, ఒడిదుడుకులు, వైమనస్యాలు చూస్తూనే వున్నాడు అతను. చాలావరకూ చాలామంది సమస్యలకు అంతర్గతమైనది ఆర్థికసూత్రం. అది చాలా సులభంగా అర్థమైంది అతనికి.

కానీ మైథిలీ, నారాయణరావుల విషయాలు వేరు. వారి సంసారంలో ఏదో ఊబి. అతడిలో తడిలేని కరుకుదనం. ఆమె కన్నీళ్లు మింగి కడుపు నింపుకోవడం, వున్న ఇద్దరు బిడ్డల్లో ఒకరు అవిటి వాడవడం తనను హింసించి తృప్తి పొందక పోయినప్పుడు, ఆ అవిటి బిడ్డను చిత్రహింస పెట్టే భర్త, ఆమె సంపాదించక తప్పనిసరి స్థితి. అతడు అనుమానించి చిత్రహింస పెట్టే పరిస్థితి - ఇవి చాలు మనకు వాళ్ల సంసారమనే న్యూస్ అర్థమవ్వడానికి.

కానీ తమాషా! విరించిలో మగవాడైన ఆలోచనాపరుడికి అసలు మైథిలి అంటే అంతర్గతమైన సన్నని విసుగు, కోపం వుందేమోనని వులిక్కిపడేవాడు.

నారాయణరావు విరించికి బాగా తెలిసిన వ్యక్తి. తాగివచ్చి మైథిలిని చావగొట్టడం లాంటి విషయాలు కళ్లబడటం వలన అతని ప్రవృత్తి గురించిన ఆలోచన వస్తోంది కానీ, కాకపోతే నారాయణరావు చాలా పెద్ద మనిషి కిందే లెక్క. సరదాగా కబుర్లు చెపుతాడు. అటువంటివాడి గురించి కేవలం మైథిలిని బాధపెట్టడం అనే ఒకే కారణం వల్ల రాక్షసుడిగా చిత్రీకరించబడేటప్పుడు - చెప్పద్దూ విరించికి కొంత బాధ కలుగుతుంది.

"ఏంటి బాబూ! క్లాసు వుందా? అని మైథిలీ టీచరు రెండుసార్లు అడిగి విసుక్కుని వెళ్లిపోయారు. ఏమిటి ఆలోచిస్తున్నారు?" కాఫీ తెచ్చి పెడుతూ అన్నాడు ప్యూను.

'ఆ! ఆహా!' అంటూ కాఫీ తాగుతూ, మళ్లీ ఆలోచిస్తున్నాడు విరించి.

అసలు నారాయణరావు ఎందుకు అలా తయారైనాడు? అన్న ప్రశ్నకు చటుక్కున "మైథిలే కారణమేమో" అన్న ఎదుర్కో లేని, అర్థం లేని, అమానుషమని తెలిసీ తట్టుకోలేని జవాబు విరించిని వెంటాడుతూనే వుంటుంది. ప్రపంచానికి

అంతా కొంచెం మొండివాడు, ఎక్కువ మంచివాడుగా కనబడే వ్యక్తి కేవలం భార్యా పిల్లల విషయంలో ఇంత క్రూరంగా, భయంకరంగా ఎలా వుండగలడు?!

కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని ఈసురోమని వుండే మైథిలిని చూసి సాటి వ్యక్తిగా జాలి పడుతున్నాడేమో కానీ, మొగవాడిగా ఆలోచిస్తే, నారాయణరావును చూస్తేనే ఒకరకమైన జాలి విరించికి.

"పంపు దగ్గర నుంచి నీళ్లు తెచ్చుకుందామంటే బిందె చిల్లు పడింది" అన్న సమస్య దగ్గర నుంచి "బియ్యం లేకపోతే పిల్లలకు బ్రెడ్ పెట్టాను" అన్న సమస్య వరకూ - ప్రపంచం అంతా మైథిలిని సపోర్టు చేసే పాయింట్లూ, నారాయణరావును చివాట్లు పెట్టే ఏర్పాటు ఏదో జరిగిపోతోంది అన్నది విరించి అభిప్రాయం - కానీ, ఇవన్నీ బయటకు చెప్పక్కర్లేదు అతను.

మైథిలి నారాయణరావులో ఏదో కాంప్లెక్స్ రేపుతోంది. తెలియకుండానే అతని ఇగోను హర్ట్ చేసి, అతనిలో పైశాచికత్వాన్ని ట్యూన్ చేస్తోంది. ఇద్దరు బిడ్డలతో చిన్న వంటిల్లు, ఒక గది ఇంట్లో అద్దెకు వుండే మైథిలి భర్త శారీరకమైన కోర్కెలకు కూడా "పిల్లలున్నారు" అని తోసిరాజంటోంది. ఇదంతా అతని కెమికల్ స్ట్రక్చర్ మీద దెబ్బతీస్తోంది. సాధారణమైన ఆడదానిలా పోట్లాడి, కాపీనం ప్రదర్శించి, "ఈ గిన్నె మాదే" అని పక్కవాళ్లతో తగూ వేసుకుంటూ, గెజిటెడ్ ఆఫీసర్ పెళ్లానికి కూడా దొంగతనం అంటగట్టగలిగానన్న తృప్తితో బతుకుతూ కూరలవాళ్లతో, రిక్షావాళ్లతో పోట్లాడి, బేరాలాడుతూ- ఇలా మామూలు రకం ఆడవాళ్లలా వుండదు మైథిలి.

నెమ్మదిగా, మౌనంగా హింసపడుతూ కూడా "పిచ్చివాడా! నువ్వింతకన్న ఏం చెయ్యగలవు? నీ మీద నాకు జాలి వేస్తోంది" అన్నట్లు చూసి మరింత కసి రేపుతోందేమో మైథిలి. అదే నిజమైతే. నారాయణరావే ఏమిటి! ఏ మొగవాడైనా చెప్పలేని కాంప్లెక్స్‌కు లోనై, దానికి అవుట్‌లెట్ లేక ఇలా హింస ద్వారా తృప్తి పడతాడేమో!

కానీ, కొన్నాళ్లు ఇలా ఆలోచిస్తూ 'ఈ సమస్య నాది కాదు' అన్న పలాయన వాదంతో హాయిగా వుందామని ప్రయత్నం చేసిన విరించికి ఈ మధ్య ఈ సమస్య గురించి, పరిష్కారం గురించి ఆలోచించక తప్పడం లేదు.

కారణం? అతనిలోనూ "మనిషి" వున్నాడు. ఆ మనిషికి సంస్కారం ఎవరి పరిధి వారిది అన్న పొరలు వెయ్యకపోతే చాలా సహజంగా రియాక్ట్ అవుతాడు.

ఈ మధ్య నారాయణరావులో అమానుషత్వం పెరిగిపోతోంది. ఒద్దనుకున్నా అదంతా విరించి కళ్ళపడక తప్పడం లేదు. రేషన్ డబ్బులు దొంగిలించి తాగుతున్నాడు నారాయణరావు. హింసల్లో చిత్ర విచిత్ర హింసలు కనిపెట్టాడు. అవన్నీ చూస్తూ వుంటే, ఒంటరిగా ఉన్నప్పుడు తనకు తెలియకుండానే ఊహల్లో నారాయణరావుతో మాట్లాడుతున్నాడు. ఊహల్లోనే బెల్ట్ పెట్టి తెలీకుండా కొడుతున్నాడు. ఎన్ని నీచమైన ప్రశ్నలు అడిగాడో, ఎంత బోధ చేశాడో అతనికే తెలియదు.

కానీ, ఇదంతా ఊహల్లోనే.

అసలు నా కోపానికి కారణం ఏమిటి? అని తనను తాను ప్రశ్నించు కున్నాడు. చాలా రకమైన ఇబ్బందికరమైన ప్రశ్నలు వేసుకున్నాడు. "నేను బుద్ధిజీవిని" అనుకునే వ్యక్తి కాబట్టి మనసు మేధస్సు పోటీపడి పెట్టే ఈ రకమైన చర్యలన్నీ భరించాడు.

చిన్నప్పటి నుంచీ బాధ్యతా బరువుకు అలవాటు పడ్డ వ్యక్తి విరించి. అందుకే బద్ధకస్తులను, వ్యసనపరులను, కాలాన్ని, డబ్బును వ్యర్థం చేసేవాడిని "భరించలేనితనం" ఏదో అతని అంతరాంతరాలలో వున్నది. పల్లెలో వుండే ముసలి తల్లి, పెళ్లి కావాలసిన చెల్లి, సంపాదన చాలని అన్నగారి సంసారం, చదువుకుంటున్న తమ్ముడు – వీరందరూ విరించి సంపాదనలో ఎక్కువ భాగానికి కర్తలు. తనవల్ల బతుకుతున్న వీళ్లంటే అతనికి ఏదో ఇష్టం, వాళ్ళ పట్ల నిష్ఠ వుందా అంటే చెప్పలేం కానీ, వాళ్ళు తన కర్తవ్యం అనుకుంటున్నదాన్ని పూర్తి చెయ్యడానికి ఉపాధులుగా కనిపించేవారు. అందుకే అతడిలో మనిషికి – కర్తవ్యం పట్ల చాలా నిష్ఠ కలిగిన అహంకారి అయిన మనిషికి, నారాయణరావు అంటే సహజమైన సానుభూతి, గౌరవం తగ్గిపోతున్నాయి. ద్వేషం, అసహ్యం పెరిగి పోతున్నాయి. ఇవి ఏమాత్రం శ్రేయస్కరమైన విషయాలు కావని ఆలోచనాపరుడైన విరించికి తెలుసు. కారణం ఈ గుణాల తాలూకు పరిణామాలు అతి త్వరలో అసహ్యకరమైన రూపంలో బయటపడతాయని అతనికి తెలిసిన సత్యం

ఉద్యోగరీత్యా, ఇంటిరీత్యా మైథిలి సంసారానికి దూరం కాలేదు. దగ్గరగా వుండి ఈ టెన్షన్ అందరిలా మామూలుగా తీసుకోలేదు.

అందుకే ఆలోచిస్తూ ఒక నిర్ణయానికి వచ్చాడు ఆ రోజు విరించి–

❀ ❀ ❀

సానుభూతి చూపేవాళ్ళను చూస్తే మనిషి చాలా బలహీనతను వెళ్ళబుచ్చుతాడు. దానికి తోడు ఏదో ప్రత్యేకత, ఇగో శాటిస్ఫాక్షన్ దొరికితే ఇంక చెప్పక్కర్లేదు. మైథిలి ఈ తత్వానికి పెద్ద వ్యతిరేకి కాదు. స్టాఫ్ మెంబర్లు, ఫ్యూన్లు వీళ్ళ మధ్య ప్రతిరోజూ తన సంసారం ఈతి బాధలు మాట్లాడేస్తుంది మైథిలి. ఎవరైనా, "ఆ మొగుడు లేకపోతేనేం" అందామనుకున్నప్పుడల్లా, తిడుతూనో, నిందిస్తూనో మాటల సందర్భంగానో అతణ్ణి సమర్థిస్తూ మాట్లాడకుండా వుండలేదు. మైథిలి. "ఆయన మొదట్లో చాలా మంచివారు. ఇప్పుడు ఇలా అయిపోయారు కానీ..." అన్నది ఆమె మామూలు ఊత పదంలాంటి వాక్యం. ఆమె ప్రపంచానికి అతను కేంద్ర బిందువు. ఆవిడ దృష్టిలో ఆ దృష్టే అన్ని కష్టాలకూ, అనుభూతులకూ కారణం అనిపించింది విరించికి.

ఉన్నట్లుండి ఒకరోజు మైథిలి మాటలు హిస్టీరికల్‌గా మారడం విని విని,

"ఎంతసేపూ మీరు ఆ బిందువు చుట్టూ పరిభ్రమిస్తారు. మిగతా ప్రపంచం లేదా ఇక?"

సూటిగా చూస్తూ ప్రశ్నించాడు ఆమెను విరించి. ఠక్కున మంత్ర ముగ్ధలా ఆగిపోయింది మైథిలి. అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయింది. "కోపం వచ్చిందేమో?" అనుకున్నాడు విరించి.

మూడు రోజులు కనబడలేదు. లీవు పెట్టిందట. ఆ మర్నాడు వస్తూనే-

"మీరు చెప్పినదాన్ని గురించి చాలా ఆలోచించాను విరించిగారూ! నా ఈ దుఃఖానికి ఈ నా పరిభ్రమణమే కారణమా? అనినన్ను నేను చాలా సార్లు ప్రశ్నించుకున్నాను. చాలా గొప్ప ప్రశ్న అడిగారు మీరు. అదే ఆలోచిస్తున్నాను. కానీ నాకీ పరిధి నుంచి బయటపడటం ఎలాగో తెలియడం లేదు. నాకే కాదు, నావంటి చాలా మందికి..." ఆలోచిస్తూ మాట్లాడుతూ వెళ్ళిపోయింది క్లాసుకు.

అదిరిపోయాడు విరించి. ఆమెకు మరొక పక్క నుంచి ఆలోచించడం కొంత నేర్పాలనుకున్నాడు నిజమే.

కానీ మరీ ఇంత సీరియస్‌గా తీసుకుంటుంది అనుకోలేదు.

కానీ కొందరు, కొన్ని క్షణాల్లో మాట్లాడే మాటలు మంత్రాక్షరాలు ఒక్కొక్కసారి ఉచ్చరించిన వ్యక్తి కక్ష్యదాటి నిశ్శబ్దతలో వెలుతురు స్వరాలు వినిపిస్తాయి అవి!

మరొక రోజు...

"ఇది మేము తెచ్చిపెట్టుకున్న దాస్యం. ఇది దాటడం మాకే ఇష్టం లేదేమో! ఈ జీవితాన్ని ఇలా కాక మరొక రకంగా ఎలా బతకాలో, ఆలోచించాలో అర్థం కావడం లేదు..." అన్నది పిల్లల క్లాస్ వర్క్ కరెక్ట్ చేసుకుంటూ.

ఆమె వంకే చూస్తున్న విరించికి ఒకటి అర్థమైంది. నిద్రాణమై అరమోడ్పుగా వుండే ఆమె కళ్ళు ప్రస్తుతం విచ్చుకుని ఎర్రబడి వున్నాయి. ఆమెలో ఆలోచన ఏదో చాలా తీవ్రంగా రక్తంతో కలిసి అయస్కాంత శక్తిలా వ్యాపిస్తోంది.

ఆమె తన పరిస్థితికి పరిష్కారం వెతుకుతోందని తెలిసింది అతనికి.

"ఒక పని చెయ్యకూడదూ? అసలు మీరింకేం చెయ్యగలరో ఆలోచించండి."

"అంటే..." పెన్ను మొన కొరుకుతూ అన్నది.

"దెబ్బలు తినడం, ఏడవడం, వంట చేసుకోవడం, పిల్లల్ని ప్రేమగా చూడటం" కొట్టడం, రేపటి రోజు ఎలా అని దిగులు పడటం, అప్పుడప్పుడు సుఖపడుతున్న వాళ్ళని చూసి అసూయపడటం, అందరికీ మన కష్టాలు చెప్పి దీనంగా మొహం పెట్టుకుని కూర్చోవడం, మీ ఆయనను ప్రేమిస్తున్నాను అనుకుంటూ భరించడం – ఇవికాక ఇంకేం చెయ్యగలరు?"

ఫక్కున నవ్వేసింది మైథిలి. "ప్రేమించడమా? నా మొహమా?" అని క్లాసుకు వెళ్ళిపోయింది.

ఆ తరువాత చాలా సీరియస్‌గా వుంటే "ఏమిటి?" అని అడిగాడు విరించి, 'ఆ! ఏముంది? మళ్ళీ వాళ్ళాయన కొట్టి వుంటాడు, అనుకుని.

"ఆలోచిస్తున్నాను..." అన్నది మైథిలి.

ఆమె మాటల్లో శక్తి అతనికి జలదరింపును కలుగజేసింది.

మూడురోజుల తరవాత.....

"విరించిగారూ! మా బాబుకు ఫిజియోథెరపీ చేయిస్తున్నాను. తప్పకుండా కాలు వస్తుందన్నారండీ డాక్టరుగారు. వాళ్ళ పిల్లలకు ట్యూషన్ చెపుతున్నాను. వాళ్ళు చాలా మంచివారు–" అన్నది.

దీనివల్ల జరిగిన మేలేమో కానీ, ఒక రెండు గంటల కాలం ఆవిడ జీవితం మరొక కొత్త ప్రపంచంలోకి తొంగి చూడటం జరిగింది. అదృష్టమేమిటంటే, అక్కడ ఆమెకు ఎదగడానికి కావలసిన వాతావరణం ఏర్పడింది.

మొత్తానికి కష్టాలు లేకపోతే తోచని స్థితి దాటారు. మరి కొంచెం దూరం వెళ్ళి ఆలోచించండి. ఈ విషయాలు తప్ప మీరు ఇంకేం మాట్లాడగలరు?" తీరికగా వున్నప్పుడు మరొక ఆలోచనా బీజం వేస్తూ అడిగాడు విరించి.

చెంపన చెయ్యి పెట్టుకుని చాలా సేపు ఆలోచిస్తూ కూర్చుంది మైథిలి. చివరికి–

"ఏం మాట్లాడకేం? చాలా చాలా మాట్లాడగలను నేను... నేను... ఓహ్... నేను ఎక్కడ ఆగిపోయానో అర్థమవుతోంది..." అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయింది.

మనిషిలో కనబడని మార్పులు ఆమెలో వ్యక్తిని ప్రభావితం చేస్తూంటే, కనబడే మార్పు మాత్రం ఆమెలో చురుకుదనం, చీర కట్టుకోవడంలో పొందిక, ఆలోచించి మాటకు సరైన జవాబు చెప్పడం, ఆత్మన్యూనత, పరనింద, మాటల్లో తగ్గిపోవడం, నీరసం, నిస్సత్తువ లేకపోవడం – ఇవన్నీ గమనిస్తున్నాడు విరించి.

ఒకరోజు మాటల సందర్భంలో మైథిలి స్టాఫ్ రూంలో చాలా చక్కటి ఆర్గ్యుమెంట్స్ చెయ్యడం వింటూ నిలుచున్నాడు విరించి.

"అజ్ఞానంలో వున్న మనిషికీ, మేధావంతుడైన మనిషికీ తేడా అతని జీవన విధానంలో కోరికలకూ, అవసరాలకూ ఇచ్చే గౌరవంలోనే బైటపడుతుంది. కాపిటలిజమ్ మార్కెట్ ఎకానమీతో మనిషి కోరికలు తీర్చుకునే వ్యవస్థను సృష్టిస్తుంది. కానీ అవసరాల గురించి ఆలోచించనివ్వదు. టీవీ సెట్ కావాలా, మంచి డ్రైనేజ్ సిస్టమ్ కావాలా? అంటే సామాన్యుడు 'టీ.వీ.' కోరుకుంటాడు. సోషలిజమ్ మనిషి అవసరాలను తీరుస్తుంది. ఆడంబరాలకు పెద్ద పీట వెయ్యదు. అందుకే ఈ రెండూ కలిసిన గవర్నమెంటు ఎక్కువగా మన దేశానికి అవసరం..."

హియర్ హియర్ ...అంటూ చప్పట్లు కొట్టారు ఒకరిద్దరు. అందులో విరించి కూడా వున్నాడు. చటుక్కున తలెత్తి అతని వంక చూసి పసిపాపలా హాయిగా నవ్వేసింది మైథిలి.

"మీరు ఆలోచిస్తున్నారు... చాలా పెద్ద మార్పు వస్తోంది!" తీరుబడిగా వున్నప్పుడు అన్నాడు విరించి.

"అవును... ఆలోచించడం నేర్చుకుంటున్నాను. మీరు నాకు గురువు."

"ఏడిచినట్లుంది.." ఏదో అనబోయాడు విరించి.

"నాకు తెలుసు మీరు ఏమంటారో? నేను నేర్చుకుంటున్న మాటలు మీ మీద విసురుతున్నాను. అంతే... అంటారు. అది మీ వరకు నిజం అయ్యుండవచ్చు. కాని, నా వరకు అవి ప్రాణం పోసిన మంత్రాలు. అయినా ఎందుకో కొంతమంది చెబితే వినాలి అనిపిస్తుంది. ఇప్పుడు నేను ఇంట్లో ఆర్గ్యుమెంట్స్ మానేశాను. ప్రశాంతంగా వున్నది ఇల్లు."

"అంటే ...దెబ్బలూ... అవీ..."

"అవి తప్పవు. కానీ ఆయనను కొట్టే స్థితికి తరమడం మానేశాను అనుకుంటాను."

నవ్వాడు విరించి ఆ కన్ఫెషన్‌కు.

"అయినా మీరు చెప్తే నేనెందుకు వింటున్నాను?" తుపాకీ గుండులాంటి ప్రశ్న అది. కానీ ఆ ప్రశ్నలో దగ్గరతనం లేదు. ఏదో ప్రోబింగ్ వున్నది.

"చెప్పలేను... బహుశ ఇద్దరం ఎక్కడో ఒక ఆలోచనా పరిధి దగ్గర కలుసుకుంటున్నామేమో?" అతనికి తెలియకుండానే ఆమెను గౌరవంగా చూస్తూ అన్నాడు విరించి.

కామ్యం లేని స్నేహం అర్థమవుతోంది ఇద్దరికీ.

"ఏమో?" అంటూ వెళ్ళిపోయింది.

"మాంటిసరీ ట్రైనింగ్‌లో చేరాను. మా ఆయనకు మందు ఇప్పిస్తున్నాను..."

"మీరే ఇస్తున్నారా?" నవ్వుతూ అడిగాడు విరించి. నవ్వేసింది.

"లేదు. ఆయన మందు తగ్గించి టాబ్లెట్స్ వాడే స్థితికి వచ్చేశారు. కానీ విరించిగారూ! నన్ను కొంచెం గైడ్ చెయ్యండి. నేను వ్యర్థుణ్ణి అన్న ఫీలింగ్ ఆయనకు ఎక్కువైపోయింది. అసలు ఈ ఆలోచన ఇప్పుడు కొత్తగా రావడానికి కారణం ఏమిటా అని ఆలోచిస్తున్నాను."

"మైథిలిగారూ! జాగ్రత్త. ఇది చాలా డేంజరస్ ఫీలింగ్. ఇప్పుడే కాంప్లెక్స్ మరింత పెరుగుతుంది. మీరు ఒకపక్క చాలా ఉపయోగకరమైన వ్యక్తిగా మారుతున్నారు. కన్నీరు లేదు. పనికిమాలిన దుఃఖం లేదు. సానుభూతికి వెంపరలాడటం లేదు. అతని దాస్యంలో లేరు. ఈ స్థితిని అతను తట్టుకోవడం కష్టం...."

అతని గొంతులో ఆదుర్దా, అభిమానం- కళ్ళల్లో నీరు తిరిగింది మైథిలికి.

బుద్ధిగా తల ఊపి వెళ్ళిపోయింది. "ఇవన్నీ మీకు ఎలా అర్థమైనాయి?" అన్న ప్రశ్న అడక్కుండా వెళ్ళినందుకు ఒకరకంగా బాధపడ్డాడు విరించి. మరొకరకంగా జవాబు చెప్పమనకుండా రక్షించింది అని సంతోషించాడు.

క్రమేణా మైథిలిలో చాలా మార్పు, ఉత్సాహం పెరిగింది. కల్చరల్స్‌లో తానే లీడింగ్. నారాయణరావు ఏదో చిన్న ఉద్యోగంలో చేరాడట. అతనిలో అప్పుడప్పుడూ పశుత్వం నిద్రలేచినా, ఈ కొత్త మైథిలిని అవి బాధ పెట్టలేకపోతున్నాయి.

విరించికి ఒక విషయం అర్థమైంది.

జీవితావసరాలు మనిషికి ఇచ్చి రక్షించడం కాక, అసలు ఆ మనిషికి తనకు తోడు తానే అయి బతికేట్లు చెయ్యడం మంచి పని అని.

టీ.వి.లో సంస్కృత రామాయణం బ్యాలే చూస్తున్నాడు విరించి.

రాముడు బంగారు లేడి వెతుకులాటలో "రక్షమైథిలీ" అని లక్ష్మణుడికి చెప్పి వెళ్ళిపోయాడు. కానీ, ఆమెను ఆమే రక్షించుకోమని చెప్పివుంటే ఎలా రక్షించుకోవాలో నేర్పివుంటే, రామాయణంలో యుద్ధకాండ అవసరం వుండేది కాదేమో!

ఒకప్పుడు భయంగా బతకడానికి అలవాటుపడ్డ మైథిలి ఇప్పుడు విడిగా తనను తాను పెంచుకుంటూ ఎదుగుతూ బతుకుతోంది.

"నాలో ఆలోచనా జ్ఞానం పెంచారు. నేను విడిగా, నేనుగా ఆలోచించగలుగుతున్నాను" అని ఆమె కృతజ్ఞతతో అన్నప్పుడు విరించి కళ్ళు ఆకస్మికంగా చెమ్మగిల్లుతాయి. మైథిలిని రక్షించే ఈ మొత్తం ప్రోసెస్‌లో తను ఎన్ని మెట్లు ఎక్కాడో, ఎన్ని చీకటి ఆలోచనలకు వెలుతురు మెట్లు కట్టాడో తెలుసుకోగలుగుతున్నాడు.

"రేపు పుట్టబోయే శిశువును గురించి కానీ, నిన్న నశించిపోయిన మనిషిని గురించి కానీ, ఆలోచించకుండా కేవలం వర్తమానం జీవితమనుకుంటే చాలా దౌర్భాగ్యపు చరిత్రలకు పునాదులు పడవు–" అంటూ జీవితాన్ని కాలాతీతంగా చిత్రీకరిస్తూ ఆర్టికల్ రాసింది స్కూల్ తరఫున మేగజైన్‌లో మైథిలి.

మంత్రము, మనిషిలో వైబ్రేషన్ కలిస్తే ఒక అపూర్వమైన మాగ్నటిజమ్ ఉద్భవిస్తుంది. హైడ్రోజన్, ఆక్సిజన్ కలిస్తే మరొక కొత్త రూపుదాల్చి నీరుగా మారుతుంది. విరించి చేసిన ప్రయత్నం, మైథిలి పరిస్థితి కలిసి మరొక కొత్త మైథిలి రూపుదాల్చింది.

మైథిలి తనను తానూ, తద్వారా తన చిన్ని ప్రపంచాన్నీ రక్షించుకోవడం నేర్చుకున్నది.

*(ఆంధ్రజ్యోతి – 9-8-1991)*

# ముంగిట్లో ముత్యాలు

"అక్షరాలు చదివే ఆడదంటే ఆయనకు ఇష్టం లేదు. ఆయన పేరు రామచంద్రయ్య. ఊరు కోనేటంపేట. ఆయన నీ మామగారు... కనబడితే, నేను గుర్తుంటే నా నమస్కారాలని చెప్పు...." ఆవిడ గొంతుకలో సన్నటి జీర.

"అరె! వై దిస్ చోకింగ్ ఆంటీ" ఆశ్చర్యంగా అంది రంజన....

"ఏమిటి? మీరు అంతగా అడిగితే తప్పకుండా చూసి వస్తాను..."

"ప్రామిస్?" టిష్యూతో కళ్లు ఒత్తుకుంటూ చేయి చాచింది చిన్నపిల్లలా మిసెస్ మేరి అబ్రహం

బాబ్డ్ హెయిర్, సోఫిస్టికేషన్ చక్కటి ఉచ్చారణ వున్న మేరి వరల్డ్ బాంక్‌లో పనిచేస్తోంది... ఆరోగ్యంగా, చురుకుగా గ్రేస్‌ఫుల్‌గా వృద్ధాప్యాన్ని అందిస్తున్న ఆమె కళ్లు ఎదురుగా వున్న కోడలు రంజనను మీద దాటి, దూసుకుని ఏదో వెతుక్కుంటూ దిగంతాలను దాటిపోతున్నాయి.

ఎక్కడో కొన్ని వేల మైళ్ల దూరంలో వున్న ముక్కు కొండను దాటుకుని, ఒక కుగ్రామంలోకి అడుగువేస్తున్న పరువాలు ఉన్నవ్యక్తి గురించిన జ్ఞాపకాలలో జారిపోతోంది. ఆమె

కారణం ఆయన ఆమెను అగ్నిసాక్షిగా పెళ్లి చేసుకున్న భర్త... ఒకప్పుడు...

అతణ్ణి ఆ ఊరును, ఆ సాంఘిక నైతిక బంధాలను దాటి, స్కాలర్‌షిప్ కోసరం మతం, పేరు మార్చుకుని తన ఉద్దేశ్యాలకు, అవసరాలకు అందుబాటులో వున్న వ్యక్తితో సెటిల్ అయిపోయింది. యాభయ్యవ పడిలో ఇప్పుడు నో రిగ్రెట్స్...

కానీ .... ఏదో బోర్.... మొనాటనీ... స్వేచ్ఛ కోసరం "చదువంటే నా ప్రాణం" అన్న మేరీ ఇప్పుడు తప్పనిసరిగా ఉద్యోగం చేస్తే తప్ప తన ఐడెంటిటీని నిలబెట్టుకోలేని స్థితిలో వుంది... తమాషా స్థితి అది... "స్వేచ్ఛ కోసరం కంపల్షన్...."

ఆవిడ సెల్ఫ్ మేడ్ పర్సన్.... తన అత్తగారు... పదహారేళ్లకు కూడా పదో క్లాసుకు రాకుండా ఇంగ్లీషులో ఈజ్ ఎక్కడ పెట్టాలో, వజ్ ఎక్కడ పెట్టాలో తెలియకుండా చెరుకు గడలు, తంపట వేరుసెనక్కాయలు తినడం, కర్రాబిల్లా ఆటలో గట్టివాడవడం తప్ప మరొక విద్య తెలియని రాఘవను తండ్రి దగ్గర నుంచి తప్పించి, గొప్ప ఎలక్ట్రానిక్ ఇంజనీర్‌ను చేసిన వ్యక్తి ఈవిడ... ఆవిడంటే చాలా గౌరవం రంజనకు.

ఆవిడ గతం... ఈ కాలంలో పెద్ద బాధపెట్టే విషయం కాదు....

భర్తలో అప్పుడప్పుడు చిన్నతనపు జ్ఞాపకాల పలవరింతలకు ఆశ్చర్యపోయేది రంజన. ఇన్నేళ్లు స్టేట్స్‌లో వున్నా ... ఏదీ మర్చిపోలేదతను... అదే ఆశ్చర్య మనుకుంటే.... తాము ఇండియా వెళుతున్నామని తెలియగానే, ఈవిడ – ఈ "రాక్ ఆఫ్ జిబ్రాల్టర్" వంటి వ్యక్తి కదలిపోయి, కన్నీరు కార్చి కోరుతున్న కోరిక వినగానే అదిరిపోయింది రంజన..... ఎటో దిగులుగా చూస్తున్న మేరీ కళ్లవంక చూస్తూంటే, ఏదీ ఆశ్చర్యమనిపించడం లేదు, హ్యూమన్ సైకాలజీ తెలిసిన రంజనకు.

కానీ, ఆ బాధలో తమకం, ఏదో పలవరింపు – "ఆయన మీకేం మిగిల్చారని ఈ జ్ఞాపకాలు" చేతులు కట్టుకుని, ఆమెను చదువుతున్నట్లు చూస్తూ అడిగింది.

ఊ – "జ్ఞాపకాలు... నిజం... జ్ఞాపకాలే ....", ఉలిక్కిపడుతూ జవాబు చెప్పింది మేరీ....

"అవ్వంత మధుర స్మృతులు కావనుకుంటానే?!..."

"ఊ! కావేమో?!...." పరధ్యాన్నంగా సోఫా మీద తల ఆనిస్తూ అన్నది మేరీ... ఒకప్పటి సీతారావమ్మ.

"ఏ జ్ఞాపకానికైనా మాధుర్యం ఆపాదించాలంటే, అసలు మధురిమ తెలియాలిగా? అది తెలుసుకునే లోపల – ప్ఛ్.... చాలా జరిగిపోయాయి... నాకు చిన్నప్పటి నుంచీ కట్టుబాట్లు గిట్టేవి కావు... నా ఇష్టం వచ్చినట్లు బ్రతకాలంటే, వీళ్లందరికీ లేని చదువు నాకుండాలనుకునేదాన్ని.... మా మేనమామలు అప్పట్లో తంబుచెట్టి వీధిలో, నగరంలో బియ్యం వ్యాపారం చేసేవాళ్ళు–"

"నగరం అంటే?"

"మద్రాసు".... నవ్వుతూ అన్నది మేరీ.

"అది మహానగరం మా పాలిట అప్పట్లో. అక్కడికి ఎక్కువగా వచ్చేదాన్ని. రిబ్బన్లు, చెంప పిన్నీసులు, హైహీల్స్ చెప్పులు కల్చరంతా మా ఊరికి నేనే తెచ్చాను. జుట్టు రింగులు తిప్పుకోడాలు, సెంట్లు వాడటాలు, నైలెక్స్ కల్చరు – ఇదంతా కూడా దాదాపు నా పుణ్యమే. ఈ పట్నవాసం వాసనతో నాకు మా ఊరు బ్రతుకు బ్రతుకు కాదనిపించేది."

పర్కొలేటర్ ఆన్ చేసి వింటోంది రంజన.

తెలుగుదేశంలో ఎక్కువ పెరగకపోయినా, తెలుగుతనం తెలిసిన ఆడపిల్ల రంజన. హయ్యర్ స్టడీస్‌కు అమెరికా వచ్చిన ఆమెను ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు రాఘవ. ఆ పెళ్లికి విపరీతంగా సంతోషించి, ఆశీర్వదించిన మొదటి వ్యక్తి మేరీ....

బాల్యంలోని జ్ఞాపకాలు, యవ్వనంలోని అనుభవాలు మనిషి జీవితం మీద పడుగు పేకలాగా జీవన విభ్రాంతులు కలిగిస్తాయన్నది తెలిసిన పిల్ల రంజన... భర్తలో ఆ పలవరింత అర్థం చేసుకోగలదు.

కమిట్‌మెంట్ కానప్పుడు బోలెడన్ని సెంటిమెంట్లు మాట్లాడే వ్యక్తి రాఘవ. కానీ, ఈవిడలో ఈ కలవరింత ఏమిటి?!

ఇన్నేళ్ల తరువాత. ఇంత నాగరికత ఇచ్చిన అనుభవం తరువాత,

"ఏం చేశాను నేను?" అని ఆలోచిస్తోందా? ఉలిక్కిపడింది రంజన.

మేరీ తన జ్ఞాపకాలు, అనుభవాలు గుదిగుచ్చి చెపుతోంది. వింటూ రంజన ఆలోచిస్తోంది.

ఓ గాడ్! ఆవిడ స్మృతుల మధ్య ఏదో ధ్వని....

"ఏం చేశాను నేను?" అని జీవితాన్ని సమీక్షించుకుంటే ఫరవాలేదు కానీ,

"ఎందుకు చేశాను ఇలా?" అని ఆలోచించే దురదృష్టం ఈవిడకు ఈ వయస్సులో అవసరం లేదు.

మంచో, చెడో "మన మనిషి" అన్న వ్యక్తిని రక్షించుకోవాలి అంటే, వాళ్లను "గిల్టీ ఫీలింగ్" నుంచి దూరంగా తీసుకువెళితేనే ఆలన, లాలన, పాలనకు అర్థం వుంటుంది...

అందుకే.

"బట్.... మీకు నో రిగ్రెట్స్... కొన్ని విషయాలు ఆలోచించడానికి అందంగా వుండచ్చు.. కానీ అనాగరికంగా మిమ్మల్ని కొట్టి, బాధపెట్టి బానిసలాగా చూసిన మనిషి. మీరు ఎదుగుతానంటే మిమ్మల్ని శతవిధాల ఆపాలని ప్రయత్నం చేసిన వ్యక్తి - అలా ఆయనను తయారు చేసిన ఆ అనాగరికత అవి మీకు జ్ఞాపకాలైతే ఫరవాలేదు కానీ, మిస్ అయిపోతున్నానని మాత్రం ఫీలవకండి...."

"అలా చెప్పాడా రాఘవ నీకు?! లౌక్యుడు వాడు. ఊ! అదీ నేను నేర్పించిందేగా!" నిర్లిప్తంగా నవ్వుతూ అన్నది మేరీ.

సగటు మొగవాడిగా, తల్లి చేసిన సాహసాన్ని, తప్పును సమర్థించుకోవడం తప్పనిసరి అయినప్పుడు, తండ్రిని, ఆయన వాతావరణాన్ని చాలా బార్బారియస్‌గా చిత్రీకరించడంతప్ప దారి లేదు రాఘవకు.

"అమ్మా! ఎంత అమెరికాలో వున్నా, మనం ఇండియన్స్‌మి. మన ఐడెంటిటీ పోదు. రాత్రి పది దాకా ఆ తిరుగుళ్లేమిటి? ఆ డేటింగ్ లేమిటి నీ కూతురికి?" అని సవితి చెల్లెలు మీద జులుం చేసే రకం అతను. అందుకే తనకు నచ్చని విషయాల గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు వేరే కోణం నుంచి చూసి, సంతృప్తిపడగలడు... తల్లి లేచిపోయిన తరవాత ఊరు ఊరంతా తల్లిని దుమ్మెత్తి పోస్తున్నా-

"పిచ్చిది. దాన్నేమనకండి... తెలిస్తే నట్టింట్లో చిచ్చుపెట్టుకుంటుందా? ఎక్కడున్నా సుఖంగా బతికిపోనీండి..." అనే తండ్రి గురించి పొరపాటున కూడా బైటకు చెప్పడు రాఘవ. సీతారామయ్య దొడ్డంతా తిరిగి కండువాలో మల్లెలు, పారిజాతాలు కోసుకువచ్చి,

"పారిజాతాలు దేముడికి పెట్టు. మల్లెపూవులు నువ్వు పెట్టుకో...." అని బంగారంలా తోమిన పూజా పాత్రలో పోస్తే,

"నాకేమక్కర్లేదు..." అని హఠంగా ఎడం కాలితో తన్నినప్పుడు,

తన అహాన్ని, పసితనాన్ని ఈడ్చి చెంప దెబ్బకొట్టాడు. నిజమే... కానీ ఆ తరువాత బ్రతిమాలి చీర కొనిపెట్టాడు. సినిమాకు తీసుకెళ్ళాడు... పదకొండో ఏటే పెళ్ళైన తన పసితనపు ముద్దు ఎంత చెల్లించాడని?! ఏదో కావాలని, ఏడ్చి రాగాలు పెట్టిన తనను ఎవరూ చూడకుండా మల్లె పందిరి కింద గుండెల మీద పడుకోబెట్టుకొని జోకొట్టాడాయన. మరి ఇవన్నీ ఎవరికి అర్థమౌతాయి?

పాంజేబు పట్టాలు పెట్టి... ఆ పాదాల్ని పదే పదే తమకంగా చూస్తూ, ముద్దుపెట్టుకున్న అతణ్ణి, ఆ చూపులో ఊపును ఉప్పెనను ఎలా వర్ణించగలదు?!

ఈనాడు, కాస్ట్లీ విస్కీని, కట్ గ్లాసులో తన ఖరీదైన కార్పెట్ మీద విసిరేసి ఆబ్రహాం విసిగించి, అల్లరి పెడుతూంటే,

"ఆఫీసులో టెన్షన్ పాపం...." అని సరి పెట్టుకుని బ్రతుకుతోంది.

ఇవన్నీ ఈ రంజనకు, ఈ తన స్నేహితురాలు, కూతురు, కోడలు అయిన ఈ పిల్లకు ఎంతని చెప్పగలదు?!

మెల్లిగా పర్స్‌లో కవరు తీసి ఇచ్చింది రంజనకు.

"ఏమిటిది అంటీ?"

"నీ బర్త్‌డేకు గిఫ్ట్ కొనుక్కో - మనకు ఇక్కడ అమ్‌స్టర్ డామ్‌లో డైమెండ్స్ దొరికినా, మన దేశంలో లాగా రవ్వ కట్టడం చెయ్యలేరు. డైమెండ్ బాంగిల్స్ తెచ్చుకో.... నువ్వు పెట్టుకుంటే చూడాలని వుంది."

భుజాల మీద రెండు చేతులు వేసి, తనివితీరా తనను చూసుకుంటున్న మహా గొప్పదాన్లా వుండే ఆ పిచ్చితల్లిని చూడగానే కళ్ళ నీళ్ళు తిరిగాయి రంజనకు....

మౌనంగా తలూపింది.

"రంజనా!" మైక్రోవేవ్ ఆన్ చేస్తూ అన్నది మేరీ. తేరుకుని తలెత్తి చూసింది రంజన.

"తప్పకుండా మనూరు వెళ్ళిరా... ఆయనకు ఏం కావాలో చూసిరా...."

"తప్పకుండా!" మాట ఇచ్చింది రంజన.

❀ ❀ ❀

కొడుకు, కోడలు ఆమెరికానించి వచ్చారని, కారు పంపించారని, తప్పనిసరిగా వచ్చాడు రామచంద్రయ్య. ఉన్న వాటిల్లో నుంచి మంచి చొక్కా వేసుకున్నా, ఆ పడవంత చల్లటి కారు హాయిగానే వున్నా, ఏదో ఉక్కిరిబిక్కిరిగా వుంది...

"సీతమ్మలానే వుంది...." కోడలు కాళ్ళకు దణ్ణం పెట్టగానే అనుకున్నాడు కానీ, "ఛీ! దాని పోలిక ఈ బంగారు తల్లికి వద్దు" అనుకున్నారు వెంటనే.

కొడుకు తన ముందు తలెత్తి మాట్లాడలేకపోవడానికి నవ్వొచ్చినా, రంజన చకచకా ఇంగ్లీషు మాట్లాడ్డం అంత రుచించకపోయినా, పెళ్ళై మూడేళ్ళైనా పిల్లలు లేరే వీళ్ళకు అని విచారించినా, ఆయనలో "మథన" మరేదో జరుగుతోంది.

రంజన ఆయనకు తెలియకుండా ఆయననే గమనిస్తోంది. ఈ మేటి మనిషి చాలా అందమైన వ్యక్తి. పలుకులో పెళుసుంది. కానీ, చేతలో తీపి కూడా వుంది. ఊరి నుంచి తెచ్చిన చెరుకు గడలు చెక్కి పెట్టాడు. "మంచి నెయ్యేసుకో అమ్మాయ్! మన గేదెది...." అని కొసరి కొసరి వేయించాడు.

కారు పంపితే అంత ఆత్మాభిమానం కల వ్యక్తి రాడనుకుంది.

కానీ, వచ్చాడు... ఎందుకని?!

బిడ్డ మీద మమకారమా? దాంట్లో, "వాడుట్టి ఎదవ... నిజాయితీ లేని ఎదవ!" అన్న ఛీత్కారం నిర్మొహమాటంగా వుంది మరి!

బాపాలాల్ దగ్గర ఆపి డైమండు గాజులకు లక్షరూపాయలపైన లెక్కపెట్టిఇస్తూ, చటుక్కున తలెత్తి చూసింది రంజన. పర్సులో నోట్ల వంక చూస్తున్నాయి మామగారి కళ్ళు. డబ్బు అవసరమా?!

ఉలిక్కిపడింది రంజన. ఆలోచనలు అంచనాలు తారుమారు చేస్తున్నాయి. ప్రతి మనిషికి, ప్రతి వస్తువుకూ ఏదో ఒక "ఖరీదు" వుంటుంది. డబ్బు, హోదా, పొగడ్త, పేరు, సెక్యూరిటీ దేనికో దానికి అమ్ముడుపోనివాడు సాధారణంగా వుండడు. ఎక్కడో, "ఇవేవీ ఒద్దు, మనిషి కావాలి, నా మనిషి..." అనుకునే వాళ్ళు నూటికో కోటికో ఒకరుంటారు.

అటువంటివాడు రామచంద్రయ్య అవ్వాలని మానసికంగా ప్రార్థిస్తోంది రంజన.

ఆ సాయంత్రం.....

"నాకు మీ ఊరు చూపించరూ?" సూటిగా మామగార్ని చూస్తూ అన్నది రంజన.

కాలు మడతేసి కుర్చీలో కూర్చున్నవాడు, ఒక్కసారిగా పైన కండువా దులిపి లేస్తూ,

"మనూరను.... పోదాం ఫా... ఇప్పుడే పోదాం..." అన్నాడు.

ఆ గొంతులో సంతోషం... ఆ కళ్ళల్లో మెరుపు.

❀ ❀ ❀

తిరపతికి వెళ్ళే దారిలో నగరికి దరిదాపుల్లో, కొండల మధ్య నిర్మలమైన కోనేరులా వుంటుంది ఆ వూరు 'కోనేటంపేట!'

"అరె.... ఆ చింత చెట్లు మీ అవ్వవి కదూ! ఇప్పటికీ అదే చింతపండు వాడతారట ఆమె. నిజమా?" ఉత్సాహంగా అన్నది రంజన. దారి పొడుగునా ఆ పిల్ల ఎక్సైట్‌మెంటును ఆపలేకపోతోంది.

ఆశ్చర్యంగా ఆమె వంక చూశాడు రాఘవ. అతనిలో కూడా చిన్నప్పటి జ్ఞాపకాలు నిద్రలేస్తున్నాయి.

ఊరు చిన్నదే... ఒక రెండు వందల గడప వుంటుందేమో.. ఏ వృత్తివారికి ఆ వీధి వున్నది.

ఊరు ఊరంతా "రామచంద్రయ్యగారి కొడుకు, కోడలు వచ్చారంటగా..." అని విరగబడిపోయారు జనం.

కారు చుట్టూ చేరారు.

"పిల్లా! మీది అమెరికా అంటనా... ఆ ముగ్గు మాసింది అక్కడే వుందా? అదే... మీ అత్త సీతారామమ్మ...నా మేనకోడలే అది...కులాసాగా వుందా? పసిడి బొమ్మలా వుండేది. పొయ్యేకాలం వచ్చింది... బారెడు జుట్టుగుళ్ళో అమ్మవారు లాగుండేది..."

బిత్తరపోయి చూసింది రంజన ఆ పళ్ళు లేని అవ్వని. గభాల్న ఆవిడ కర్ర జారిపోతూంటే అందించింది.

"కళ్ళు జారితే ఫరవాలేదులే - తట్టుకోగలను. కాలు జారితే కష్టం... పొయ్యేటప్పుడు ఇంటికి వచ్చిపో... పసుపు కుంకుమ పెట్టి పంపిస్తా.... ఓరి రాంచంద్రయ్యో.... కోడల్ని పంపవోయ్... ఏమిటా జాతర? అమ్మోరి కొలువులా.

జరగండెహె..." కర్రతో అదిలించి, జనాన్ని చీల్చుకుని వెళ్ళిపోయింది అవ్వ.

కొబ్బరినీళ్ళు, మజ్జిగ తేట, కమ్మటి కాఫీ... అడిగే పని లేదు రంజనకు. ఎవరు ఇస్తే వద్దంటే ఎవరు బాధపడతారోనన్న భయం.

అందరి కళ్ళల్లో నవ్వు... ఆనందం.... 'ఈ ఊరంతా మంచివాళ్ళేనా?' అన్నట్లు చూస్తోంది ఆమె.

ఎన్నో అడుగుతున్నారు. ఏదేదో చెప్తున్నారు. ఇంట్లో ముసలమ్మలు వంట ప్రయత్నం చేస్తున్నారు. పడక్కుర్చీలో కూర్చుని, గౌరవంగా ఎదురుగా నిలబడి వున్న జనానికి కొడుకు ఉద్యోగం గురించి చెప్తున్నాడు రామచంద్రయ్య. ఒద్దన్నా ఆ గొంతులో గర్వం... కొడుకుతోపాటు కోడలూ ఉద్యోగం చేస్తోంది. ఆ విషయం చెప్పడం నామర్దా ఆయనకు... అర్థమై నవ్వుకున్నది రంజన.

ఇల్లంతా తిరిగి చూసింది... అక్కడక్కడ క్రాక్‌లిచ్చింది. వెనకాల వంటకు గుండ్రంగా చాలా అర్టిస్టిక్‌గా కట్టిన చిన్న గది... దొడ్లో అక్కడక్కడ ఆంటిక్ పీసెస్ లాంటి గంగాళాలు దొర్లించి వున్నాయి. వెనకాల మందారాలు, పారిజాతాలు... గుబురు సంపెంగ కాబోలు... నూతిగట్టున కూర్చుని ఊరివారి కబుర్లు వింటోంది.

గోడమీద గంగానమ్మ కొలువుకు రాసిన పసుపు చందమామ. ఎరుపు కళ్యాణం బొట్టు.

"ఇదుగో, ఈడే మీ అత్తగారు మజ్జిగ చేసేది. మంచి చెయ్యి ఆమెది. ఎంత వెన్న పడేదో... ఇదుగో, ఈ గట్టుమీద తలార పెట్టుకుంటూ తిరిగేది. బారెడు జుట్టు. వాళ్ళత్త వైనంగా చిక్కుదీసి, సాంబ్రాణి పొగ వేసి దిష్టి తగులుతుందని కొండె సిగ చుట్టేది. ఎంత ముద్దుగా చూసేవారు ఆ యమ్మను... ఎప్పుడైనా కనబడుతుందా?"

మెల్లిగా తలూపింది రంజన... ముప్ఫై ఏళ్ళు గడిచినా ఈ జ్ఞాపకాలు ఆమెకు సొంతమేనా?

"ఇదుగో, ఈ మల్లె అంటు ఆమె పుట్టింటి నుంచి తెచ్చుకున్నది. ఎన్ని చామంతులుండేవో... ఉన్నన్నాళ్ళూ ఇల్లు నందనవనం చేసేది."

తులసి కోట వంక చూస్తూ ఆలోచిస్తోంది రంజన. జరిగిన కాలం నాటి నిశ్శబ్ద చిత్రాలు ఆమెకు అర్థంకాని చాలా విషయాలు చెబుతున్నాయి.

"మా ఇంటికి రామ్మా శుక్రవారం పొద్దు.... పసుపుకుంకుమ తీసుకుని పోదువుగాని...." నవ్వుతూ పిలిచింది ఒక పెద్దింటి ఇల్లాలు.

అలా అలా అంచలంచలుగా ఇళ్ళు, బజార్లు చూస్తోంది రంజన.

"ఇదుగో, ఈ గుళ్లో దీపం ఎప్పుడూ కొండెక్కనివ్వరు తెలుసా? మా వినాయకుడి గుడి ఇది. మొక్కుకో... పండంటి బిడ్డ పుడతాడు." చల్లటి మాట, ఎర్రటి చీర, తెల్లటి పళ్ళు, కాటుక కళ్ళు! ఎవరా అని వెనక్కు తిరిగి ప్రశ్నార్థకంగా చూసింది రంజన.

"ఓయ్... బత్తుల జీలమ్మరోయ్... ఏవమ్మోవ్... కోడల్ని చూడ్డానికి వచ్చావ్ అయితే..."

ఎవరో పరిహాసంగా అన్నారు. ఆ యాసలో ఏదో మ్యూజిక్ హమ్మింగ్... వెనుకటి జన్మల జ్ఞాపకాల లాంటి ఏదో తీపి... తేరుకుని ఆవిడను చూసింది. ఈవిడకు తనే రకంగా కోడలు?!

చిన్న చిన్న వీధులు దాటుతున్నారు.

"ఆ వీధి చూపించావ్!.... అక్కా మా వీధికి తీసుకురా..."

ఒకర్నొకరు ప్రశ్నించుకుంటూ తీసుకువెళ్తున్నారు... గట్టిగా పదడుగులు కూడా లేనిది వీధి!... నవ్వుకుంది రంజన.

ఎవరిదో ఇల్లు పడగొట్టి కడుతున్నారులా వుంది... గొప్ప గొప్ప కళా ఖండాలు చెక్కిన దూలాలు ఉసూరుమని పడి ఉన్నాయి.

"మా బిడ్డకు పట్నం వాసన వంట బట్టిందిలే వదినా! ఆడంతే... మనశ్శాంతిగా బ్రతకడు... బంగారం లాంటి ఇల్లు పగులగొట్టి ఆడంబరంగా కడతాడంట..." కొత్తచీర, రవికల గుడ్డ పెడుతూ మొత్తుకుంది మునిరంగమ్మ.

"ఇదుగో, ఇక్కడే ఈ గుడి ముంగిట్లోనే మీ మాంగారి చెల్లెల్ని గభాల్న తాళి కట్టి పెళ్ళి చేసుకున్నాడు పెద్దలు ఒద్దన్నా అయ్యవారు. అప్పుడేమైందో తెలుసా? తలంబ్రాలు లేకపోతే తప్పుగా తోసి ముత్యాల సరాలు తెంపి పోసింది మీ ముత్తవ్వ.

తా నచ్చినవాడ్ని ఎన్నుకుంది, తప్పేముందని తండ్రికి ఎదురు తిరిగి రామచంద్రయ్య బలవంతంగా ఇద్దర్నీ గృహప్రవేశం చేయించాడు. అప్పుడు మీ ముంగిటి నిండా ముత్యాలే..." పకపకా నవ్వుతూ ఒకరి మాటలో ఒకరు కలుపుతూ, కల్లాకపటం లేకుండా చెపుతున్నారు ఇల్లాళ్ళు.

ముంగిటి నిండా ముత్యాలు... ఏం ఊరిది?! నిజమే. పచ్చి పేడ ఎర్ర మన్నుతో తాపీపనివాడంత అనుభవంతో అలికిన అరుగులు, అలా అలికితే దోమ, ఈగ రావట. ముంగిట్లో ఎర్రమన్ను గీతలు మధ్య ముగ్గులన్నీ ముత్యాల్లాగానే వున్నాయి రంజనకు. ఆ ముగ్గులు, ఆ శుభ్రత ఆ ఊరు స్త్రీ ధనం! ప్రతి ఇంట్లో విచిత్రంగా గోడకు చెక్క కొట్టి దేముళ్ళను అమరుస్తారు. పసుపు, కుంకుమ, రంగవల్లులు, పంచ ముగ్గులు, ఎర్ర నీటిలో మెరిసిపోయే జంట దీపాలు... సన్నికల్లు మీద సైకతలింగం పెట్టి తెల్లవారు ఝామున లేచి వ్రతం చేస్తారు ఆడవాళ్ళు. శుభ్రత, శుచి, భక్తి, శ్రద్ధ... భగవంతుడు ఏనాడో కిక్కిరిసిపోయిన కోరికల గుళ్లో నుంచి పారిపోయి కోనేటంపేటలో కాపురం పెట్టాడనుకుంది రంజన.

ఇంటికొక జాకెట్టు బట్ట, తాంబూలాలు, మెరుస్తున్న పసుపు పాదాలు, వెనకాల ఊరేగింపులా జనం. ప్రతి ఒక్కరూ "అక్కా" అని నోరార పలకరిస్తున్న ఆ ఊరిలో కోనేరు కూడా "నన్ను చూడవూ?" అని పలకరిస్తున్నట్టు వుంది.

"ఈ కోనేర్లో ఎన్ని రోజులు స్నానాలు చేశాను? నాన్న చిన్న గోచి పెట్టి ఈత రావడానికి కోనేట్లో పడేసేవాడు. ఎంత హాయి. అప్పుడు చుట్టూ వెదురు పొదలుండేవి. పాములు గూడా మా సందడికి పారిపోయేవి..." చెప్పాడు రాఘవ.

ఆ గాలి, నీరు మేను సోకంగానే కొత్త ఉత్సాహం వచ్చింది అతనికి. చాలా ఆర్టిఫిషియల్‌గా అతికించుకున్న గంభీరత చెదిరిపోయింది.

"మీ అత్తగారు ఈ ఊరు ఒదిలిపోయిన సంవత్సరమే అమ్మవారి నోరు ఎవరో మాంత్రికుడు కట్టేశాడమ్మా!"

"అదేమిటి? అమ్మవారు ఊరుకుంటుందా?"

"పేరు, రూపం ఏర్పడగానే దేవతైనా కాలానికి, మంత్రానికి కట్టుబడాలిగా తల్లీ! ఇంట్లో మందారాలన్నీ తెచ్చి. మాల కట్టి అమ్మకు వేసే మీ అత్తగారు. పెళ్ళాం పూల పిచ్చితో ఎండలో వస్తుందని, మమ్మల్ని అదిలించి, తెల్లవారు ఝామునే గుడి తెరిపించేవాడు మీ మామగారు.... అవ్వో రోజులు..." పూజారాయన మాట్లాడుతున్నాడు.

విగ్రహం మౌనంగా వుంది... ఆమె కూడా ఆ ఊరి ఆడబడుచు కిందే లెక్క జనానికి...

"ఎందుకలా చేశాడు అమ్మవార్ని?" కుతూహలంగా అడిగింది రంజన.

"ఎందుకా? ఈ తల్లి శక్తి గల దేవతమ్మా! ఈమె వుంటే చుట్టుపక్కల చేతబడులు, చిల్లంగులు పని చెయ్యవు... అందుకే, ఈవిడను నిర్వీర్యం చేస్తే కానీ, వారి ఆటలు సాగవని..."

ఆలోచిస్తోంది రంజన. డివైన్ మాగ్నటిక్ ఫీల్డ్, ఎలక్ట్రో మాగ్నటిక్ ఎనర్జీ ఫీల్డ్స్ తెలియని వ్యక్తి కాదు ఆమె.

పూజారిగారి భార్య జనాన్ని అదిలించి లోపలికి తీసుకువెళ్ళింది.

"మీ అత్తగారు ఊరు దాటగానే 'నువ్వు మగాడివి కాదు కనుకే అది ఊరు దాటింది, అసలు ఆ కొడుకు మాత్రం నీకే...' అని జనం అడ్డగోలుగా మాట్లాడారని ఛాలెంజిగా ఈ బత్తుల జాలమ్మను చేరదీశాడు మీ మాంగారు. ఆ యమ్మా ఆయన్నే నమ్ముకుంది. ఆయన మీ అత్తగార్ని మర్చిపోలేదు ఏనాడూ... ఆ ఇంట్లో జ్ఞాపకాలన్నీ ఆవిడవే..."

అన్నీ వింటూ ఆలోచిస్తోంది రంజన. మాటల్లో పెట్టి ఊరివారినుంచి చాలా వివరాలు సేకరించింది.

డ్రైనేజ్ లేకపోయినా, మరుగు దొడ్లు ఊరికి దూరం కనుక ఊళ్లో ఇన్‌ఫెక్షన్ లేదు. శుచీ, శుభ్రతా ఆచారం పేరుతో అక్కడ అలవాటుగా బ్రతికి వున్నాయి. చిన్న స్కూలు. ఎవరో మహానుభావుడు మంచి నీటి బావికి మోటారు పెట్టించి ఊరికి ఉపకారం చేశాడు. పట్నం వాసన 'పల్లెపట్టు' దగ్గర ఆగిపోయింది.

పసిపిల్లలా, అమ్మవారు పారు వేటలా ఊరంతా ఊరేగింపుగా తిరిగింది రంజన. తిరిగి ఇంటికి వచ్చేటప్పటికి తలెత్తి చూసింది.

వాకిట్లో చేతులు కట్టుకుని చూరు కింద నుంచి ఆమెనే చూస్తున్నాడు మామగారు. ఆమె చూడగానే చటుక్కున తల తిప్పి,

"సుబ్బక్కా... కోడలికి ఎర్రనీళ్ళు తీసి పొయ్యి..." అని పైకొంగు మలుపుతూ రోడ్డెక్కాడు.

ఆ చూపులో నిలుపు, ఆశీర్వచనం, ఆప్యాయత, గుర్తింపు-

కళ్లు చెమర్చాయి రంజనకు.

వాకిట సింహద్వారం వస్తున్నప్పుడు హడావిడిలో గమనించలేదు. శ్రీరామ జననం నుంచి పట్టాభిషేకం దాకా చెక్కుంది.

శాన్‌ఫ్రాన్సిస్కోలో తమ ఇంట్లో వెయ్యి డాలర్లతో కొన్న "ఏంటిక్" గుర్తుకు వచ్చింది.

"అసలు ఈ ఊరు, ఈ ఇల్లు, ఈ మనుష్యులు అంతా ఆంటిక్ పీసెస్. ఆ దేశంలో కేవలం 50, 60 ఏళ్ల నాటి కల్చర్ ప్రిజర్వ్ చెయ్యడానికి అంతగా అవస్థ పడతారు. మరి ఈ ఊరు చరిత్ర ఎంతండీ?!" భర్తతో అన్నది.

అన్నం తింటూ తలెత్తి చూశాడు మామగారు. ఆ కళ్ళల్లో మెరుపు, సన్నటి నవ్వులో గుర్తింపు.

గోడకానుకుని దూరంగా కూర్చున్న రంజనకు ఈ అనుభవమంతా తమాషాగా వుంది.

"అమ్మవారి కొలుపు లెత్తాలని, పుష్పగిరి స్వాముల్ని పిలిచి తిరిగి ప్రాణ ప్రతిష్ఠ చేయించాలని అయ్యకు ఆశమ్మా! ఊరందరికీ అన్నదానం చెయ్యాలిట... పదివేల ఖర్చు... పంటలు సరిగా లేవు. ఊరి మీద మమకారంతో ఏ ఊరు సంపాదనకూ ఆశపడలేదు. తృప్తిపడ్డాడు. ఇక్కడే బ్రతికాడు.... ఆ మా తల్లిని ఒక్క గడియ కూడా మర్చిపోలేదమ్మా!"

బత్తుల జాలమ్మ చెప్తోంది.

మెల్లిగా ఒడి విప్పి "అమ్మోయ్... పట్నం పిల్లవి. అమెరికా దానివి. వేసుకుంటావో లేదో కాని, కులం ఒప్పుకోకపోయినా కోడలివే నాకు... వేసుకుంటావా తల్లీ!" అన్నది.

"ఏమిటి?" ఇంతింత కళ్ళతో అడిగింది రంజన.

మెల్లిగా ఒణుకుతున్న చేతుల్తో సిగ్గుగా, బెరుగ్గా తీసింది పొట్లం ఒళ్ళోనించి.

గాజులు-ఎర్రటి మరకతపుపొడితో చేసినట్టున్న గాజులు. కళ్ళంబడి నీళ్ళు తిరిగాయి రంజనకు. అత్తగారు కొనుక్కోమన్న డైమండ్ గాజుల పక్కనే తొడుక్కుంది ఎర్రటిగాజులు. చెయ్యిపదిసార్లు గలగలలాడించి చూసుకుంది. చటుక్కున చేతులు ముద్దుపెట్టుకుని, మెటికలు విరిచి 'దృష్టి' తీసింది బత్తుల జాలమ్మ. ఆమె కళ్లలో తృప్తి, పెదవిలో ఒణుకు.

'తనను నేను ఏక్సెప్ట్ చేశానన్న తృప్తా ఇది?! ఆఖరికి మనిషికి ఏం కావాలి? ఆ కాస్త 'తను' అన్న గుర్తింపా?!'

మరొకసారి ఆలోచిస్తూ ఇల్లంతా తిరిగింది రంజన. అన్ని లక్షల మైళ్ళ దూరంలో వున్న అత్తగారి పలవరింపు ఆ ఇంట్లో ప్రతి అణువులోనూ ప్రతిధ్వనిస్తోంది.

'అందుకే ఆంటీ అంత తలుచుకునేవారు...' అనుకుంది.

గట్టిగా బిగించి వేసిన జడ, పూవుల ముడుపు, వెనక అద్దం, పెద్ద బొట్టు, నిష్కల్మషంగా నవ్వుతున్న కళ్ళు, కాళ్ళకడియాలు, పాంజేబు పట్టాలు... ఇవన్నీ అలంకరించిన చాలా పెద్దసైజున అత్తగారి ఫోటో వుంది పూజగదిలో ఇవతలి గోడకు. అడుగున వంకర టింకర అక్షరాల్తో కుంకుమ రంగుతో-

"నా సీతారావుమ్మ" అని రాసి వుంది.

కళ్ళనీళ్ళు తిరిగాయి రంజనకు.

మేరీ అబ్రహాం, వరల్డ్ బాంకు ఎంప్లాయి, చాలా ధనవంతురాలు, ఏం పోగొట్టుకున్నానని తన 50వ ఏట పలవరిస్తోందో అర్థమైంది రంజనకి.

❀ ❀ ❀

"ఒక యాభైవేలు మామగారి పేర బాంకులోకి ట్రాన్స్ఫర్ చేయించండి. పక్కన రెండెకరాల పొలం, మన పొలానికి కలిసేది బేరానికి వచ్చిందిట. ఆయన పేర రిజిస్టర్ చేయించండి. ఇల్లు కూలిపోతోంది... బాగుచేయించి, అమ్మవారికి కొలుపులు ఎత్తడానికి 'సరే' అనండి" భర్తతో మెల్లిగా మాటలు పేర్చి చెపుతోంది.

"ఛా! ఛా! ఎందుకు వేస్ట్? నువ్వు కూడా ఏమిటి రంజనా?! ఈ కూలిపోయే ఇల్లు ఇంకెలా బాగు చేయించగలరు!? మద్రాసులో ఫ్లాట్ కొనిపెడదాం కావాలంటే...

[illegible]- సు[illegible] [illegible]-"

"హూ! వేస్ట్... ఆ పదానికి అర్థం ఏమిటో తెలుసా మనకు? ఇండియా నుంచి గ్రనైట్ తెప్పించుకుని అక్కడ ఇల్లు కట్టించారు. అక్కడ మీకు మీ అమ్మగారి జ్ఞాపకాలున్నాయా? చిన్నప్పటి కలలున్నాయా? మీ నాన్న తాలూకు వ్యక్తిత్వపు నీడలు వున్నాయా? అవి ఎంత ఖరీదు?! ఎవరో ఊళ్లోవాళ్లు చూడ్డానికీ మెచ్చుకోడానికీ బ్రతికాం ఇన్నాళ్లూ..."

"అంటే?" అర్థం కానట్లు అన్నాడు రాఘవ.

"ఇదుగో... ఈ చేతి గాజుల ఖరీదు దాదాపు లక్ష రూపాయలు దాటింది. ఇది ఒట్టి అలంకారం... స్టేటస్ సింబల్. కానీ అందులో పదివేలు, జస్ట్ టెన్ థౌజండ్ ఈ కూలిపోతున్న జ్ఞాపకాల తీయదనం నిలబెట్టగలదు. నాన్నకు కావల్సింది ఇవ్వగలదు..."

"సరే, నీ ఇష్టం... పొలం కొనడం, ఇల్లు రిపేర్ చేయించడం నాకొక లెక్క కాదు. కానీ, అమ్మవారి కొలుపులనీ, అన్నదానాలు చేయించడమనీ వేస్ట్ చెయ్యద్దను... అర్థమైందా?" ఎటో చూస్తూ అన్నాడు రాఘవ. అతను ఎంత లౌక్యుడైపోయాడంటే, అతని మంచి ఆలోచనకు కూడా మరొకరి సపోర్టు కోరుకునేటంతటి బలహీనుడైపోయాడు. ..ప... 'ఇతడు బ్రతికేది ప్రాక్టికల్ మనుష్యులుండే అమెరికా కాబట్టి సరిపోయింది... ఇటువంటి వాతావరణంలో వందిమాగధుల మాట విని ఎన్ని వంకరదారులు తొక్కేవాడో కదా!' అనుకుంది రంజన.

ఇవన్నీ అక్కడ గమనించలేకపోయినా, ఇవ్వాళ నిజాయితీ వర్షిస్తున్న ఈ వాతావరణంలో స్పష్టంగా తెలుస్తోంది ఆమెకు. నవ్వొచ్చింది.

"మనమెవరం ఒద్దనడానికీ? దేవతకు, ఈ ఊరికీ, మన కుటుంబానికీ వుండే అనుబంధానికి మన డొనేషను ఇది – అంతే. ఊరు దాటిపోయిన ఈ దేవత తిరిగి ఎలాగూ రాలేదు... అమ్మవారికైనా ప్రాణప్రతిష్ఠ జరగనివ్వండి..." అత్తగారి ఫోటో చూస్తూ భోరుమంది రంజన.

"రంజనా! ఏయ్!... ఎందుకంత సెంటిమెంటల్ అయిపోతున్నావు? ఏమైంది నీకు?" దగ్గరగా వచ్చి కుదుపుతూ అన్నాడు రాఘవ...

తల్లి ఫోటో పక్కన చిన్నప్పుడు నల్లపూసలు, మామిడిపిందలు, సిగ్గుబిళ్ళ మొలతాడుతో ఒక చిన్న బాబు ఫోటో వుంది... రాఘవది... ఆ పక్కన శుభ్రంగా తుడిచిన ఉయ్యాల వుంది. అది అతను పసితనంలో ఊగింది...

"ఏమిస్తే మనకు జ్ఞాపకాలు దొరుకుతాయండీ?! ఆ ప్రపంచంలో ఎవరు మననుంచి ఏం ఆశించకుండా, కేవలం మన జ్ఞాపకాలతో బ్రతికేది? ఈ జన్మలో లౌక్య ప్రపంచంలో మొగవాడికి ఆడవాళ్ళ గుండెల్లో ఉప్పెనలు అర్థం కావండీ... అందుకే మాకు చాలా అర్థమౌతాయి..."

కన్నీళ్లు తుడుచుకుంటూ అన్నది రంజన.

"ఆయనకు తప్పకుండా ఏం కావాలో చూసిరా... ప్లీజ్..." అక్కడెక్కడో కొన్ని మైళ్ల దూరంలో వున్న మేరీ అబ్రహాం రూపు మార్చుకుని ఫోటోలో నించి వేడుకొంటున్నట్లనిపించింది రంజనకు.

"ఓకే. డన్... నీ ఇష్టం... ఎమోషను అవకు... అందరూ చూస్తారు... కమాన్, అదుగో ఎవరో వచ్చారు" అంటూ హడావిడిగా జుట్టు సర్దుకుంటూ బైటి వాకిలివైపుకు వెళ్లాడు రాఘవ.

"అమ్మాయ్!"

ఆ పిలుపులో లక్ష అర్థాలు వినిపించాయి. తలెత్తి చూసింది.

మామగారు... గుమ్మానికి ఆనుకుని చూస్తున్నాడు...

"అక్షరాలంటే నాకు అసహ్యం... చదువిచ్చిన నాగరికతే నా భార్యను నాకు దూరం చేసింది అని నేను భ్రమపడేవాణ్ణి... అందుకే నీ మొగుణ్ణి కూడా చదివించలేదు... కానీ ఇప్పుడు అర్థమైంది... నువ్వు నిజంగా చదువుకున్నదానివి తల్లీ! చిన్నదానివి, నా బిడ్డవు... నీకు నమస్కరించాలనిపిస్తోంది. కానీ... చెయ్యను - ఆయుః క్షీణం..."

గావంచాతో కళ్లు ఒత్తుకుంటున్నాడు ఆజానుబాహువూ, పౌరుషవంతుడు, ఆరడుగుల అరవిందదళాయతాక్షుడు అయిన ఆ పల్లెటూరి కామందు...

ఆ ఇద్దరి మధ్యా ఏర్పడిన అద్భుతమైన నిశ్శబ్దం వాతావరణంలో పార్టికల్స్‌ను చార్జ్ చేసి ఆమెకు ఆయన పాత జీవితాన్ని సినిమాలా చూపిస్తోంది. ఎంత ప్రేమించాడామెను? ఎంత దుఃఖం ఆ గుండెలో దాచుకుని తడిలేని ఎడారిలా కనబడుతున్నారు?!

"అమ్మా!"

తత్తరపాటుపడి "ఆ!" అంది ఆ పిలుపులోని మాధుర్యానికి ...

"సీతారావుమ్మ బావుందా?"

ఒక్కసారిగా ఏదో కరుడుగట్టిన స్తబ్దత. గుండెల్లో గూడుకట్టుకున్న నిరాశ ఫటేలున పేలిపోయినట్లైంది. తత్తరపాటుతో-

"ఆ! మీకు నమస్కారాలు చెప్పమన్నారు..." ఒంగి ఆయన కాళ్లకు నమస్కరిస్తూ అన్నది రంజన.

ఆయన కన్నీరు, ఆమె కన్నీరు... జాలువారి, మనసు ముంగిట్లో ముత్యాలుగా, ఆ ఇంటి జ్ఞాపకాలై నిలిచిపోతాయా? ఏమో!...

కాలమే చెప్పాలి మరి.

*('ఆంధ్రజ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక, 1991)*

# సూర్యోదయం

"మీ కథ చాలా బావుంది....కానీ ముగింపే...."మొహమాటంగా అన్నాడు సూర్యం.

"ఏమిటట ముగింపుకు?" అమాయకంగా అడిగింది ఆ పిల్ల. చుడీదార్‌లో పెద్ద పెద్ద బెంగాలీ రింగులతో ఎదురుగా కూర్చుని కళ్లల్లోకి సూటిగా చూస్తూ మాట్లాడుతున్న ఆ పిల్లకు సమాధానం చెప్పడం కొంచెం ఇబ్బందిగానే ఉంది సూర్యానికి.

మామూలు... పరిస్థితుల్లో అయితే, చాలా నిర్మొహమాటంగా చెప్పగలడు.

కానీ, ఆ పత్రిక పెట్టిన బాస్ అంతకు ముందు సాయంత్రం పిలిచి,

"ఇదుగో చూడూ! రేపు ఒక పిల్ల ఏవో కథలు తీసుకువస్తుంది.... నీ మామూలు స్టైల్‌లో బెదిరించక, ఏదో ఒకటి దిద్ది వేసేయ్.... అట్లా చూడకు.... ఆ పిల్ల నా స్నేహితుడి కూతురు.... పేరు చంద్రిక. ఒకప్పుడు గొప్ప జర్నలిస్టు నైపోవాలని మద్రాసు వచ్చి, పాంన్ బజారు తురాయి చెట్ల కింద ఒ న్ బైటూ కాఫీ కూడా దొరకని రోజుల్లో ఈ పిల్ల తండ్రే ప్రెస్‌కొనిపెట్టి, నన్ను నిలబెట్టి మనిషిని చేశాడు.... అర్థమైందా!!" అన్నాడు.

బాస్‌కు ఎలా సూర్యాన్ని మాట్లాడించకుండా చెయ్యాలో తెలుసు. పైగా, ప్రపంచంలో ఎక్కడా ఇమడని సూర్యం అక్కడ పనిచేస్తున్నాడంటే, కారణం కేవలం బాస్ కనబడని అభిమానం, ఆత్మగౌరవాన్ని గౌరవించడం.

"ఏమిటండీ? మాట్లాడరేం? ఆ పిల్ల మళ్లీ రెట్టించింది. "అది కాదు - ఆ ముగింపులో మీ ఉద్దేశ్యం?"

"నా ఉద్దేశ్యం ఏమిటీ అన్నది కాదు. మీరు ఆ ముగింపు "ఒద్దు" అనడంలో మీ ఉద్దేశ్యం ఏమిటి? అని...."

నిశ్శబ్దంగా చూశాడు ఆ పిల్లను...ఏమిటీ అమ్మాయి అసలు....చూడటానికి హాయిగా, ఆర్టిఫిషియాలిటీ, తెచ్చిపెట్టుకున్న మానర్స్ అవీ లేకుండా ఉంది. కానీ, ఈ కథల జబ్బేమిటని?!

"చెప్పండీ?" రెట్టించింది ఆ అమ్మాయి.

టేబిల్ మీద పెన్సిలు వేళ్లమధ్య అటూ ఇటూ తిప్పుతూ "ఒక అమ్మాయి. ఒక అబ్బాయిని చాలా అద్భుతమైన వ్యక్తిగా ఊహించుకుని, అతనికి విపరీతమైన శక్తులన్నీ ఆపాదించి, అతను నేను సామాన్యుణ్ణి మొర్రో అంటున్నా 'కాదు, నువ్వు అసామాన్యుడివి అని అడ్డమైన ప్రత్యేకతలు ఆపాదించి, అతను అతి మామూలుగా

కాలగర్భంలో కలిసిపోతే.... అతడి కోసరం నది ఒడ్డున పిచ్చిదాన్లా 'ఓనా ప్రభూ తిరిగిరావా?' అని అరుస్తూ తిరుగుతోందని రాశారు కదా.... క్షమించండి మేడం.... ఇదేదో సూపర్‌నాచురల్ ఫిక్షన్ సినిమా ముగింపులా లేదూ?!"

ఆ ధాటికి బిత్తరపోయిందేమో, రెండు క్షణాలు మాట్లాడలేదు ఆమె.

మెల్లిగా, "అయితే మీకు నా కథ అలా అర్థమైందన్న మాట?!" అన్నది అమాయకంగా మోహంపెట్టి.

ఫకాలున నవ్వేశాడు సూర్యం ఆవిడ భంగిమకు.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"నవ్వకేం చెయ్యమంటారు? ప్రతి రచయితా తాను ఊహించుకుని రచించినవన్నీ సీన్లతో సహా ఎదటివాళ్లకు తను అనుకున్నట్లు అనువాదమై పోతుందనుకుంటాడు. అందుకే దెబ్బతింటూ ఉంటాడు."

"అంటే?" ఎర్ఱగా చూస్తూ అన్నది ఆ అమ్మాయి

"అంటే..." కాలరు సర్దుకుని మరొకసారి తను చెప్పదలుచుకున్న చెప్పాలన్నదీ ప్రయత్నంలో వున్నాడు సూర్యం.

"అంటే...నాకు మీరు చెప్పినదాన్లో ఒక్క ముక్కా అర్థం కాలేదు అని అర్థం. మీరు నా కథ వేసుక్కోరని అర్థం. అసలు మీకు--మీకు మాబోటి కొత్త రైటర్లమీద సింపతీ లేదని అర్థం..."

"రామరామ.. ఇదెక్కడ పాపఖర్మ.. అదికాదండీ!"

"అక్కర్లేదు. నా కథ అసలు మీరు వెయ్యక్కర్లేదు.. వస్తాను.."

రపీమని స్ప్రింగ్ వోలే వేడిమెరుపుతీగలా వెళ్లిపోయింది ఆ అమ్మాయి.

ఆలోచించే లోపలే ఫోను మోగింది.

"చంద్రిక వెళ్లిపోయిందా?"

"ఆఁ! అదికాదు బాస్... ఆ అమ్మాయి చాలా కోపంగా..." ఎప్పుడూ ముక్కుకు సూటిగా ఫట్‌మని సమాధానం చెప్పే సూర్యం, చాలా రోజుల తరవాత మాట తడబడ్డాడు.

"ఆ కథ వేస్తానని చెప్పావా?"

ఏం చెప్తాడు?!

"తప్పకుండా వేద్దాం సార్... ఫరవాలేదు లెండి. ఏవో చిన్న చిన్న మార్పులు... చేద్దాంలెండి."

"మన పత్రికలో ప్రతి కథా అత్యుత్తమమైనదే వేస్తున్నాము నువ్వు దిద్దివేసెయ్యవోయ్.."

అదేగా తనూ అన్నాడు...అయినా అవే మాటలు అజ్ఞగా ఆయన చెప్పడం బాస్ లక్షణం. పైగా కథల క్వాలిటీ మీద చురక..

నవ్వుకుంటూ, ఆ కథవంక చూస్తూ ఆలోచిస్తూ ఉండిపోయాడు సూర్యం.

"వెన్నెల" అనే ఆ పత్రిక ఆ కథ ప్రచురించింది. కానీ, అంతటితో ఆ కథా ప్రహసనం ముగిసిపోలేదు.

మరొకసారి తుఫానులాగా వచ్చింది చంద్రిక.

"ఏమిటండీ మీ ఉద్దేశ్యం? ఎందుకూ ఆ కథను మార్చారు? అవతలి వ్యక్తి ఆ అమ్మాయిని విపరీతంగా ఆరాధించినట్లు, అందుకే ఆ పిల్ల పిచ్చిదైపోయినట్లు... ఇది అవసరమా?! ఏమిటా ముగింపు?!" దబాయిస్తూ అడిగింది.

"శాంతించండి మేడం! ఇదుగో కూల్‌డ్రింక్ తాగండి. ఆc! ఏమిటి అడిగారు? ముగింపు ఎందుకలా మార్చాను అనా?! మీ హీరోయిన్ ప్రేమలో అంత ఇన్టెన్సిటీ--" చాలా సిన్సియారిటీ నటిస్తూ మాట్లాడుతున్నాడు కానీ... అతని వ్యంగ్యానికి అతనికే నవ్వు వస్తోంది.

"ప్రేమ కాదు ఆరాధన.." చెప్పింది ఆ పిల్ల అస్సలు ఏం గ్రహించుకోనట్లు.

"ఓహ్! సారీ.... ఆరాధన.... అంత ఇన్టెన్సిటీ ఉండాలంటే అవతలి వ్యక్తిలో ఆ మాత్రపు కదలిక, వైబ్రేషన్... అవన్నీ ఉండాలిగా మాడం"

(పొరపాటున ఆ మాటలు అన్నందుకు అవే హెడ్డింగులుగా కథలు రాసేయ్యగలదని తెలిసి తరవాత చింతించవలసి వచ్చింది సూర్యం.)

"అట్లాంటివన్నీ ఉండాలని ఏం లేదండీ! అయినా అది నా కథ--"

నిజమే...ఇదుగో చూడండి మీ కథ మెచ్చుకుంటూ ఎన్ని ఉత్తరాలు వచ్చాయో..." ఆమెను మాటతప్పిస్తూ అన్నాడు సూర్యం.

అవి చూస్తూ మౌనంగా ఉండిపోయింది చంద్రిక.

బాస్‌లు ఉండచ్చు. వాళ్లకు ఉదారులైన స్నేహితులుండచ్చు. వాళ్లకు అందమైన కూతుళ్లుండడం వల్ల పెద్ద ప్రమాదం లేదు. కానీ ఇలా కథలు రాసి ఇబ్బంది పెట్టకుండా ఉంటే బావుణ్ణు. బాపూ రమణలు సృష్టించిన ఈ "బాస్ కుట్టి" బాధ ఎంత నిజం?! పైగా, తన టెంపర్‌మెంటుకు అస్సలుపడదు ఇదంతా!

ఈ అమ్మాయయితే మామూలుగా ఏ హైక్లాస్ ఫంక్షన్‌లోనో కనబడ్డా కనీసం పలకరించడం, మాట్లాడ్డం కష్టం. కానీ, కథల మోజు పాపం, ఈ పిల్ల తన టేబిల్ దగ్గరకు వచ్చింది. అన్నీ బావున్నాయి కానీ, ఈ కథలు రాసే పిచ్చేమిటని?!

"మీకు మరొక కథ ఇద్దామనుకుంటున్నాను...." చాలా గంభీరంగా అన్నది ఆ పిల్ల

"హతోస్మి..." అనుకోకుండా ఆ మాట బైటికి అనేశాడు సూర్యం.

సీరియస్‌గా చూసింది ఆ పిల్ల.

"ఏం?" తల ఎగరేస్తూ అడిగింది.

ఏంలేదు. ఈ కథ నేను మార్చిరాయకుండా, అలాగే పబ్లిష్ చేసిఉంటే... ఇన్ని పొగడ్తలు రాకుండా ఉండి ఉంటే... మాకూ, మా పత్రికకు మళ్లీ ఈ ప్రమాదం తప్పేది కదా అని..."

"అంతేనా, ఏమండీ?! నేను బాగా రాయలేనంటారా?!"

ఏం మాట్లాడతాడు ఆ పిల్లతో?!

ఈసారి కథనిండా ఏదో భయంకరమైన తత్వవిచారణ ఉన్నది.

"ఈ గోలేమిటండీ? అయినా, మీకు ఇదేం బుద్ధి?!"

"ఏం. మీకు అర్థం కావడం లేదా?!" జ్ఞానిలా, జాలిగా నవ్వింది ఆ పిల్ల.

ఒళ్లు మండిపోయింది సూర్యానికి.

"ఖర్మ..." నుదురు కొట్టుకుంటూ అన్నాడు.

"అర్థం, అనర్థం... అది కాదు ప్రశ్న..ఆ అమ్మాయి దిక్కులేని పరిస్థితుల్లో వేశ్యా వృత్తికి దిగిందని నమ్మిద్దామని ప్రయత్నించారు సరే... మరి ఈ తత్వజిజ్ఞాస బోధేమిటి వచ్చిన వ్యక్తికల్లా...."

ఎక్కడ మర్యాద తప్పిన మాటలు వచ్చేస్తాయోనని అతను భయపడుతున్నాడు.

"ఏం? ఆవిడ వృత్తి అదైనంత మాత్రాన, ఆమెకు తత్వజ్ఞానం తెలియకూడదా?! అసలు ఆవిడకే ఎక్కువ తెలుస్తుందేమో...."

ఏడిచినట్లుంది పరిశోధన.. కచ్చపుట్టింది సూర్యానికి.

"మహాతల్లీ! మరొక మంచి పని చెయ్యండి. కథలకు థీం మేం ఇస్తాం.. మీరు మహా రచయిత్రి అవ్వాలనుకుంటే, వాటితో కథలు రాయండి..."

"అయితే, నా శిల్పం బావుందన్నమాట!..." తల ఎగరేస్తూ అన్నది.

"బావున్నది అనడంకన్న థీం కొంతనయం"

"మరి భాష?"

"భాషా?! మీరు ఏనాడో వత్తులపెట్టి మర్చిపోయారు.. మీకు మళ్లీ వత్తులు, పొల్లులు, ఉభయాక్షరాలు వగైరా నేర్పాలి...."

ఏమాత్రం కోపం తెచ్చుకోలేదు ఆ పిల్ల. పైగా-

"సో... శిల్పం, భాషకన్న థీం నయం అంటారు. అయితే నేను మీకు థీం ఇస్తాను. మీరు కథ రాయండి... ప్రస్తుతానికి ఈ కథ వేసెయ్యండి..తరవాత చూద్దాం.."

చచ్చినట్లు ఆ కథ మొదటినుంచీ చివరివరకు, దిద్దిమరీ వేశాడు సూర్యం.

చాలా మంచి ఉత్తరాలు వచ్చాయి. ఒకరిద్దరు మంచిరచయిత. దగ్గరనుంచి ఆశీర్వచనాలు వచ్చాయి.

ఒకరోజు స్క్రిప్ట్‌లో ఒక కొటేషన్ కనిపించింది.

"నిశ్శబ్దంలోకి పారిపోతున్నాను.. నేను నీనుంచి.. నీలోకి " అనే వాక్యం చూసి ఉలిక్కిపడ్డాడు. ఏవేవో జ్ఞాపకాలు..

"ఏమండీ! ఈ వాక్యం మీ సొంతమా?" అనుమానంగా అడిగాడు చంద్రికను.

అతణ్ణి ఓరగా చూసి, "పోనీ, మీ సొంతమా?" అని అడిగి వెళ్లిపోయింది.

ఇలా కథల ప్రహసనం జరుగుతూపోతే, చెప్పేందుకు పెద్ద ఏముంటుంది కానీ, ఒక పది మంచి కథలు అన్నపేరు వచ్చినతరవాత.

ఒక భయంకరమైన, సంచలనాత్మక, సందేశాత్మక విషయం జరిగింది సూర్యం జీవితంలో.

"కంగ్రాట్స్" అంటూ ఫోన్లు వచ్చాయి.

"ఈ కథలన్నీ ఎడిటర్ సూర్యంగారివే.... వారే చంద్రిక పేరుతో రాశారు. అనవసరంగా ఈ గౌరవం నాకు దక్కింది.." అని ఒక ప్రముఖ డైలీలో ఇన్‌టర్వ్యూ ఇచ్చి కూర్చుంది చంద్రిక.

"దిక్కుమాలిన పరిస్థితిలో ఇరుక్కుపోయాను" అని వాపోయాడు సూర్యం.. పైగా అతణ్ణి ఎవరూ నమ్మడంలేదు. "నువ్వు కథలు రాయడం మానేసి, పెద్ద సినిక్‌వైపోయావు ఈమధ్య. కానీ, లేకపోతే మీ శైలి, శిల్పం మాకు తెలియనివా?" అంటున్నారు సాహిత్యమిత్రులు.

"ఛస్తే ఇంత బుద్ధితక్కువ కథలు నేను రాయనుగాక రాయను.." అని గట్టిగా అరుద్దామన్నా, నమ్మేవాళ్లు లేరు. అతని పరిస్థితి అతనికే అగమ్యగోచరమైపోయింది.

పైగా, "నువ్వే మా చంద్రిక పేరు మీద కథలు రాస్తున్నావని నాకు మాటవరసకైనా చెప్పలేదేమయ్యా?! ఇంకేం....మంచి సీరియల్ రాసియ్యి.. స్టాఫ్ అని పేమెంటు ఇవ్వకుండా ఉండనులే...." బాస్ జోకులు.

❀ ❀ ❀

టెన్షన్ భరించలేక, నేరుగా చంద్రిక ఇంటికి వెళ్లాడు సూర్యం.

"ఏమిటీగోల అంతా? అసలు మీ ఉద్దేశ్యం ఏమిటి?! ఏనాడో రాయడం మానుకున్నాను నేను. ఈ ప్రారబ్ధం ఏమిటి నాకు?!" ఏమాత్రం మొహమాటం లేకుండా అడిగేశాడు.

క్రోటన్స్ మీద ఎండ పడుతూంటే దానివంకే సీరియస్‌గా చూస్తున్నట్లు మాట్లాడలేదు చంద్రిక.

మండిపోయింది, అప్పటికే బలవంతాన రెండోసారి కాఫీ తాగిన సూర్యానికి.

"మాట్లాడరేమిటండీ?"

"అసలు మీరు కథలెందుకు రాయరు సూర్యంగారూ?"

"నేనా..నాకు జర్నలిజం అంటే ఇష్టం. అదీకాక కథ రాయాలంటే ఒక ప్రత్యేకమైన పద్ధతి, కథనం - ఇవన్నీ ఉండాలని నా ఉద్దేశ్యం. అడ్డమైనవాళ్లూ కథలు రాసెయ్యకూడదుగా...." కావాలనే కసిగా అన్నాడు.

"వీటన్నింటికన్న మీకు ఈగో ప్రాబ్లం. నా అంతటివాడు కథ రాస్తే, బాగా లేదంటారేమోనని.."

"అది కూడా అయ్యుండచ్చు.." విసుగుపుట్టి ఒప్పుకున్నాడు సూర్యం, ఇంతకీ ఏమంటావు తల్లీ! అనుకుంటూ.

"మరి ఇప్పుడు ఈ కథలన్నీ..."

"మళ్ళీ అదేమాట అంటారు. ఈ కథలు నావా?!"

"ఆఁ - మీవే..."

"ఏమిటి మీరనేది?"

"ఇప్పుడే వస్తాను.." లోపలికి వెళ్లి ఒక ఎఱ్ఱటి డైరీ తెచ్చింది చంద్రిక.

"ఇది మీదేనా?" అడిగింది.

"ఇదా.. ఇది.. అరె.. ఇది మీకెలా?.. చాలా రోజులక్రితం ఇది పారేసుకున్నాను."

"ఎక్కడ?" సూటిగా చూస్తూ అడిగింది చంద్రిక.

"జ్ఞాపకం లేదు" ఆలోచిస్తూ అన్నాడు సూర్యం.

అతనివంకే కన్నార్పకుండా చూస్తోంది ఆమె.

ఆ ఖరీదైన భవనంలో ఆమె ఒక అలంకారంలా ఉన్నది.

ఆమె ఎఱ్ఱటి గోళ్లరంగులో తెల్లటి పాదం వంక, ఎనామిల్ చేసిన పట్టాలవంక, ఆమె పాదాల క్రింద కార్పెట్‌వంక, ఆ కార్పెట్ కింద పాలరాతి వంక, చల్లటి ఇన్‌డోర్ ప్లాంట్స్ వంక మార్చి మార్చి చూస్తున్నాడు సూర్యం.

అతను ఇప్పుడు ఈ మనిషి గురించి ఆలోచిస్తున్నాడు. ఆమధ్యకాలంలో అతను ఆలోచించదగ్గ మనుష్యులే లేరని ఎప్పుడో నిర్ణయానికి వచ్చేశాడు మరి.

"అసలు ఈ డైరీ----" టేబిల్‌మీదనుంచి తీసుకుని మెల్లిగా తెరిచాడు.

ఏవేవో పిచ్చి పిచ్చి కవిత్వాలు, రాతలు. ప్రతి విషయం అప్పుడొక ఇన్స్‌పిరేషన్.. పక్కింటి అయ్యంగారి అమ్మాయి, బీచ్ ఒడ్డున మత్స్యగంధి. పార్థసారధి గుడి దగ్గర కదంబాలు అమ్మే ముక్కు బేసరి పిల్ల. చీకట్లో నీడలచాటున శరీరాన్ని ఖరీదుకు పెట్టిన బి.ఎ. ఫిలాసఫీ అమ్మాయి, ఇలా ఎన్నో ఎన్నెన్నో..ఆలోచనల అలలు.. అవి ఇచ్చిన కలలు.. ఒకటనేమిటి?!

ఆ రాతలు అతనికే నవ్వు తెప్పిస్తున్నాయి. ఎంత కవిత్వం? అందులో ఎంత విభ్రాంతి? జీవితంపట్ల ఎంత నమ్మకం? ఎంత అర్థం కాని అమాయకత్వం?!

ఆ తరవాత జీవితంలో నీ దగ్గర ఏముంది తాకట్టుకు? అంటూ ఆత్మగౌరవం దగ్గర నుంచి ఖరీదు కట్టే మనుష్యుల్ని చూసి నలిగిపోయాడు అతను మానసికంగా..

"అయినా.. ఈ డైరీ మీ దగ్గరకు ఎలా---"

ముందు అవన్నీ ఈ పిల్ల చదివిందంటేనే భయంగా ఉన్నది సూర్యానికి.

"ఇది రెండు సంవత్సరాల క్రితం కాన్సర్ ఇన్స్టిట్యూట్‌లో వదలిపెట్టారు గుర్తొచ్చిందా?" మీ ఫ్రెండ్‌ను చెకప్‌కు తీసుకువచ్చారు.

"అవును.. జ్ఞాపకం లేదు.. మరి మీకు ఎలా..."

"దొరికింది.."

"అదే.. ఎలా అని?"

"ఆ రోజు చెకింగ్‌కు నేనూ వచ్చాను కాబట్టి.. మీకు వెనక వరసలో ఉన్నాను కాఒ

"ఓహో.. అదా సంగతి-- అయినా అడ్రస్ ఉన్నదిగా.. పోస్ట్ చేసెయ్యక పోయారా?!"

"ముందు అలా చేద్దామనే అనిపించింది..కానీ.."

"కానీ, అది పెద్దమనిషి తరహా ఉన్నవాళ్ల లక్షణం.. అది మనకేదీ?! ఎదటివాళ్లను వీలైనంత ఇబ్బందుల్లో పడెయ్యడం తప్ప.." కావాలనే ఎద్దేవాగా అన్నాడు.

నవ్వేసింది చంద్రిక.

"ఆ డైరీ చదివాను.. అందులో నాకు అక్షరాలతో అనువాదం చెయ్యబడ్డ ఒక గొప్పవ్యక్తి మూర్తీభవించి కనబడ్డారు. ఆశ్చర్యపోయాను ఆ ఆర్ద్రతకు, ఆ కవిత్వానికి..." సున్నితంగా చెపుతోంది ఆ పిల్ల.

"ఏడిసినట్లుంది. ఎవరూ చూడరనుకుంటూ చాలామంది చాలా గొప్పగా రాసుకుంటారు డైరీల్లో. మీ అదృష్టం బావుంది. అవాకులూ, చవాకులూ రాశాను కాదు" లైట్‌గా అన్నాడు సూర్యం.

సీరియస్‌గా చూస్తూ అన్నది చంద్రిక:

"మీరు చెత్త రాయలేరు సూర్యం! రాయడం చాతకాదు మీకు. మీరు బ్రతుకు తెరువు కోసం, ప్రపంచం కోసం మూర్ఖత్వం నటించచ్చు. కానీ మీలోపల ఒక గొప్ప వ్యక్తి ఉన్నాడు. ఆదివారాలు అనాథ పిల్లలతో కలసిపోయే మంచి బాలుడు ఉన్నాడు. ఫ్రీ స్కూలు నడుపుతున్న జ్ఞాని ఉన్నాడు. ప్రపంచం నాకేమీ ఇవ్వకపోయినా సరే, నాకు తోచింది నేను చేస్తాననే కర్మజీవి ఉన్నాడు. కవి ఉన్నాడు. రచయిత ఉన్నాడు.

"అయ్యబాబోయ్.. ఇవన్నీ నేనే?! చంద్రికగారూ.. మీకు నేనేం ద్రోహం చేశానండీ ఇన్ని రకాలుగా నామీద కక్షతీర్చుకుంటున్నారు--"

"మీరు ఒప్పుకోలేరు. నాకు తెలుసు, మీ డైరీ నాకు మీ గురించి చాలా చాలా చెప్పింది. నాకు ఈ వ్యక్తి ఎవరా? అని కుతూహలం పెరిగింది. మీ గురించి కూలంకషంగా ఎన్‌క్వైరీ చేశాను. ఆ తరవాతే నా కథలతో మీ టేబిల్ దగ్గర ప్రత్యక్షమయ్యాను."

"మా బాస్ రికమెండేషన్‌తో... ఒప్పుకోండి ముందు. అలా కాకపోయినట్లైతే నాకీ ప్రమాదాలన్నీ తప్పేవి---"

"పోనీ, అంతే అనుకోండి-- కానీ, నా ఏ(బర్డ్ అంతా చెత్త అని తిట్టేవారే. కానీ, ప్రతి థీం మీదే సూర్యం. మీరు రాసిన ప్రతి కథా మీదే."

ఆ అమ్మాయి గొంతులో ఏవో మంచుకొండల్ని కరిగించే ఆప్యాయతల వెచ్చదనం.

ఉక్కిరిబిక్కిరి అయ్యాడు సూర్యం.

అతనికి గుండె గొంతులోన కొట్లాడ్డం అంటే ఏమిటో అర్థమౌతోంది. ఇంక అక్కడే ఉంటే అనవసరంగా ఏం మాట్లాడతానో అని భయపడ్డాడు.

"చాలా చాలా థ్యాంక్స్ అండీ--- ఇలా చెప్పాలని లేకపోయినా తప్పదుమరి. నన్ను--నన్ను రచయితగా ప్రపంచానికి అనవసరంగా డిక్లేర్ చేశారు. చచ్చినట్లు అలా బ్రతక్క తప్పదు. ఇది తియ్యటి శాపం--" ఇంక ఏమైపోతానో ఏమిటో-- కావాలనే అల్లరిగా అంటూ లేచి నిలబడ్డాడు సూర్యం.

"నమస్కారం--వెళ్లిరండి--"

"అదేమిటి--మళ్లీ రమ్మంటున్నారు?! రావచ్చా?"

తెచ్చిపెట్టుకున్న అమాయకత్వంతో అడిగాడు.

"మళ్లీనా -- రండి -- నేను ఉంటే --" నవ్వుతూ అన్నది చంద్రిక. సందుమలుపు తిరిగేదాకా చెయ్యి ఊపుతూనే ఉన్నది.

❀ ❀ ❀

"సూర్యం.. తొందరగా బయలుదేరు."

బలవంతంగా కారులో కూర్చోపెట్టాడు సూర్యాన్ని బాస్. ఎక్కడికో అర్థం కాలేదు అతనికి.

హాస్పిటల్ ముందు ఆగింది కారు.

"చంద్రికకు చాలా సీరియస్‌గా ఉంది.." చెపుతూనే ఎ.సి. రూంలోకి అడుగుపెట్టాడు ఆయన.

"అదేవిటండీ?" అంటూనే లోపలికి వెళ్లాడు సూర్యం. రకరకాల ట్యూబులు, ఆక్సిజన్ సిలెండరు.

ఆమె స్పృహలో లేదు.

మౌనంగా పది నిమిషాలు నిలబడి బైటకు వచ్చేశారు ఇద్దరూ.

"ఏమిటి బాస్?" అయోమయంగా అన్నాడు సూర్యం. "ఆ పిల్లకు కేన్సరు అడ్వాన్స్ స్టేజి -- ఎక్కువ కాలం బ్రతకదు.. రోజులు.. అంతే...

"బాస్.." గట్టిగా అన్నాడు సూర్యం.

ఆ పిల్ల కాన్సర్ ఇన్స్టిట్యూట్, చెకింగ్ అన్నది ఆ రోజు. తను అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదు. లేకపోతే తన భాషలో చెప్పాలంటే, అంత సౌందర్య సౌజన్యమూర్తి గురించిన ఆ చేదు నిజం సబ్‌కాన్షియస్ రిజిస్టర్ చెయ్యడానికి ఎదురు తిరిగి ఉంటుంది.

అతణ్ణి దుఃఖాన్ని మించిన ఏదో భయంకరమైన స్థితి ఆవరించింది. అర్థం కానంత వేగంగా అతని పెన్ను నర్తిస్తోంది.

"చంద్రికా--"

ఆ మర్నాడు వెళ్లాడు.

తలతిప్పి, అతణ్ణి చూసి నవ్వింది. నీరసంగా ఉన్నది కానీ, ట్యూబులు, డాక్టర్ల హడావిడి లేదు ఆ రోజు.

"ఇదుగో---"

"చంద్రోదయం--" అన్న మకుటంతో అతని కవిత్వం. తన స్నేహితురాలు, శ్రేయోభిలాషిని అయిన ఆ యువతి కోసం అతని దుఃఖం అంతా అక్షరమాలికగా మారింది.

చదివింది ఆమె--కళ్ళల్లో నీరు తిరిగాయి.

"అద్భుతంగా ఉన్నది కవిత్వం. కానీ, ఎడిటరుగారూ! మకుటం మార్చాలండీ! ఇది చంద్రికాస్తమయం.. ఇంక చంద్రికకు ఉదయమేమిటి.. ఇలా ఇవ్వండి పెన్ను.. ఇది సూర్యోదయం.." తనే రాస్తూ అన్నది.

"చంద్రికా.." అతని పెదవుల మీద వినబడని మాటలు భావాలుగా ఆమెను తాకుతున్నాయి.

అర్థమైంది ఆమె జీవశక్తి కోల్పోతున్న కళ్లకు.

❀ ❀ ❀

సముద్రపు ఇసుక.. అలల వంక చూస్తూ అతను.

"నేస్తం.. ఎక్కడున్నావు? తిరిగిరా! చంద్రోదయంగా రా! వెన్నెలగా మారిపోయావా?! నా పిలుపు నీకు వినబడటం లేదా?!.." అంటూ అలలపైన చందమామను చూస్తూ అడుగులు వేస్తూ తిరుగుతున్నాడు ఆ వ్యక్తి..

"ఇల్లాంటి ముగింపు మీ భాషలో చెప్పాలంటే చాలా కృతకంగా లేదూ ఎడిటర్‌గారూ!..."

పాలవెన్నెల సముద్రం మీద నుంచి ఫకాలున నవ్వుతూ అడిగినట్లనిపించిం దతనికి.

ఏమంటాడు అతను?!

*("ఆంధ్రజ్యోతి" దీపావళి సంచిక - నవంబరు, 1993)*

# ఉపాసన

"ఊర్ధ్వ మూల మధః శాఖమ్"

ఆ కంఠ మాధుర్యం అది.

గబగబ పూజ ముగించి, "మంత్రహీనం... క్రియాహీనం అని చెబుతూ అక్షింతలు, నీళ్లు వదిలారు ఆ పెద్దాయన.

అన్నీ అమెండ్‌మెంట్సే... పూజలో కూడా... అని" మనస్సు నవ్వింది. పట్టు పంచతోనే గేటు దగ్గరకు పరుగు లాంటి నడకతో వచ్చాడు.

ఫలకం మీద బంగారు రంగుతో ఆర్. వెంకట్రమణన్" - తెల్లటి పాలరాతి అక్షరాలు.

ఆయన చీఫ్ జడ్జి. అమ్మా, నాన్న పెట్టిన పేరు వెంకటరమణ మూర్తి. కానీ, పదవుల్లో పైపైకి పోవాలంటే, పై అధికారంలో ఉన్న దక్షిణాత్యులను సంతోషింప చెయ్యాలంటే, నేను మీ "మంద మనిషినే" అని గుర్తు చెయ్యడానికా ఉన్నట్లు పేరు మార్చుకున్నాడు.

అడిగినవారికి సంజాయిషీకి "న్యూమరాలజీ" అడ్డంపెట్టుకున్నాడు.

కంటికి చెయ్యి అడ్డం పెట్టుకుని, తూరుపు దిక్కుకు చూశాడు వెలుతురులో వెతుక్కుంటూ.

భగవద్గీత శ్లోకం చెప్పుకుంటూ దగ్గరగా వచ్చాడు ఆయన చూడాలనుకుంటున్న వ్యక్తి.

రెండు చేతులూ పైకెత్తి ఆకాశం వంక చూస్తూ, సుస్పష్టమైన ఉచ్చారణతో, సుస్వరంతో శ్లోకం చదువుతున్న ఆ వ్యక్తిని దగ్గరకు రానిచ్చి తేరిపార చూశాడు వెంకట్రమణయ్య. ఆజానుబాహువు, చక్కటి వర్చస్సు, మంచి ముఖ కవళికలు, చారెడు కళ్లు... తెల్లటి పంచ, పైన ఉత్తరీయం, చేతికి వేళ్లాడుతున్న సంచీ.

"నమస్కారం..." అప్రయత్నంగా అన్నాడు వెంకట్రమణయ్య, అవతలి వ్యక్తి చిన్న వాడని మనకు చెపుతున్నా.

ప్రతి నమస్కారం చేసి చిరునవ్వు నవ్వాడతను. అతని వంకే చూస్తున్నాడు ఆయన. ఆయన రిటైర్ అయి, ఈ ఇంటికి మారిన వారం రోజులుగా ఈ మనిషి, ఈ సుస్వరం ఎవరిదా? అన్న జిజ్ఞాసలో ఇవ్వాల్టికి పట్టుకోగలిగాడు అతణ్ణి.

"మీకేం కావాలి?" మెల్లగా అడిగాడు అతను.

ఆ మాటతో 'మీకు పని లేకపోతే, నా దారికి అడ్డు తొలిగితే, నేను వెళ్లిపోతాను' - అన్న ధ్వని ఉన్నది.

కానీ, వెంకట్రమణయ్యకు మాత్రం "ఏం కోరుకుంటున్నావు నువ్వు?" అని వరాలిచ్చే దేముడిలా ఏమిటి ఆ ప్రశ్న అనిపించింది.

"అసలు మీకేం కావాలని ఇలా ప్రొద్దున్నే భగవద్గీత శ్లోకాలు చదువుతూ...."

ఆయన ప్రశ్నను మధ్యలో అపడానికి అతను తన చేతి సంచీని చూపించాడు.

అందులో, బియ్యం, కాయగూరలు, డబ్బులు...

"అంటే... తిరిపెమా? క్షమించాలి. నా ఉద్దేశ్యం...."

"మీరంత ఖంగారుపడటం ఎందుకు? దీనిపేరు ఇదేగా..." అన్నాడు ఆ యువకుడు.

ఖంగు తిన్నాడు వెంకట్రమణయ్య.

"మీరు చూస్తే చదువుకున్నవారిలా ఉన్నారు. ఇలా...." మళ్లీ ప్రశ్నించాడు.

"చదువుకున్నంతమాత్రాన, చదువుకున్నవాడిలా బ్రతికే రోజులా ఇవి?"

ఆ సమాధానం ఆయనకు అంతగా రుచించలేదు. ప్రతి కష్టపడలేనివాడూ, అదృష్టవంతుణ్ణి చూసి ఈ మాట అనడం సహజమైపోయింది.

"అది సరే.. మరి ఇది వృత్తి అనుకుంటే, నోరు తెరిచి బిచ్చం కావాలని అడగరేం? పైగా.. పైగా.. మీకేం కావాలి అని మా బోటివాళ్లను ప్రశ్నిస్తున్నారు. వీరముష్టి అంటే ఇదేనేమిటి?!" వెటకారంగా, తర్కం జోడించి. కళ్ళజోడు సవరించుకుంటూ అన్నాడు వెంకట్రమణయ్య ఎంత రిటైర్ అయినా పదవి ఇచ్చిన 'పవరు' పొగరు అంత తొందరగా పోవు.

"ఎందుకు అడగడం?!" నవ్వుతూ అన్నాడు అతను.

"మరి ఎలా?"

"అయ్యా! మనం పూర్తిగా మనని మనం నమ్ముకోం. ఎదుటివాళ్లను నమ్మం. రాతిలో ఉండే కప్పకు కూడా నీరు ఏర్పరుస్తుంది సృష్టి శక్తి. నాకేం కావాలో, ఇవ్వాలో అలాగే మీ మనస్సుకూ తెలుస్తుంది. అడిగామనా చెట్టు కాయ కాస్తుంది?!"

"అంటే - మీరు వస్తారని గ్రహించుకుని, వాకిట్లో నిలబడి మీకు చెల్లుబడి చేయించుకోవాలనా?!" వెటకారంగా అన్నాడు వెంకట్రమణయ్య.

ఏ ఇంటి ముందూ ఒక్క నిముషంకన్నా ఆగడు, ఏదీ అడగడు అతను మరి.

మాట్లాడలేదు ఆ యువకుడు. అతను మౌనం "అంతేగా మరి" - అన్నట్లు అర్థమై తాటి ప్రమాణాన లేచాడు, అసలే బ్లడ్ ప్రెషరు పేషెంటు అయన ఆ పెద్దాయన.

"అంటే... అంటే... మీకు భిక్ష పెట్టడం కేవలం మా అదృష్టముంటే ప్రాప్తిస్తుందనా తమరి ఉవాచ?!" - వ్యంగ్యంగా అడిగాడు.

సూటిగా చూశాడతను. ఎండ మెల్లిమెల్లిగా పెరుగుతోంది.

"నేను మీ ప్రాప్తం గురించి మాట్లాడ లేదు. నా ప్రాప్తం గురించే నా అక్కర... ఇలా ప్రతి గుమ్మం ముందూ నిలబడి, భగవద్గీత శ్లోకాలు చెప్పుకుంటూ, ఈ ఇంటి

వారు చల్లగా ఉండాలి. ఈ ఇంట్లో 'పాజిటివ్ ఎనర్జీ' ఉండాలి అని ప్రార్థిస్తూ, ఇక్కడ ఉండే చెట్టూ, పుట్టా అన్నింటికీ తేజోశక్తిని, ప్రాణశక్తిని 'జనరేట్' చెయ్యమని 'మెసేజ్' ఇస్తూ నడిచిపోవడం నా ప్రాప్తం అనుకుంటాను.. నాకూ, నా ప్రవర్తనకూ మధ్య జరిగే 'సింథసిస్' ఈ సమర్పణ రూపం దాల్చచ్చుగా..." అన్నాడు ఆ యువకుడు జోలె చూపెడుతూ.

అవాక్కయిపోయాడు వెంకట్రణయ్య. అతను చూపిస్తున్న జోలిలో వెయ్యడానికి తనవి రిక్త హస్తాలు.... తన దగ్గరేమున్నదీ చెవులో తులసిదళం తప్ప?!

ఆ క్షణంలో ఆయనకు మెళ్లో ఉండే బంగారు గొలుసు, చేతికి ఉండే ఉంగరాలూ గుర్తుకు రాలేదు. అవి సంపద జాతికి చెందినవి. అవి దానానికి ఉపయోగించకూడదని సాంఘిక శాస్త్రం. అర్థశాస్త్రం చెప్పింది మరి.

అలా ఆలోచిస్తూనే పక్కకు తప్పుకోగానే, ఆయనను దాటుకుంటూ వడివడిగా అడుగులు వేస్తూ ఏదో శ్లోకాలు చదువుకుంటూ దాటిపోయాడు ఆ వింత వ్యక్తి.

తెలివి తెచ్చుకుని లోపలికి వెళ్లిన వెంకట్రమణయ్యకు మతి మతిలో లేదు అతను అతని రూపు, అతని మాటలు... ముగ్గు మీద పడిన సుస్పష్టమైన అతని నీడ....

ఏవో జ్ఞాపకాలు.. ఏవేవో ఆలోచనలు. ఎక్కడో చూసినట్లుండే అతని రూపం.

సుష్టుగా టిఫెన్ తింటున్నా నాలుగు అధరవులూ వేసుకుని భోజనం చేస్తున్నా అతనే గుర్తుకు వస్తున్నాడు. ఆయనలో ఉప్పొంగుతున్న ఎన్నో ఆలోచనలు ఎవరితోనైనా పంచుకోవాలని ఉన్నది. కానీ చెప్పలేదు.

'తత్త్వమసి' అన్న వేదాంత గ్రంథం తీశాడు 'ఉపనిషత్ సారం' పేజీలు తిరగేశాడు. తన లైబ్రరీ అంతా సర్దాడు. అందులో కొన్ని పుస్తకాలు తను "చాలా గొప్ప వేదాంత భ్రాంతితో" అన్న బహుమతిగా ఇచ్చినవి.

ఏమన్నాడు ఆ యువకుడు?!

అతని మాటలే పదే పదే వినబడుతున్నాయి.

అద్దంలో తన గుండెల మీద జంధ్యం కనబడింది.

"యజ్ఞోపవీతం పరమం పవిత్రం...." శ్లోకం వచ్చు.. అర్థం అనవసరం. 'ఏది గౌరవమిస్తుందో అది ముఖ్యం కానీ, దేన్ని ఎలా గౌరవించాలో అది ముఖ్యం కాదు' అన్న పద్ధతి మీద ఎదిగాడు ఆయన.

ఎనిమిదవ ఏట పంచశిఖలు.. ఉపనయనం.. గాయత్రి ఉపదేశం.. ఏమిటి నేర్చుకున్నాడు?! భువర్లోక, సత్యలోకాల నుంచి వచ్చే ధీ శక్తిని ఎప్పుడైనా తనను ఆవహించమని మనస్ఫూర్తిగా కోరుకున్నాడా?! అహాన్ని నిజాయితీ అనే ధ్వజస్తంభానికి కట్టి భగవదర్పణగా చేసే క్షణాలు అవి.

"ఊర్ధ్వ మూల మధః శాఖమ్..." రెండు చేతులూ ఆకాశం వైపు చూపుతూ శ్లోకం చదువుతూ వెలుతురు వాకిళ్లను వెతుక్కుంటూ వెళ్లే ఆ యువకుడు.

ఆ రాత్రి కలత నిద్రే.... కొడుకు ఆలస్యంగా వచ్చాడని తెలుసు. అప్పుడు తను వెళ్లి మాట్లాడాలని ప్రయత్నించినా ప్రయోజనం లేదు.

❀ ❀ ❀

మర్నాడు ప్రొద్దున్నే మరింత తొందరగా లేచి, స్నానం, పూజ ముగించుకుని అతని కోసం ఎదురుచూశాడు వెంకట్రమణయ్య.

అదే మేఘ గంభీరమైన స్వరం... ఆత్మకు మేలుకొలుపు లాంటి సుస్వరం.

ఆపాడు అతణ్ణి.

ఏదిచ్చినా స్వీకరించడానికి సిద్ధంగా ఉన్నాడతను. సిద్ధంగా ఉంచుకున్న బియ్యం, డబ్బులు అతని సంచీలోకి జారవిడుస్తూ,

"మీరు ఉండేది ఎక్కడ?" అని ప్రశ్నించాడు వెంకట్రమణయ్య.

నవ్వా డతను

"బంజరులో చెట్టు కింద...."

"వర్షమొస్తే...."

"చిన్న పర్ణశాల ఉన్నది."

"ఎవరుంటారు మీతో?"

"ఒక్కడినే...."

"మరి మీ ఒక్కరికీ ఇంత తిరిపెం....?"

"నా చుట్టూ చదువుకునే పిల్లలు ఒక పాతికమంది ఉన్నారు. మేమందరం వండుకుని తింటాము."

"ఎక్కడ?"

"అక్కడే...." నవ్వుతూ చెపుతూ కదిలాడతను.

"మీరు మా ఇంటికి రేపు భోజనానికి రావాలి.."

గభాలున అన్నాడు వెంకట్రమణయ్య.

"నేనా?!"

"ఆ – మీరే.. ఇవ్వాళ ఏకాదశి, రేపు ద్వాదశి.."

"నేను బ్రాహ్మడిని కానే...." సూటిగా చూస్తూ అన్నాడతను.

ఖంగు తిన్నాడు వెంకట్రమణయ్య. వెంటనే సర్దుకుని, 'బ్రాహ్మడు.. అంటే అర్థం ఏమిటి? లోకాం సమస్తాః సుఖినోభవన్తు....' అనుకునే ఉన్న బ్రాహ్మణత్వం ఎవరికి ఉన్నది?! ఏదిచ్చినా ఒప్పుకుంటా నన్నారు. మరి ఆహ్వానం?!"

అతను నవ్వుతూ వస్తానని తల పంకించాడు.

❀ ❀ ❀

"రంగా! ఇవ్వాళ మధ్యాహ్నం నువ్వు ఇంటికి భోజనానికి రావాలిరా!"

"ఎందుకు నాన్నగారూ! కొంచెం బిజీగా ఉన్నానే... తప్పనిసరైతే వస్తాను" భార్య అందించిన కాఫీ తాగుతూ అన్నాడు రంగారావు.

"రావాలి... ఇవ్వాళ నీ కొక విచిత్రమైనది చూపిస్తాను. నువ్వు చూడాలి. అతను మనింటికి భోజనానికి వస్తున్నాడు."

"నిజంగానా? మీకే అలా అనిపించింది. తప్పకుండా చూడవలసిన వ్యక్తే మనకు ఉపయోగించేవాడే అయ్యుంటాడు. ఎవరు చీఫ్ సెక్రటరీయా, మినిష్టరుగారి అబ్బాయా, లేక ప్రధాని పి.ఏ.నా?!"

"వీళ్లెవరూ కారు."

"మరి? ఓహో.. నా ప్రమోషన్ కోసం వాళ్లెవరికో పార్టీ ఇవ్వాలి అన్నారు వారి తాలూకానా?! తప్పకుండా వస్తాను." అన్నాడు కొడుకు.

"కాదురా! వీళ్లెవరూ కాదు..." అతని గొంతులో ఆర్తికి ఉలిక్కిపడింది కోడలు.

మనస్సెంత చిత్రమైంది! ఇది ఒక సమయంలో పరిపరి విధాల ఆలోచించగలదు. ఆ తిరిపెం ఎత్తే ఆ వ్యక్తి తన కొడుకు జాబితాలో ఏ ఒక్క వ్యక్తి నీడలో నిలబడటానికి కూడా అర్హుడు కాడేమో! ఆర్థిక స్థాయి రీత్యా అతనిని వీళ్లతో పోలుస్తూంటే ప్రాణం చివుక్కుమంటోంది ఎందుకనో! వీళ్ళంతా ప్రజా ప్రతినిధులు. నిజమే కానీ, అతను తమ ముంగిట నిలిచి, సత్సంకల్పంతో వైబ్రేషన్స్ కల్పించే వ్యక్తి. అతని దీక్షలో నిజాయితి ఉన్నది.

అదే సమయంలో మనస్సు మరొక విషయానికి కూడా బాధపడింది.

తను తన బిడ్డ దృష్టిలో, లోకం దృష్టిలో తనకు ఉపయోగించని పని ఏదీ చెయ్యడన్న అభిప్రాయం కలిగించాడా?! ఇన్నేళ్ల నిండు జీవితం తరవాత ఇదేనా తనను గురించి ప్రపంచం అర్థం చేసుకునేది?! మరి అతను?

ఆయన తల తిరిగిపోయింది. ఎవరు అతను? ఎవరు?



మర్నాడు అతను, అతని జోలె సిద్ధం 12 గంటలకు వస్తానని పైకి వెళ్లిపోయాడు.

మామగారు వంటవాడిని ఇంత హడావిడి ఎందుకు పెడుతున్నారో బొత్తిగా అర్థం కాలేదు కోడలికి.

వచ్చేవాడు ఒక్కడు. పైగా 'మాదాకవళం' కేసు. వచ్చాడతను.

అతను ప్రధాన ద్వారం దాటి లోపలికి అడుగుపెట్టగానే, "మొన్న మీరు పాజిటివ్ ఎనర్జీ గురించి చెప్పారు. మీవంటి వారి ఆలోచనే ఆశీర్వచనం. మా ఇల్లు బిడ్డా, పాపలతో కళకళలాడాలని దీవించండి" అన్నాడు వెంకట్రమణయ్య.

లోపల ఉన్న కోడలు ఆ మాటలకు ఉలిక్కిపడింది. మనసు చివుక్కుమన్నది. ఏమిటీ మామగారి చాదస్తం?! అయినా, శంకరమఠానికి వెళ్లినా సంవత్సరాదాయం

ఎంత? అక్కడి వాళ్లు ఎంత జేబులో వేసుకుంటున్నారు? అని ఆరాలు తీసే లౌక్యుడు ఈయన. ఇదేమిటి ఇవ్వాళ ఇంత బేలగా?!

అతణ్ణి కూర్చోబెట్టి, మంచినీళ్లు ఇచ్చేలోపల. వచ్చాడు టకటక బూట్లు శబ్దం చేసుకుంటూ కొడుకు రంగారావు.

"నాన్నగారూ! నాకు అసలే టైం తక్కువ. అతిథులు వచ్చారా? వాకిట్లో కార్లు లేవే...." అంటూ ఆ అపరిచితుణ్ణి చూసి ఆగిపోయాడు.

అతడు కూడా లేచి నుంచుని రంగారావును పరిశీలనగా చూస్తూ నిలబడిపోయాడు.

"మీరు... నువ్వు.. నువ్వు కృష్ణవు కదూ?..." సందేహంగా అన్నాడు రంగారావు.

"మీరు... రంగా..." అతడు మాట పూర్తి చెయ్యకముందే – "ఒరేయ్ కృష్ణా!" అంటూ రెండు చేతులూ చాపాడు రంగారావు. ఒకరి కౌగిలిలో ఒకరు ఇమిడిపోయారు.

ఆ ఇద్దరి వంకా చూస్తూ నిలబడిపోయాడు వెంకట్రమణయ్య. ఇతడు కృష్ణా! రంగారావుతో చదువుకున్న కృష్ణ ఆంధ్రా యూనివర్సిటీలో న్యూక్లియర్ ఫిజిక్స్‌లో రీసర్చ్ స్కాలర్!.

"ఓరి భగవంతుడా!" ఒక్కసారిగా కదిలిపోయాడు వెంకట్రమణయ్య.

ఏవేవో ఆలోచనలు.... మరేవేవో జ్ఞాపకాలు.

"ముందు భోజనాలకు పదండి."

లోపల నుంచి తెర తొలగి మళ్లీ మూసుకున్నది. తలుపు పక్కన ఇత్తడి ఫ్లవర్‌వాజ్ తొట్రుపాటుకి కిందపడింది.

'కోడలు లేదా నాన్నా?" భోజనాల దగ్గర రంగా తండ్రిని అడిగాడు.

"ఒంట్లో బాగాలేదని... ఇప్పుడే వెళ్లి పడుకుంది..."

"అయినా, అంత చదువు చదివీ, అంత ఉన్నత కుటుంబంలో పుట్టీ ఇదేమిటిరా?! ఈ మాదాకవళం ఏమిటీ? ఆ స్టూడెంట్సుకు చదువు చెప్పడం ఏమిటి? ఏమిటీ గోల?" చనువుగా అడిగాడు రంగారావు.

లోపల నుంచి రెండు చెవులు ప్రతి అక్షరం శ్రద్ధగా వింటున్నాయి. ఆ వ్యక్తి కంటిగుండా అనుభూతి వెల్లువ జలధారగా కురుస్తోంది.

"ఎంత చదువు? ఏం చదువిది? ప్రొఫెసెర్ల దయమీద, అభిమానం మీద ఆధారపడ్డ చదువు. ఇంత ఫీజు కట్టగలిగితే కానీ చెప్పని చదువు.. అప్పట్లో అది చాలా గొప్పగా అనిపించింది నాకు. అప్పులు పెరిగే తరుణంలో ఆస్థులనీ నేను నా చదువు వల్ల కూడా నడిచిపోయాయి. ఏదో ఇంటర్వ్యూకు వెళ్లాలంటే డిపాజిట్టుతో సహా వెయ్యి రూపాయలు కావలసి వచ్చాయి.

"అప్పుడు ఏం తాకట్టు పెట్టానో తెలుసా మా అమ్మ ప్రాణం... నా కోసం, మా ఇంట తరతరాలుగా ఉన్న జలతారు జరీచీర. కళ్ల నీళ్లతో చేత పెట్టింది మా అమ్మ. దాన్ని ఒక మధ్యవర్తి ద్వారా కలిగినింటివారికి అమ్మించాను. కాని ఆ పరిస్థితి నా చేత చాలా ఆలోచింప చేసింది. బ్యూరోక్రసీలో చదువు, ఉద్యోగం రెండు కూడా ఏవో అత్యంత విలువైనవి తాకట్టుపెట్టి ఈ బానిసత్వం కొనుక్కోవాలా? అనిపించింది. విద్యావంతుడికి వెయ్యి రూపాయల సహాయానికి సెంటిమెంటు తాకట్టు పెట్టించే ఈ ప్రపంచం డెస్మండ్ మారిస్ అన్నట్లు మనషుల జూ (Zoo) అని అర్థమైంది.

"అమ్మలో రాచరికపు అమాయకత్వం ఆ జరీ చీరతో మంచాన పట్టించింది. కనీసం అమ్మను బ్రతికించుకుందామని, ఆ జరీ చీర కోసం ప్రయత్నం చేశాను. కానీ దాన్ని తాకట్టు పెట్టుకున్న వారు నాలుగింతలు ధర అడిగారు అమ్మ మంచాన పట్టి మరి లేవలేదు. ఈ విశాల ప్రపంచంలో నేను ఒంటరివాణ్ణి అయ్యాను."

గదిలో కాస్సేపు నిశ్శబ్దం తాండవించింది అందరి మనస్సులు అతని కథతో బరువెక్కిపోయాయి.

"ఆ తర్వాత?" కుతూహలంగా అడిగాడు రంగారావు. అతను ఏ కష్టం లేకుండా చదువుకున్నాడు. అంతేకాదు. చదువు విలువ తెలియనక్కర్లేకుండా చదువుకున్నాడు.

"డబ్బు సంపాదించడం కష్టమేమీ కాదు ఇలా సంపాదించాలీ అన్న నియమే లేనప్పుడు... ఈ సత్యాన్ని తరువాత జీవితం చేదు అనుభవాలతో నేర్పింది."

"కాస్సేపు పడుకుంటాను బాబూ వెంకట్రమణయ్య మెల్లిగా లేచి వాళ్లమాటలు వినబడేటట్లు పక్కగదిలో పడుకోడానికి వెళ్ళాదు ధారగా కారిపోతున్న కన్నీరు తుడుచుకుంటూ– కోడలు గభాలున బైటకు వెళ్లిపోయింది.

ఏదో అడగబోయి ఎదురుగా లైఫ్‌ఎన్‌లార్జ్ చెయ్యబడ్డ భార్య ఫోటో చూసి ఆగిపోయాడు ఆయన. పెద్ద పట్టుచీర పెద్ద కుంకుమ బొట్టు, రవ్వల నగలు, నవ్వులో అహంకారం

"ఎంతపని చేశావు మహాలక్ష్మీ?" మనిషితో మాట్లాడుతున్నట్లు అప్రయత్నంగా అన్నాడు. వెంకట్రమణయ్య.

ఆయనకు గతంలో ఆ సంఘటన కండ్లకు కట్టినట్లు గుర్తుకు వస్తోంది. "జమీందారులింటి పట్టుచీర ఏవతో తాకట్టు కోసం ఎవడో తెచ్చాడు. కాని జరీయే. కొంటే ముప్పై వేలు పైన ఉంటుంది అడి వెయ్యి రూపాయ లిచ్చి పంపేశాను సంతోషంగా చెప్పింది. ఆ మోజులోనే ఆ పట్టు చీర కట్టుకుని, నగకట్టు దిగేసుకుని జమీందారిణిలా ఫీలైపోయి ఫోటో కూడా తీయించుకున్నది.

ఆ తరవాత పది రోజులకే ఏమండోయ్ ఇది విన్నారా!! ఆ చీర అమ్మిన అబ్బాయి మళ్లీ ఆ చీర కావాలంటున్నాడట. అమ్మినవాడు వచ్చి చెపుతున్నాడు. నాలిగింతలు ఖరీదు అడిగాను. సాయంత్రం లోపల డబ్బుతో రాకపోతే కరిగించేస్తానని బెదిరించాను. కంసాలిని రమ్మనండి...." అన్నది.

భార్య చిన్న చిన్న కక్కుర్తులకు, బుల్లి బుల్లి పాపాలకు, పుల్లవిరుపు మాటలకు అలవాటుపడడం ఆచారాల్లో ఒకటిగా అలవాటు చేసుకున్న మొగవాళ్లలో వెంకట్రమణయ్య ఒకడు.

ఆ పట్టు చీర.... కరిగించబడి వెండి గిన్నెగా రూపాంతరం చెందింది. "మన మనుమడికి అన్నప్రాశన దీంతోనే చేద్దాం" అనుకునే ఆవిడ శాశ్వతంగా ఉండలేదు.

కానీ ఆవిడ కిరాతకం ఈ కుర్రాడి జీవితాన్నే మార్చేసింది. తన రాజరికపు ఆఖరు కుదుళ్లు కదిలిపోయాయన్న భ్రాంతితో, ఆ చీరతోపాటే చనిపోయింది రాజ్యాలు పోయినా, రాచరికంపోని ఒక జమీందారిణి.

కళ్ల ముందు నల్లగా కాలిపోయిన జరీ చీర దృశ్యం, నిద్రపట్టక, లేచి మెల్లగా హాల్లోకి వచ్చాడు ఆయన.

"నా అనుభవాల వలన జీవితపు విలువల పట్ల చాలా మార్పు వచ్చింది, రంగా! లెక్చరర్‌ను అయితే పిల్లలకు పాఠాలు చెప్పచ్చు. కానీ, ఉద్యోగం నాకు రాదు... కానీ, అది విద్యాదానానికి ఆటంకం కాదుగా... జ్ఞానం తెచ్చుకోవడానికి, యూనివర్సిటీలే అక్కరలేదు అని అర్థమైంది. నేను చదువుకున్న సైన్సు నాకు చాలా నేర్పింది.

"మన ముని వేళ్లలో యాంటీనాల వంటి శక్తివంతమైన నాడీ మండలం ఉన్నది. అది ఆకాశం నుంచి అక్కడ నిక్షిప్తమైన ఎనర్జీని తీసుకోగలదు. రెండు చేతులూ పైకెత్తి. ఆ ఎనర్జీనీ ప్రార్థిస్తే, మనలోకి ఆ అమృత వర్షిణి లాంటి శక్తి వస్తుంది. అది దాచుకోవాలనో, నిక్షిప్తం కావాలనో ప్రయత్నిస్తే లాభంలేదు. ఆ శక్తిని పంచాలి. ఏ యూనివర్సిటీ చెప్పని వెన్నో నేర్చుకున్నాను. అవన్నీ నా దగ్గరకు వచ్చే వాళ్లకు నేర్పుతున్నాను."

"ఏమిటిరా ఈ పిచ్చి?! నాకేం అర్థం కావడంలేదు. జీవితంలో జ్ఞానానికే చోటున్నది అన్నట్లు బ్రతుకున్నావు... ఇందాకటి నుంచి నువ్వు అన్నీ అవ్వే మాట్లాడుతున్నావు. మరి పెళ్లి... పిల్లలు?"

"అవన్నీ కూడా 'భిక్షలా' మనని కనికరించాలి కానీ, మనం భిక్షమెత్త కూడదురా! నేను కోరుకున్న అమ్మాయి, నేను దేశాటనం పట్టినప్పుడు, మరి రాననుకుని మరొక డబ్బుగలవారింటి కోడలయిందట. నా తల్లి పోయింది. డిగ్రీ అర్థం లేనిదైంది. కానీ, నా చుట్టూ నా బోటి వారెందరో... వారందరికీ నేను చెయ్య గలిగింది చేస్తున్నాను – అంతే!"

"గురుకుల మన్నమాట..." కుర్చీలో చేరగిలబడుతూ అన్నాడు వెంకట్రమణయ్య.

"అబ్బే.. అదేం లేదండీ.. విద్య నేర్చుకుంటాను అన్నవాడికి అక్కడ అన్నీ దొరుకుతాయి. అంతే."

"మరీ అంత దినదిన గండంగా... పోనీ, గవర్నమెంటు ద్వారా ఏదైనా ఎయిడూ అదీ..." అన్నాడు వెంకటరమణయ్య.

గట్టిగా నవ్వాడు కృష్ణ.

"ఎందుకూ? అవి మా బోటివాళ్లకు కాదు. అయినా, ఈ తృప్తి చాలు నాకు."

"తృప్తి... ఒరేయ్! నీకన్నా కొన్ని వందల రెట్లు అధికం ఉన్నది నాకు. అందమైన భార్య, మంచి ఉద్యోగం, బోలెడు ఆస్తి, సంఘంలో పలుకుబడి.... అయినా నువ్వు చెపుతున్న 'తృప్తి' - అది లేదనిపిస్తుందేమిటిరా?! ఏదో చికాకు..." ఎక్కడో చూస్తూ అన్నాడు రంగారావు. మామూలు పరిస్థితుల్లో ఇలా మాట్లాడే అంత బలహీనుడు కాదు రంగారావు. కానీ 'కృష్ణ' సమక్షంలో అతనికి దాచుకోవాలనిపించ లేదు.

"కారణం నాకు తెలిసి ఒకటే...మనకు చిన్నప్పుడు గోళీకాయల మీద కోరిక. పెద్దవాళ్లమైన తరవాత ప్రమోషన్ మీద, పాలరాతి బంగళామీద, మరింత పొడుగాటి కారు మీదా అలా అంచలంచలుగా పెరుగుతుంది. కావలసిన వస్తువులు మారుతున్నాయి. కానీ 'కోరిక' మాత్రం మామూలే. దొరికిన తృప్తి, దొరకని అసంతృప్తి కూడా ఈ 'కోరిక' చుట్టూ పరిధులే.

"మరి మనకు కావలసిన వస్తువుల మీద ఈ కోరిక, అసంతృప్తికి కారణం అంటావా?!"

'కాదేమో... ప్రపంచం అంతా సమృద్ధిగానే ఉన్నది. దానితో మనకు పేచీలేదు. సమస్య నాకు అన్నీ కావాలి' అనుకుంటేనూ, ఆ తరవాత నాకే ఉండాలి' అనుకుంటేనూ వస్తుందేమో ఏది మనకు అవసరమో అది ఎప్పుడూ ఉంటుందో ఏది మనకే కావాలని కోరుకుంటామో అది దుఃఖాన్ని ఇస్తుంది."

"నువ్వేదైనా ఉపాసన చేస్తున్నావా బాబు ఆప్యాయంగా అడిగాడు వెంకట్రమణయ్య.

"ఉపాసనా?! బావుంది. ఒకప్పుడు ఆ పేరు నాకు చాలా చాలా ఇష్టం. ఉపాసన హుఁ ఇదేనేమో నేను చేసేది. ఎక్కడో ఉండే మహాశక్తిని ఈ ప్రపంచాన్ని పునీతం చెయ్యమని కోరుకోవడం ఒకవేళ ఉపాసనే అయితే-"

"ఏమిటిరా ఈ మెటాఫిజికల్ నాన్సెన్స్ ఇదంతా నిజమంటావా?!" సీరియస్‌గా అడిగాడు రంగారావు.

ఇలాంటి మాటలు, నిజాలైతే మామూలు ఉద్యోగాలు, ప్రమోషన్లు, సంపాదన లంచాలు ప్రపంచ ధర్మాలు... వీటన్నిటికీ అర్థం ఉండదు మరి. అందుకనే ఎప్పుడూ ఒక తెగమనుష్యుడు ఇవి! రంగారావు వేరొక తెగ మనిషి.

ఇది నా పద్ధతి రంగా. ఇవ్వాళ్టి సైంటిస్ట్ క్వార్క్ విడగొట్టలేననవచ్చు. కానీ, నా దృష్టిలో అది నిజంకాదు గొప్పధాట్ వాటితో నాకు తెలిసీ క్వార్క్స్ బ్రేక్ వేసినప్పుడు ఆకుపచ్చ, ఎరుపు, పార్టికల్స్‌గా మారుతాయి. అక్కడే మేటర్ ఎనర్జీ అవుతుంది. ఆ టెక్నిక్‌ను జీవితంలోకి అనువదించాలని ప్రయత్నిస్తున్నాను మరి నాన్నగారు అన్నట్లు దీనిపేరు ఉపాసన అయితే..." నవ్వుతూ అన్నాడు. ఘల్లున మ్రోగాయి కర్టన్‌కు ఉన్న మువ్వలు.

నాపేరు ఉపాసన.. నేను ఈ ఇంటి కోడలిని కళ్ల ముందు నిలబడిన ఆ అద్భుత సౌందర్యరాశి.

"నా భార్య ఉపాసన..." అన్నాడు రంగారావు.

మౌనంగా చూశాడతను... సన్నగా ... నవ్వుకున్నాడు.

మీకు నేను గుర్తు లేనా?!" కవ్వింపు గొంతుకలో దాచుకుంటూ మామూలుగా అడిగినట్లుదామె.

ఆ మాటల్లో ఒకప్పుడు తనను ప్రేమించి, ఆరాధించి పిచ్చివాడైపోయిన గుర్తించిన ఆమె

నేను మర్చిపోతేగా... ఇంక నేను బయలుదేరతాను, రంగా..." లేచాడతను ఏం జరగనట్లు.

"నీకు... నీకు నేనేం చెయ్యగలనురా? ఏం చెయ్యాలి చెప్పు..." అతని రెండు చేతులూ పట్టుకుని ఆర్తిగా అడుగుతున్నాడు రంగారావు.

"నాకేమీ వద్దు."

"నిజంగానా?"

"ఆఁ - నిజంగా! వీలైతే నా తృప్తి నీకు ఇచ్చి వెళ్లాలని ఉన్నది. కానీ, అది నీకు నువ్వే సంపాదించుకోవలసింది... వస్తాను."

"బాబూ! కృష్ణా!" ఆర్తిగా వినబడింది వెంకట్రమణయ్య గొంతు.

వెనక్కు తిరిగాడతను.

"ఇదుగో ఈ వెండి గిన్నె మా కానుకగా, జ్ఞాపకంగా తీసుకు వెళ్లు..." అతని సంచిలో వేస్తూ అన్నాడాయన.

ఏదో అపరాధానికి క్షమాభిక్ష దొరికినట్లున్నది ఆయన తీరు, ఆ కంటి తీరు.

దానివంక ఒక్క క్షణం పరిశీలనగా చూశాడు కృష్ణ.

మెల్లిగా సంచిలోనించి బైటకు తీసి,

"బాబూగారూ! మీ ఇంట పుట్టబోయే చిన్నబిడ్డకు ఇది నా కానుకగా ఇవ్వండి..." అంటూ కన్నార్పకుండా తనవైపే చూస్తున్న ఉపాసన పట్టిన దోయిలిలో పెట్టాడతను.

అందరికి నమస్కరించి వెళ్లిపోయాడు.

"ఊర్ధ్వ మూల మధః శాఖమ్..."

గాలిలో మౌనంగా అతడు చదివే శ్లోకార్థచ్ఛాయలు.

వాకిట్లోకి అతణ్ణి సాగనంపడానికి వచ్చారు తండ్రీ కొడుకు.

మధ్యదారిలోనే ఆగిపోయింది ఉపాసన. వెలుగులోకి వెళ్లిపోతున్నాడతను.

వెనక్కు తిరిగి చూసింది.

పెద్ద మేడ, రెండు కార్లూ, బరువైన మంగళసూత్రాలు - ఇవన్నీ, ఇవన్నీ ఎంత అర్థరహితమైనవి?!

ఎండపడి ఆమె చేతిలో వెండిగిన్నె మెరుస్తోంది.

అప్రయత్నంగా ఆకాశంవంక చూసిందామె.

"ఊర్ధ్వ మూల మధః శాఖమ్..."

("కృష్ణ" జీవితపు పద్ధతిలో అర్థాన్ని గురించి నాకు చెప్పిన వ్యక్తికి...
"అంకితం")

*('ఆంధ్రప్రభ' 17-23 నవంబరు, 1993)*

# మైనపు బొమ్మ

"మా అత్తవారు బంగారు వ్యాపారస్థులే... స్టేటస్ కాన్షియన్స్ మనుష్యులు. నా తరఫున నువ్వు వస్తే నాకు గర్వంగా ఉంటుంది..." జడ్జిగారి కోడలు భాగ్యవతిని తన మరదలు పెళ్ళికి రమ్మని ఒట్లు, సత్యాలు వేయించుకుని వెళ్ళింది రాజేశ్వరి.

నవ్వుకున్నది భాగ్యవతి. ఒకరకంగా ఆనందించింది.

కారణం?!

భాగ్యవతి ఒకప్పుడు లోయర్ మిడిల్ క్లాసు ఆడపిల్ల - తెలియకుండానే దరిద్రం అంటే భయం, ఏవగింపు పెంచుకున్నది. మానవత్వం, స్టేటస్ ఒక్కొక్కప్పుడు సమానాంతర రేఖలుగా ఉన్నప్పుడు, రెండోదానికి మొదటిదాన్ని ఆపాదించి కలిపి చూడాలనుకోవడమే కృత్రిమత్వం. దీనికి ప్రలోభమున్నవారు చాలా తేలిగ్గా లొంగిపోతారు

అలా లొంగిపోయిన భాగ్యవతి 'ప్రేమ' అనే భ్రాంతిలో పడింది. రెండేళ్ళలో వివాహం ఇచ్చే నిర్లక్ష్యపు కవచంతో బతికేసే ధనశేఖరాన్ని "నన్నే కావాలని ఎందుకు చేసుకున్నారు?" అని ఉక్రోషంగా అడిగితే...

"ఆఁ! పోనీ పడుంటావని..." అన్న నిర్లక్ష్యసమాధానికి అలవాటుపడక తప్పలేదు భాగ్యవతికి. పెళ్ళనే ఈ ప్రాసెస్‌లో జడ్జిగారి కోడలు, లీడింగ్ కంప్యూటర్స్ ఓనరు ధనశేఖరం భార్య అయిన ఆమెకు డబ్బు ఇచ్చే మొదటి జబ్బు - మామూలు వాళ్ళలో మనుషుల్ని గుర్తించక పోవడం - అని గ్రహింపు వచ్చింది.

రాజీ పిలుపులో తనను తానుగా గుర్తించిన గురుతులున్నాయని ఆశపడింది.

"పెళ్ళికి వెళ్ళాలా? ముందు చెప్పద్దూ! నా కారు సర్వీస్ కిచ్చానే..." రిటైర్ అయిన మామగారు.

"ఫరవాలేదండీ! ఆటోలో వెళతాను." ఎంత గట్టిగా సమాధానం చెబుదామన్నా ఆయన ఉనికిలోనే ఉన్నది భయపెట్టే గుణం.

"ఆటోలోనా?" ఆ ప్రశ్నలోనే భూనభోంతరాళాలన్నీ కదిలిపోయేటంత గాంభీర్యం. "వెళదామనే?" అన్న చాలెంజ్, "ఒద్దు" అన్న వార్నింగ్...బోలెడు.

సాయంత్రం మామగారు వాకింగ్‌కు వెళ్ళి వచ్చే లోపల ఆటో తెప్పించుకుని ఎక్కి కూర్చుంటూ డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ పేరు చెప్పింది గిఫ్ట్ కొనాలని. నిస్సహాయంగా, భయంగా చూశారు వాచ్‌మన్, వంటమనిషి.

లేతరంగు వెంకటగిరి చీర, నల్లపూసలు... హాయిగా, తెరిపిగా ఉన్నది ఆమెకు. ఆడంబరాలు అన్ని చోట్లా తప్పవు... రాజీ దగ్గర కూడానా?

బోలెడు మంది స్నేహితురాళ్ళు వస్తారు.... చాలా రోజుల తరువాత హాయిగా నవ్వుకుంటూ....

"ఏం చేస్తున్నావు?" అని అందరూ అడిగితే....

"ఏం చెయ్యడం లేదు" అని చెప్పాలా?! నవ్వొచ్చింది భాగ్యవతికి.

కాలేజీలో ఎన్ని ఆదర్శాలు? ఎన్ని కబుర్లు.... చాలా రోజుల తరువాత ఆలోచించనివన్నీ ఆలోచిస్తోంది భాగ్యవతి. 'ఎందుకని ఆ పెద్ద మేడలో, ఆ మొనాటనీ మధ్య కనీసం ఎందుకు పనికిరాకుండా పోయానో కూడా ఆలోచించలేకపోతున్నానేమిటి?' అనుకున్నది.

జర్క్‌తో ఆటో ఆగింది.

గిఫ్ట్ కొని బయటకు వస్తూంటే -

"హాయ్ భాగ్యా! ఇదేమిటి ఇక్కడ? మా ఇంట్లో దండలు ఆలస్యమైతే తెమ్మనమని నన్ను పంపారు. చూశావా? ఒక్కొక్కటి ఐదువందలు... ఉన్నవాళ్ళుగా... అంతే మరి. ఇదిగో ఈ చీర, ఈ నెక్లెస్ మా మామగారు కొనిపెట్టారు... అది సరే. కారేదీ?!"

గబగబా మాట్లాడేస్తోంది రాజీ.

"కారూ...." నసుగుతూ అన్నది భాగ్య.

"ఆటోలో వచ్చావా? ఏం ఖర్మే?"

"మీ ఇంట్లో పెళ్ళికే బయలుదేరాను....."

ఆ మాటల్లో ఏదో తక్కువైపోయిన ధ్వని ఎందుకు వస్తుందో ఆమెకే అర్థం కాలేదు.

"ఏమిటీ?" కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యపోయింది రాజీ.

"ఈ చీరతో, ఈ ఆటోలో - నువ్వు నా స్నేహితురాలివని గొప్పగా చెప్పుకోవాలని నేను చూస్తూంటే...." ఆ గొంతులో బోలెడంత హర్ట్.

అయోమయంగా చూసింది భాగ్య... "నేను నేనుగా నీకు ఒద్దా?" అన్నట్లు చూసింది.

సఱ్ఱున పడవంత కారు పక్కన ఆగింది.

"అమ్మగారూ! అయ్యగారు కారు పంపారు. ఇంటికి వెళ్ళి వెళుదురు గాని రండి...." వంటమనిషి అన్నాడు.

"అదేకదా! అయినా, నీకు మతి లేదే - ఇంటికి వెళ్ళి దర్జాగా రాక...వస్తాను." కారెక్కి వెళ్ళిపోయింది రాజీ.

ఇంక ఆలోచించడానికి ఏం మిగలలేదు భాగ్యకు. పెద్ద నగలు మామగారి అధీనంలో ఉంటాయి.... పట్టుచీర, రవ్వల నగలు, పడవంత కారు.

"చూడమ్మాయ్... ఎప్పుడూ ఇలా సింపుల్‌గా బయటకు వెళ్ళకు. నువ్వు నువ్వుగా ఏమిటన్నది కాదు విషయం. నువ్వు పెద్దింటి కోడలివి. అర్థమైందా - నీ స్నేహితురాలైనా నిన్ను ఇలాగే చూడాలనుకుంటుంది...."

మామగారి మాటల్లో అన్నీ తెలిసినట్లున్న మందలింపు.... "కాదు" అనలేదుగా.... కళ్ళనీళ్ళు తిరిగాయి భాగ్యవతికి.

భాగ్యవంతురాలైన తన స్నేహితురాలిని పేరు పేరున తన వాళ్ళకు గర్వంగా పరిచయం చేసింది రాజీ. అక్కడ ఒక్కొక్క ఆడపిల్ల బంగారపు షోకేసులో బొమ్మలా ఉన్నది. పెద్దవాళ్ళు సరేసరి. కాసుల పేర్లతో కంఠాలు వంగిపోతున్నాయి.

వీడియోలు, ఫోటోలు, హడావిడి....

అందగత్తె భాగ్యవతి లైట్లు పడినప్పుడల్లా మెరిసిపోతోంది. కానీ, ఆమె కళ్ళల్లో కాంతి ఆ కృత్రిమ జిలుగుకు పాలిపోతోంది.

పాత స్నేహితురాళ్ళు ఒకపక్కన ఉన్నారు. "హల్లో!" అన్నది కానీ, వాళ్ళ దగ్గరకు వెళ్ళనీయలేదు రాజీ బంధువులు.

"ఎలక్ట్రీషియన్ ఏడీ?.... అక్కడ ఏదో సర్క్యూట్ ఫెయిల్ అయిందట...." ఎవరో హడావిడిగా వచ్చారు.

"ఇక్కడే ఉన్నాను.... వస్తున్నాను...." కదిలాడు ఆ వ్యక్తి. అంతవరకు దగ్గర ఉన్న స్తంభానికి ఆనుకుని, ఈ ఫార్సంతా చూస్తున్నాడు కాబోలు.

"అరె.... అతను రాజేశ్వరరావు కదూ!" గభాలున అన్నది భాగ్యవతి.

"ఆఁ! గుర్తుపట్టావే - అతనే - ఎలక్ట్రిక్ డిపార్ట్‌మెంటులో పని చేస్తున్నాడు...."

"అరే....! మరి నన్ను పలకరించలేదేం?... అదేమిటి రాజీ! నువ్వన్నా గుర్తు చేసి ఉండచ్చు కదే...."

"ఒద్దులేవే....నీ స్టేటస్ ఏమిటి? అతనెక్కడ? అతను గుర్తుపట్టకేం.... 'భాగ్య వస్తుందా?' అని అడిగాడు."

అవాక్కై చూస్తోంది భాగ్య.... కాలేజీ రోజుల్లో పెద్ద హీరో అతను.... ఇప్పుడు చిన్న ఉద్యోగి.... అయితేనేం అతను మనిషి కాదా?!

గొప్పగా డిన్నర్ జరుగుతోంది.... మంది మాట్లాడుకుంటున్నారు. "నువ్వెలాగూ అక్కడ ఏం తినలేవని నాకు తెలుసులే.... ఇంద...." కూల్‌డ్రింక్ ఇస్తూ అన్నది రాజీ....

అంత పెద్ద విందులో తను అన్నం తినకూడదని రాజీ, ఆమె బంధువులు - వాళ్ళే నిర్ణయించేసుకున్నారు.

ఆకలి మండిపోతోంది భాగ్యకు. డైటింగ్ కొంత, మొనాటనీ కొంత.... సరిగ్గా ఇంట్లో తినే భాగ్యంలేని భాగ్య.... కానీ, ఇక్కడ తన స్నేహితుల మధ్య హాయిగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం చెయ్యాలని ఉన్నది.... కానీ....

మాట్లాడకుండా కూల్‌డ్రింక్ తాగింది. భాగ్య బాధపడుతోంది.... రాజీని ఎట్టకేలకు వదిలించుకుని కారులో కూర్చుంది. బోలెడంత మంది కారు దగ్గరకు వచ్చి వీడ్కోలు చెప్పారు.

అది కడుపులో మంటో, నిరాశో, ఆకలో - ఏదో అర్థం కానట్లు తలకాయ వెనక సీటుకు ఆన్చి పడుకున్నది భాగ్య. బోరున వర్షం.... దుఃఖంలా....

గేటుకు అవతల చీకట్లో కారు సఙ్ఞున ఆగింది. ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది.

చేతుల్లో ఏవో పాకెట్లతో రాజేశ్వరరావు....

"మీరు...." గబాలున అద్దం దించుతూ అన్నది.

"అంత మన్నించి నన్ను పరాయివాడని చేసెయ్యకు... ఇదిగో, నువ్వు తిన్నావా? అని కూడా అడిగేవారు లేరు. నీకు ఇష్టం కదా పులిహోర, గారెలు... ఎలా ఉన్నావు?"

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పడం ఎంత కష్టం?!

మౌనంగా పేపరు ప్లేట్లు తీసుకున్నది.... పిక్నిక్, వనభోజనాల్లో పులిహోర కోసం చంటిపిల్లలా అల్లరి చేసేది భాగ్య ఒకప్పుడు.

కారులో అలముకున్న చీకట్లో తెల్ల ప్లేటులో మెరుస్తున్నాయి పసుపు అన్నంలో నల్లటి ఆవాలు....

"ఇంక వెళ్ళనా? ఎలా ఉన్నావో చెప్పద్దు కానీ, ఇలా.... ఇలా మాత్రం అయిపోకు...."

"ఎలా?" అన్నది అప్రయత్నంగా.

"కరగలేని మైనపు బొమ్మలా - వెలగని కొవ్వొత్తిలా..." తల వంచుకున్నది భాగ్య.... ఏదో దుఃఖం అది ఏ తరహాదో తెలియలేదామెకు. కొన్ని అభిమానాలకూ, మమతలకు నిర్వచనాలుండవు - రాజు అభిమానం అలాంటిదే.

దరిద్రమంటే విసుగూ, భయమూ రాజూ అనే --వి. కానీ, దరిద్రం కంటే భయంకరమైనది అనుభవంలోకి వచ్చి ఉండాలి. స్తబ్ధత....

ఉలిక్కిపడి తలెత్తి చూసింది భాగ్య.

"బయలుదేరు ఇంక...." కారు సఙ్ఞున బయలుదేరింది.... డోర్ బలంగా వేసుకోవడంలో అతని చెయ్యి కారు డోర్ మధ్య....

"సారీ.... రాజూ.... సారీ!"

"ఫరవాలేదు. డ్రైవర్, పోనీ...." నలిగినచెయ్యి రెండో చేత్తో పట్టుకుని చీకట్లో కలిసిపోయాడు రాజేశ్వరరావు.

వెనక్కు వెనక్కు తిరిగి చూసింది. వర్షపు మసకలో నీడలాంటి మనిషి.

పులిహోర నోట్లో పెట్టుకోగానే ఎందుకో పుక్కిలింతలుగా దుఃఖం వచ్చింది.

ప్రసాదంలా తింటోంది. పెట్టేవారి భావాలు ఆహారానికి ఎంత అమృతత్వాన్ని ఇస్తాయో అర్థమౌతోంది ఆమెకు.... అప్యాయత లేని తన ఖరీదైన డైనింగ్ టేబుల్ మీద అన్నం ఎక్కదు మరి....

చుట్టూ వర్షం. ఇప్పుడు విసుగ్గా లేదు.

అర్హత లేకపోయినా, నిశ్శబ్దపు వరాలు కొన్ని నిజంగానే మనిషి మీద వర్షిస్తాయేమో!....

ఇల్లు దగ్గరౌతుండగా కారు ఆపాడు డ్రైవర్.

"ఎందుకు?" కళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

"కారు క్లీన్ చేసి, పేపర్ ప్లేట్లు పారేద్దామమ్మా.... ఇంట్లో పెద్దాళ్ళకు ఇదంతా నాన్సెన్సుగా కనబడుతుంది...."

అన్నీ అర్థమౌతున్న డ్రైవర్‌లో మనిషి. ఏదో వెలుతురు కారు మీద పడ్డట్లయింది.

ప్రవృత్తులను బట్టి వృత్తులను నిర్ణయించే ఉద్ధరింపు మనస్తత్వం దేశంలో ఎలాగూ లేదు. కానీ, వృత్తులను బట్టి ప్రవృత్తులను ఆపాదించే అసహ్యత ఎక్కడిదసలు?!

ఎలక్ట్రీషియన్‌లో స్నేహితుడు రాజేశ్వరరావు. డ్రైవర్‌లో తండ్రి లాంటి రామయ్య.

❀ ❀ ❀

ఎదుటివారి గురించి ఎన్నాళ్ళయింది ఆలోచించి?! ఎంతసేపూ నా బాధ, నా దుఃఖం, నా మొనాటనీ, నా బంగారు పంజరం. అన్ని ఆడంబరాల ముసుగులు విప్పేసిన తరువాత ఆలోచిస్తూ పడుకున్నది భాగ్య.... భర్త రాడు....

పాత ఆటోగ్రాఫ్ బుక్ తీసింది.... ఎన్ని జ్ఞాపకాలు?!

ఒకచోట "ది బెస్ట్ ఆపర్చునిటీ లైఫ్ గివ్స్ ఈజ్ ది ఇండివిడ్యువల్ ఎడ్వాన్స్‌మెంట్. - రాజేశ్వర్..."

ఏమన్నాడు రాజేశ్వరరావు? "స్తబ్ధత...." ఎంత నిజం? ఎంత భయంకరమైనది అది?!

'ఎలా ఉన్నదో అతని చెయ్యి?...'

ఏదో ఆలోచనల సజీవత అగ్గిలా ఆమెలో ఘనీభవించిన మంచుతెరల్ని కరిగిస్తోంది....

పొద్దున్నే....

"అమ్మగారూ, ఫోను...."

"నేను రాజేశ్వరరావును.... నా చెయ్యి బాగానే ఉన్నది.... ఏదో అయిపోయిందని రాత్రంతా నిద్రపోయి ఉండవు.... అందుకే ఫోను చేశాను...."

అవాక్కైపోయింది ఆమె.

"ఎందుకలా స్తబ్దుగా.... నువ్వు బోలెడు చెయ్యగలవు తెలుసా? ఆలోచించు. ఉంటాను...." ఫోను పెట్టేసిన శబ్దం.

"ఎవరమ్మాయ్?" మామగారి ఎంక్వైరీ.

ఏం చెప్పాలి?

"మా బంధులెవరో...." స్నేహం కన్నా బంధువు పదంలో కొంత రక్షణ. దేన్నించి రక్షణ?!

ఫోను, కారు, బంగళా, ఆస్తి, నగలు, ఇవన్నీ పేరుకే తనవి.... సొంతం కానివి.... ఏం తాకట్టుపెట్టుకుంటే ఈ గౌరవం, సొంతం అనుకునే భ్రాంతి.... స్వాతంత్ర్యాన్నా? ఎందుకు అది పోగొట్టుకోవడానికి ఇన్ని ప్రయత్నాలు? ఇన్ని బంధనాలు?!

ఏమన్నాడు రాజేశ్వరరావు?! వెలగని కొవ్వొత్తిలా.... ఏమిటీ వెలిగించేది?! ఏమిటది?!

"నేను మనిషిని" అన్న పలవరింపు.... ఎదుటి వ్యక్తులలో వ్యక్తిత్వపు గుర్తింపు....

మైనపు బొమ్మకు ఆలోచన అనే అగ్గి సోకి, వెలుతురు బొమ్మగా మారుతోంది మెల్లిగా.... అతిమెల్లిగా....

*('ఇండియా టుడే' ఫిబ్రవరి 21-5 మార్చి, 1994)*

# తేజస్విని

"నా ఫోన్ నెంబరు కూడా మర్చిపోయావా మధూ! ఇండియా వస్తే కనీసం నాకు ఫోన్ చెయ్యాలని కూడా అనిపించలేదా నీకు?!"

ఆ గొంతులో నిష్ఠురం కన్నా మించినది... అదేదో ధ్వని, అవతలి వ్యక్తి మాట్లాడలేదు... చేతులు కట్టుకుని సూటిగా ఆమెనే పరీక్షగా చూస్తున్నాడు.

"నా ప్రశ్నకు జవాబు చెప్పలేవని నాకు తెలుసు..."

ఈసారి ఆమె మాటల్లో కొద్దిపాటి నిష్ఠురచ్ఛాయలు.

నవ్వాడతను...

"కొన్ని ప్రశ్నలే... జవాబులుండవు..."

"ఇలా రిడిల్స్ మాట్లాడి ఎంతకాలం నన్ను సాధిద్దామని?"

ఈసారి ఆమె గొంతులో దుఃఖం... నిస్సహాయత... ఆ తరవాత స్టేజ్ అతను ఊహించుకోగలడు.

అది ఫైవ్‌స్టార్ హోటల్లో జరుగుతున్న గొప్ప బిజినెస్ మాగ్నెట్స్ పార్టీ... ఆమె భర్త అందులో ఒకరు... ఈ అమ్మాయి ఇక్కడ, ఇలా కన్నీటి దేవతగా బైటపడితే...

"నేను నిన్ను సాధించడమా?" ఆ గొంతులో ఏదో ఆశ, చిలిపి తళుకు...

"ఎందుకు మీనా?... వస్తాను..." సూటిగా చూస్తూ చేతులు జోడించి వెళ్ళిపోయాడు మధు.

"ఎందుకు?" ఆ ప్రశ్నతో దుఃఖం భళ్ళుమన్నది ఆమెలో. మెల్లగా రెస్ట్‌రూం పక్కకు అడుగులు వేసింది.

"ఎందుకు?" ఆ ప్రశ్నలో చాలా జీవితం ఇమిడి వున్నది మరి!

సాధించడం, దుఃఖపెట్టడం, ఎమోషనల్, బ్లాక్‌మెయిల్, మరి రెండు మెట్లు దిగజారితే కచ్చ సాధించడం... ఇవన్నీ మామూలు తరహా మనుష్యుల ప్రవర్తన... కానీ, మధు?! అతను వేరు. అతని ఉనికిలోనే ప్రత్యేకత వున్నది.

"ప్రత్యేకమైన వ్యక్తి అని అతణ్ణి ప్రెషియస్‌గా ఫీలవడం చాలా కష్టం... నా మాట విను... సంఘం దృష్ట్యా అతను మామూలు ఉద్యోగి... నువ్వా - పెద్ద పొలిటీషియన్ కూతురివి. అతడు ఎప్పుడో ఏదో అనుకున్నవన్నీ సాధించాడనుకో, అప్పటికి మీ ఇద్దరూ యాభయ్యవపడిలో పడిపోతారు. నా మాట విని అన్నయ్య తెచ్చిన సంబంధం ఒప్పుకో. పెళ్ళికి కావలసింది ప్రస్తుత కాలంలో స్టేటస్..." స్నేహితురాలైన పెద్ద వదిన ఐదేళ్ల క్రితం హితవు చెప్పింది.

నవ్వొచ్చింది కాలేజీ గర్ల్ మీనాకు. మధు గురించి తను ఒక నిర్ణయానికి రాకముందే, వీళ్ళు అతణ్ణి తను చేసుకుంటానేమోనని జాగ్రత్తపడుతున్నారు.

అసలు ఈ విషయం మాట్లాడవలసిన వ్యక్తి మధు, కానీ అతను తన కోసం వీళ్లనుకుంటున్నట్టు పడిచచ్చిపోవడం లేదు. ఇన్‌ఫాక్ట్... తనే అతని వెనకాల...

ఆలోచించలేకపోయింది మీనా.

ఆ సాయంత్రం అతణ్ణి కలుసుకున్నప్పుడు చాలా పరోక్షంగా,

"నేను నేనుగా ఏమిటంటావు?" అని అడిగింది.

"అంటే?" కాఫీ సిప్ చేస్తూ పరీక్షగా చూస్తూ అడిగాడు మధు.

"నేను, నా అందం బాగా

"సారీ! ఆమె మాటల్ని మధ్యలోనే ఖండిస్తూ,

"కేవలం నువ్వు ఎలా వుంటావో అన్నదే ముఖ్యమైనప్పుడు, అద్దంలో చూసుకుంటూ నిన్ను నువ్వు పోగొట్టుకుంటావు... ఈ జన్మలో నీకు నువ్వు దొరకవు..." తీక్షణంగా అన్నాడు మధు.

ఉలిక్కిపడింధి మీనా...

"మరి... నేను నేనుగా... నేను ఇప్పుడు తిరుగుతున్న సొసైటీ, ఈ జనం, ఇవన్నీ కాకుండా, లేకుండా... నేను నేనుగా ఏమిటి అని..." అన్నది సందేహంగా చూస్తూ...

"గుడ్... చాలా విచిత్రంగా ఆలోచిస్తున్నావే... యు ఆర్ రైట్... మనం ఎప్పుడూ మన చుట్టూ మనుష్యులు మన ఇగో ఫీడ్ చేసేవాళ్ళు, మనకు సింపతీ, గుర్తింపు ఇచ్చేవాళ్ళను వెతుక్కుంటాం... అప్పటికి అది హాయిగా వున్నట్లే వున్నా, ఇంక ఎదగలేం... ఒక పని చెయ్యి... ఒక వారం రోజులు నీ రొటీన్ మార్చుకో... నీకు నచ్చింది చెయ్యడం కన్నా, నీకు బాగుంటుందేమో అని అనిపించింది చెయ్యి. అప్పుడు నీలోకి నువ్వు ప్రయాణం చేస్తావు..."

"నాన్సెన్స్... ఇదేదో సెల్ఫ్ హెల్ఫ్ కొటేషన్‌లా వుంది..." నవ్వుతూ అనేసింది కానీ, ఆ మర్నాటి నుంచే అదేదో ప్రయత్నించాలని సరదా పుట్టింది.

మధు కాంపుకు వెళ్ళాడు. వారం రోజులు. అతడు తిరిగి వచ్చేలోగా, తను తనుగా ఏమిటో చెప్పాలన్న తపన ఎక్కువైంది.

మర్నాడు అలారం పెట్టుకుని ఐదు గంటలకే లేచింది. తన కాఫీ తను కలుపుకున్నది. వాషింగ్, డ్రైయింగ్ తనే చేసుకున్నది. మొక్కలకు నీళ్ళు పోసింది. ఐదుగురు పనివాళ్ళు అమ్మగారిలో ఈ మార్పుకు హడలిపోయారు.

నడుం పట్టేసింది. అయినా పంతంగా వున్నది మీనాకు. రొటీన్ ఫోన్ కాల్స్, సాయంత్రం గెట్ టుగెదర్స్, వేటికీ లేనని చెప్పించింది.

బోలెడంత కాలం... ఏం చెయ్యాలి?! నిద్ర రాలేదు... ఎన్నాళ్టిబట్టో వినాలని దాచుకున్న కేసెట్స్... బోర్... విడియోలు... ఒంటరిగా చూడటం కష్టం. అమ్మ గదికి వెళ్ళింది.

"ఏం కావాలమ్మా?!" నాన్నా, అమ్మా ప్రశ్న.

'అవును... ఏదో అవసరం లేనిదే ఏనాడూ అక్కడికి వెళ్లలేదే?!

గార్డెన్లో ఒంటరిగా తిరిగింది... ఏమిటో పిచ్చి పిచ్చి ఆలోచనలు... వీణ తీసి దుమ్ము దులిపింది... తీగ తెగింది. అన్నయ్య పిల్లలను చేర్చి ఆడింది. కాసేపటికి వాళ్ళ కళ్ళల్లో ఏదో ఎలియనేషన్... "నువ్వు మాదానివి కాదు-" అన్న భావన... "నువ్వు వెళ్ళిపోతే మాకు ఇబ్బంది తగ్గుతుంది" అన్న ధ్వని ఏదో.

మౌనంగా తన గదికి వచ్చేసింది.

వదినతో కార్డ్స్ ఆడింది. కచ్చగా గెలిచింది.

"ఓడిపోకపోతే నువ్వు ఊరుకుంటావా తల్లీ!" సన్నగా నవ్వుతూ అన్నది వదిన.

"అంటే?" ఈ గెలుపుకు కూడా తను కర్త కాదన్నమాట... ఛా!

ఏం చెయ్యాలి? ఏదో చెయ్యాలి... తల పగిలిపోతోంది. మనస్సులో పిచ్చి పిచ్చి ఆలోచనలు.

పెద్దన్నయ్యకు లాంగ్ డిస్టెంట్ కాల్ బుక్ చేసింది.

"ఏం కావాలి మీనా?"

మామూలుగా అయితే చాలా చెప్పేది. కానీ, ఇవ్వాళ రొటీన్ నుంచి తప్పించుకోవాలని,

"ఏమీ ఒద్దు... ఊరికే కాల్ చేశాను..." అన్నది.

ఆ మాటల్లో బోలెడంత ఓటితనం.

"నువ్వు ఊరికే ఫోన్ చెయ్యవే?" ఆ మాటల్లో మోకరీ ఏదో కావాలి కాబట్టే ఫోన్ చేసిందనా?!

అంటే?!

ఏదో సుడిగుండంలాంటి భయం...

మర్నాడు పొద్దున్నకు జ్వరం వచ్చినంత పనైంది. కానీ పట్టుదలగా మర్నాడూ ప్రయత్నించింది. ఏవేవో పిచ్చి పిచ్చి తుది మొదలు లేని ఆలోచనలు. తన ఆలోచనలు తనకే భయంగా వున్నాయి.

సాయంత్రం మధు తండ్రి కోసం ఎస్.టి.డి. చేశాడు. తండ్రి ఆఫీసులో ఉద్యోగం అతనికి.

తండ్రికి కనెక్ట్ చేసేముందు,

"మధూ! ట్రై చేస్తున్నాను... బోర్‌గా భయంగా వున్నది..." అన్నది.

"ఏమిటి?"

ఏమిటి! ఏమిటని చెప్పాలి... అసలా ప్రశ్న ఏమిటి? నాతో నేను బ్రతకడం అని చెప్పాలా?!

"అది కాదు... రొటీన్‌గా కాక, ఏదో డిఫరెంట్‌గా ట్రై చెయ్యమన్నావుగా..."

"లైబ్రరీకి వెళ్లు... బుక్సు తెచ్చుకో..."

"ట్రై చేస్తాను..."

లైబ్రరీకి వెళ్ళింది. చాలా ఫాసినేటింగ్‌గా అనిపించింది. ప్రపంచంలో ఇన్ని పుస్తకాలు, ఇవి అసలు చదివేవాళ్ళు వుంటారా? ఎన్ని జన్మలు పడతాయి?

కాసేపు తరవాత... ఏదో పుస్తకాల మెతక వాసన... తీసిన పుస్తకాల్లో చించేసిన పేజీలు... వెధవ మనుష్యులు!

పుస్తకాల సంస్కారం వేరు... అది తెలియని మీనాకు కచ్చ పుట్టింది. అన్ని పుస్తకాలు ఒదిలేసి తిరిగి వచ్చేసింది. ఏదో బుక్ షాపు నుంచి పుస్తకాలు కొన్నది. కావాలనే కుక్కరీ బుక్ దగ్గర నుంచి, ఫిలాసఫీ బుక్ దాకా కొన్నది. ఇంటికి వచ్చి, బెడ్ మీద అన్నీ పరుచుకుని... ఒక్కొక్కటీ తియ్యనూ... ఏకాగ్రత రెండో పేజీకీ పోవడం... మత్తులోకి జారిపోవడం... విసుగు...విసుగు.

సాయంత్రం కొత్త టెక్నిక్స్ ప్రయత్నించింది.

గుడికి వెళ్ళింది.

ఆ క్యూలు, ఆ జనాలు, ఆ కొబ్బరికాయలు, పూజారుల చెమట, హారతి కర్పూరం, కుంకుమ - మూడూ కలిసిన తడిసిన ఏదో భయంకర వాసన. చెమటతో తడిసిన పట్టుచీరలు, కారిపోతున్న కుంకాలు, హిస్టీరికల్‌గా కనిపిస్తున్న భక్తి, పట్టుపంచల సెక్స్ అప్పీళ్ళూ దొంగ చూపులు...

దక్షణనుబట్టి ప్రసాదం...

ఛీ! ఛీ!... మందలోని జనం... భగవంతుడంటూ వుంటే ఎలా కనబడతాడిక్కడ?!

నామ ఘోష వింటూ, చెవులు రెండూ మూసుకుని, తప్పించుకు పారిపోయి, కారు వున్నదని కూడా మర్చిపోయి ఆటోలో వెళ్ళి బీచ్‌లో దిగిపోయింది మీనా...

బీచ్‌లో కూర్చుంది కాసేపు. వెన్నెల, చల్లగాలి హాయిగా వున్నాయి. కానీ అది ఎంతో సేపు లేదు... కాలి పట్టా ఇసుకలో పారేసుకున్న ఎత్తు ముక్కు అరవ పిల్ల "పాతీశా మామీ!" - అంటూ ఆమె చుట్టూ తిరుగుతోంది. బటాణీ సుండల కుర్రాళ్ళు ఎలాగైనా కొనమని సేల్స్‌మెన్‌షిప్ ప్రకటిస్తున్నారు. ఎవరో గట్టిగా రన్నింగ్ కామెంట్రీలా ఒకటే కబుర్లు. ఏదో చీప్ టాక్.

విసుగుపుట్టి ఇంటికి వచ్చేసి, మంచం మీద బోర్లా పడుకుని నిద్రపోయింది.

పొద్దున్నే తొమ్మిది గంటలకు లేచింది. మాచింగ్ బ్లౌజు కోసం చీరలు తీసింది. స్నేహితురాళ్లకు ఫోన్ చేసింది. హాయిగా షాపింగ్ చేసుకున్నది. సాయంత్రం మూవీ, ఐస్‌క్రీం పార్లర్. ఐదారుగంటలు ఎసి షోరూముల్లోనూ, థియేటర్లలోనూ, పేవ్‌మెంట్ మీద ఎక్కడా ఆమె ఉత్సాహం అణగలేదు... ఏవేవో మాట్లాడుతూనే వున్నది. స్టార్ క్రికెటర్స్, టి.వి. ప్రోగ్రామ్స్, ఎవడో రోమియో... ఒకటేమిటి? వెరైటీ టాపిక్స్... నోరు మూతపడలేదు ఆమెకు.

ఆ మర్నాడు ఏదో ఫ్లవర్ షో...

మూడో రోజు ఏదో ఫైవ్‌స్టార్ హోటల్లో ఏన్‌టిక్స్ ఎగ్జిబిషన్... ఐదారుగురు స్నేహితురాళ్ళు గుంపుగా వెళ్లడం, డ్రస్సింగ్‌కే ఒక గంట, హాయిగా తుళ్లుతూ కబుర్లు.

ఆ తరువాత మధు వచ్చి,

"ఎలా వున్నావ్?" అనేదాకా ఆమెకు తన ప్రయత్నం గుర్తుకురాలేదు.

"బాగానే వున్నాను..."

"ఏమైంది నిన్ను నువ్వు తెలుసుకునే ప్రయత్నం?" మునిపంటితో పెదవి నొక్కి పెట్టి తమాషాగా నవ్వుతూ అడిగాడు.

"నా మొహంలా వున్నది... ఏం బాగాలేదు..."

"ఎందుకని?"

"ఎందుకని అంటే..." మాటలకు తడుముకున్నది.

"అంటే... నీతో నువ్వు ఏ మాత్రం బ్రతకలేకపోయావన్న మాట... నీ ఒంటరితనం నిన్ను చాలా భయపెట్టినట్లుంది!"

అవును, కాదు... అన్నట్లు తలూపింది!

తను చేసిన ప్రయత్నాలు చెప్పింది. తన ఫీలింగ్స్ చెప్పింది. తనను కొన్ని పరిస్థితులు ఎంత డిప్రెషన్‌లో పడేశాయో, ఎంత కచ్చ పుట్టించాయో కొంచెమే చెప్పింది.

నవ్వాడు మధు...

"ఆ తరువాత మూడు రోజులు?!"

"హాయిగా ఉన్నాను..." రిలీఫ్‌గా అన్నది.

"నిజమే... హాయిగా వున్న ఆ మూడు రోజుల ఖర్చు, అందులో ఉపయోగపడే ఖర్చు... పేపరు మీద రాయి."

దెబ్బతిన్నట్టు ఒక్కసారి తలెత్తి చూసింది మీనా.

ఒద్దనుకుంటూనే మనసులో ఉజ్జాయింపుగా లెక్కలు వేసింది... సగటున రోజుకు వెయ్యి రూపాయలు!

"నువ్వు ఎంత ఖర్చుపెట్టావో నాకు చెప్పద్దుకానీ, నీ మనశ్శాంతి ఖరీదు రోజుకు 'అంత' అని అర్థమైందా?!"

అతని వంకే చూస్తూ వుండిపోయింది మీనా.

"పిచ్చి మీనా!... ఇది నిజమైన మనశ్శాంతి అయితే, కొనుక్కున్నా తప్పులేదు. కానీ మీ ఖర్చులో గిల్టీనెస్ వున్నది. తప్పనిసరి వున్నది. దేన్నో తప్పించుకోవాలన్న భయమున్నది. ఇన్‌సెక్యూరిటీ వున్నది... ఏనాడూ లేనిది ఇన్ని షాపింగ్ ఆర్కేడ్స్ ఎలా వెలుస్తున్నాయంటావు?! ఎన్నో లక్షల బట్టల షాపులు?! ఎవరూ తెలివితక్కువగా బిజినెస్‌లు ప్రారంభించరుగా?... మీ వర్గాన్ని వాళ్ళు

గుర్తుపట్టారు. సమ్‌థింగ్ డిఫరెంట్, సమ్‌థింగ్ యూనిక్ అనే మీ ఇన్‌సెక్యూరిటీకి అనువాదం వాళ్లకు అర్థమైంది. మీ టెన్షన్‌ను వాళ్ళు క్యాష్ చేసుకుంటున్నారు... ముందు టెన్షన్... దాన్నించి బైటపడటానికి తిండి కొంతమందికి రిలీఫ్ అయితే, షాపింగ్ కొంతమందికి... ఇదొక జబ్బు... ముందు సంఘంలో రోగుల్ని తయారుచేసుకుని, వాళ్ళ మీద ఆధారపడి బ్రతికే బిజినెస్‌మెన్ దేశమంతటా వున్నారు... అసలు మీకు..."

విడిగా మధు ఈ మాటలు చెప్తే ఎలా వుండేదో. కానీ వంటింటి గుమ్మంలో పనివాళ్ళు, ఏమిటో? అన్నట్లు చూస్తున్న పెద్ద వదిన – ఎవరైనా వింటున్నారు, చూస్తున్నారు అన్న టెన్షన్‌లో జీవితంలో ఎన్ని విలువైనవి పోగొట్టుకుంటామో ఆ తరవాత చాలాకాలానికి అర్థమైంది మీనాకు.

కానీ, అప్పుడు మాత్రం...

"అంటే నీ ఉద్దేశం?"... దెబ్బ తిన్న ఆడపులిలా అరిచింది. నానా మాటలు మాట్లాడింది. 'నీకు కలలో కూడా దొరకని జీవితం నాకు వున్నది కాబట్టి నీకు అసూయ...' అన్నంత నీచంగా చాలా చాలా మాట్లాడేసింది.

తల వంచుకుని వెళ్ళిపోయాడు మధు. ఆ మర్నాడే రిసిగ్నేషన్ పంపించాడు.

వెంటనే నాన్నగారు, అన్నయ్య చెప్పిన సంబంధం ఒప్పుకున్నది. "నాలుగు డిస్టిల్లరీలు, ఐదు ఫ్యాక్టరీలు ఒక పక్క, రెండు ఫైవ్ స్టార్ హోటళ్ళు, నలభై ఎస్టేట్స్ మరొక పక్క –" ఎంత గొప్ప పెళ్ళి అని సంతోషించారు కొందరు.

"ఆ! తప్పించుకున్న ఛార్జ్‌షీట్లు, కనీసం ముప్పై మర్డర్లు ఒక పక్క, బాంబు కేసులు, విదేశీ స్మగ్లింగ్, పద్దెనిమిది రేప్ కేసులు మరొక పక్క..." అన్నారు గిట్టనివాళ్ళు.

కానీ, మీనా దాదాపు మూడు నెలలు ఫ్లైట్‌లో వెళ్ళి షాపింగ్‌లు చేసుకుంది. ఆ తరువాత పెళ్ళి, హడావిడి, హనీమూన్, కనీవినీ ఎరగని బహుమతులు, సొంత బంగ్లా, అతిథులు, పార్టీలు – చీరల మెయిన్టెనెన్స్‌కే వారానికి ఒక రోజు తప్పడం లేదు. వచ్చే జనం, పొయ్యే జనం.

ఏదో జైంట్‌వీల్ కుదుపులులా కొన్ని థ్రిల్లింగ్‌గా, కొన్ని భయంగా...

కాన్పు... పాపాయి... భర్త మీద కేసులు, బిజినెస్ టెన్షన్. అదంతా డ్రింక్స్ మీదా, భార్య మీదా తీర్చుకోవడం. ఆమె చుట్టూ సర్వవ్యాపకమైనది ఒకటే... టెన్షన్. గొంతు తడారిపోయే టెన్షన్. ఆమె ముఖం ముడుపులో ఏదో నిరంతర ఆందోళన... కళ్ళు పాలిపోయి... ఎన్ని బ్యూటీపార్లర్స్ కూడా ఆమె స్నిగ్ధ సౌందర్యాన్ని తిరిగి ఇవ్వలేకపోతున్నాయి. లావైతే భర్త కామెంట్ చేస్తాడని డైటింగ్‌లు... టెన్షన్, ఆకలి తగ్గాలంటే షాపింగ్ ఏవో, ఏవేవో కొనిపడెయ్యడం, ఆ కొన్నవాటి ప్రదర్శనకు పార్టీలు...

కొన్నవి ఎవరికైనా చూపించకపోతే ఎలా? నిద్దర రాదే?! చూడాలి... మెచ్చుకోవాలి... కానీ ఆ మోడల్ నగో, చీరో ఎవరైనా కాపీ కొడితే భరించలేక మార్చెయ్యాలి... తన యూనిక్‌నెస్ పోదూ?...

షాపింగ్ ఆర్కేడ్‌లో అడుగు పెడుతున్నప్పుడల్లా విధిగా మధూ, అతని మాటలూ గుర్తుకువచ్చేవి.

జీవితం అయిపోయింది అనిపించే విసుగు ఛాయలు...

ఖర్చుపెట్టుకోవడానికి బీరువాలోనించి డబ్బులు తీసుకోవడంలో తప్ప మరే విషయంలోనూ భర్తకూ, ఆమెకూ సయోధ్య లేదు.

బీరువా... మొద్దుగా... ఎత్తుగా... మొరటుగా... భర్తలా... ఉలిక్కిపడుతోంది ఆమె.

"నువ్వు దొరకడం నా అదృష్టం మీనా!" అని హనీమూన్‌లో అన్న భర్త.

"నిన్ను భరించడానికి నీ బాబు కానుకలంటూ కట్నంగా పాపపు సొమ్ము చాలా ఇచ్చాడుగా... తప్పదు మరి..." అంటున్నాడిప్పుడు.

మొదట్లో చెలరేగి, ఆర్గ్యుమెంట్స్ చేసి, మీ బతుకులు మాకు తెలియవా అని ఇద్దరూ కచ్చకొద్దీ అసహ్యంగా కొన్ని నిజాలు బైటపెట్టుకునేవారు. ఆ తరవాత అతను డ్రింక్స్‌కు, ఆమె షాపింగ్‌లకు, ఆ తరువాత,

"ఆర్గ్యుమెంట్స్ కామన్‌సెన్స్‌ని చంపేస్తాయి మీనా!..." అనే మధు మాటలు గుర్తుకువచ్చి మౌనం నేర్చుకున్నది.

తన జీవితంలో ఏదో ఓటితనం... మహాశూన్యం...

అలంకారాలు, నగలు, చీరలు, బహుమతులు – ఇవన్నీ ఆ ఓటితనాన్ని కప్పిపుచ్చడం లేదిప్పుడు.

సూర్యోదయాన్ని చూసి ఆగిపోతోంది ఇప్పుడు ఆమె. స్విమ్మింగ్ పూలులో చంద్రోదయం... చిన్ని కొలనులో విచ్చిన తామర పూవులు.. ఇవన్నీ ఇంటీరియల్ డెకరేటర్ అలంకారాలకు పెట్టించాడు ఒకప్పుడు. కానీ... ఇప్పుడు ఆమెకు వీటిల్లో ప్రాణమున్నదనిపిస్తోంది.

మధు... మధు...

చాలాసార్లు గుర్తుకు వస్తున్నాడు అతను... కానీ... కానీ... ఈ ఆకుపచ్చని లాన్ల మీద అతని అడుగులు ఇప్పుడు కావు, ఎప్పుడూ పడవు. ఈ మొలకెత్తుతున్న సౌందర్యాలకు అతని స్పర్శ, స్పందనల కాంతిపుంజాలు అందవుగాక, అందవు.

ఆమెలో ఏదో నెమ్మది, భరించగలిగినంత నిశ్శబ్దం. అటువంటి సమయంలో ఫారిన్ ముద్రతో ఒక కవరు.

"నా తేజస్వినీ!"

ఆ సంబోధనకు ఉలిక్కిపడింది. సంతకం చూసింది. ఆమె ఒళ్లు ఝల్లుమన్నది. మెల్లగా చదవడం ప్రారంభించింది.

"ఎవరనుకున్నావు మీనా? నువ్వే... నువ్వే... నేను ఇది చేస్తాను... అది చెయ్యను అని అనుకునే వ్యక్తి దారుణంగా చాలా పోగొట్టుకుంటాడు. అటువంటి వారిలో ప్రేమబీజాలు పడవు. పడినా మొలకెత్తవు మీనా!... ఈ మాటలు జె.కె.వి.

ఎదటి మనిషిని పోగొట్టుకుంటానేమోనన్న భయం ఒక్కొక్కప్పుడు మనిషిలో మంచిగా కనబడాలన్న తపన ఏర్పడవచ్చు. అది హిపోక్రసీ. కానీ, కనీసం... నువ్వు ఆనాడు... మనం విడిపోయిన రోజు ఆ నాటకం ఆడలేదు. అనవసరంగా ఇద్దరం ప్రలోభానికి లోనై, జీవితాంతం కట్టుబడి బందలుగా మారిపోయి వుండేవాళ్లం.

కానీ, నీకొక విషయం తెలుసా మీనా!! ఇప్పుడు చెపితే నీకు అర్థమౌతుంది.

నిన్ను నేను విపరీతంగా ప్రేమించాను. ఆరాధించాను. 'ఏం చూసి' అని అడగకు. ఆ ప్రశ్నకు జవాబు వెతికితే, కొన్ని అద్భుతమైన ప్రేమ కథలకు అర్థాలే వుండవు. నువ్వు ఎలాగో వుండాలనుకునేవాణ్ణి, నిన్ను మార్చాలని నేను ఎన్నో నేర్చుకున్నాను. నీకు చెప్పాలని నేను ఎంతో చదువుకున్నాను. కానీ, నాకు జీవితం అంత అవకాశం ఇవ్వలేదు.

ఆ రోజు పార్టీలో ఇన్నేళ్ల తర్వాత నిన్ను చూసినప్పుడు ఆశ్చర్యంగా నీలో నేను వెతుక్కునే నువ్వు కనబడ్డావు. ఆశ్చర్యపోయాను. భయపడ్డాను. బాధపడ్డాను. కాలపు నిశ్శబ్దపు చక్రాలను వెనుకకు తిరగమని ప్రార్థించాను.

కానీ ఇదంతా భ్రమ.

``His beloved embodees the beauty that his innermost soul seeks" - అంటాడు ఖలీల్ జిబ్రాన్.

ఇంతకాలం "నువ్వేమిటి?" అంటూ బాధపడ్డాను.

ఈనాడు నువ్వేమిటిలా? అనుకుని నివ్వెరపోతున్నాను.

నా గుండెల్లో రూపుదాల్చిన తేజస్వినిని ఈనాడు నీలో చూసి నిశ్శబ్దంలోకి పారిపోతున్నాను.

నేను నీ నుంచి... నీలోకి...

- నీ మధు"

తను ఈ మధ్య ఏర్పరుచుకున్న లైబ్రరీలో మౌనంగా కూర్చుంది మీనా... ఆ అక్షరాల కిరణాల గజిబిజి చీకటి సౌధంలాంటి ఆమె జీవితంలోకి ఒక్కసారిగా నిశ్శబ్దపు తలుపులు తోసుకుని ప్రవేశించింది.

ఆ తరువాత... ఆ తరువాత ఆమె మామూలుగానే వున్నది ప్రపంచం దృష్టిలో.

కానీ, ఇప్పుడు ఆమె ఎప్పుడైనా ప్రేమ గురించి ఎవరైనా మాట్లాడినా, విన్నా, ఎక్కడన్నా చదివినా... ఆమె పెదవుల మీద అర్థవంతమైన చిరునవ్వు...

ఆ అర్హత రావడం... అది మామూలు విషయమా మరి?!

*('ఆంధ్రజ్యోతి' దీపావళి ప్రత్యేక సంచిక - నవంబరు, 1994)*

# వియద్గంగ

'ఆమె రావాలని ఎంత కోరుకుంటున్నాడో,... రాకూడదని అంతగా అనిపిస్తోందా?'... ఆలోచిస్తున్నాడు కశ్యప్.

నిరీక్షణ... వచ్చే మనిషి ఉనికి వల్ల అది తియ్యగానో, బాధగానో, భయంకరంగానో ఉంటుంది.. విషయం ఎంత స్వచ్ఛమైనదైనా మన భావవలయాల ఉచ్చు స్వచ్ఛమైన వాటి చుట్టూ ఆవరింపచేసి రూపం, రంగు, భావం - అన్నీ ఆపాదించి... మళ్లీ అదే మన సమస్య అనుకుంటాము.

మందాకిని కోసరం ఈ నిరీక్షణ... ఇది బాధగా ఉన్నదా లేదా అంటే... చెప్పలేని స్థితి.

బీరువాలో అడుగున దాచిన చెల్లెలు రాణి ఉత్తరం... అతని ఊహల్లో రెప రెపలాడుతోంది.

'ఆ మహాతల్లి పేరు మందాకిని... మా ఆయనగారి పై ఆఫీసరు... విధవ. ఆవిడ మోజులో పడి రాజా నన్ను, సంసారాన్నీ, బాధ్యతల్నీ... అన్నీ మర్చిపోయారు... విపరీతంగా తాగుతున్నారు. అన్నయ్యా!... మీ ఇద్దరు కృష్ణార్జునుల్లా ఉండేవారు... అందుకే నన్నిచ్చి రాజాకు పెళ్ళి చేశావు... నా సంసారం నిలబెట్టే బాధ్యత నీదే... నన్నెంత గారాబంగా పెంచావన్నయ్యా! నాకిప్పుడు చచ్చిపోవాలనుంది..."

ఇవి రాణి రాసిన సుదీర్ఘమైన లేఖలో అక్కడక్కడ ఉండే కొన్ని వాక్యాలు... వాటిల్లో బాధ, అమాయకత్వం, ఇంపల్సివ్‌నెస్... చాలా ఉన్నాయి.

అన్నగారుగా చాలా బాధ పడుతున్నాడు కశ్యప్.

గ్రాడ్యుయేట్ అయి ప్రపంచ జ్ఞానం బొత్తిగా లేని అమాయకురాలైన చెల్లెల్ని చూసి మనిషిగా. జాలిపడుతున్నాడు.

కానీ, రాజా కోసరం దుఃఖపడుతున్నాడు కశ్యప్.

"ఈ ఉత్తరం టెలిగ్రాంగా భావించి బైలుదేరిరా" అని రాసింది చెల్లెలు.

కానీ వెళ్లలేదు. వెళ్లడం వలన ప్రయోజనం ఉండదని తెలుసు; దుఃఖంలో తోడు, సానుభూతి అవసరం ఉండచ్చు. కానీ తన బలహీనతలు తప్పు అన్నవాళ్లను, అడ్డం వచ్చిన వాళ్ళను ముందు శత్రువుల్లాగా చూస్తాడు మామూలు మనిషి. అందులో రాజాలాంటి సెన్సిటివ్ వ్యక్తి అసలు భరించలేనిది "మంచి స్నేహితుడి దగ్గర నుంచి వచ్చే హితవచనాలు..."

అందుకే వివరాలు సేకరించాడు...

ఈ మందాకిని ఎవరో కానీ... రాజా చాలా ప్రలోభంలో ఉన్నాడు. ఆవిడ ప్రభావం అతణ్ణి తాగుబోతుగాను, బాధ్యతలు మర్చిపోయేవాడిగానూ చేసింది. స్నేహాలను, ఎఫైర్స్‌ను భరించి అర్థం చేసుకోలేని స్థితిలో లేడు కశ్యప్... కానీ, దేని పరిణామమైనా కానీ, మనిషి, అతని ఔన్నత్యాలను దిగజారుస్తూ ఉంటే మాత్రం అదెంత గొప్పదైనా గౌరవించక్కర్లేదన్న విషయం కశ్యప్‌కు తెలుసు.

తను వేసే ప్రతి అడుగు తూచి వెయ్యాలని తెలుసు అతనికి. విషయస్ఫూర్తి, సమయస్ఫూర్తి - ఈ రెండూ ఉండాలి.

మందాకిని వైజాగ్ కాంపు మీద వచ్చిందని తెలిసి వెళ్ళి పరిచయం చేసుకున్నాడు... డిన్నరుకు ఆహ్వానించాడు.

వెంటనే ఒప్పుకున్నది ఆమె.

ఆలోచనలలోనించి చటుక్కున తలెత్తి చూశాడు కశ్యప్ కారు శబ్దానికి.

ఆమె కారులోనించి దిగుతోంది.

ఆవిడలో ఒక ప్రత్యేకత ఉంది. ఏ వాతావరణంలోనైనా కలిసిపోయినట్లే ఉంటూ, తనకు తనుగా విడిగా కనిపిస్తూనే ఉంటుంది.

మర్యాద పరదాలు చుట్టుకున్న బోలెడన్ని ఓటి మాటలు. "మీ శ్రీమతిగారు ఊరెళ్లారన్నారు... కానీ మీ ఇల్లు చాలా నీట్‌గా శుభ్రంగా..." అన్నది అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ మందాకిని.

ఆ ధ్వనికి నవ్వుకున్నాడు కశ్యప్... 'సమర్థురాలైన స్త్రీమూర్తికి సాధారణంగా భర్త హోదాల వెనకాల బ్రతికే భార్యల గురించి ఒక తమాషా భావన ఉంటుంది. ఇల్లాళ్లతో మాట్లాడితే మెచ్చుకోగలరు... వారు లేనప్పుడు వెటకారం ధ్వనించగలరు.

"నాకు ఇలా ఉండటం ఇష్టం... నా ఇష్టాలకోసరం మరొకరిమీద ఆధారపడే తత్వం నాకు లేదు..."

"గుడ్... చాలా మందిలా శుచికి, రుచికి, శుభ్రానికి మరొకర్ని బాధ్యుల్ని చెయ్యరన్నమాట..." నవ్వేస్తూ అన్నది మందాకిని.

ఈవిడతో అసలు విషయం ఎలా మాట్లాడాలో అర్థంకావడం లేదు కశ్యప్‌కు.

ప్రతి మనిషిని ఉలిక్కిపడేట్లు చేసే కొన్ని విషయాలుంటాయి. అవి మనిషి బలహీనతలవచ్చు... స్ట్రాంగ్ పాయింట్లు కావచ్చు.

మరి ఈవిడను స్పందింపచేసేవి ఏమిటట?!

సాధారణంగా సౌందర్యవతికి ఉండే సౌందర్య పిపాసా?!

ఏ మాత్రం సున్నితత్వం ఉన్నా కోరుకునే గుర్తింపు, ఆరాధనా?! లేక బాధ్యత లేని తేలిక సుఖాలా?!

అంత తొందరగా దొరకడం లేదు మందాకిని మాటలకు...

రాగచ్ఛాయల్లో ఇమడని ఆలాపన ఆమె. కొంపదీసి దొరకదని తెలిసినా దేనికోసమో అన్వేషణా?! ఏమిటది?!

ఆమె శారీరక పక్వంలో జిలుగు ఉన్నది; లాలస లేదు. ఆమెకు సౌందర్యవతినని తెలుసు; కానీ ప్రశంసించినప్పుడు చాలా సున్నితంగా మాట మారుస్తున్నది... ఆ ప్రయత్నంలో నిజాయితీ ఉన్నది.

"మీరు కళాకారిణులా? ఏదైనా ఆర్ట్ అంటే..."

"అబ్బే లేదండీ! If appreciation is the greatest art, I am an expert in it..." అన్నది.

భగవంతుడు చాలా గొప్ప ఆబ్స్ట్రాక్ట్ సబ్జెక్ట్... అలా ప్రయత్నిస్తే?!

ఆ విషయం వైపు సంభాషణ తిప్పాడు.

"నాకు అర్థం కాని చాలా విషయాలకు కారణం భగవంతుడనుకుంటాను. That is an answer to my question. It is not by itself a question-" అన్నది.

మెల్లిగా అలా మాటల అడ్డుగోడలు దాటారిద్దరూ... లాన్‌లో కుర్చీల్లో కూర్చుని, దోరగా వేయించిన జీడిపప్పు నోట్లో వేసుకుంటూ, క్రిస్టల్ గ్లాసులో వట్టివేరు, పచ్చకర్పూరం కలిపిన నీటిని సిప్ చేస్తూ మాట్లాడడం... "ఇదేమిటి?" అని లౌక్యం ఊహను నిలబెట్టి ప్రశ్నించకుండా గడిపెయ్యగలిగిన కొన్ని గంటలు... చాలా గొప్పవి... అటువంటి క్షణాలు దాచుకోగలిగిన అదృష్టవంతులు చాలా చాలా తక్కువ మంది. ఫలితం ఏదన్నా కావచ్చు... ఆమె సాన్నిధ్యం గొప్ప అనుభవం.

అదేమిటో విశ్లేషించుకుంటున్నాడు. కశ్యప్ లోలోపల. The greatest blessings come by way of madness... indeed of madness that heaven seat..." అన్నాడు సోక్రటీస్.

రాజారావు నిజంగా ఈవిడ అపరిమిత స్నేహాన్ని పొంది ఉంటే, ఒక రకంగా అదృష్టవంతుడు.

కానీ... ఈ కాసేపట్లో ఒకటి అర్థమైంది కశ్యప్‌కి; అతడు ఆమెను అతిగా ఇష్టపడి, దగ్గర అవలేక వ్యసనానికి బానిస అయి ఉండాలి... ఎందుకంటే, ఎవరూ ఈవిడకు ఎదురుపడి "నువ్వు నా దానివి..." అని అనలేరు... అది మాత్రం నిజం...

మరి ఈవిడ?!

పరిస్థితి ఎటువంటిదైనా, కశ్యప్‌లాంటి వ్యక్తి కేవలం చెల్లెలి కన్నీళ్ళు మాత్రమే ఆలోచించలేదు. 'మందాకిని మంచి కూడా ఆలోచించగలడు.' కానీ రాజా, మందాకినిల స్నేహఫలితం గొప్పగా లేదు... రాజా సర్వనాశనమైపోకముందే జాగ్రత్త పడాలి... బావమరిది అనేకాదు... మంచి స్నేహితుడు కూడ అతను.

"ఊఁ" అని నిట్టూర్పు విడిచాడు కశ్యప్ ఆలోచిస్తూ... ఒక్కసారి తలెత్తి చూసింది మందాకిని.

అప్పటికే, అపరిచితుల మధ్య ఉండే మొహమాటం, స్నేహితుల మధ్య ఉండే సన్నిహితత్వం... ఈ రెండు స్థితులు దాటిపోయారు ఇద్దరు... అతని మాటల్లో

అంతర్గతంగా ఏదో ధ్వని తాటాకు ఛాయలు పట్టుకుందామని ఆమె కూడా ప్రయత్నిస్తోంది.

ఇంత స్నేహమయి, ఆకర్షణమూర్తికి ఎలా ఏమిటి తెలియచెప్పాలో అర్థం కావడంలేదు కశ్యప్‌కు.

"మీ పాప ఫోటోనా?" టేబిల్ మీద ఉన్న తెల్లటి ఫ్రాక్‌తో ఉన్న చిన్నపిల్ల ఫోటో చూస్తూ అడిగింది ఆమె.

"కాదు... మా చెల్లెలిది... వాణిది..." ఆమెనే చూస్తూ అన్నాడతను.

"నాకు తనంటే చాలా ఇష్టం మందాకినీ!... నాన్న, అమ్మ పోతే చాలా ప్రేమగా, గారాబంగా పెంచుకున్నాను..."

ఛటుక్కున తలెత్తి చూసి, ఆ ఫోటోనే తదేకంగా చూస్తూ-

"మీ చెల్లెలు రాణి అదృష్టవంతురాలు. మీలాంటి అన్నగారు, రాజారావుగారి లాంటి భర్త దొరికారావిడకు..." అన్నది.

ఆ గొంతులో అణుచుకుంటున్న ప్రకంపన.

మళ్లీ గభాలున మామూలుగా: "నిజానికి వీళ్లిద్దరు మీ గురించి మాట్లాడని రోజు ఉండదు. అందుకే.. మీరు ఎలా ఉంటారా అని చూడాలనే పిలవగానే వచ్చాను..." నవ్వేస్తూనే అన్నది.

"ఎనీ రిగ్రెట్స్?" సూటిగా చూస్తూ అడిగాడు కశ్యప్.

"అబ్బే... లేదు... ఎక్కువగా మీ గురించి వాళ్ళిద్దరికీ చాలా చాలా తక్కువ తెలుసేమోననిపిస్తోంది నాకు ఇప్పుడు..."

"థాంక్స్... మీకు మనుష్యుల గురించి స్టడీ ఎక్కువేమో..." పరీక్షగా చూస్తూ అన్నాడు.

"అవును... నా ఒంటరితనం నన్ను ఒదిలెయ్యలేదు... అబ్జర్వేషన్ నేర్పింది..." ఆమె నవ్వినప్పుడు ఆ కాటుక కళ్ళకింద సన్నటి గీతలు.

స్త్రీత్వపు పరిధులు దాటి ఎదుగుతున్న సమయంలో సెక్స్‌లెస్ సౌందర్యం వుంటుంది. ఆ విషయం అర్థమైన ఆడవాళ్ళు చాలా తక్కువమంది. మందాకిని ఆ స్థితి అర్థంచేసుకున్నది.

"మీరు మరోలా అనుకోకపోతే మీరు మళ్ళీ పెళ్ళి ఎందుకు చేసుకోలేదు మందాకినీ?"

ఆమె మాట్లాడలేదు - మునివేళ్ళ మధ్య అతను కోసిచ్చిన విచ్చీ విచ్చని రోజా మొగ్గ, సున్నితంగా, ముద్దుగా, అలవోకగా...

"చెప్పడం ఇష్టం లేకపోతే..."

"అబ్బే అదేం లేదు... నా వైవాహిక జీవితం అంత గొప్పగా లేదు. నాకు ఆ అనుభూతిలో అందం కనిపించలేదు. అందుకే, అతను చనిపోయిన తరవాత మళ్ళీ కమిట్ అవడం అనవసరం అనిపించింది..."

"ఓ... సారీ... అసలు ఈ పెళ్ళిళ్ళు ఇలా అయిపోవటానికి ఈ కాన్సెప్టుకు మన దేశంలో మనం ఇచ్చే గౌరవానికి, మనిషికి కావలసిన స్వేచ్ఛకు మధ్య ఏదో అగాధం ఉందనిపిస్తోంది..."

"అవును... ప్రపంచంలో చాలా చోట్ల అది అగ్రిమెంటు. మన దేశంలాంటి కొన్ని చోట్ల మాత్రం అది వ్యవస్థ... భర్త, భార్య అన్నవి మనుషుల భావాలమీద కన్న ప్రోటోకాల్స్ ఉన్న పదవుల్లా మారిపోయాయేమో..."

"అవును... ప్రకృతి సిద్ధమైన చట్టాలకు, మనిషి తయారు చేసే చట్టాలకు చాలా తేడా ఉంది..." వంటమనిషి తెచ్చిన డిన్నరు ప్లేట్లలో సర్దుతూ అన్నాడు కశ్యప్.

లాన్‌లో ఆకుపచ్చటి చీకటిలో ఎఱ్ఱటి గార్డెన్ టేబుల్ మధ్య తెల్లటి పాలరాయి శిల్పంతో మలచిన దీపకన్య... అతని అభిరుచిని గమనిస్తోందామె... ఇటువంటి మనిషికి ఎటువంటి చెల్లెలు?!

ఆమెనే గమనిస్తున్నాడు క్రీగంటన కశ్యప్. తెల్లటి చీరమీద ఎఱ్ఱ రోజాపూవుల ఎంబ్రాయిడరీ... ముత్యాలనగలు... ఆమె ఆ చక్కటి వాతావరణంలో ఇమిడిపోయినట్లు... విశ్వ విపంచిలో లయించిపోతున్న హ్రీంకార నాదంలా, సూర్యాస్తమయంలో కలిసిపోతున్న కాంతిరేఖలా, తమాషాగా ఉన్నది.

"అదేమిటి? మీరు భోజనం చెయ్యరా?" అరిటిపళ్ళు, పాలు తాగి సరిపెట్టుకుంటున్న అతణ్ణి చూస్తూ అడిగింది.

"అవును."

"ఎందుకని? డైటింగ్?"

"కాదు"

"మరి?"

"నవ్వనంటే చెప్తాను..." నలభయ్యవ పడిలో ఉన్న అతని నవ్వులో స్వచ్ఛత ఉన్నది.

"ఛా! ఛా! చెప్పండి..."

"మొక్కు."

"మొక్కా? యు మీన్..."

"అవును... మనం ఏదన్నా కోరుకుంటే, ఏదో మనకు చాలా ఇష్టమైనది ఇవ్వాలి, కష్టమైనది చెయ్యాలన్నది ప్రకృతిసిద్ధమైన చట్టం... బహుశః ఈ మొక్కుకు అదేనేమో అర్థం... మనం సులభంగా చెయ్యగలిగినదాన్ని ముడుపు కట్టడంలో అర్థం లేదేమో..."

"అంటే..." ఆలోచిస్తూ అడిగిందామె... ప్రశ్న ఎలా ఉన్నా, అతని మాటల్లో అంతరార్థానికి వెతుకులాట అది.

"మీరు డగ్లాస్ రాసిన 'మాగ్నిఫిషియంట్ అబ్సెషన్' చదివారా?!"

"లేదు."

"చాలా గొప్ప నవల... ఒక డాక్టరుగా అది దాదాపు నాకు భగవద్గీత లాంటిది... ఒక మనిషిలో దాక్కున్న గుప్త శక్తులు ఉదాత్తమైన స్థితిని పొందాలంటే, నిస్వార్థ తత్వంతో కూడుకున్న ఒక్క క్రియ చాలు అంటాడు... చాలా గొప్ప పుస్తకం... తప్పకుండా చదవండి..."

"ష్యూర్... కానీ, మీరు చెప్పే మొక్కు..."

"అదేనండీ! నాకు తిండి వీక్‌నెస్... అందుకనే, నేను చాలా ఇష్టమైనదాన్ని దూరంచేసుకుని, నేను ప్రార్థిస్తున్నదాన్ని పొందాలని నా ప్రయత్నం..."

ఆ చీకటి చీల్చుకుని ఆమె చూపులు అతణ్ణి ప్రశ్నిస్తున్నాయి. అతని మాటల్లోని ధ్వని తరంగాల్ని అనువదించాలని ప్రయత్నిస్తున్నాయి. అంతర్గతంగా ఉన్న భావ సౌందర్యాల యవనికలు చీలుస్తున్నాయి.

"మీరు ఇంత ప్రయత్నం చేసేది దేనికోసరం డాక్టర్?" అడగక తప్పని ప్రశ్న.. ఆమె గొంతులో సన్నటి జీర.

"నా చెల్లెలు సాంసారిక జీవితంలో సుఖంగా ఉండాలని నా ప్రయత్నం... మందాకినీ!... రాజా నా ప్రాణం... వాళ్లిద్దరూ హాయిగా ఉండాలి..." తలవంచుకుని అరచేతిలో కనబడని రేఖలు వెతుక్కుంటున్నాడు కశ్యప్.

అతనివంకే చూస్తోంది మందాకిని.

ఆమె కళ్లల్లో తడి... అతనికి కనిపించదు అనుకుంటోంది మందాకిని.

ఆమె గుండెల్లో హోరు... అతనికి వినిపించదు. అనుకుంటోంది ఆమె...

మౌనం చాలా మాట్లాడింది కొద్ది క్షణాలు.

చేతిలో ఉన్న గాజు ప్లేట్లో గీతలు గీస్తూ కూర్చుంది ఆమె.

రెండు చేతుల మధ్య గడ్డం పెట్టుకుని ఆమెనే సునిశితంగా చూస్తున్నాడతను.

మెల్లిగా ఆమె దృష్టి గడియారం వైపు తిరిగింది. అప్పటికే ఆమె వచ్చి మూడు గంటలు దాటింది.

❀ ❀ ❀

"డియర్ డాక్టర్!"

లేతగులాబీ రంగు ఉలిపిరి కాగితం మీద ముత్యాలసరాల్లాంటి అక్షరాలు...

మందాకిని ఉత్తరం.

అతనికి తెలుసు ఆమె రాస్తుందని...

చదవడం ప్రారంభించాడు:

"మీకు తెలుసు నేను ఉత్తరం రాయకుండా ఉండలేనని... కారణం మనిద్దరికీ తెలుసు...

మన పరిచయం స్నేహం పరిధి కూడా దాటి మనసు, మేధస్సు కూడా స్పృశించలేని ఒక తెలియని అధి భౌతికస్థితికి చేరిపోయింది.

ఈ మీ పరిచయం నా జీవితంలో చాలా గొప్ప మలుపు తెచ్చింది... నా తప్పులు సమీక్షించుకునే స్థితికి ఎదిగాను.

ఈ విషయం నిజాయితీగా ఒప్పుకోవాలంటే, ఒకప్పటి మందాకినికి అసలు అవకాశము, అవసరము కూడా లేదు...

కానీ... ఇప్పుడు...?!

మారిన మందాకిని ఒప్పుకుంటోంది...

దీనికి కారణం?!

ఒద్దనుకున్నా కొన్ని విషయాలకు తలవంచాలి...

'నిశ్చలమైన నిర్మలమైన భావనకు చాలా బరువు ఉంటుంది. బాంధవ్య మేర్పరుస్తుంది... ఎదటి వ్యక్తి సబ్‌కాన్షియస్ స్థితిని కలియపరచి, నిక్షిప్తమైన అనేక ఆలోచనా సరళుల మధ్య చిక్కుకున్న ఆంతరంగికమైన చైతన్యాన్ని అద్భుతంగా నిద్రలేపుతుంది. మీరు ఆ 'స్థితి' నాకు తెలియపరిచారు.

ఈ థియరీని ఇప్పుడు ఒప్పుకుంటున్నాను... ఇంతకాలం, అర్థంలేని 'ఇగో'తో నా జీవితంలో నాకున్న కొన్ని లాలిత్యాలమీద నమ్మకంతో, ప్రపంచాన్ని చాలా ప్రలోభపరిచాను. పదహారో ఏట పెళ్లైన నేను ఇరవయ్యో ఏటకు భర్తను పోగొట్టుకున్నాను. అతను బ్రతికినంత కాలం భర్తగా నాకు వైవాహిక జీవితం మీద ఏమాత్రం గౌరవం మిగిల్చేట్లు ప్రవర్తించలేదు. నా అందం, నా సౌకుమార్యం, నా అభిప్రాయం – ఇవన్నీ కట్నం తీసుకుని కొనుక్కొన్నట్లు ప్రవర్తించేవారు అతను, అతని 'మంది.'

అందరికీ ఎదురు తిరిగి, చదువుకుని, ఆర్థికంగా స్వతంత్రురాల్నైనాను కాని అపారమైన స్వేచ్ఛతో, నాకు జీవితంలో దొరకని సంతృప్తిని ఇలా ఎదటి వ్యక్తులను ఊరించి అహంతో నవ్వుకున్నాను. ఊరించానే కానీ, చాలా తక్కువసార్లు ఊరడించాను. నన్ను పొందలేక వాళ్లు పడే తపన నాకు తెలియని శాడిస్టిక్ ఆనందాన్ని ఇచ్చేది.

కానీ ఈ చదరంగపు ఆటకు మించిన అందమైన, సుందరమైన లాలిత్యా లుంటాయని రాజాను చూసిన తరవాత అర్థమైంది నాకు. అతని స్నేహంలో నిజంగా చాలా హాయిగా ఉన్నాను నేను. ఆడదాని సౌందర్యానికి నమ్మకము, కొత్త జిలుగు కావాలంటే, ఎదటి వ్యక్తుల ఆరాధనే కారణమౌతుంది. అంత తియ్యటి తమకంలో ఉన్న నేను, అది నీహారిక అని ఎవరు చెప్పినా వినే స్థితిలో లేను... నా దగ్గరితనం వల్ల, అతను నన్ను పొందలేక, దూరమవలేక, చెప్పలేక బాధపడి తాగుబోతు అయిపోతున్నాడని తెలిసినా నేను బాధ పడలేదు.

కానీ... విచిత్రం... మీరు చాలా గొప్పగా, తెలివిగా, 'మొక్కు' అన్న మాటతో చాలా తెలియపరిచారు నాకు. మనకు అత్యంత ఇష్టమైన దాన్ని 'ముడుపు' కడితే మనలో జరిగే అంతర్‌మధనం వల్ల ఎదటివారి జీవితం, మనస్సు ఇన్‌ఫ్లుయన్స్

అవుతాయన్న థియరీ చాలా గొప్పది. జీవితంలో చాలా ఇష్టమైన దాన్ని ముడుపు కట్టుకుని, మనం కోరుకున్న వ్యక్తికి మేలుగా మార్చి, చాలా విలువైనదాన్ని పొందగలం అన్న సూత్రంలో ఆనందం నాకు అర్థమైంది.

``Our attitudes towards things reflect basic value judgements–" అంటాడు *Alvin Toffler* Future shock లో...

మీ దగ్గర నుంచి వచ్చి, చాలా చాలా ఆలోచించాను. రాజా గురించి విచారించాను. అతను తాగుతూ సర్వనాశనమైపోతున్నాడు. మీ బాధ వెనకాల సిన్సియారిటీ నాకు అర్థమైంది. ఒకరకంగా మీకన్నా మానసికంగా నేను అతడికి దగ్గరదాన్నని అతడు అనుకుంటున్నాడు. మరి నా బాధ్యత మరింత ఎక్కువ కదా!

ఇంతకాలం నా ఆకర్షణ, నా ప్రత్యేకత ఎదటి వ్యక్తి మీద నాకు అధికారాన్ని మాత్రం ఇస్తుందనుకునేదాన్ని... కానీ, ఆలోచిస్తే అవతల వ్యక్తి జీవితానికి అది మనని బాధ్యుల్ని చేస్తుందని అర్థమై ఒణికిపోయాను... 'నాకేం సంబంధం?' అనుకోవడం నిజాయితీ లేనిమాట.

ఆలోచించాను... అతణ్ణి ఎలా రక్షించాలా అని మధన పడ్డాను. నాలోని 'అహాన్ని' మీ శిష్యరికంలో 'ముడుపు' కట్టాను. అతని సాన్నిధ్యం, అతని ఆరాధన పట్టనట్లు నటించాను. అతనికి విసుగు, కోపం వచ్చేటట్లు ప్రవర్తించాను. ఈ సున్నిత హృదయాలుండే భావుకులలో ఉండే పెద్ద బలహీనత ఇదే. చటుక్కున మనస్సు విరిగిపోతుంది... ఎంత తొందరగా స్పందిస్తారో, అంత తొందరగా, అంత ఆలోచన లేకుండా దూరమైపోతారు. నాలోని స్త్రీత్వానికి బానిస అవడానికి సిద్ధపడ్డ రాజా నాలో కనిపించిన నిర్లక్ష్యాన్ని భరించలేకపోయాడు. 'ఎందుకిలా మారింది ఈమె?' అని ప్రశ్నించుకోలేకపోయాడు. క్రమంగా నాకు దూరమైపోయాడు.

ఆఫ్‌కోర్స్... ఇదంతా చెయ్యడానికి, నేను చాలా మానసిక క్షోభ పడవలసి వచ్చింది. నా అహం మీద దెబ్బతగిలే మరొక విషయం కూడా అర్థమైంది. నన్ను కోరుకునే ఏ వ్యక్తీ 'నేనుగా ఏమిటి?' అని ఆలోచించడం లేదు... ఇది తెలుసుకుని, ఒప్పుకుని, తలవంచాలంటే... నాలాంటి మనిషికి చాలా కష్టం.

కానీ, ఏదో ఒక తృప్తి. అది ఆత్మకు సంబంధించింది. ఈ ముడుపు కట్టి, నేను జీవితానికి తృప్తి అని నేను అనుకున్న భావనకు దూరమైనా, మానసికమైన ఏదో తెలియని ప్రశాంతత, ఏనాడూ నాకు అర్థం కానిది నా జీవితాన్ని ఆవరించింది...

రాజా బాగుపడ్డారు. నేను చాలా రోజులు ఈ నటన సాగించలేను... అతనికి దూరంగా ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోతున్నాను... చాలా పోగొట్టుకుని మరొక రకంగా చాలా తెలుసుకుని వెళ్ళిపోతున్నాను.

తడిసిన రెక్కలతో, మంచు పర్వతాల ప్రాంతాలకు వలస వెళ్లక తప్పని పరిస్థితిలో ఉన్న నీటి కొంగలా ఉన్నది నా స్థితి.

నేను మీ దగ్గర నేర్చుకున్నది ఏమిటా? అని సమీక్షించుకుంటున్నాను ఇప్పుడు. ఈ పద్ధతి కూడా మీ పరిచయం తరవాత అలవరుచుకున్నదే...

ఇప్పటి నా ఒంటరితనంలో క్షణాలను అనుభవాలుగా ఖరాబు చేసెయ్యాలన్న ఖంగారు లేదు. నా ఒంటరితనంలో హాయి ఉన్నది. తృప్తి ఉన్నది. ఏదో పొంది తృప్తి పొందడం అంటే అది అసంతృప్తి కిందే లెఖ్ఖ. ఎవరి పరిచయం మీదనో, స్నేహం మీదనో ఆధారపడి తృప్తి తెచ్చిపెట్టుకుంటే, అది అహం సంతృప్తిపడగానే, బీటలువారి విసుగువేస్తుంది. ఇటువంటి తృప్తి వలన అవతలి స్నేహాన్నో, హోదానో, పదవినో, పరిస్థితినో పొగొట్టుకుంటానన్న 'భయం' మీద ఆధారపడుతుంది. అది ఊబిగా మారుతుంది. మన ఆనందానికి మరొక వ్యక్తి మీద ఆధారపడడం వల్ల మనలో ఒక రకమైన సంఘర్షణ, బాధ ఉంటాయి. తృప్తిగా ఉండే స్వేచ్ఛ మరొకరు ఇచ్చేది కాదు. తృప్తి అనేది లక్ష్యం కాదు. ఎప్పుడో పొందబోయే తృప్తిలో నిజం లేదు. మన ప్రస్తుతపు క్షణాలను తప్పితీయడం వల్ల వచ్చే చీకటి నీడను కాలంతో కొలవడం అది...

మనని ఆవరించే `Passive awareness', ఏదో నిశ్శబ్దమైన ఆనందం.. ఇది గుర్తించడం నేర్చుకున్నాను.

మీరు ఒక అన్నగా రాణికి చాలా చాలా ఇచ్చారు. కానీ, నాకు గురుత్వంతో సరిగ్గా ఆలోచించగల జ్ఞానం అరణమిచ్చారు. ఇంతకన్న ఏం కావాలి?

'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని చెప్పడానికి ఉపనిషత్తులు చాలు డాక్టర్... కానీ, మాయలో ఉంటూ, మాయాతీతమైన మానసిక స్థితికి చేర్చగలిగిన మహోన్నత విద్య–

ఇది నాకు తెలియపరిచిన మీకు

నా ప్రణామాలు

మందాకిని."

అతని చేతుల్లో కాగితాలు రెప రెపలాడుతున్నాయి. అతని కళ్లల్లో తడి... అతి సున్నితంగా, 'ప్రాణమున్న అక్షరాలు' కాగితాలమీద స్పందిస్తున్నట్లుగా దాచుకున్నాడు ఆ ఉత్తరం కశ్యప్.

ఆ మరునాడు సాయంత్రమే రాజా కాంప్ మీద వచ్చాడు... ఒద్దన్నా వారిద్దరి మధ్యా మందాకిని నీడ...

"నో డౌట్... మందాకిని చాలా గొప్ప మనిషి. కానీ ఎదుటి వాళ్ల 'ఇగో' ను హర్ట్ చేస్తుందిరా... ఛత్ అనిపించింది... అందుకే దూరంగా పెట్టాను. పాపం... చాలా ఆలోచించి ఉంటుంది నేను ఎందుకిలా అయ్యానా అని! కానీ అంత అహంకారాన్ని ఎవరు భరిస్తారురా? నీ చెల్లెలిది అజ్ఞానం. అదే నయం కొంతవరకు. ఒ.కే. ఫర్‌గెట్ ఎబౌట్ ఇట్. నీదగ్గరవుండాలట మీ చెల్లెలు. ఫ్లాట్ ఒకటి కొందాం

చూడు. ట్రాన్స్‌ఫర్‌కు ట్రై చేస్తాను." చాలా మామూలుగా సోఫోలో ఒక మూలకు కాలి మీద కాలేసుకుని కూర్చుని, మాట్లాడేస్తున్నాడు రాజారావు.

ఆలోచిస్తున్నాడు కశ్యప్ అతనివంకే చూస్తూ.

ఎంత గొప్ప మనిషైనా, "నాది" అనుకునేటప్పటికి ఆ మనిషిలో చలనము, చైతన్యము, దీప్తి, నిర్దేశికత ఉంటాయని ఒప్పుకోలేక, తను సంపాదించుకున్న ఖరీదైన వస్తువులా అప్పుడప్పుడు ఎగ్జిబిట్ చేస్తూ, ఏడు తాళాలు వేసి దాచెయ్యాలనుకుంటాడు మనిషి.

ముఖ్యంగా బలహీనత, భావుకత ఉన్న ప్రేమికుడు. అవతలి మనిషి తన స్వస్వరూపాన్ని బయటపెట్టడం ప్రారంభించగానే, భరించలేక, భయపడి "నేను" అన్న అహంతో అఘాయిత్యం ప్రారంభిస్తాడు. అదే జరుగుతోంది రాజాలో... ఇష్టం వచ్చినట్లు మాటలు కొట్టి పోస్తున్నాడు మందాకిని గురించి... తనకు దొరకనిది అదేమంత గొప్పది కాదులే అన్న ద్రాక్షపళ్ల నక్క మనస్తత్వానికి జాలివేస్తోంది కశ్యప్‌కు.

కశ్యప్‌లో నిజాయితీ నిజం చెప్పెయ్యమంటోంది. కానీ, మమకారానికీ, వాస్తవానికీ, అనుభవానికీ, అనుభూతికీ మధ్య ఏవో తెలియని పలుచని పొరలుంటాయి.

"స్త్రీ ఆనంద రూపమే... కానీ వ్యసనమైనప్పుడు అది మనిషి స్వభావాన్ని మలినం చేస్తుంది... నన్ను చేసింది... నిర్మలమైన ఆనందం కాక, ఇంక ఏమిచ్చినా... ఆ సందర్భంలో, ఆ యత్నంలో మాలిన్యమున్నదన్నమాట..." అన్న "చలం ఉత్తరా"ల్లోని వాక్యం గుర్తుకు వచ్చింది... అందుకే మాట్లాడలేదు కశ్యప్.

అంతేకాదు... నిజం చెప్పినా, ఆమెలోని మానసిక పరిణతిని గురించి చెప్పినా, అది తనకు ఎంతవరకు సంబంధించింది? అని ఆలోచించగలడే కానీ, రాజాలాంటి మనిషి "ఆమె ఏమిటి? ఏమౌతోంది? ఎటు మార్పు చెందుతోంది?" అని ఆలోచించ లేడు. అతనిలో ఆరాధకుడు నిర్మలమైన స్నేహశీలి స్థితికి ఎదగలేదు.

"మేధస్సుతో కాక, మనసుతో ఆలోచించేటప్పుడు ప్రగాఢమైన లోతుల అంతర్వ్యూహ అతి సూక్ష్మ మహా ప్రకంపనలను గురించి ఆలోచించలేరు... ఉపరితలాన్ని స్పృశించగలరు... అంతా..." మందాకినిలో జరిగిన మెటామార్ఫాసిస్ రాజాకు అర్థం కాకపోవచ్చు.

అందుకే ఊరుకున్నాడు కశ్యప్.

"అన్నయ్యా! మా అబ్బాయి పుట్టిన రోజుకు వచ్చేటప్పుడు నాకు నెమలి పింఛం రంగు పట్టుచీర తెచ్చి పెట్టు. వదినకు తెలుసు నాకు ఎట్లాంటిది కావాలో... నువ్వు, వదిన, పిల్లలు త్వరగా రండి..." రాణి రాసిన ఉత్తరం టేబిల్ మీద రెప రెప లాడుతోంది.

ఒక సమస్య పరిష్కారమైంది.

కానీ... ఏం జరిగితే "ఇది" జరిగింది?!

పాతాళంలో తేజోవతిగా ప్రవహించే గంగ, భూమిపై మందాకినిగా, ఆకాశంలో వియద్గంగగా రూపు దాలుస్తుందిట.

బీడుపడిన సాటి స్త్రీ జీవితం మీద అనుభూతుల్ని నీరుగా మార్చి ప్రవహించి, జీవం పోసి, మొలకెత్తించి, మెదలకుండా పారుతూ, జీవనగతిలో దార్శనికతను వెతుక్కుంటూ వెళ్లిపోయి వియద్గంగగా మారిన "మందాకిని"ని తలుచుకుంటూ కూర్చున్నాడు కశ్యప్ చాలాసేపు...

('రచన' మాసపత్రిక)

# సన్నిధి

"ఆమె పోయిందిట..."

"అవును... విన్నాను..."

కుతూహలంగా చూస్తున్నాడు వాసు రామకృష్ణను.

"టీ తాగు వాసూ! చల్లారిపోతుంది..." ఒక్క క్షణం ఆగి అన్నాడు.

"మరి నువ్వెళ్లవా?" టీ సిప్ చేస్తూ అడిగాడి వాసు. మాట్లాడలేదు రామకృష్ణ... చేతులు కట్టుకుని, కిటికీలోంచి ధారగా పడుతున్న వర్షాన్ని చూస్తున్నాడు. ఆకుపచ్చటి క్రోటన్స్ తబ్బిబ్బు అవుతున్నాయి... ఈదురు గాలి...

"మాట్లాడవేం?"

ఏమి సమాధానం చెపుతాడు?! నువ్వెవరు? అని అడగకపోవచ్చు జనం... కానీ, కొన్ని ప్రశ్నలు అడగక్కర్లేదు. అర్థమైపోతాయి.

"వెళ్లను... రా పోదాం..." రెస్టారెంటులో బిల్లు ఇస్తూ అన్నాడు.

"నువ్వు మనిషివి కావురా?!"

కార్లో అన్నాడు వాసు బాధగా.

నవ్వేశాడు రామకృష్ణ.

"కానేమో... మా ఇంటికి పోదాం పద."

❀ ❀ ❀

ఇంటికి వచ్చి తల తుడుచుకుంటూ, భార్యతో కబుర్లు చెపుతూ, వేడివేడి భోజనం తింటూ... ఇదంతా రొటీను...

కానీ, "ఆమె"ను గురించే ఆలోచిస్తున్నాడు వాసు, రామకృష్ణను చూస్తూ...

అలా "నేను వెళ్లను..." అని ఎలా అనగలిగాడు?!

"నీ స్నేహితుడు ఒట్టి రాయి అని వదిలేద్దామా? అంటే అదీ కాదు... చంద్రశిలా ఫలకం... కరిగితే వెన్నెలే... కానీ ఎంతమందికి తెలుసు ఆ విషయం?!"

ఈ మాటలు "ఆమె"వి.

రామకృష్ణ, వాసు స్కూలు రోజుల నుంచీ స్నేహితులు. వారి స్నేహం అలా పెద్దవాళ్లైనా నిలబడడానికి కారణం కొంత అనుకూలమైన సన్నిహితత్వమేమో...

పట్నంలో చదువుకునేవారు ఇద్దరూ...

ఏమీకారు... బంధుత్వరీత్యా...

కృష్ణాజిల్లా అజ్జంపూడి లాంటి పల్లెటూరులో కాలవ నుంచి ఇల్లాళ్ళు నీరు తెచ్చుకునేవారు. కృష్ణానది పాయ అక్కడ ఎఱ్ఱ పూవుల చెట్ల నీడన మెత్తటి ఇసుకలో చాలా అద్భుతంగా ఉండేది.

అమ్మలకొంగు పట్టుకుని ఏటి ఒడ్డుకు షికారుకు వచ్చే వాళ్ళిద్దరూ... వారి ఇద్దరి ఇళ్ళు ఎదురు గడపలే...

కోడిపుంజు పూలతో పందాలు వేసుకుని చచ్చేట్లు కొట్టుకునేవారు. ఆమె అప్పటికి ఏడు ఎనిమిది ఏళ్ల పిల్లేమో... నిర్మొహమాటంగా గద్దరితనం చేసి, అయినా, గెలిచానని బలపాలు, జీళ్లు లాక్కునేది.

ఓడిపోవాలనే ఓడిపోయేవాడు రామకృష్ణ.

"ఆ గుణం జీవితాంతం మిగిలిపోయింది నీ స్నేహితుడికి... కానీ, ఎప్పుడూ ఎదుటివాళ్లు అది వాళ్ల గెలుపు అనుకుంటారు పాపం..." ఎప్పుడో మాటల సందర్భంలో చెప్పింది ఆమె.

ఆవార, ఆపాప లక్కపిడతలలో వేరుసెనగపప్పు, బఠాణీలు, చేగోడీలు ఉల్లిపాయలు... ఇవన్నీ కలిపి అన్నాలాట ఆడేది... వండి వడ్డించడం, మహా ఇష్టం ఆ పిల్లకి అందుకనే, అన్నీ బాదం ఆకులోపెట్టి "తినూ..." అని పట్టు గాజులతో బొద్దుగా ఉన్న చేతులతో పరికిణి పొందికగా పెట్టుకుని కూర్చుని బెదరించి తినిపించేది.

అందుకే, "అప్పుడు ఓడిపోయినా నాకేం బాధ ఉండేది కాదు... కాని ప్రపంచం అలా కాదే... దానికి మన దగ్గర నుంచి అన్నీ లాక్కోవడం వచ్చు... అంతే... మనకేం కావాలో దానికి అఖ్ఖర్లేదు..." అనేవాడు రామకృష్ణ.

వాళ్లది అందమైన, నిర్మలమైన స్నేహం... స్నేహితులిద్దరూ హైస్కూల్ దాటేప్పటికే ఆ పిల్ల పెళ్లై అత్తగారింటికి వెళ్లిపోయింది.

ఆ తరవాత మూడేళ్లకు మళ్ళీ రామకృష్ణ చెల్లెలు పెళ్లికి, మగపెళ్ళి వారి తరఫున కనబడింది ఆమె. ఎదుగుతూ రామకృష్ణ చాలా లౌక్యాలు నేర్చుకున్నాడు. కావలసినవి సంపాదించుకోవడం లేదా కొనుక్కోవడం నేర్చుకున్నాడు. వాసు తనకేం కావాలో తెలిసినా, ఎలా పొందాలో తెలియక మామూలు జీవితంతో ఆగిపోయాడు.

కానీ, ఆమె... ఆమె తమాషాగా అలాగే ఉండిపోయింది. అసలు ఆడపిల్లలు మహా ఆరిందాలై, ఊసరవెల్లి లక్షణాలన్నీ అలవరుచుకుంటారు పెద్దవాళ్ళై... కానీ, ఆ అమ్మాయి ఏమిటి?! మారదా?! అదే నిర్మలమైన నవ్వు. అదే నిశ్చలమైన చూపు...

ఇది స్నేహితులిద్దరికీ ఆశ్చర్యమని అనిపించింది. చాలా మామూలుగా మాట్లాడింది ఆమె... మూడేళ్ల తరవాత చూసిన మగపిల్లలు ఎలా మాట్లాడాలా అని భయపడ్డారు కానీ, అంత కాలాన్ని ఆమె గుర్తు పట్టడానికి సిద్ధపడలేదు.

కలిసినది కొద్దిసేపే... బోలెడన్ని కబుర్లు చెప్పుకున్నారు. పిల్లలు లేరట

"ఇంక పుట్టరని డాక్టరు భయపెడితే, మావారికి మరో పెళ్లి చేస్తామని మా అత్తగారు భయపెడుతున్నారు..." నవ్వుతూనే చెప్పింది ఆమె.

కానీ... ఆ మాటలు విని వాసు ఉలిక్కిపడ్డాడు, రామకృష్ణ మొహం చూసి.

ఆమె భర్త మరో పల్లెటూళ్లో శానిటరీ ఇన్స్పెక్టర్.

ఆ రాత్రంతా నిద్రపోలేదు రామకృష్ణ.

"అదేమిట్రా... ఆవిడను... అలా ఎలా... చూస్తో... అయినా ఆ మొగుడు..." అంటూ మాట్లాడుతూనే ఉన్నాడు.

కొన్ని ప్రశ్నలకు సమాధానాలు ఉండవు... వెతుక్కోవాలి. వెతికాడు రామకృష్ణ, ఆమె ఊళ్లో వుండే చుట్టం ద్వారా.

"ఆవిడ సుఖంగా లేదురా... చాలా బాధల్లో ఉన్నది. వాళ్లాయన పెద్ద గ్రంథసాంగుడు..." బాధగా అన్నాడు వాసుతో.

ఏం చెయ్యడం?! చాలా మంది జీవితాల్లోని మామూలు కథే ఇది.

"కానీ... కానీ... ఆవిడకు మామూలు మనిషిలా ఈ చవకబారు కష్టాలేమిట్రా?!"

అతడి మాటలకు నవ్వొచ్చింది వాసుకు... కానీ, నవ్వలేకపోయాడు.

❀ ❀ ❀

రామకృష్ణ, క్లాసుమేటు జానకి ప్రేమలో తలమునకలుగా పడ్డాడు.

"ఆమె మన ఊరొచ్చిందిట... ఏదో వైద్యం కోసం. రెండు నెలలు ఉంటుందిట... జానకి సంగతి చెప్పాలి..." అన్నాడు రామకృష్ణ.

ఇద్దరు స్నేహితులు ఊరు వెళ్లారు.

ఆ వరండాలో కుర్చీల్లో కూర్చున్నారిద్దరూ... పెద్ద గడపకు ఆనుకుని కింద కూర్చుంది ఆమె. పొడుగాటి స్టీలు గ్లాసుల్లో మసాలా మజ్జిగ ఇచ్చింది వాళ్ల అమ్మ.

మెల్లిగా జానకి గురించి చెప్పాడు రామకృష్ణ.

"ఈ మధ్య మనవాడికి ఆ పేరు తప్ప కలవరింతలు మరేం లేవు!" వాసు వెక్కిరింపుగా అన్నాడు. రామకృష్ణ నవ్వుతూ సమాధానం చెప్పాడు.

నవ్వేసింది ఆమె... చాలాసేపు వాళ్లను మాట్లాడనిచ్చి...

"నువ్వేమిటో ఆ పిల్లకు తెలుసా?! ఆ పిల్లను నువ్వు నిజంగా కావాలను కుంటున్నావా? ఆ పిల్ల ఏమిటో తెలిసే కావాలనుకుంటున్నావా?!" సూటిగా చూస్తూ అడిగింది.

అరచేతిని, వేళ్లను చూసుకుంటూ మాట్లాడలేదు రామకృష్ణ.

"గోడమీద వేళ్లాడేసుకోవడానికి ఒక నలభై సంవత్సరాలకు సరిపడ క్యాలండరు కొనుక్కున్నట్లు కాదు పెళ్లంటే. ఆలోచించుకో... ఆ పిల్లకు ఏం కావాలో తెలుసుకో... నువ్వు అది ఇవ్వగలవా? అని ఆలోచించుకో... అసలు ముందు నీ

సంగతి ఏమిటి?! నీకేమిటి కావాలి?!" మెల్లిగా చీకట్లో మెరుస్తున్న నందివర్ధనం పూలవంక చూస్తూ చెప్పింది.

ఆ పాతకాలపు బరువైన గుమ్మానికి ఆనుకుని కూర్చున్న ఆమె చాలా చిన్నగా అనిపిస్తోంది.

కానీ, ఆ రూపంలో ఏదో ఎక్కువతనం.

ఆమె ఉన్నచోట, ఆమె తప్ప మరేం కనిపించదు చుట్టుపక్కల, అనిపించింది రామకృష్ణకు.

కాసేపటి తరవాత బయలుదేరుతూ,

"నీ కళ్లకింద ఎందుకలా ఉబ్బింది?! ఒంట్లో బాగా లేదా?!" అన్నాడు రామకృష్ణ.

నవ్వేసింది ఆమె.

"ఏద్రో నంజుకు సంబంధించిన వ్యాధి... బలుపో, వాపో తెలియడం లేదు..."

వెనక్కు వెనక్కు చూసుకుంటూ వచ్చేశాడు రామకృష్ణ.

❀ ❀ ❀

ఆలోచించుకుంటూ కూర్చుంటే చాలా పెళ్ళిళ్లు ముడిపడవు. జానకి రామకృష్ణను పెళ్లి చేసుకున్నది. పెళ్లికొడుక్కి వృద్ధిలోకి వచ్చే అవకాశాలు, పెళ్లికూతురి వల్ల ఆర్థికలాభాలూ ఉన్నాయి కాబట్టి ఇటువాళ్లకు, అటువాళ్లకు అభ్యంతరం లేకపోయింది.

గ్రామదేవత పూజచేయించి మనూళ్లోనే గృహప్రవేశం జరగాలని పట్టుపట్టింది రామకృష్ణ తల్లి. ఈ పెళ్లిళ్లు నిలవడానికి ఎన్ని దీవెనలు కావాలో అని పెద్ద వాళ్ల దుడుకు.

ఆమెకు అబార్షన్ అయిందని పుట్టింట్లో ఉందట.

సత్యనారాయణ వ్రతానికి వచ్చింది.

"మా ఆవిడ..." అంటూ జానకిని పరిచయం చేశాడు ఆమెకు.

"చాలా అందంగా ఉంది..." నవ్వుతూ అన్నది ఆమె.

"ఆవిడెవరు?" సూటిగా ప్రశ్నించింది జానకి.

ఏదో చెప్పబోయాడు... కానీ, ఆగిపోయాడు రామకృష్ణ. ఏమని చెప్పగలడు? పైగా జానకికి ఎలా అర్థమౌతుంది?

భార్యకు చెప్పలేనివి భర్తకు కొన్ని వుంటాయని మూడో రోజునే అర్థమైంది రామకృష్ణకు.

"నేను మీ వారికి చిన్ననాటి స్నేహితురాలిని..." నిష్కల్మషంగా నవ్వుతూ చెప్పింది ఆమె.

"మరి ఇప్పుడు?" ఆ ప్రశ్నలో ధ్వనికి ఉలిక్కిపడ్డాడు. ఖోషాణం దగ్గర అరటిపళ్ల గెలలు దించుతున్న వాసు.

"ఇప్పుడూ మాకు స్నేహితురాలే..." ఖంగారుగా సర్దేసి చుట్టూ చూశాడు రామకృష్ణ కోసం. అతడు అక్కడ లేడు.

ఆ తరవాత... జానకి, రామకృష్ణ పడకటింట్లో, వంటింట్లో, కార్లో, పిల్లల స్కూలు, ఫంక్షన్‌లో హక్కులున్న పరిచయస్థురాలిగానే మిగిలిపోయింది.

"నేను మీకు అర్థంకాను ఎప్పటికీ..." షిఫాన్ చీర దగ్గర నుంచి, క్లబ్ మెంబర్‌షిప్ దాకా ఒకటే మాట. కొంత సుఖం ఏమిటంటే జానకివి డబ్బుతో తీరే సమస్యలు. రామకృష్ణ దగ్గర అది పుష్కలంగానే ఉన్నది. కొంతమంది ఆడవాళ్లు ఖరీదును బట్టి అలంకారాలతో అందం పెరుగుతుందనుకుంటారు.

కాటుక పెట్టిన కళ్లు, పసుపు రాసిన పాదాలు, బొడ్డు మల్లిపూవులు, మట్టిగాజులు, పసుపుతాడు... ఇవి ఆమె అలంకారాలు... వాటికే అందం తెచ్చే "ఆమె" తెలిసిన అతనికి,

లక్ష రూపాయల రవ్వల నగ పెట్టుకుని 'బాగున్నానా?' అని గర్వంగా ప్రశ్నించే భార్యను చూసి నవ్వుతాడు.

కోపం జానకికి...

"నేను మీకు అర్థం కాను..." జానకి ఊతపదం అది.

కానీ,

"నేను నీకు ఎప్పటికీ అర్థం కాను..." అని అనడతను, ప్రయోజనమున్న మాటలే తక్కువ మాట్లాడతాడాయె.

❀ ❀ ❀

"రామకృష్ణా! ఏం చేస్తున్నావురా?" హడావిడిగా వచ్చాడు వాసు.

"ష్..." ఏదో డైరీలో రాసుకుంటూ అన్నాడు రామకృష్ణ.

"అదికాదు..." ఏదో చెప్పబోయాడు వాసు.

"ఈ కొటేషన్ విను. టాగూర్‌ది:"

ఒళ్లు మండిపోయింది వాసుకు.

"ప్రాక్టికాల్టీలోకి రారా... ఆవిడకు..."

"ఏమైంది?" చటుక్కున లేచాడు, రామకృష్ణ.

"ఆవిడకు కేన్సరుట... సెకండరీ స్టేజ్ దాకా పట్టించుకోలేదట... నాకు సంబంధం లేదు అని వదిలించుకుని వెళ్లిపోయాడు మొగుడు... ఆపరేషన్ చేయిస్తే బ్రతుకుతుందేమోనని పాపం, ఆ తల్లి గోల... మామూలు ట్రీట్‌మెంటుకే డబ్బులు లేవు వాళ్ల దగ్గర... నా దగ్గరున్నదేదో ఇచ్చి వద్దామనుకున్నాను కానీ..."

"నా దగ్గర బోలెడు డబ్బుంది... కానీ..." ఆగిపోయాడు రామకృష్ణ.

"ఏవిటి, ఆవిడ రోగానికి డబ్బు సహాయం చేస్తారా?! పిచ్చా చాదస్తమా? పైగా దానికి వంతులు పడిపోతున్నారేమిటి?! ఆమెతో మనకేం సంబంధం అసలు?..."

డ్రెవాష్ నుంచి వచ్చిన పట్టుచీరలు తెచ్చి పెట్టుకుంటూ అడిగింది జానకి.

"నేను వెళ్లి... అవిడను అలా చూడలేను... ప్లీజ్... నువ్వు వెళ్లి నా మాటగా చెప్పు... ఆపరేషన్ నేను చేయిస్తానని చెప్పు..."

ఆ సాయంత్రం వాసు ఇంటికి వచ్చి అన్నాడు రామకృష్ణ. అతని ముఖంలో భావాలను చూడటానికి భయం వేసి తలదించుకున్నాడు వాసు.

వాసు వెళ్లాడు.

సన్నగా నవ్వుతూనే తిరస్కరించింది ఆమె.

"బ్రతకడం అంత పెద్ద అవసరంలా లేదు వాసూ! అవతారం చాలిస్తే పోలా?..."

"ఎందుకని?! అలా అనకు... వాడు ఏడుస్తాడు... వాడికి... వాడికి నువ్వంటే ఎంత ఇష్టమో తెలుసా?" నిస్సహాయతతో కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి వాసుకు.

"తెలుసు..." జాలిగా అందామె.

"మరి తెలిసీ..."

"ఈ శిథిల గృహానికి ఇంకా దీపారాధనలేమిటి చెప్పు?...దా, అన్నం తిందువుగాని..."

"కనీసం... కనీసం వాడికి చెప్పు..." చేతిలో వక్కపలుకులు తెచ్చిపెడుతూ అన్నాడు వాసు.

"ఏమని?" సూటిగా చూస్తూ అన్నది.

"నీకు... నీకు వాడంటే ఇష్టమని..." చటుక్కున మాట అనేసి నాలుక కొరుక్కున్నాడు వాసు... ఏదో అనాలని, ఏదో చెప్పేశాడా?!

తులసికోటకు ఆనుకుని కూర్చుంది ఆమె. సందెదీపం వెలుతురులో తమాషాగా మెరుస్తున్నాయి ఆమె కళ్లు. బొడ్డుమల్లె సువాసన...

"మాట్లాడవేం?" ఏదో మొండితనం వచ్చింది అతనికి.

"హు!" నిర్లిప్తంగా నవ్వింది ఆమె... "సీత వేషం వెయ్యడానికి వచ్చి ద్రౌపది డైలాగులు మాట్లాడకూడదు వాసూ!... నాటకం రసాభాసమౌతుంది... ఈ పాత్ర పరిధి ఇంతే..." చీకట్లోకి చూస్తూ చెప్పింది.

"ఇది జీవితం. నాటకం కాదు..." కచ్చపుడుతోంది అతనికి, ఏదో నిస్సహాయత.

"జీవితమే పెద్ద నాటకం – ఇంక ఆ విషయం మాట్లాడకు... జానకీ పిల్లలూ కులాసాగా ఉన్నారా? కొడుకు దోగాడుతున్నాడా?"

సమాధానాలు చెపుతున్నాడు వాసు...

రామకృష్ణ వచ్చిఉంటే బలవంతాన టాక్సీ మాట్లాడి తీసుకువెళ్లి హాస్పిటల్ చేర్చేవాడా, ఏమో అసలు రాడే...

హక్కులు లేని, అర్థం చెప్పలేని బాంధవ్యాలు వాటిని మాటల్లో బిగించినకొద్దీ మాయ కప్పుకుని వేరే రూపాలు ఎత్తుతాయి.

❀ ❀ ❀

ఆమె చనిపోయిన నెలరోజులకు...

"ఇక్కడే..." ఆమెను సమాధి చేసిన చోటు ఎవరో చూపించారు. అక్కడ మౌనంగా నిలబడ్డాడు రామకృష్ణ... అతని ఊహల్లో-

అక్కడొక పాలరాతి మంటపం... చుట్టూ ఎఱ్ఱని రోజా మొక్కలు... సమాధిపై నిత్యం జలజలరాలే పారిజాతాలు... నిరంతరం వెలిగే సుగంధ పరిమళాలు... చుట్టూ కనుచూపు మేర బొండు మల్లెల తోట. ఆ సమాధి మందిరంలో నిశ్చింతగా నిద్రపోతున్న ఆమె...

కానీ... ఇదంతా ఊహే... నిజం చెయ్యలేదు అతను...

"నువ్వెవరు?" అని ప్రపంచం అడిగే ప్రశ్నకు సమాధానం లేదు అతని దగ్గర.

"నా సమాధి సమాధానం చెపుతుంది..." అన్న మహానుభావుల ఆశీర్వచనమేమో కానీ,

సన్నిధికి అర్థం తెలిసింది అతనికి...

ఇంతకాలం ఆమెతో తన సన్నిహితత్వం... దీనికి మృత్యువు అడ్డం కాదని అర్థమైంది.

ఆ తరవాత...

పౌర్ణమికి అతడు ఉపవాసమెందుకు ఉంటాడో, కార్తీక పౌర్ణమికి ఆ పల్లెటూరుకి ఎందుకు వెళతాడో అర్థం చేసుకోగలిగింది వాసు ఒక్కడే...

"మీరు బ్రతికేది జ్ఞాపకాలతో... మీ ఊహల్తో ఆవిడకు పవిత్రత అంటగట్టి, గ్లామరైజ్ చేసి బ్రతికేస్తున్నారు. ప్రాక్టికాలిటీ ఉండాలి దేనికైనా..." అప్పుడప్పుడు వంకరగా అంటుంది జానకి.

అతడు మామూలుగానే... ఏమీ మాట్లాడడు.

*('వనిత' (ఉగాది సంచిక) - ఏప్రిల్, 1995)*

# శుభాకాంక్షలు!

"ఎట్లా ఉన్నది ఇవ్వాళ ఒంట్లో?"

మెల్లిగా తలెత్తి చూశాడు రాఘవ.

ఆ గొంతు... ఆ ఆప్యాయమైన పలకరింపు కోసం గంటలకొద్దీ ఎదురు చూస్తున్నాడతను...

నవ్వాడు...

"పరవాలేదు... రా కూర్చో..."

"లేదు... వెళ్లాలి... ఇదుగో భోజనం..." కారియర్ తీస్తూ అంది గంగ.

"గంగా!..." అతని గొంతులో జలదరింపు.

"ఏమిటి?!"

"నీకెందుకింత శ్రమ?!"

కళ్లెత్తి చూసి నవ్వింది... పెదవుల మీద విచ్చే చిరునవ్వు కళ్లల్లో ప్రతిఫలించడం అందమైన అనుభూతివల్ల వచ్చే పరిణామం.

కానీ... కళ్లు నవ్వుతూ, పెదవులమీదకు సుతిమెత్తగా జారి ప్రతిఫలించడం... అదొక అయస్కాంత హేల,

❀ ❀ ❀

గంగ... "గంగ" అని పిలవబడే పరిస్థితుల్లోనే పుట్టింది. ఆ అమ్మాయి తండ్రి స్కూలు వాచ్‌మాన్. తల్లి రంగి కాలేజిలో ఆయాగా ఉండేది. ఒక సుప్రభాతాన పక్కనే ఉండే కరస్పాండెంటుగారి కారు డ్రైవర్‌తో లేచిపోయింది. కారణం?! "ఈ లేమీ, ఈ అతి మంచి మొగుడ్ని నేను భరించలేను..." అని అర్థమయ్యేట్లు చెప్పిపోయింది.

గంగ తండ్రి అసమర్థుడై ఊరుకున్నాడో, అర్థం చేసుకునే ఊరుకున్నాడో కానీ, ఏనాడూ భార్యగురించి చెడ్డగా మాట్లాడేవాడు కాదు. మాట్లాడనిచ్చేవాడు కాదు.

"ఆ లేచిపోయిన దానికోసం నువ్వేమిటిరా ఇలా?!" బుద్ధుందా లేదా?!" అని తిట్టేవాడు, స్కూలు గోడనానుకుని ఉన్న ఇంట్లో ఉంటూ పౌరోహిత్యం చేసుకునే సుబ్రహ్మణ్యశాస్త్రి.

"ఒద్దు బాబూ! చెడ్డ మాట్లాడినకొద్దీ మనలో చెడ్డతనం వస్తుంది. మంచి ఆలోచిస్తే మైలపడం. రంగి అంటే నా ప్రాణం. 'నాకు ఇది బాగుంది... ఇలాగే ఉంటాను...' అనే అధికారం దానికి లేదా?! అదీ మనిషేగా?... దానిమీద నాకు

ఉన్నది ప్రేమ బాబూ, హక్కు కాదు! ఎటొచ్చీ... ఈ పసితల్లే..." గంగను గుండెలకు హత్తుకుని కన్నీళ్లు పెట్టుకునేవాడు వాచ్‌మేన్...

"అణవమల శోధనార్థం..." అని ఆచమనీయం చేసే శాస్త్రిగారికి చేతల వైబ్రేషన్ అర్థం కాలేదేమో కానీ మంచిగా ఆలోచించే వాచ్‌మేన్ దాన్ని సంపూర్ణంగా ఆచరణలో పెట్టాడు. గంగకు అలా చెప్తూనే పెంచాడు.

రాఘవ... శాస్త్రి కొడుకు.

అతనికి డిగ్రీ వచ్చినా, ఉద్యోగం లేదని... "రోజూ నీకు ఇంట్లో దండగ పిండం పెట్టడానికి ఎవరూ సిద్ధంగా లేరు. అయినా నీ అంత పనికిమాలిన వాజెమ్మను నేను ఎక్కడా చూడలేదు..." అంటూ మాటలే మంత్రాల్లాగా, సజెషన్స్‌గా మారతాయని అర్థం చేసుకోని శాస్త్రి అతణ్ణి నిర్వీర్యుణ్ణి, నిర్లిప్తుణ్ణిగా తయారుచేశాడు.

"మా గంగతల్లి అందం ఆకాశం... గుణానికి భూదేవత..." వయసొచ్చి సోయగంగా తయారైన బిడ్డను ఆప్యాయంగా చూసుకుంటూ అనేవాడు వాచ్‌మాన్ నెరసిన మీసాల్లోంచి నవ్వుతూ...

గంగ చదువుకున్నది... పదవ తరగతి దాకా... ఫ్యాక్టరీలో చిన్న తరగతి ఉద్యోగినిగా చేరింది.

కరెస్పాండెంటుగారే ఉద్యోగం వేయించారు, ఆయన కొడుకుదే ఫ్యాక్టరీ కనుక.

ఆ కొడుకు పదవక్లాసు కూడా పాస్ కాలేదు. తండ్రి విద్యాసంస్థలు స్థాపించినా కొడుకు 'స్థితి'లో మార్పులేదు. డబ్బున్నవాడు కాబట్టి ఫ్యాక్టరీ యజమాని అయ్యాడు.

గంగను మనిషిగా చూసేవాడు కాదు అతను. భోగ్యవస్తువుగా... "ఎప్పుడైనా వీలైతే..." అన్నట్లే చూసేవాడు. తండ్రి భయం అతణ్ణి ఆ సాహసం చెయ్యనివ్వలేదు. పనివాళ్ల గ్రేడ్‌నుబట్టికాక, గుణాన్నిబట్టి గౌరవం ఇచ్చే కరస్పాండెంటుగారు గంగను బిడ్డలా చూసేవాడు.

గంగ, రాఘవ చిన్నప్పటినుంచి స్నేహితులు.

ఫ్యాక్టరీ యజమాని మనస్తత్వం, మాటలు గంగ చెప్పినప్పుడల్లా కచ్చగా వినేవాడు రాఘవ.

"డబ్బున్న మదం. నాకే అంత డబ్బు, అధికారం ఉంటేనా?!"

"ఏం చేస్తావు?!" అన్నట్లు కళ్లెత్తి చూసేది గంగ.

"ఏమిటి అట్లా చూస్తావు?! నేనేం చెయ్యలేనా?! దేముడు నాకు ఆ అవకాశం ఇవ్వాలేకానీ." రెచ్చిపోతూ అనేవాడు రాఘవ.

మధ్యతరగతి నిరుద్యోగి కథ ఎప్పుడూ ఒకటే. ఇంట్లోవాళ్ల ఉదాసీనం... బైటవాళ్ల వేళాకోళం.

అప్పుడే రాఘవకు యాక్సిడెంట్ అయింది.

దెబ్బతీసిన బస్సువాడి దగ్గరనుంచి కాంపన్సేషన్ అడగాలన్నా రికమెండేషన్, పలుకుబడి ఉండాలని తెలిసి, ఏం చెయ్యలేక కొడుకును నానామాటలూ అన్నాడు శాస్త్రి.

డబ్బు ఉత్పత్తి చెయ్యని బిడ్డలకు పనికిరాని యంత్రాలకు ఉన్న విలువే ఉంటుంది శాస్త్రిలాంటివాళ్ల దృష్టిలో

ఇంటిల్లిపాదీ వేరే ఊరు పెళ్లికి వెళ్లారు అతడ్ని గవర్నమెంటు వాళ్ల బ్రెడ్, పాలకు వదిలిపెట్టి... తండ్రి ఇచ్చివెళ్ళిన యాభైరూపాయలు తనకు కావలసిన అవసరాలకు రెండు రోజులు కూడా రావని తెలుసు రాఘవకు.

నిరాశ, నిస్పృహ, చచ్చిపోదామన్న నిర్ణయం బాధ, కంట్లో నీరు...

అప్పుడు వచ్చింది గంగ నవ్వుతూ... కారేజీ పట్టుకుని. అలా రోజూ వచ్చేది పదిరోజుల కాలం.

ఈ పదిరోజుల్లో రాఘవ ఆలోచనలలో బోలెడు మార్పులు...

అవి ఎదిగి, తీగెలు సాగి, ఊయలలు వేసి...

"గంగను ఎలా పెళ్లి చేసుకోవాలి?" అన్నదాకా వెళ్లాయి.

ఫ్యాక్టరీ నుంచి రోజూ అక్కడ చదివి వదిలేసిన పేపరు తెచ్చేది గంగ వాంటెడ్ కాలమ్స్ చూసేందుకు. పేపరు చూస్తూ అరిచాడు రాఘవ–

"గంగా! నా డైరీ తీసుకురా" అని. తెచ్చింది.

"ఏమిటి బాబూ! అదేమిటి లాటరీ టిక్కెట్టు చూస్తున్నారు?!" అతని చేతిలో టిక్కెట్టు.

రెండు క్షణాలు చూసి, అతడు పేపర్లో మునిగిపోగానే "వస్తాను బాబూ!" అని వెళ్లిపోయింది గంగ.

"లక్షరూపాయలు..." రాఘవ కళ్లు తిరిగిపోతున్నాయి. దేవుడు ఉన్నాడు. ఎంత గొప్ప అవకాశమిచ్చాడు?. ఏమిటేమిటో ఊహలు?!

కానీ... ఈ డబ్బు వస్తే... ఈ డబ్బు వస్తే తనవాళ్లు తనదైన ఏ ఒక్క ఆలోచనా సాగనివ్వరు. తను పనికిరానివాడైతే ఏమో కానీ, ప్రయోజకుడైన కొడుకు పెట్టుబడి అని తెలిసిన మరుక్షణం గంగను తన దరిదాపులకు రానివ్వరు... దరిద్రంలో చెయ్యగల కొన్ని ధైర్యాలు. డబ్బున్నవాళ్లు చెయ్యలేరని అతని చుట్టూ ఉన్నవాళ్ల జీవితాలు పాఠాలు చెప్పాయి.

తన చుట్టాలు, జనాలు తనని బ్రతకనివ్వరు.

ఏమేమిటో పిచ్చి ఆలోచనలు... ఊహల్లో బాధలు, ఈ లాటరీ టిక్కెట్టుతో గంగను తీసుకుని రైలెక్కి దూరంగా పారిపోతే... ఛా! గంగ... గంగ రాదు... అయినా ఎలా అడగాలి? వాళ్లనాన్న, పెళ్లాం లేచిపోయి, కూతురు కూడా అదే దారిపడితే గుండె ఆగి చచ్చిపోతాడు.

ఆలోచిస్తూ అలా నిద్రలోకి వెళ్లిపోయాడు రాఘవ.

ఫ్యాక్టరీ మధ్యాహ్నం షిఫ్ట్‌లో ఉన్న గంగ ఆలోచిస్తోంది.

"గంగా! రాఘవబాబుకు ఎట్టా ఉందే? అదేం తల్లీ తండ్రీ... అట్లా వదిలేసిపోయారు?! అదిసరే గానీ, రాఘవ బాబేమన్నా లాటరీ టిక్కెట్టు గురించి మాట్టాడాడా?!" అడిగాడు మిషన్ల మీద మేస్త్రీ వీరయ్య.

ఉలిక్కిపడింది గంగ.

"ఏం? ఎందుకు?"

"ఏం లేదే... నాకన్న ఇద్దరి ముందు క్యూలో నిలబడి ఈయన టిక్కెట్టు కొన్నాడు. నా నెంబరుకన్నా రెండు నెంబర్లెక్కువ. ఆ నెంబరుకు లాటరీ వచ్చిందని అనుమానం నాకు..."

పర్మిషన్ తీసుకుని ఫాక్టరీ పక్కన ఉన్న హాస్పిటల్‌కు వెళ్లింది గంగ.

నిద్రపోతున్నాడు రాఘవ, అతని పక్కన డైరీలో టిక్కెట్టు నెంబరు.

మూడో నాటికల్లా తిరిగి వచ్చిన రాఘవ కుటుంబం రాఘవను ఒక్కసారిగా "ప్రయోజకుడివి" అన్నది. చుట్టూ అందరూ నీ అంత అదృష్టవంతుడు లేడన్నారు...

"దెబ్బ తగిలిందని ఊళ్లో ఉన్నవాళ్లకు చెప్పద్దురా? అయినవాళ్లం కదా..." ఎదిగిన కూతురుతో వచ్చిన మేనమామ యాపిల్‌పళ్లు తెచ్చాడు.

గంగ కారియర్‌తో వచ్చి, ఈ కోలాహలమంతా చూసి నిశ్శబ్దంగా తిరిగి వెళ్లిపోయింది.

"ఎంత పనిచేశావు గంగా! నిన్నెవరు నా లాటరీ టిక్కెట్టు సంగతి బైట పెట్టమన్నారు?!" ఫ్యాక్టరీ దగ్గరకు వచ్చి అడిగాడు రాఘవ వారం రోజుల తరవాత.

అతని కళ్లల్లో ఆప్యాయత, బాధ.

"ఏం బాబూ?" అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

"ఎంత అందంగా ఉన్నాడు రాఘవబాబు..." అనుకున్నది గంగ. పర్సనాలిటీ ఇచ్చే అందం కన్నా... ఆప్యాయతల అనుభూతులు ప్రతిఫలించే అందం ఎంత గొప్పదో అర్థం చేసుకోగలిగిన గంగ.

"ఏమంటావేమిటి? నీకు తెలియడం లేదా? అందరూ నన్ను దిక్కుమాలిన వాడివని వదిలేస్తే, నువ్వే నాకు దిక్కయ్యావు. ఏమిటి ఇప్పుడు నిన్ను నాకు దూరంగా నిలబెట్టేది? ఈ డబ్బు కదూ? ఈ జనం అంతా ఇప్పుడు ఎవరు? ఎందుకు నా చుట్టూ ఇలా తిరుగుతున్నారు? నాకు తెలియదా? అర్థం కాదా?"

"అంటే?... మీకు ఆ డబ్బు ఒద్దా?" ఆశ్చర్యంగా అడిగింది గంగ.

"ఏది నిన్ను నాకు దూరం చేస్తుందో అది నాకు వద్దు గంగా! అందుకే ఆ లాటరీ టిక్కెట్టు చించేద్దామనుకున్నాను. కానీ, నువ్వు... నువ్వే అందరికీ చెప్పావు... ఇప్పుడు చూడు..." పసిబిడ్డలా ఉడుక్కున్నాడు రాఘవ.

"అంటే... అంటే... అన్ని బాధల్లో, డబ్బు కష్టాల్లో ఉద్యోగం లేదని కన్నవాళ్ల చేత మాటపడ్డ మీరు... ఇంత అవకాశాన్ని నా కోసం... నా కోసం దూరం

చేసుకుందామనుకున్నారా? లక్షరూపాయలు... అంటే, ఎంత డబ్బు? మీకు ఎంత అవసరం? హూఁ, గంగలు బోలెడి మంది బాబూ... కానీ, లక్షరూపాయలు... వాటి విలువ వేరు... వెళ్లి ఏం చెయ్యాలో ఆలోచించండి..." వెళ్లబోయింది గంగ.

అడ్డం వచ్చాడు రాఘవ.

"అందరూ గంగలు కాలేరు... కారు... నువ్వు... నువ్వు..." అతని గొంతులో ధ్వనికి పులకించిపోయింది గంగ.

"ఈ ఆలోచనే గొప్పగా ఉన్నది రాఘవయ్యబాబూ! ఇంకేమీ ఒద్దు నాకు... మీరు వెళ్లండి. డబ్బు ఏం చెయ్యగలదో నాకూ కొంచెం తెలుసు. దేముడి లాంటి మా నాన్నను వదిలి అమ్మ వెళ్లిపోయిందంటే ఈ డబ్బు కోసమే... నా కోసం ఒక నిరుద్యోగి లక్షరూపాయలు ఒద్దు అనుకున్నాడంటే... నవ్వొస్తోంది మీ అమాయకత్వానికి. వస్తాను బాబూ... పనుంది..."

"నన్ను నమ్ము గంగా!" నిస్సహాయంగా అన్నాడు రాఘవ.

"నమ్ముతాను... మీరు ఈ డబ్బు మీదై, గొప్పవారైన తరవాత కూడా ఎలా ప్రవర్తిస్తారో చూసినప్పుడు... అప్పుడు... అప్పుడు నమ్ముతాను బాబూ... వస్తాను."

వెళ్లిపోయింది గంగ.



ఆ అవకాశం ఐదేళ్ల తరవాత వచ్చింది గంగకు. స్వయం ఉపాధి పథకం కింద లోన్ శాంక్షన్ చేసే ఆఫీసర్‌ను చూడటానికి వెళ్లింది గంగ. ఆమెలాంటివారు బోలెడుమంది.

"అర్జీకి ఐదువందలు జత పరిస్తే ముందు పేపర్లు కదుల్తాయి... తరవాత పై ఆఫీసర్‌కు ఐదువేలు వస్తు రూపంగా, ఐదువేలు నగదు రూపంగా... ఈరకంగా రేట్లు..."

గాలిలో మాటలు గడ్డకట్టుకుంటున్నాయి.

చెంపన చెయ్యి పట్టుకుని ఓపిగ్గా నిరీక్షిస్తోంది గంగ. తన వంతు రాగానే స్ప్రింగ్ డోర్ తెరిచి లోపలికి వెళ్లింది.

"నమస్కారం..."

"అరె గంగా!... నువ్వు - నువ్వేనా?!"

"ఔను..." అన్నట్లు తలూపింది. విషయం చెప్పింది.

"నీ అప్లికేషన్ వచ్చిందా? చూడనే లేదే?! ఎలా వున్నావు? ఏం చేస్తున్నావు?"

"అక్కడే ఉన్నాను... నాన్నకు పక్షవాతం వచ్చింది."

తలెత్తి చూశాడు.

"నా పెళ్లికి రాలేదేం గంగా?!"

కుర్చీమీద గీతలు గీస్తూ నిలబడింది.

పసుపు పెట్టిన శుభలేఖ... ఇంటి ముంగిట్లోకి ఎవరిచేతో పంపిన శుభలేఖ... కనీసం వచ్చి ఇవ్వలేని శుభలేఖ.

"నన్నెవరు పిలిచారు బాబూ! నాకు కావలసింది మనసు పిలుపు. కార్డు మీద అచ్చొత్తిన అక్షరాల ఆహ్వానం కాదు..."

ఈ మాటలు అనలేదు గంగ... ఆమె గంగ... అనదు, కానీ,

ఎదుటివాళ్లకు ఆమె ఏమి ఆలోచిస్తోందో ఆమె కళ్లు చూస్తే అర్థమైపోతుంది.

ఉలిక్కిపడి కళ్లు దించుకున్నాడు రాఘవ.

"ఏమిటి? ఆ కరస్పాండెంట్‌గారి పుత్రరత్నం ఇల్లు వాకిలి అన్నీ .ఇస్తాను. ఉంపుడు గత్తెగా రమ్మనమని ఏవేవో అన్నాడట. అంత పొగరేమిటి ఆ స్కౌండ్రల్‌కి... మనుషుల్ని కొనుక్కుందామనా?" సిగరెట్టు తాగుతూ రాకింగ్ చెయిర్‌లో అటూ ఇటూ ఊగుతూ అన్నాడు రాఘవ.

పొగరు... నవ్వొచ్చింది గంగకు. అంటే అర్థమేమిటో?...

"మాట్లాడవేం? అరె కూర్చో... రంగయ్యా... రెండు కాఫీ చెప్పు."

"ఏమిటి ఆలోచిస్తున్నావు గంగా... కూర్చో..."

స్థిరంగా నిలబడే అన్నది గంగ.

"ఆయన అన్నమాటలకు ఒప్పుకుని ఉంటేనే బాగుండేది రాఘవబాబూ! జీవితం మీ భాషలో చెప్పాలంటే 'సెటిల్' అయిపోయేది... ఈ రోజు ఇలా స్వయం ఉపాధి కేంద్రం ఆఫీసు దగ్గర ఐదు గంటలు పడి ఉండక్కర్లేక పోయేది. ఆయన పెట్టిన షరతులకు ఒప్పుకుని ఉంటే, ఈరోజు కార్లో వచ్చి మిమ్మల్ని మా ఇంటికి భోజనానికి తీసుకెళ్లేదాన్ని... ఖరీదైన రోజాపువ్వులతో, మరింత ఖరీదైన చిరునవ్వుతో మీరు మా ఇంట్లోకి వచ్చేవారు. ఇవ్వాళ్టిలాగా నన్ను కూర్చోమనాలా ఒద్దా, కాఫీ తెప్పించాలా అక్కర్లేదా? అనే పరిస్థితిలో మీరూ ఉండక్కర్లేదు. నేనూ ఉండక్కర్లేదు... ఔనా?."

"గంగా!" ఉలిక్కిపడ్డాడు రాఘవ. కొంచెం ఖంగారు కూడా పడ్డాడు.

"మా నాన్న పెంపకంలో బీదరికం నాకు ధైర్యాన్నిచ్చింది బాబూ! దైన్యం ఇవ్వలేదు. మీరు ఆ రోజు అన్నమాటలు చాలా కరెక్టు రాఘవ బాబూ!"

"ఏ మాటలు?" అయోమయంగా అన్నాడు.

"నేను లాటరీ టిక్కెట్టు బైటపెట్టానన్నప్పుడు... మనిద్దరి మధ్య ఎంత దూరం చూడిప్పుడు? అన్నారు. అది ఆ రోజే మీ మనసు గుర్తించింది. నాకు ఇప్పుడు చాలా చాలా అర్థమైంది బాబూ!"

"కూర్చో గంగా! ప్లీజ్... ఏమిటంటావు? హుం! నీ స్థితిలో ఉంటే నేనూ అలాగే మాట్లాడతానేమో!... కానీ, ఈ డబ్బు సుఖమివ్వదు గంగా!... మన జీవితాల్ని ఇది శాశిస్తుంది. మనకు ఏం కావాలో తెలుసుకోనివ్వదు. ఏం చెయ్యాలో చెపుతుంది."

"కరెక్టు బాబూ!" చప్పట్లు కొట్టింది గంగ.

"కరెక్టు... మనకు నిజంగా ఏం కావాలో తెలుసుకోనివ్వనిది ఏదీ మనకు ఒద్దు అనుకుంటే కానీ, జీవితం అర్థం కాదు. అదే నేను చెప్పబోయింది... అదే నాకు అర్థమైంది అన్నానే... అదే..."

"లేదు గంగా!" తల విదిలిస్తూ అన్నాడు రాఘవ

"నేను నువ్వు అన్నట్లు ఆలోచించకుండా బ్రతకడం లేదు. ఈ రకం జీవితం శాశించే పనులు యాంత్రికంగా చేస్తున్నా, మనసు ఎప్పుడూ నాకు కావల్సిన కొద్ది విషయాల గురించి తట్టి చెబుతూనే ఉన్నది. దాని మాట వినకూడదనే చాలా తప్పులు చేసి మరింత బిజీగా నటిస్తూ వుంటాను. ఆనాడు నన్ను అందరూ మాకు అక్కర్లేదని దిక్కులేకుండా వదిలేసినప్పుడు, కాటుక కళ్లతో, కారియర్‌తో నువ్వు ఇచ్చిన ఆప్యాయత, పెట్టిన అన్నం మర్చిపోలేను. ఆ పది రోజుల్లో రోజు రోజుకు నువ్వు నాకు ఎంత దగ్గర అయ్యావు! నీ దగ్గరతనం నన్ను ఎంత గొప్పగా, ఎంత ఉన్నతుడిగా ఆలోచింపచేసేది? డబ్బు సంపాదించలేని వెధవ అని అయినవాళ్లు వదిలేసిన స్థితిలో ఏ శక్తినన్ను లక్షరూపాయల లాటరీ టిక్కెట్టు చించెయ్యడానికి ధైర్యమిచ్చింది?! ఇవ్వాళ అయిదు వేలకు కక్కుర్తిపడే నేను, ఆ రోజు లక్షరూపాయలు ఎందుకు "ఒద్దు' అనుకున్నాను?

"ఇప్పుడు ఆ ధైర్యం... ఆ ధైర్యం ఏది గంగా?" జుట్టులో చేతివేళ్లు పోనిస్తూ బాధగా అన్నాడు రాఘవ.

అతణ్ణి చూస్తే జాలివేసింది గంగకు.

"మీరు చాలా అదృష్టవంతులు బాబూ! కనీసం ఏది పోయిందో, ఏమిటి కావాలో... దాని పరిధి గురించి అయినా ఆలోచిస్తున్నారు. చాలామంది ఈ అశాంతి దేనికో తెలియక ఎంత నరకం అనుభవిస్తున్నారో? మీకు హృదయపూర్వక శుభాకాంక్షలు! మీకు ప్రమోషన్ రావాలనో, మరిన్ని లక్షలు చేరాలనో నేను ఈ మాటలు అనడం లేదు బాబూ! మీరన్నారే... ఆ పోగొట్టుకున్న భావం ఏమిటి? అని... అది... మీకు రావాలని శుభాకాంక్షలు తెలుపుతున్నాను... వస్తాను..." వెనక్కు తిరిగింది గంగ.

"గంగా!... నీ అప్లికేషన్..."

"అది చాలా అడుగున ఉన్నదనీ, నాకు లోన్ శాంక్షన్ అయ్యే అర్హతలు అన్నీ ఉన్నా, నాకన్న ముందు ఆ ఇచ్చే అర్హతను మీ దగ్గర చాలామంది కొనేశారని నాకు తెలుసు రాఘవబాబూ! ఎప్పుడూ నా గురించి కొంచెం ఆలోచించమని మిమ్మల్ని ఇబ్బంది పెట్టలేదు... ఇప్పుడూ పెట్టను... వస్తాను..."

అవతలనించి వస్తున్న ఎవరికో స్ప్రింగ్ డోర్ రపీమని తగిలింది.

"అబ్బ... నుదురు పగిలిపోయింది... ఏమిటా పొగరు, అమ్మాయీ?"

చురుగ్గా చూసింది ఆవిడను గంగ...

"రాజేశ్వరీ!... ఆ అమ్మాయి గంగనీ... గంగా!... ఈవిడ నా భార్య..."

నవ్వుతూ నమస్కారం పెట్టింది గంగ.

చేనేతచీర, మట్టిగాజులు, తెల్లరాయి ముక్కుపుడక... అలంకారాలు, వాటి ఖరీదులనుబట్టి మనుష్యులకు అర్హతలను లెఖ్ఖవేసే రాజేశ్వరీ దేవికి గంగ కంటికి ఆనలేదు.

ఈసడింపుగా మొహం తిప్పుకున్నది. జరీ వెంకటగిరి చీరలో చుట్టి, రవ్వలు అతికించిన స్థూలకాయాన్ని కుర్చీలో ఇరికించి.

"అబ్బా... కూల్ డ్రింక్స్ తెప్పించండీ... ఏమి ఎండలు? ఏడీ ఈ ఫ్యాన్ ఎక్కడ చచ్చాడు?" అంది.

రాఘవ .ఇబ్బందిపడుతున్నాడు.

గంగ పెదవిపై సన్నని చిరునవ్వు.

'ఎంత జాలిపడవలసిన స్థితిలో ఉన్నావు రాఘవబాబూ! ఎన్నింటికని నిన్ను నువ్వు తాకట్టు పెట్టుకుంటావు?"

ఆ అడగని ప్రశ్నలు గాలిలో తేలి రాఘవ చుట్టూ తిరుగుతూ ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

❀ ❀ ❀

"ఏంటమ్మా... అలుపుగా వున్నదా?"

సార్టింగ్ చేస్తున్న గంగను అడిగింది మహాలక్ష్మమ్మ. "నీకు లోన్ శాంక్షన్ కాలేదంటగా... అదృష్టం ఉండాలి దేనికైనా... అదికూడా లంచం ఇస్తేకానీ దొరకదాయె..."

"ఫరవాలేదులే లక్ష్మమ్మా! అదృష్టం సంగతి దేముడెరుగును. చాలా చాలా అదృష్టాలలాంటి దురదృష్టాలు పట్టకపోవడం కూడా అదృష్టమే..." ఆలోచిస్తూ అన్నది గంగ.

"గంగా! నీకు ఏదో కవరొచ్చింది..."

గ్రీటింగ్ కార్డ్!.

"గంగా! కంగ్రాట్స్... నీ అప్లికేషన్ శాంక్షన్ అయింది. నీ శుభాకాంక్షలు నేను మర్చిపోలేను... నువ్వు అవకాశం వస్తే ఎన్ని చెయ్యగలవో, ఎన్ని నేర్పగలవో నాకు అర్థమైంది... ఆల్ ది బెస్ట్.

నీ

రాఘవ"

మరొక్కసారి గంగ కళ్లల్లో తళుక్కుమన్న వెన్నెల పెదవి మీదకు ప్రతిఫలించింది.

*('వనిత' - ఆగస్ట్, 1995)*

# పిచ్చితల్లి

'కొన్ని ప్రశ్నలకు సమాధానాలు జీవితకాలంలో దొరకవు. దొరికినా అర్థంకావు...' అనుకునేవాడు రాజేశ్వరరావు.

జీవితం చావుదెబ్బలు కొట్టి నేర్పించిన ప్రాక్టికాలిటి ముందు సున్నితత్వాలు, స్పందనలు జీవితపు కాసారంలో ఎప్పుడో అట్టడుగుకు వెళ్లిపోయి ఉంటాయి.

రానురాను బండబారిపోతున్న మనుషుల మధ్య, మెటీరియలిస్టిక్ రియాలిటీ పేరుతో చెల్లుబడి అయిపోతున్న స్వార్థాల మధ్య, అనుభూతుల నిశ్శబ్ద చలమలను గమనించేవారే ఉండరేమో అనుకుంటూ వుండగా అతనికి...

సావిత్రి కనిపించింది... చాలా ఏళ్లకు.

అప్పుడు,

పొడుగాటి జడ, సోగ కళ్లు, రాళ్ల ముక్కుపుడక అంటే చాలా చాలా ఆరాధన రాజేశ్వరరావుకు. ఆమెకు ఆ విషయం చెప్పాలన్న ఉత్సాహం బోలెడు వున్నా, చెప్పి దగ్గరయ్యే ధైర్యం అతనికి బొత్తిగా లేదు.

కానీ, ఆడపిల్లలకు కొన్ని చెప్పకుండానే తెలుస్తాయి. ఆ పిల్ల కళ్లు నవ్వు దాచేవి. సన్నటి పెదవుల మీద తేనెరంగు పుట్టుమచ్చ. వంకర నవ్వు, 'నీ సంగతి నాకు తెలుసులే' అన్నట్లు ఉండేది.

"మీరంటే నాకు చాలా ఇష్టం... నాకే కాదు చాలామందికి..." అని తన భావాన్ని జనరలైజ్ చేసి భయపడుతూనే బైటపెట్టాడు ఒకరోజున.

"ఎందుకట? ఎందుకు నేనంటే ఇష్టం?! ఎందులో నేను మిగతావాళ్లకన్నా వేరని?!" అని సావిత్రి ఎదురొచ్చేటప్పటికి,

ఉక్కిరిబిక్కిరై, చేతిలో వున్న ముంత కింద పప్పు గభాలున నోట్లో పోసుకుని, మరింత గందరగోళంలో పడ్డాడు రాజేశ్వరరావు. ఆ అమ్మాయి ఎన్ని విషయాల్లోనో మిగతావాళ్లకన్నా ప్రత్యేకమైన మనిషి అని తెలిసినా, ఎందుకో చెప్పాలంటే ఇసుకమీద గీతల్లాగా గజిబిజిగా ఉన్నదతనికి.

చాలామంది ప్రేమిస్తున్నామనుకునేవాళ్లకు అసలు ఎందుకు ప్రేమిస్తున్నామో, ఏ గుణం ఎదటి మనిషిని గొప్ప మనిషిగా, విలక్షణమైన వ్యక్తిగా రూపుదిద్దుతోందో చెప్పలేరు.

ఆ తరువాత, ప్రాక్టికల్ జీవితం అంటూ బుద్ధిగా కట్నానికి అమ్ముడుపోయి, సెటిల్ అయిపోయినాడు రాజేశ్వరరావు. కాలం మధ్య జ్ఞాపకాల నీడల్లో సావిత్రి ఛాయ చాలా తక్కువసార్లు తళుక్కుమనేది. స్థూలత్వం డాంభికత, అహంకారం

రూపుదిద్దుకున్న ఆడవాళ్ల ఇల్లాలితనాల మధ్య, వీటికి వ్యతిరేకమైన వ్యక్తి ఉంటుందా? అనుకున్నప్పుడల్లా ఆమె జ్ఞాపకానికి వచ్చేది.

"మా అత్తగారు నన్ను కాపురం చెయ్యనివ్వదు మామయ్యా! నా బతుకింతే..." బోరున ఏడుస్తూ ఐదో నెల కడుపుతో పుట్టింటికి వచ్చిన మేనకోడలు కసితో, రోషంతో చాలా చాలా కథలు చెప్పింది.

"అసలే అత్తగారు... అందులో సవితి తల్లి ఓ ముద్దు, ముచ్చట లేదు. ఏది అత్తగారు ఆలోచించి చెయ్యి అని ఒకటే నస. అమ్మ దేవత... ఆవిడ అన్నీ మంచే చెబుతుంది' అనే నా మొగుడు చేసిందా ఛీ... వెధవ జీవితం..." అని విసుక్కుంటూనే బోలెడు కష్టాలు చెప్పింది ఆ పిల్ల.

'నా కూతురు కాపురం కొల్లేరైపోయింది... త్వరగా రా...' అని అక్కగారి ఎస్.టి.డి. పిలుపు విని వెంటనే వచ్చిన రాజేశ్వరరావుకు ఆ మేనకోడలు అత్తగారి గురించిన కథలు వింటే ఆవిడ అసలు ఊహకు అందలేదు.

ఈ కోడలు పిల్ల తొందరపాటు తెలిసినా, అవతలి మనిషి సామాన్యురాలు మాత్రం కాదు అని అర్థమైంది అతనికి.

ఆవిడ సవితి కొడుకు పెళ్లికి ఏదో అలిగి రాలేదని అందరూ అన్నారు. అందుకే ఆవిడను చూడలేదు రాజేశ్వరరావు.

ఏం మాట్లాడాలో నిర్ణయించుకోకుండానే తప్పనిసరిగా అక్కగారి పోరు పడలేక, మేనకోడలు అత్తవారి ఊరు బైలుదేరాడు.

అప్పుడు... అక్కడ చూశాడు సావిత్రిని ఇన్నేళ్లకు - మేనగోడలి సవితి అత్తగారి హోదాలో.

ఆశ్చర్యపోయాడు రాజేశ్వరరావు ఆమెను చూసి. తనలో వయస్సు కనబడుతోంది. కానీ ఆమెలో పెద్ద మార్పు లేదు - తెచ్చిపెట్టుకున్న గంభీరత, వయసు ఇచ్చిన పెద్దరికం తప్ప.

తనకు ఆనాడు అలా తెలిసిన సావిత్రితో ఈనాడు ఈ విషయాలు ఎలా మాట్లాడాలో బొత్తిగా అర్థంకాలేదు అతనికి.

అతిథి మర్యాదల తరువాత, ముందు ఆవిడి సవితి కొడుకును కదిలించాడు.

"మా అమ్మను ప్రపంచం అంతా సవితి తల్లి అంటుంది. ఆవిడ నాకు అలా కాదండీ... ఆవిడ ఏం చేసినా నా మేలుకోసమే చేస్తోందని నాకు తెలుసు..." అన్నాడు అతను ఖరాఖండీగా...

ఈ విషయాన్ని అసలు ఎలా ప్రస్తావించాలో, ఎలా తేల్చాలో బొత్తిగా అర్థం కాలేదు రాజేశ్వరరావుకు.

కానీ, ఆ బాధ్యత కూడా సావిత్రే నెత్తిన వేసుకున్నది. "ఏమంటోంది మీ మేనకోడలు? మా అత్త గద్దరి రాక్షసి అంటోందా? ఆవిడ చస్తే తద్దినం కూడా పెట్టను అంటోందా?!" నవ్వుతూనే అడిగింది సావిత్రి.

ఆ మాటలన్నీ... అవ్వేమిటి? అంతకన్నా పలుగురాళ్లలాంటి మాటలే మాట్లాడింది మేనకోడలు. కానీ, ఎందుకో ఈవిడ నోట అవి వినలేకపోయాడు రాజేశ్వరరావు.

"ఏమిటి ఆ పిల్ల అసలు గోల?!" అడిగాడు.

ఆలోచిస్తూ చీకట్లోకి చూస్తూ కూర్చున్నది సావిత్రి.

తనపట్ల ఆ పిల్ల ఎంత క్రూరంగా ప్రవర్తించిందో చెప్పలేకపోతోందేమో ననిపించింది అతనికి.

"అసలు నా మేనకోడలు చిన్నప్పటి నుంచీ కొంచెం గడ్డరి..." ఇంకా ఏదో అనబోయాడు.

తనేదో తన అక్కకూతురు తరపున వకాలత్ తీసుకోవడానికి వచ్చి ఈవిడ పక్షం మొగ్గుతున్నానని తెలుస్తూనే వున్నది అతనికి. ఏమిటీ బలహీనత?!

"ఆ అమ్మాయినేమీ అనకండి... చాలా అమాయకురాలు.. రండి... భోజనం పెడతాను. అబ్బాయి వచ్చాడు..." అంటూ వంటింట్లోకి వెళ్లింది ఆమె.

ఆశ్చర్యపోయాడు రాజేశ్వరరావు. మామూలు ఆడవాళ్ల తత్వం తెలిసిన అతనికి ఈమె అర్థం కాలేదు. తను మాట్లాడించకుండానే ఆమె మంచిదైపోవడానికి ఇదొక ప్లాన్ ఏమో అనుకున్నాడు.

ఉన్న మూడు రోజుల్లో చాలా స్టడీ చేశాడు. బోలెడన్ని తెలుసుకున్నాడు. మరిన్ని ఎవరూ చెప్పకుండానే అర్థం చేసుకున్నాడు. అన్నింటిలోకీ ఆశ్చర్యం చాలా ఏళ్ల తరవాత అతను టెన్షన్ లేకుండా గడపడం. మొగవాణ్ణి ఇరవై నాలుగు గంటలూ బాధ్యతలు గుర్తుచేసి, గిల్టీగా తయారుచేసి, బతుకు భయం, బరువు తెలియజేసే సంసార వ్యవస్థలో, ఆ ప్రహరీ గోడలన్నీ దాటి ఏదో హాయి అనే వెన్నెల మైదానాల్లో స్వేచ్ఛగా వున్నట్లున్నది అతనికి. ఈ అనుభూతి చాలా తక్కువమంది ఆడవాళ్ల సన్నిధి ఇస్తుంది. ఈ మాట ఆమెతో చెబుదామని ప్రయత్నించాడు కానీ, చెప్పి... ఆ మాటల అర్థాన్ని, అందాన్ని, అనుభూతిని పోగొట్టుకోలేకపోయాడు.

సావిత్రి ఆవిడ అత్తగారి చేతుల్లో, భర్తతోనూ కూడా చాలా చాలా బాధలు పడింది. నిందలు, దుఃఖాలు అనంతం. పుట్టిన ఒక్క బిడ్డను పురిట్లోనే పోగొట్టుకున్నది. ఈ కొడుకు కూడా మొదట్లో చుట్టుపక్కలవాళ్లు, బంధువులు చెప్పిన మాటలు నమ్మి. 'నువ్వు సవితి తల్లివే' అంటూ చాలా హింసించాడు. పరిహసించాడు. కానీ రానురాను ఆమె గుణాలు తెలుసుకుని ప్రేమను పెంచుకున్నాడు.

"వాడి ముఖం, అలా చెప్పాడా వాడు?! వాడికి నా గురించి ఏమీ తెలియదు. వాడికి నా వల్ల భద్రత ఉన్నది, లాభదాయకమని ప్రేమిస్తున్నాడు అంతే... వాడూ ఆ తండ్రి పోలికే..." అన్నది చటుక్కున సావిత్రి.

అవాక్కైపోయాడు రాజేశ్వరరావు. చుట్టుపక్కల మనుష్యులందరూ తనను మమతానురాగాల్తో పూజిస్తున్నారు. వాళ్లు నేను లేకపోతే బతకలేరు. వీళ్లు నేనంటే

పడి చచ్చిపోతారు... అన్న అబద్ధం ముసుగు కప్పుకుని బతికెయ్యడం ఒక వర్గం ఆడవాళ్ల బలహీనతేమో కానీ, అందుకని మరీ ఇంత 'సినికల్'గా కూడా ఉండక్కర్లేదు అనిపించింది అతనికి.

"నా కష్టాలకు, దుఃఖాలకు కారణాలు నాకు తెలుసు రాజేశ్వరరావుగారూ! నా చుట్టూ వుండే మనుషుల మూర్ఖత్వం నాకు ఐడెన్టిటీ క్రైసిస్ తెప్పించడం. యాభై ఎకరాల సుక్షేత్రమైన మాగాణి మా అబ్బాయి తరానికి ఐదు ఎకరాలుగా మార్చిన మూర్ఖత్వం. ఒడియాల్లో వంద రకాలు, అప్పడాల్లో అరవై రకాలూ అంటూ పోటీ పడుతూ ఇంట్లో సంపాదనలేని ఖర్చుకు అలవాటు చేశారు ఆడవాళ్లు. అనవసరపు ఆడంబరాలు, అక్ఖర్లేని ఖర్చులు, ఎవరో చూస్తారన్న హెచ్చులు – ఇవన్నీ ఈ ఇంటిని ఏ స్థితికి తెస్తున్నాయో తెలిసికూడా నేను మాట్లాడలేకపోయాను. కారణం – గద్దరితనం చెల్లినట్లు కామన్‌సెన్స్ చెల్లకపోవడం. ఆడది ఆలోచించి సలహాలివ్వడం సగటు మొగవాడు భరించలేకపోవడం, మూర్ఖత్వంతో జీవితం పీటముడి పడిపోయినప్పుడు వచ్చే ఐడెన్టిటీ క్రైసిస్ అనుభవిస్తే కానీ తెలియదు.

"కానీ, నా కొడుకు పెద్దవాడౌతున్నకొద్దీ, ఇవన్నీ ఎంత అనవసరమో వాడికి తెలియచెప్పాను, ఎంత దాచుకోవచ్చో నచ్చచెప్పాను. వాడితండ్రి పోయినతరువాత, ఈ శిథిల ఆర్థిక వ్యవస్థలో పునాదులు కూలిపోకుండా మరింత ఆస్తి పెంచి వాడికి ఇచ్చాను. వాడికి నామీద నమ్మకం వచ్చింది. సవితి తల్లిని అన్న అపనమ్మకం పోయింది. నావల్ల వాడికి కష్టం లేదు. పైగా, నా పెద్దరికం వాడిని కాపాడుతుందన్న ధైర్యం. అందుకే వాడు నన్ను ప్రేమిస్తున్నాడు. అంతే..."

రాజేశ్వరరావుకు నవ్వొచ్చింది ఆవిడ ఎనలైజేషన్‌కు. అంతకన్నా నీలో ఏమున్నదో చూసే శక్తి అతనికి వున్నదంటావా? అని అడగబోయి మానేశాడు.

"మరి మీరు అతని పెళ్లికి అలిగి రాలేదని విన్నాను... నిజమా?!"

చటుక్కున్న తలెత్తి చూసింది సావిత్రి ఆ ప్రశ్నకు. "అవును... కానీ, అలిగి రాకపోవడం కాదు... బాధ... మీ అక్కగారి కుటుంబం ఆర్థిక స్థోమత ఏమిటో నాకు తెలుసు. తండ్రి అప్పులపాలు చేస్తే ఉద్యోగం చేస్తున్న కొడుకు మీద ఆధారపడ్డ కుటుంబం అది. లక్ష రూపాయలు పెళ్లికి ఖర్చు చేస్తామన్నారు. అటువంటప్పుడు పెళ్లి ఇంట్లో చేసి, సత్యనారాయణ వ్రతం చేసి, భోజనాలు పెట్టి, మిగతా డబ్బు ఆ పిల్ల పేరుమీద బ్యాంకులో వెయ్యమన్నాను. అది అమానుషంగా కనిపించింది అందరికీ. సవితి తల్లిని కాబట్టి అచ్చట ముచ్చట చూడలేకపోయానన్నారు. నా కొడుకు కూడా ఊరేగింపు సరదాలకు, లాంఛనాల ఆడంబరాలకు లొంగిపోయి 'ఒక్కసారేకదమ్మా పెళ్లి జరిగేది..." అంటూ సిద్ధపడిపోయాడు. పిల్లనిచ్చేవాళ్ల కష్టం తెలియని వీడిని అల్లుడిని చేసుకోవడానికి తీసుకువచ్చిన అప్పుకు ఇంకా వడ్డీ కూడా సరిగ్గా కట్టలేకపోతున్నాడు మీ మేనల్లుడు. కళ్లముందు జరగబోయే ఈ అనవసరపు ఖర్చు భరించలేకే నేను రాలేదు."

ఆమె గొంతులో పదునుకు, సాంఘిక చైతన్యం పట్ల ఆమెకు వుండే అవగాహనకు ఆశ్చర్యపోయాడు రాజేశ్వరరావు. మరికొన్నిక్షణాల్లో మరింత పెద్ద షాక్ ఇచ్చింది సావిత్రి.

"నేను పడ్డ దుఃఖాలు, మూర్ఖత్వానికి బలై అనుభవించిన కష్టాలు, నా కోడలుకు వుండకూడదనుకున్నాను రాజేశ్వరరావుగారూ! ఎందుకో తెలుసా?! ఆ పిల్ల సాటి ఆడపిల్ల. మామూలుగా వుండే ఏ ఆడపిల్లకూ సాధారణంగా తనను ఎందుకు ఎలా గౌరవిస్తారో తెలియదు. తన అందం, శారీరకంగా తన అవసరం, తన అదృష్టం - ఈ మూడు మాత్రమే అర్థమయ్యేట్లు పెంచుతున్నాం ఆడపిల్లల్ని. అలా ఆమె ఒక హోదాగా, ఒక తప్పనిసరి బాధ్యతగా తయారవడం నాకు ఇష్టం లేదు. అందుకనే నా కోడలుకు చాలా చాలా చెప్పాలని. ప్రయత్నించాను. చదువుకోమన్నాను. పార్ట్ టైం జాబ్ చెయ్యమన్నాను. వాయిస్ కల్చర్ నేర్చుకోమన్నాను. డ్రస్ సైన్స్ హుందాతనం ఆమెలో పెరగాలని ప్రయత్నం చేశాను. మామూలుగా పెరిగిన ఆడపిల్ల కదా! నా ఆలోచనలు అర్థమవడానికి టైం పట్టచ్చు. ఈ కొత్తగా పెళ్లైన పిల్లలంతా, పిల్లల్ని కనడమే తమ సంసారానికి ఇన్స్యూరెన్స్ పాలసీ అనుకుంటారు. ఇంకా ఎదగఖ్ఖర్లేదనుకుంటారు. కొద్దిరోజుల తరువాత గుర్తింపులేక నరకయాతన పడతారు."

అవాక్కైపోయాడు రాజేశ్వరరావు.

ఇవన్నీ... ఈ నేర్పరితనమే తన మేనకోడలికి సవితి అత్తగారు పెట్టే కష్టాలుగా కనిపించాయన్నమాట!

"తనకు మీరు అర్థమై వుండరు సావిత్రీ!" నసుగుతూ అన్నాడతను.

'హు!' నిర్లిప్తంగా నవ్వింది ఆమె.

"ఏ ఆడది సాటి ఆడదానికి సంపూర్ణంగా ఎప్పుడు అర్థమైందికనక?! మొగవాడు ఆడదాన్ని తన కోణం నుంచి చూసి, తన అవసరాల వరకే గుర్తిస్తాడు. కానీ స్త్రీ మరొక స్త్రీని బైటపడే ఎమోషన్స్, పరిస్థితుల్నిబట్టికాక, జెలసీ, కాంప్లెక్సులు లేకుండా కుతూహలంతో స్టడీచేస్తే కనబడని భావాలు, అర్థాలు బోలెడు నేర్పిస్తాయి."

అలా ఆమె చాలా మాట్లాడింది. వింటూ కూర్చున్నాడతను. సాధారణంగా గడిపేస్తున్న ఈ జీవితంలో ఎన్ని వింత కారణాలున్నాయో ఆమెతో మాట్లాడుతుంటే అర్థమైంది అతనికి.

ఇలా తన ఇంట్లో. ఆడవాళ్లెవరూ ఆలోచించరేం? భయమా? అవసరం లేకపోవడమా? తన భార్య, అక్క, కూతురు, మేనకోడలు - ఒకరేమిటి? అసలు ఇలా మాట్లాడితే తనే భరించగలడా?.

ఉలిక్కిపడ్డాడు రాజేశ్వరరావు.

"రాజా!"

బయలుదేరుతున్న అతను ఉలిక్కిపడ్డాడు ఆ పిలుపుకు... ఏనాటి పిలుపు అది?!

"ఇదుగో... ఈ పదివేలు ఆ పిల్ల పురిటి ఖర్చుకు, మా వాడికి పెట్టుబడులకు ఖర్చుపెట్టమని మీ అక్కయ్యకు ఇవ్వండి. లేకపోతే నా కొడుకు దృష్టిలో ఆ పిల్ల పుట్టింటి వాళ్లమీద గౌరవం పోతుంది. ప్రేమ, ఆప్యాయతలకన్నా పెట్టుపోతలమీద ఆధారపడి సాగే సంసారాలు మనవి. ఇదంతా మార్చాలని నా ప్రయత్నం... నా కోడలుకు నా ఆశీర్వచనాలని చెప్పండి... తనింటికి తనను త్వరగా రమ్మన్నానని చెప్పండి..."

కళ్లు చెమర్చాయి రాజేశ్వరరావుకు. ఎంత పిచ్చితల్లి ఈమె?! ఎవరికి ఈమె అర్థమౌతుంది?! ఇలాంటి కరుణామూర్తులైన ఇల్లాళ్లు ఎంతమంది వున్నారు ఈ నా దేశంలో?! సాటి ఆడదాన్ని రక్షించాలన్న జ్ఞానమే అపురూపమైన ఈ కాలంలో ఆమెను ఎలా రక్షించాలో, ఎలా బతికించుకోవాలో తెలిసినవాళ్లెంతమంది?! ఈమె గురించి తను తనవాళ్లకు ఎలా, ఏమని అర్థమయ్యేట్లు చెప్పగలడు?!

'నా గురించి ఏం తెలుసునని ఇష్టపడుతున్నారు?' అన్న ముప్పైఏళ్లక్రితం నాటి సావిత్రి ప్రశ్నకు ఇప్పుడు అతనికి సమాధానం దొరికింది.

వెనక్కు తిరిగి "వెళ్లివస్తాను" అని చేతులు జోడించి నమస్కరించి, ఒక రకమైన నిశ్చింతతో అడుగు బైటకువేశాడు రాజేశ్వరరావు.

('ఈనాడు' ఆదివారం – జనవరి *21, 1996*)

# మలుపు

ఆమె నా దగ్గరకు వస్తానన్నది... స్పిరిచ్యువల్ గైడెన్స్ కోసరం అయి ఉండాలి. వచ్చింది... దానికోసరంమాత్రంకాదు.

ఆశ్చర్యంగా ఉన్నది - ఆమె అంత భ్రాంతితో... ప్రాపంచిక విషయాల ప్రలోభంతో మాట్లాడుతూ ఉంటే...

"అనూ ముజుమ్‌దార్ సృష్టించిన 'పారలెల్ జర్నీస్'లో మైత్రేయి అంతటిదానివనుకున్నాను... ఏమిటి మరీ ఇలా...'

"మీరు యాజ్ఞవల్క్యుణ్ణి కూడా అనుకున్నారా?" ఒకరకంగా నవ్వుతూ అడిగింది... ఆ నవ్వులో చిలిపితనం పొర కప్పుకున్న ఏదో నిర్లిప్త తేజోమయత్వం.

కానీ... ఆ కాంతి నా అహంమీద కొట్టింది.

బుసకొట్టిన అహం... కుండలినీశక్తి అయి తేజోచక్రాలనే భాసింప చెయ్యనక్కర్లేదు. అధోముఖంగా ప్రయాణించి నేను 'నేను తనాన్ని' మరింత ప్రాభావితం చేయవచ్చు కూడా.

శూన్యత, సాంద్రత అనేవి చాలా అస్పష్టపు చీకట్లు. అందులో నిప్పచ్చరమే నిలకడ అనిపిస్తుంది. ఆధ్యాత్మిక దారుల్లో అహం ప్రయాణం అప్పుడప్పుడు ఈ నీహారికా స్వాంతనంలో 'మాయ' తోడుగా ప్రయాణిస్తూ పరుగందుకుంటుంది.

ఆవిడ వచ్చిన విషయం ఏదో స్థలాల కొనుగోలు విషయం. నా స్కూల్ ఆఫ్ థాట్‌కు పక్కనున్న స్థలం ఆవిడకు కావాలిట. బేరం కుదుర్చమన్నది.

చాలా వ్యవహారవేత్తలా మాట్లాడుతోంది, ఒళ్లు మండిపోయేటట్లు.

ఒకప్పుడు, "నీకు నేను ఒద్దా?" అని ఆరాటంగా అడిగి, ఒద్దు అనిపించుకున్న వ్యక్తి.

"నీకు నేను అక్కర్లేనప్పుడు, నేను ఎవరిదాన్నైనా ఒకటే..." అన్న ఈ మనిషి ఏమిటి ఇలా మారిపోయింది?!

ఆవిడకు నా ఇన్టలెక్చువాలిటీ మీద విపరీతమైన ఆరాధన ఉండేది. ఏ బాధనన్నా నాతో పంచుకోవడానికి వస్తూ ఉండేది.

"నా దుఃఖానికి కాదు అర్థం...నాకు నేను అర్థం వెతుక్కుంటున్నాను ప్రొఫెసర్‌గారూ!" అన్నది రెండేళ్ళ క్రితం వచ్చినప్పుడు.

ఆ క్రితంసారి వచ్చినప్పుడు భోరున ఏడ్చింది. ఆవిడకు ఎం.బి.ఎ. చదువుతున్న కొడుకు పోయాడట.

ఆ తరవాత చాలా చాలా మార్పులు.

నా పర్సనల్ గ్రోత్‌కు ఫ్యామిలీ అడ్డం అనిపించింది. తెగతెంపులు చేసుకొని చాలా చాలా చేస్తున్నాను.

నేను ఇప్పుడు యోగా, జెన్ సెంటర్స్‌కు హెడ్‌ను. ఆధ్యాత్మిక గురువును.

"నిరాదరణకు, దుఃఖానికి, ఐడెన్టిటీ క్రైసిస్‌కు ఒక మలుపు ఉంటుంది. ఆ మలుపు తిరిగేదాకానే ఈ బాధలు..."

ఎప్పుడూ చెప్పేవాణ్ణి ఆమెకు.

"ఎలా? ఏమిటి మారుస్తుంది నన్ను? ఏది ఎందులో ఎలా వెతుక్కోవాలి?" భోరున ఏడుస్తూ అడిగిన రోజులు ఉన్నాయి.

"ఇలా అని చెపితే నీకు అర్థంకాదు... జీవితంలో మీన్స్ అండ్ ఎండ్స్ ఒకటైనప్పుడు కలిగే చైతన్యం, స్ఫూర్తి – వాట్ యు కాల్ రియలైజేషన్... అది వచ్చేదాకా ఈ పోరాటం, ఈ ఆరాటం తప్పదు..." ఓదారుస్తూ చెప్పేవాడిని.

"అది వేరు... జీవితం... అంటే మనం జీవిస్తున్న జీవితం – ఇవి రెండూ వేరా?" ఆమె అమాయకంగా అడిగేది.

"అవును... నువ్వున్న సెన్సిటివ్ స్టేజ్‌లో అలాగే అనిపిస్తుంది. కానీ అది ఇదిగా, ఇది అదిగా మలుచుకోవాలి..." సూటిగా చూస్తున్న నా కళ్ళ నుంచి చూపు మరల్చుకునేది.

"మన చుట్టూ ఉండే చైతన్యశక్తితో మనస్సు లయమవడమే ధ్యానం అంటారు మీరు... ఆ స్థితి రావాలంటే స్వార్థం, అసూయ, అహం – ఇల్లాంటివన్నీ కంట్రోల్‌లో ఉండాలి అన్నారు సరే. అదెలా అని? ఏదన్నా పూజలు, వ్రతాలు..." అది నిజాయితీ గల ప్రశ్నో, లేక పరీక్షకు పెట్టే విమర్శో తెలియకుండా మాట్లాడే తెలివితేటలు ఆమెకు చాలా ఉన్నాయి.

"పూజలా? ఇంకా నయం... ఇది ఏ మతానికి, కులానికి సంబంధించింది కాదు... ఇది ఏ మనిషికి ఆ మనిషి సాధించుకునే స్థితి."

"రైటే–కానీ, ఒక్కసారిగా మనిషి తన వాతావరణం నుంచి బైట పడడుకదా! దాన్ని తప్పించి అతడికి 'చైతన్యం' ఇచ్చే స్పెషల్ పద్ధతి మీరేమైనా కనిపెట్టారా?!" సూటిగా అడిగింది.

"లేదు... అది అతడంతట అతడే తప్పించుకోవాలి..."

"ఇక్కడే ఉన్నది మెలిక... అది తప్పించుకున్న తరవాత మీలాంటి స్పిరిచువల్ గైడ్స్ హెల్ప్ చేస్తారా? అది తప్పించుకునేందుకు సహాయం చేస్తారా?!"

"ఒకసారి ధ్యానమార్గంలో పడ్డతరవాత అవన్నీ మెల్లిగా తొలిగిపోతాయి..... ప్రయత్నించకుండా అల్లరి చెయ్యకు..." మందలించాడు ఒకసారి.

బుద్ధిగా తల ఊపింది. బోలెడు పుస్తకాలు తీసుకువెళ్ళింది.

"పూర్వజన్మలు, కర్మలు, అనుభవాలు – ఇవన్నీ ఉన్నాయని అన్ని దేశాల్లోనూ చాటేస్తున్నారు కదా! ఇంక అనుభవించక తప్పనప్పుడు..." – ఒక సిలోన్ యువకుడు ప్రశ్నించాడు.

"అనుభవానికి సరిహద్దు లేదు... కానీ అనుభవించేటప్పుడు అవేర్‌నెస్ మనను మారుస్తుంది. మరొక పరిధికి తీసుకువెళుతుంది. ఇది బైటకు కనబడని మార్పు... ఈ అవేర్‌నెస్ కోసరమే ఈ ధ్యానం అనుకుంటూ..." ఆమె జవాబు చెప్పింది.

ప్రశంసాపూర్వకంగా చూశాను.

ఆమె సర్వజీవితానికి అర్థం నా గుప్పెట్లో... నా పిడికిట పట్టులో... నా స్పర్శతో తప్ప చైతన్యంరాని బొమ్మ... నా ఊహల దారాలు కాంతిరేఖలైతే, వాటి పరిధిలో వెలిగే సీతాకోకచిలకలాగా నేను ఇచ్చే ఇంటలెక్చువల్ స్వేచ్ఛతో వెలుగుతూ ఉండేది ఆమె...

ఒకసారి వచ్చినప్పుడు–

నా చుట్టూ అమెరికన్స్, జర్మన్స్... దూరంగా నిలబడిపోయింది.

మన దేశంలో ప్రతి ఆధ్యాత్మిక గురువుకూ, వాళ్ళ చుట్టూ ఉండే ఈ నీలి కళ్ళ తెల్లబొమ్మలు విపరీతమైన 'విలువ' తెచ్చిపెడతారు.

నేను కొద్దిగా గర్వంతో పరిచయం చెయ్యబోయాను.

నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

"మాస్టర్!... ఆవిడ ఆరా... చాలా అద్భుతంగా ఉన్నది... ఆవిడ ఎవరు?!" ఒక జర్మన్ కుతూహలంగా అడిగాడు.

ఉలిక్కిపడ్డాను నేను.

ఆ మధ్య ఆవిడ చాలా మేధావంతురాలిగా, ఆధ్యాత్మికత గురించి మాట్లాడుతున్న వ్యక్తిగా ఆ పరిధికి సంబంధించిన జనం మాట్లాడటం మొదలు పెట్టారు.

"ఆమె మీ శిష్యురాలుటగా?" అన్న ప్రశ్న నాకు చాలా చాలా సమస్యలు రేపింది.

ఔనో, కాదో అన్నట్లు తల ఊపేవాణ్ణి. ఆవిడ గొప్పగా తయారైతే, నన్ను గురువుగా చెప్పుకుంటే ఒప్పుకోవచ్చునుకానీ, ఏదైనా కాంట్రవర్సీగా తయారైతే?!... బాధ్యత నాదెలా అవుతుంది?!

నువ్వు గొప్ప గురువువి అయిపోతున్నావుటగా?!" అడిగాను.

నవ్వింది.

"నేను భగవత్‌దూతను... మిమ్మల్నందర్నీ రక్షించడానికే వచ్చాను..." అన్న ఆలోచన, స్కిజియోఫీనియాలో ఒక భాగం అని విన్నాను... ఏమంటారు దాన్ని? మాగ్లమానియానా?! అలా ఏమైనా తయారౌతున్నానా ఏమిటి ఖర్మ?!"

ఉలిక్కిపడ్డాను... ఆ మాటల్లో నిజాయితీకి.

"లేదు... నీ గురించి చాలా విన్నాను... నా దగ్గరకు నీ స్నేహితులు చాలామంది వస్తున్నారు..."

ఆలోచిస్తూ, ఎటో చూస్తూ తలకాయ అలవోకగా ఊపింది.

'ఇదంతా మీ గైడెన్స్' అని తప్పించుకుంటుంది అనుకున్నాను.

అంత నిష్పూచీగా లేదు మనిషి.

ఈ మధ్యకాలంలో...

ఆమెకు జీవితం పట్ల, అనవసరపు అవకాశాలపట్ల, వస్తుభ్రాంతిపట్ల చాలా చాలా యావ పెరిగింది అనిపిస్తోంది నాకు. హెచ్చరించాను ఆ విషయం.

"అనుభవం తప్పుకాదేమో!... పైగా, దాని నుంచి పారిపోవడం పిరికితనం... అనుభవం నుంచి ఏం మిగుల్చుకుంటున్నాం అన్నది ప్రజ్ఞ... అవునా?!" ఓరగా చూస్తూ అడిగింది.

"అంటే..." ఎక్కడికి దారితీస్తోందా అని ఆలోచిస్తూనే అడిగాను.

"ఇదంతా గొంగళిపురుగు సీతాకోకచిలకగా మారే ప్రాసెస్ కాదంటారా?" నవ్వుతూ అడిగింది.

ఒళ్ళు మండింది నాకు.

"గొంగళి పురుగులన్నీ సీతాకోకచిలకలవ్వాలన్న రూలు లేదు... అనుభవాలు అనుకుంటూ బంధనాలు పెంచుకుంటే అలాగే అంతంకూడా అయిపోవచ్చు..."

"అంటే బంధనాల మధ్య 'బ్రతికి' ఉండాలన్నమాట... అదేగా నేనూ అన్నది..." అంటూ నవ్వింది.

ఆ తరువాత ఆమె గురించి పట్టించుకోలేనంత బిజీ అయిపోయాను నేను.

"ఇదంతా ఇటాలియన్ మార్బుల్... ఒక శిష్యుడు తయారు చేయించి ఇచ్చాడు..."

సువిశాలమైన నా ధ్యానమందిరం చుట్టూ చూపిస్తూ చెప్తున్నాను ఆమెకు, మరొకసారి వచ్చినపుడు.

చెట్లు ముట్టుకు చూసింది.

"ఈ ఇండోర్ ప్లాంట్స్‌లో కొన్ని ప్లాస్టిక్‌వి... సింగపూర్ శిష్యుడి కానుక..."

నవ్వింది.

నలభై ఎకరాల సువిశాల ప్రాంగణంలో చాలా అద్భుతంగా పెరుగుతోంది. నా ఆశ్రమం.

టి.వి. ఛానల్ ఒకదానిలో పాతికవేల ఖర్చుతో ఈ నా ఆశ్రమం గురించి, ఇక్కడ జరిగే ఆధ్యాత్మిక, ఆధిభౌతిక వ్యాధి నివారణ గురించి చాలా చాలా చెప్పిస్తున్నాను.

జనానికి ఇటువంటి ఆధ్యాత్మిక రిసార్ట్స్ ఎంత అవసరమో?! నాకు వేల సంఖ్యలో దేశ విదేశాల శిష్యులు పెరిగిపోయారు.

చాలా చాలా బ్రాంచీలు కావలసి వస్తున్నాయి.

ఏదో ఆలోచిస్తూ కంటి నీరు తుడుచుకోవడం చూశాను ఆమెను.

"ఎందుకు?" ప్రశ్నించాను జాలిగా.

కంటి నీటిపొర నుంచి తలెత్తి చూసి పక పకా నవ్వింది.

"అదేమిటి? ఏడుపూ, నవ్వూ ఒకేసారి వస్తున్నాయా? ఏమిటి దాచాలని ఆ ప్రయత్నం?" ఆలోచిస్తూ అడిగాను.

"అబ్బే... ఏడుపు రావడానికి అనేక కారణాలు ఉంటాయి... కానీ, ఇంకా కన్నీళ్ళు రావడానికి కావలసిన స్పందన మిగిలి ఉన్నందుకు నవ్వు వచ్చింది... ఇది హిస్టీరియా కాదు... అంతా బ్రహ్మానందమే..." అన్నది.

"నీ దుఃఖాలకు కారణం నేను అడగను... చాలా దుఃఖాలకు కారణం బంధం... నిన్ను అన్నీ వదులుకోమని నేను అడగను కానీ, మీ ఊరు దగ్గర మెడిటేషన్ సెంటర్ పెడదామనుకుంటున్నాను... నువ్వు దాన్ని లీడ్ చెయ్యగలవా?" అడిగాను.

మళ్ళీ నవ్వింది.

"ఆ బ్రాంచ్ పేరేమిటి? దండకారణ్యమా? దహరాకాశమా?"

కొన్ని మాటలు మాడ్యులేషన్‌తో, ఒక రకపు విరుపుతో కోటి అర్థాలు ధ్వనిస్తాయి.

ఆమె చూపులో నిర్భీతికి, మెరుపుకు అలాంటి విరుపు కూడా ఉన్నది.

ఏమౌతోంది ఈ మనిషి?!

"నువ్వు దండకారణ్యంలో ఉన్నావు... దహరాకాశానికి దారి చెప్పాలనే నా ప్రయత్నం..." ఆప్యాయంగా చూస్తూ అన్నాను.

అక్కడ కొంతమంది నా శిష్యులు జెన్ కొటేషన్సు, భగవద్గీత శ్లోకాలు చిన్న చిన్న బోర్డుల మీద దిద్దుతున్నారు.

వాళ్ళ దగ్గర కూర్చుని, వాళ్ళకు సహాయం చేస్తూ, నవ్విస్తున్న ఆమెనే చూస్తూ కూర్చున్నాను.

మనిషిలో వ్యక్తమయ్యే పసితనం... అది చాలా గొప్పది... ఈమెను ఒకప్పుడు ఇన్‌స్పిరేషన్స్ కమిట్‌మెంట్ కాకూడదని దూరం చేసుకున్నాను.

పెళ్ళిళ్ళ విధానంలో ఇన్‌స్పిరేషన్ హక్కుల గుప్పిళ్ళలో నలిగి ఆవిరైపోతుందని తెలియచెప్పాను.

అయినా 'పెళ్ళి'లో ఇరుక్కున్నది. నేను ఆ వలయం నుంచి సులభంగా బైటపడ్డాను... మొగవాణ్ణి కాబట్టేమో... కానీ, ఆమెకు తామరాకు మీద నీటి

బొట్టులాగా బ్రతకడం రావడంలేదు... మరింత, మరింత కూరుకుపోతోంది పాపం. ఆమె రాస్తున్న బోర్డ్ చూశాను.

In not being able to get it, you get it.

When you are silent, it speaks.

When you speak it is silent.

తలకాయ ఎత్తి చూసి నవ్వింది... ఎన్ని అర్థాలు ఆ నవ్వులో!

మర్నాడు మధ్యాహ్నానికి రియల్ ఎస్టేట్‌వాళ్ళతో బిజినెస్ సెటిల్ చేసుకుని భోజనానికి ఆశ్రమానికి వచ్చేసింది. మిగతా ఫార్మాలిటీస్ నా పలుకుబడిగల శిష్యులు, ఆవిడ మేనేజర్ చేస్తారు.

"మీ ఫారిన్ కారులో ప్రయాణం చాలా హాయిగా ఉన్నది..." అన్నది.

నవ్వాను.

"ఏమిటి అలా నవ్వుతున్నారు? నాకు ఇలాంటి చిన్న చిన్న విషయాలు ఎలా తృప్తినిస్తాయా అనా?! ప్రతిక్షణంలోనూ జీవించాలిగా మరి..." అన్నది.

ఆవిడ ఒళ్ళు విరుపులో హాయిని గమనిస్తున్నాను.

"మీకు తెలుసా? నేను డాన్స్ నేర్చుకుంటున్నాను..." అన్నది గభాలున.

"అదేమిటి?" అప్రయత్నంగా అడిగాను. వెంటనే,

"నేర్చుకోకూడదని కాదుగానీ..." అన్నాను సర్దుకుంటూ.

"ఇప్పుడు మీకు రుక్మిణీ అరెండేళ్ గురించి చెప్పి డాన్స్‌కు వయస్సుకు సంబంధంలేదని, యోగము, నృత్యము, ఆత్మానందము వగైరా చెప్పి మిమ్మల్ని భయపెట్టను లెండి... ఎవరో స్వామీజీ మనలో నిద్రిస్తున్న అంతర్గత చైతన్య వాహినులు ఒక్కసారిగా ఏ ఇన్హిబిషన్స్ లేకుండా చేసే బాడీ మూవ్‌మెంట్స్ వల్ల నిద్ర లేస్తాయి అన్నారు... అదేదో చూద్దామని..." చిలిపిగా అన్నది.

"ఈ అడ్డమైన మెడిటేషన్ విధానాలు, ఆధ్యాత్మిక అడ్డదారులూ... సారీ... అన్ని ఆశ్రమాలూ ఒక రకంగా ఉండవు... ఆ స్వామీజీ గురించి, ఆయన సంబంధాలను గురించి చాలా చాలా విన్నాను... అనవసరంగా మెంటల్‌రెక్స్ అయి అక్కడినుంచి, ఇక్కడికి వస్తున్నారు జనం... జాగ్రత్త!..." హెచ్చరికగా అన్నాను.

నా గొంతులో భీతి కనిపెట్టి నవ్వింది.

"దేన్ని గురించి భయపడుతున్నారు మీరు? మానవ సంబంధాల గురించా? మానసిక అనుబంధాల గురించా?"

ఒళ్ళు మండింది నాకు.

"చెప్పలేం... ఒకదాంట్లో నుంచి ఒకటి వస్తే..."

"భయపడకండి... ఆశ్రమమే కావల్సివస్తే..."

"అవును... నువ్వు ఇక్కడ చేరవచ్చు కదా!"

వెనక్కు తిరిగింది ఆమె ఆ మాటలు విని.

తెల్లటి చీరలో, రవ్వల దిద్దులతో... వైష్ణవి. ఆమె ఆడబడుచు... నా శిష్యురాలు... ఆశ్రమవాసి... ఆవిడ వచ్చిన తరవాత ఈ సెంటర్లో చాలా అందాలు, మార్పులు, ఆవేశాలు, ఆరాధనలు పెరిగాయి.

"అరె... మీరా వదినా? ఇవిగో, మీకు ఒక పది తెల్లచీరలు తెచ్చాను..."

"థాంక్స్... వీటికోసమే నీకు రెండుసార్లు ఫోన్ చేయించాను..."

వైష్ణవి ఆమెవంకే పరిశీలనగా చూస్తోంది.

ఏదో గులాబీరంగు చీరలో విచ్చుకున్న భ్రాంతిలా ఉన్నదామె.

"హాయిగా నువ్వు కూడా తెలుపు చీరలలోకి మారిపోకూడదూ?" ఓరగా నన్ను చూస్తూ అన్నది వైష్ణవి.

పకపక నవ్వింది ఆమె... ఆ నవ్వు వెలుతురు రతనాల వెల్లువలా ఆ స్పందనలేని పాలరాతి మందిరాన్ని జలదరింపచేసిందో, పులకింపచేసిందో చెప్పలేను.

ఆశ్రమంలో ఆ నవ్వు... కొంచెం కష్టమే... ఇద్దరు ముగ్గురు తొంగిచూసి మౌనంగా వెళ్ళిపోయారు.

"వదినా! మీరు తెల్లచీరలో హాయిగా ఉన్నాననుకుంటున్నారు... నేను ఏ చీరలోనైనా హాయిగా ఉంటాను... తప్పదుగా వదినా!... మీకు ఆశ్రమం ఉన్నది మరి..."

అర్థంకాలేదు వైష్ణవికి... అసూయ తెలిసిన కొంతమంది ఆడవాళ్ళకు చాలా చాలా అర్థం అవడం మానేస్తాయి.

చీరలు లెఖ్ఖ పెట్టుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది వైష్ణవి. ఆమె కూడా వెళ్లిపోయింది 'నిద్ర వస్తోంది' అంటూ.

"ఆవిడ కొన్న స్థలం మన ఆశ్రమానికే ఇస్తుందా గురువుగారూ! అందుకే బోలెడు ఇన్ఫ్లుయన్స్ ఉపయోగించాను... అంతా వేస్ట్ అయిపోతుందా?" ఆశగా అడిగాడు నా దబ్బు, పలుకుబడి ఉన్న శిష్యుడు ఆమె వెళ్ళిన వైపే చూస్తూ.

చాలా ఇబ్బందికరమైన ప్రశ్న... ఎలా అడుగుతాను ఆమెను? నిజానికి ఆ స్థలం వస్తే స్కూలు పెట్టచ్చుమరి.

కానీ, ఆవిడ భర్త పెద్ద రాజకీయవేత్త!

మాటల సందర్భంలో, ఆ స్థలం ఆయన గెస్ట్‌హౌస్‌కు అని చెప్పినట్లు గుర్తు.

❀ ❀ ❀

ఆ సాయంత్రం...

ప్రశాంతంగా ఉన్నది వాతావరణం.

అశ్వత్థ కింద కట్టిన అరుగు మీద కూర్చున్నాము మేమిద్దరము.

ఆమె చాలా సేపటినుంచీ అక్కడే కూర్చుని ఉన్నది. నేను మూడు మెడిటేషను క్లాసులు తీసుకుని వస్తున్నాను.

అలుపుగా ఉన్నది నాకు. అంతమందికి 'రిలాక్సేషన్ థెరపీ' ఇచ్చే నాకు రిలాక్స్ అవ్వడం ఎంత కష్టమో తెలుసు.

చల్లగా నవ్వింది ఆమె నావంక చూసి.

దూరం నుంచి భగవద్గీత క్లాసు... పక్షుల కుహూ కుహూ రవాల నుంచి శ్రావ్యంగా... అలౌకికంగా.

"మీ విభూతి యోగం కన్న నా అనుభూతి యోగం చాలా గొప్పది..." అని ఒకప్పుడు ఆమె చేసే అల్లరి గుర్తుకు వచ్చింది.

కాలం, వయస్సు, సమస్యలు, పరిస్థితులు - వీటి మధ్యలో చటుక్కున గుర్తుకు వచ్చే జ్ఞాపకాల శకలాలే జీవితంలో సారమా?! అవే మిగులుతాయా?!

"చాలా చల్లగా, హాయిగా ఉన్నది కదా..." ఆలోచనలు దాచేసుకుంటూ అన్నాను.

"అవును..." చిన్న చిన్న మాటలు అతి మెత్తగా పేరుస్తూ, సూటిగా చూస్తూ అన్నది ఆమె.

"అవును... ఇవి పాలరాతి మీదుగా వీచే అమానుషమైన చల్లదనం, ఆలోచనల వక్రీభూత చల్లదనం, బలవంతపు మౌనం, బాహ్య ప్రశాంతత, అంతర్ఘోషనించి ఆరంభించిన మెడిటేషన్ గదుల చల్లదనం కాదు ఇది... ఎక్కడి చల్లదనమో, హాయోకాదు... ఎప్పుడూ మన చుట్టూ ఉండేదే... మనం ట్యూన్ అయితే వెంటనే అనుభవంలోకి వచ్చేది..."

ఆ మాటల్లో... ఏదో శక్తి... ఏదో సందేశం. చల్లటి మంచుగడ్డ ఖణేల్‌మని విరిగినట్లు, లోపల, లోలోపల, అంతఃచేతనలో ఏదో... ఏదో కల్లోలం... ఘోష... ఎక్కడో నిర్లిప్త చైతన్యం నిర్జీవమైపోకుండా వెలుగు రూపం దాల్చడానికి జరుగుతున్న మహాయజ్ఞం... ఎక్కడి లోకాలకో దివ్య ఆవాహన... ఏవో మెరుపులు దాటిన పయనం.

తెలియకుండా నా కళ్లు మూసుకుపోతున్నాయి. ఏదో, ఏమిటో జరుగుతోంది... ఏది?... ఏమిటి?....

నా అలుపా? నా జిజ్ఞాసా? అసంతృప్తా లేక ఆమె... ప్రకృతిలో లయమౌతున్న ఆమె సన్నిధా?!

ఏది నన్ను కాన్షియస్ లెవల్ దాటించి... లాజిక్‌ను మరిపించి,
నిద్ర ఓడ ఎక్కించి,
అనుభూత ద్వీపాలను ఒరుసుకుంటూ.
ఊహల సంద్రాల అంచులు స్పృశిస్తూ,
గమ్యం తెలియని కాంతి ప్రయాణంలోకి... లోలోనికి...
ఎప్పుడు కళ్లు తెరిచానో అర్థంకాలేదు.
ఏమిటీ ప్రశాంతత?! నాలో... నా చుట్టూ...
ఒళ్లు విరుచుకుంటూ తల విదిలించాను.

"ఏమైంది స్వామీ?" అల్లరిగా అడిగింది.

ఆగిపోయాను నేను. ఏదో అనబోయి మెల్లిగా అడిగాను సూటిగా చూస్తూ:

"ఏమైంది నాకు?"

"అప్పటి నుంచీ చాలా అలౌకికంగా ఉండిపోయారు... ఏమైందిట... ప్రకృతి దేవత మీకు ఇచ్చిన మెడిటేషన్ క్లాసుకు ఛార్జ్ ఎంతట?! మీరైతే ఏ మూడు వేలో అడుగుతారు అనుకోండి..."

ఛమక్‌మని ఏదో విద్యుత్ కొరడాతో వెలిగిన కాంతివలయం నన్ను తాకినట్లనిపించింది... ఆ స్పర్శ... నా చుట్టూ... చాలా అబ్‌స్ట్రాక్ట్‌గా... ఏదో అనుభూతి... ఇది చెప్పలేని... ఇది అని చెప్పలేని జలదరింపు... దానిలోనుంచి ఒక మెలుకువ.

"ఏం చేశావు నువ్వు నన్ను..." అప్రయత్నంగా అడిగాను.

"మీరు చెప్పిన 'మలుపు'... నాలో రావలసిన మార్పు... నేను... ప్రయాణానికి సిద్ధమైపోయాను... మరి మీరు వస్తారా?!"

ఆ కప్పర కప్పర చీకట్లో ఈ వెలుతురు.

ఇదొకరకమైన డివైన్ హిప్నోటిజమ్. ఏమి తెలుసు అసలు నాకు ఈమె గురించి?! ఎంత తెలుసనుకుని పొరబడ్డాను?! ఇంత ప్రశాంతత దొరికితే... ఎక్కడికి పోతే ఏం?!

"వస్తాను..." చటుక్కున లేచి నిలబడ్డాను.

దూరంగా శంఖానాదం...

నవ్వుతూ తల ఊపింది అడ్డంగా... రాలేవు అన్నట్లు.

ఒక్కసారి ఉలిక్కిపడి చూశాను... శాంతి... కాంతి... రెండూ చెదిరాయి.

చుట్టూ చూశాను. మామూలు చీకటి.

"అవును... రాలేను... నన్ను నమ్ముకుని ఇంతమంది మనుష్యులు, ఈ ఆశ్రమం, ఈ మెడిటేషన్ సెంటర్స్..."

నవ్వింది ఆమె...

"రావద్దు... అయినా, ఈ ప్రయాణానికి ఈ అనుబంధాల నుంచి పారిపోవడం కన్న అంతఃప్రయాణం అవసరం... అవునా... మన లోపలి దండకారణ్యాలను చీల్చుకుని దహరాకాశానికి ప్రయాణం... ఆశ, కోపము, అసూయ, అహం... ఇవి ఉంటే ఆశ్రమం అయినా ఒకటే... అవతల ప్రపంచం అయినా ఒకటే... ఈ ప్రయాణం సాగదు...

"నేను అడిగింది ఆ ప్రయాణం గురించి..."

ప్రశాంతంగా చూస్తున్న ఆమెను అర్థం చేసుకోవడం... ఎంత కష్టం?!

"ఎప్పుడు ఎదిగిపోయావు ఇలా?"

నవ్వింది...

"అంటే... ఇదొక ప్రాసెస్... ఎదగడం, ఆగడం ఉండదుగా... మీన్స్ అండ్ ఎండ్స్ ఒకటేనేమో కదూ! ఇవన్నీ మీ మాటలేగా..."

మాటలు... మాటలు నావే... అర్థాలు అనుభవాలు ఎవరివి?! ఎవరి సొంతం?!

"రియల్ ఎస్టేట్ ఏజెంటు వచ్చారు... మీరు వస్తారా మేడం?..." ఆమె మేనేజర్.

"పద... వస్తున్నాను..."

గబ గబ అడుగులు వేస్తూ ఆమె 'మలుపు' తిరిగింది.

మరి నేను?!

*('రచన' ప్రతిష్ఠాత్మక జన్మదిన ప్రత్యేక సంచిక – ఫిబ్రవరి, 1999)*

# సహాయం

"మే ఐ కమిన్?"

తలుపు సగం తెరిచిన బలమైన చెయ్యి. ఆ గొంతులో అభ్యర్థన కాదు వినిపించింది. గభాలున తన ఖరీదైన రివాల్వింగ్ కుర్చీలోంచి లేచి నిలబడి 'రండి రండి' అన్నాడు రాంజీ. తమకన్న పవరో డబ్బో ఉన్నవాళ్ళు వస్తేతప్ప ఇవ్వని ఆ స్వాగతం ఇతనికి ఇవ్వడంలో ఈ రోజు రాంజీలో తటపటాయింపు లేదు.

ఆ ఆహ్వానంలో 'దయచేసి రండి' అన్న ఆదరపూర్వకమైన మర్యాద ఉన్నది.

మెత్తటి కార్పెట్ దాటుకుంటూ వచ్చాడు అతను - సిద్ధార్థ. ముప్ఫైఏళ్ళవ్యక్తి కొంచెం నలిగిన ప్యాంటు, బనియన్.

జీవితంలో పోరాటం తెలిసిన వ్యక్తిలో ఉండే కొరకంచు ఆవేశం అతనిలో కనబడడం లేదు.

అతని కళ్ళలో "మెరుపు" తప్ప "అలుపు" లేదు. కారణం అతని సటిలిటీ. అతని మీద అతనికే అంతర్లీనమైన గౌరవం. తనను గురించి తనకు తెలిసిన వ్యక్తి తాలూకు నిశ్శబ్ద స్వప్నంలా ఉన్నాడతను.

"కూర్చోండి సిద్ధార్థా వాట్ కెన్ ఐ డు ఫర్ యూ? ఆత్రంగా అడిగాడు రాంజీ.

సిద్ధార్థ నవ్వాడు. నాకు ఏదో చెయ్యడం ద్వారా నాకు నువ్వు చాలా చేసుకుంటున్నావు అన్న అర్థం ధ్వనించింది రాంజీకి ఆ నవ్వులో. ఉలిక్కిపడ్డాడు.

"రాంజీగారూ! మీరు నాకేం చెయ్యొద్దు. ఇది నా ప్రాజెక్ట్. దీన్ని ఫిలిమ్‌గా మార్చడానికి మీ సహకారం కావాలి" అన్నాడు సిద్ధార్థ.

రాంజీ లేచి గ్లాసులో డ్రింక్ పోశాడు. సిద్ధార్థకు ఇచ్చాడు. కిటికీ దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. తెల్లటి ఆకాశాన్ని, దాన్ని ఒక శకలంగా మాత్రమే కనబడేటట్లు చేస్తున్న తన తండ్రి పది అంతస్తుల కాంప్లెక్సును చూశాడు.

అందులో ఒక బ్లాక్‌లో సగం ఖరీదు కూడా చెయ్యదు సిద్ధార్థకు కావలసిన సహకారం.

కానీ... కానీ తనలాంటి వ్యాపారస్తుడు. తండ్రి తర్ఫీదు పూర్తిగా పొందిన పక్కా బిజినెస్‌మ్యాన్ ఇది చెయ్యడు. కారణం ఫ్లాట్‌మీద పెట్టిన డబ్బు పిల్లలు పెడుతుంది. సెక్యూరిటీ ఉన్నది. సెల్యులాయిడ్ మీద పెట్టిన డబ్బు నమ్మలేం. అందులో ఎంత మెసేజ్ ఉన్నా, ఎంత గొప్పగా తీసినా, ఆలోచించడం చేతగానివాళ్ళు, ఆలోచించేందుకు భయపడేవాళ్ళు, అర్థంకానివాళ్ళు దానికి

'బాగాలేదు' అని ముద్రవేస్తే? అది చాలు. ఆ మిగిలిపోయిన ఫిలిమ్ ముక్కలతో బాయిలర్‌లో నీళ్ళుకూడా కాగవు.

అదే అన్నాడు మూడు నెలల క్రితం తండ్రి.

"వాడెవడో వాడికి కలలు, విజన్ ఉంటే సరిపోదురా! కమర్షియల్ కల ఉండాలి. ఆలోచన రూపాయలుగా కనబడాలి. లేదనుకో. ఆ పిచ్చి వెధవను నమ్మితే మనకు మిగిలేది మట్టే. వాడి సబ్జెక్టు గొప్పగా ఉన్నది అనకు. అంతకన్న గొప్ప సబ్జెక్ట్ డబ్బిచ్చి పండించగలను. విషయం చెప్పు. వీడి పేరు చెబితే ఎవరు, ఎవరు కొంటారు? వీడికి సర్కిల్ ఏది? లౌక్యం తెలిసిన పాపులర్ మనిషి పేరు వేసుకోమను. డైరెక్ట్ చేయించమను. అనవసరంగా ఎవడో స్నేహితుడు చెప్పాడని కమిట్ అయిపోకు. అర్థమైందా?"

ఇది మూడు నెలలక్రితం తండ్రి ఇచ్చిన వార్నింగ్. అందులో ప్రతి అక్షరంలోనూ పచ్చినిజం ఉన్నదని నమ్మాడు రాంజీ.

అందుకే. "చాలా స్పార్క్ ఉన్న కుర్రాడురా! సహాయం చెయ్యగలవేమో చూడు" అని ఒక స్నేహితుడు సిద్ధార్థ గురించి చెప్పినప్పుడు తండ్రి "ఒద్దు" అనగానే, "సారీ ఫ్రెండ్" అని అనెయ్యగలిగాడు. ఆ విషయం పూర్తిగా మర్చిపోయాడు. కానీ, ఇప్పుడు అతణ్ణి రమ్మనమని తానే కబురు పంపించాడు. కారణం? ఈ తొంభై రోజుల్లో చాలా చాలా జరిగింది.

❀ ❀ ❀

భోగి పండుగ రోజున రాంజీ చెల్లెలు జ్యోత్స్న అత్తవారింటి నుంచి పుట్టింటికి వచ్చింది. అది శుభసూచకమే. కానీ, "మళ్ళీ వెళ్ళను" అన్నది.

ఆ పిల్లను పరీక్షగా చూస్తే తమ బాబాయి కూతురికి ఉన్నట్లు ఒంటిమీద పంటిగాట్లు, సిగరెట్టు వాతలు లేవు, బెల్ట్ దెబ్బలు లేవు. ఉబికివచ్చే ఏడుపు లేదు. చేతికి ఉండే రవ్వల గాజు, ఖరీదైన బిన్నీ సిల్క్ చీర, బ్యూటీ పార్లర్ తయారుచేసిన సౌందర్యం చెక్కు చెదరలేదు.

డబ్బున్న ఇంటి బంగారు చిలక. మరో బంగారు పంజరంలోకే పంపారు మరి.

"నేను వెళ్ళను. అక్కడ, అక్కడ ఏదో లేదు అన్నయ్యా! ఇది... ఇది అని చెప్పడం నాకు రావడంలేదు" అని భోరున ఏడ్చినప్పుడు ఇంట్లో ఎవరికీ అర్థంకాలేదు.

ఆడబడుచు అలా "ఇక్కడే ఉండిపోతాను" అనడం ఆవిడ అధికార దర్పానికి ఒక ఎదిరింపు అనిపించింది. తండ్రి తాలూకు నియంత సామ్రాజ్యంలో అనారోగ్యంతో, పక్షవాతంతో, గర్భకోశంలో ఫైబ్రాయిడ్స్‌తో, భయంలోనో, బాధలోనో బతికిన తల్లి కూతురి ఆక్రోశం అర్థమైనా బయటకు చెప్పదు. కారణం, తన మాట చెల్లదు కాబట్టి.

జ్యోత్స్న మామగారి బిజినెస్‌లో ఆమె తండ్రి పార్ట్‌నర్. అంత మంచి "బిజినెస్ రిలేషన్‌షిప్"ను కేవలం కూతురు అర్థం లేని బాధకు విలువ ఇచ్చి పోగొట్టుకోడు తండ్రి.

అందుకే, "సర్దుకుపోవాలమ్మా, ఆడదానివి కదా!" అని ఓదార్పుగా అన్నాడు.

"నావల్లకాదు నాన్నా! ఆ మానసిక హింస, ఆ అమర్యాదలు...." ఏదో మాట్లాడబోయింది దురుసుగా జ్యోత్స్న.

బరబర ఏ.సి రూమ్‌లోకి లాక్కుని వెళ్ళాడు. "నీకు అటువంటి మంచి సంబంధం తేవడానికి నా పెట్టుబడి ఎంతో తెలుసా? వాళ్ళ బిజినెస్‌లో షేర్లు, నగలు, సారె, పెళ్ళి ఖర్చు.... అంతా కలిపి డెబ్బై అయిదు లక్షలు! నువ్వేమన్నా సాహసం చేస్తే వచ్చే నష్టం ఎంతో తెలుసా? కొన్ని కోట్లు! ఎర్ర ఏగాని సంపాదించడం చాతకాని ఆడదానివి నీకేం తెలుసే డబ్బు విలువ? నోరు మూసుకుని పడి ఉండు."

ఆ మాటలు అనేటప్పుడు అతనిలో తండ్రి కనబడలేదు. వ్యాపారవేత్త కనబడ్డాడు. తన పెళ్ళి 'ఖరీదైన అగ్రిమెంట్!' తనకు దాన్ని చించేసే అధికారం లేదు.

మర్నాడు, బొట్టు పెట్టి, పసుపు రాసి, తాంబూలం ఇచ్చి, ఖరీదైన చీరపెట్టి రాంజీ భార్య చూసిన చూపులో, "వెళ్ళిరా, ఎప్పుడు వచ్చినా వెళ్ళిపోవాలి. అప్పుడే మళ్ళీ రాగలవు" అన్న అర్థం ధ్వనించింది.

"తిరిగి వెళ్ళిపో" అన్న ఆ బంతిపూవులు కట్టిన పెద్ద ముగ్గుల గడప పంపించివేసింది ఆ ఇంటి ఆడపడుచును, పండగపూట. వెళ్ళిపోయింది జ్యోత్స్న కన్నీళ్ళు తుడుచుకుంటూ.



ఆ మర్నాడు రాంజీ ఆఫీసుకు వచ్చింది జ్యోత్స్న.

"అన్నయ్యా! నాకు బతకాలని లేదు" అని భోరున ఏడ్చింది. ఆమె దిగివచ్చిన హోండా కారు. ఆమె అలంకరణ. ఏ.సి రూమ్‌లో ఆ నీలి జిలుగుల మధ్య అర్థం లేని ప్రవచనంలా ఉన్నాయి ఆమె మాటలు.

"చాలామంది గంజిలో ఉప్పు లేక ఏడుస్తుంటే, నీలాంటివాళ్ళు పాయసంలో ఏలకులు ఎక్కువయ్యాయని ఏడుస్తున్నారు. ఆలోచించుకో. పనిలేక డబ్బున్న కష్టాలు ఊహించుకోకు. ఆ డబ్బు లేనివాళ్ళ బాధలముందు నువ్వెంత? బంగారు తల్లివి కదూ! కొంచెం అడ్జస్ట్ అవ్వాలి" అని మెత్తటి మాటలతో ఓదార్చాడు.

జోక్స్ చెప్పాడు.

ఇద్దరూ నవ్వుకున్నారు.

ఫైవ్‌స్టార్ హోటల్ నుంచి లంచ్ తెప్పించుకుని అక్కడే తిన్నారు ఇద్దరూ. హాయిగా కబుర్లు చెప్పుకున్నారు.

మనిషిలో తమాషా అదే. వినబడని దుఃఖం ఎదుటివాళ్ళకు అర్థం కానప్పుడు చెప్పడం మానేస్తాము. మానసిక ప్రళయాలకు, ఆంతరంగిక మహా విప్లవానికి అక్కడే నాంది ఏర్పడుతుంది. తన బాధ, తన గుండెల్ని కాల్చి వేస్తున్న బాధ.... చెప్పడం ప్రారంభించగానే 'వినడం' నుంచి ఎదుటి మనసు తప్పించుకోగానే ఆ 'తలపు' అర్థం అయ్యేటట్లు చెప్పాలనే 'చైతన్యద్వారం' మూసుకుపోతుంది. ఆపైన.... ఆపైన అంతా నాటకమే. ఏదో జరిగిపోతూ ఉంటుంది. ఏ అనుభవమూ మనసుదాకా వెళ్ళదు. మెదడు రికార్డ్ చెయ్యదు. అన్ని ఆనందాలు, దుఃఖాలు, జోక్స్, మీటింగులు పార్టీలు... అన్నీ ఉపరితలం మీద స్పర్శే. ఏదీ గుండె తడిని స్పృశించదు.

అదే జరిగింది జ్యోత్స్న విషయంలో. ఎప్పుడైతే తన బలగం. తనవాళ్ళు అనుకున్న ప్రతి ఒక్కరూ వాళ్ళకు నచ్చేవిధంగా తాను కనబడినంతసేపూ తనను ఉద్ధరించినట్లు మాట్లాడతారు కానీ, తనకు నిజంగా దుఃఖం, బాధ, అవసరం ఉన్నప్పుడు వీళ్ళెవరూ వీళ్ళ 'సేఫ్టీ సెల్స్' నుంచి బయటకు వచ్చి రక్షించరుగాక రక్షించరు. తాను తానుగా ఎవరికీ అక్కర్లేదు. -శాడిజం షాండ్లియర్‌గా, స్వార్థం కార్పెట్‌గా బతకాలి అని అర్థం అవగానే ఈ అక్కర్లేనితనం ఆమెలో కచ్చ, ఆవేశాలను నిద్ర లేపాయి.

ఆమె మానసికంగా చచ్చిపోవడం ప్రారంభించింది. ఆ మృత్యువు నీడ ఎవరికీ అర్థం కాదు. ఏ స్కానింగ్‌కూ దొరకదు. కాబట్టి మెల్లిగా డ్రింక్స్, డ్రగ్స్ - వీటి నీడలు ఆమెమీద పరచుకుంటున్నాయి.

ఒకరోజు భర్త గదిలో మరొక ఆడదాన్ని, అవకాశాలకు అమ్ముడుపోయే ఆడదాన్ని చూసినప్పుడు, "అదంటే నాకు అసహ్యం, దాన్ని రానియ్యకు" అని పెద్దగా రంకెలు వేస్తూ కారిడార్‌లో మొగుడుతో పోట్లాటకు దిగింది జ్యోత్స్న ఒక తెల్లవారుజామున.

అతను.... ఆమె భర్త.... ఆమెను కొట్టలేదు, తిట్టలేదు.

"అది ఎవరు అన్నది కాదు సమస్య. ఆ అమ్మాయి నాకు కావాలి. దానికి ఏం కావాలో నేనిచ్చి కొనుక్కోగలను." స్పష్టంగా గట్టిగా చెప్పాడు.

"అంటే.... నేను..... నేను" ఆవేశంగా మీదిమీదికి వెళ్ళి అరుస్తోంది జ్యోత్స్న.

"అక్కర్లేదు" అని అతను స్పష్టం చెయ్యలేదు. కాని, "పడి ఉండు. అదీ పద్ధతి" అని అర్థవంతంగా చూస్తూ మెట్లు దిగాడు.

అతని వెనకే వంకర నవ్వుతో విజయగర్వంతో చూసి వెళుతున్న ఆ ఆడది. ఆమెకు వెండి గ్లాసులో మంచినీళ్ళు ఇస్తున్న అత్తగారూ, హోండా కారు తలుపు తీస్తున్న డ్రైవరు.

ఉడుకుబోతుతనంతో, నిస్సహాయంగా అక్కడ స్తంభానికి తలకాయ వేసి కొట్టుకుంటోంది జ్యోత్స్న. జుట్టు విరబోసుకుని బోరున ఏడుస్తున్న ఆమెను ఏవో చూపులు అంతఃతమస్సును చీల్చి స్పర్శిస్తున్నాయి నీరెండలా.

గబాల్న చూసింది. పక్క కాంపౌండ్‌లో చేతులు కట్టుకుని నిలబడి సూటిగా చూస్తున్నాడతను. అతని చూపుల్లో ఓదార్పు, ఇంత పిచ్చిపిల్లవేమిటి అన్న మందలింపు.

అభిమానంతో గబాలున గదిలోకి పారిపోయింది అప్పటికి. 'ఎవరా వ్యక్తి' అని ఆరా తీసింది.

తన ఇంటి ఫర్నిచర్ ఖరీదు చెయ్యని ఆ మనిషి.... ఏవో కలలు కనే కథకుడు, ఏదో చేసెయ్యాలన్న ఆదర్శాల అర్భకుడు, ఎవరూ లక్ష్యపెట్టని, మూడు నెలలు అద్దె కట్టలేని పక్కింటి అవుట్ హౌస్‌లో ఉండే అమాయకుడు.

అతని పేరు సిద్ధార్థ. మరి ఏమిటిచ్చింది ఆ ధైర్యం? ఎలా చూశాడు తనని? ఎంత నిబ్బరం అతనిలో? ఏమిటి? ఏమిటిస్తుంది మనిషికి ఆ శక్తి?

కేవలం కుతూహలంతో అతణ్ణి పలకరించింది. తన దుఃఖం చెప్పి సానుభూతిని, తద్వారా అతని అభిమానాన్ని పొందాలని అనుకున్నది. వ్యాపారస్థుడి కూతురు ఆమె. కానీ, ఆమె స్నేహం తప్ప మిగతా అన్నీ అతను సున్నితంగా తృణీకరించాడు. అది ఆమెను మరింత ఆశ్చర్యపరిచింది.

అతను ఆమెకు తెలియని, అర్థం కాని చాలా చాలా విషయాలు చెప్పేవాడు. కానీ, ఆమె సంభాషణ ఎప్పుడూ తిరిగి తిరిగి తన బాధల దగ్గరే ఆగేది. అతను సహనంగా వినేవాడు.

"సాటి ఆడది కదా మా అత్తగారు, అంత ఘోరంగా...."

నవ్వాడు అతను.

"ఆవిడను, ఆమె భర్త, కొడుకు గౌరవిస్తారా?"

"నో. ఆవిడంటే పైసా విలువ లేదు. మా మామగారు చెయ్యెత్తుతారు కూడా. కానీ, నేను మాత్రం ఆవిడ మాట జవదాటకూడదని శాసిస్తారు. ఆవిడ నామీద రెచ్చిపోతుంది." ఆవేశంగా అన్నది జ్యోత్స్న.

"పుట్టు బానిసకు ఇంకొక కట్టుబానిసను తెచ్చి ఇస్తే ఆవిడ దానత్వం ఆవిడ మరిచిపోయి తన 'అధికారం' చెల్లుబడి అయిపోతోందనుకునే ఈ 'మాయ' చాలా గొప్పగా వివాహ వ్యవస్థను ఆవరించింది. ఆలోచించండి. ఆవిడ స్వతహాగా అంత చెడ్డవారై ఉండరు."

విన్నది జ్యోత్స్న. పరిశీలించడం ప్రారంభించింది. ఏ అభద్రతాభావం ఈ మనుషుల్ని తమ మనస్సుకు విరుద్ధమైన పనులు చేసే బానిసలుగా, ఆ తరువాత నియంతలుగా మారుస్తుంది? సంఘంలో చాలా 'గొప్ప ఫ్యామిలీలు'గా గౌరవించే బోలెడు ఇళ్ళు ఓటిగూళ్ళని, అందులో సుఖం నటిస్తున్న కుంటి చిలకల్ని గమనించింది. అతనితో చర్చించింది.

"అవమానించేవారు అవమానించబడేవారే... చిన్నప్పుడు బెల్టు దెబ్బలు తిన్న కొడుకు ఆ తరువాత శాడిస్టిక్ తండ్రి అవుతాడు. దరిద్రాన్ని, హింసను

అనుభవించిన వ్యక్తి తనకు డబ్బు రాగానే ఆ రెండింటితో బలహీనుణ్ణి బానిసను చేస్తాడు. ఈ మానసిక స్థితిలో బంధాలు, ప్రేమలు, బంధుత్వాలు అన్నీ ఓటిమాటలే. సంస్కారవంతుడే ఈ స్థితిని జయిస్తాడు. ఇలా ఆలోచించండి, మీకు చాలా అర్థమౌతాయి." చెప్పాడతను.

చాలా మారింది జ్యోత్స్న. చాలా చదివింది. ఇప్పుడు జ్యోత్స్న ప్రేమించ గలుగుతోంది. జాలి పడగలుగుతోంది.

పదిహేను రోజులు మంచం మీద ఉన్న అత్తగారికి చాలా సేవ చెయ్యగలిగింది జ్యోత్స్న. ఆమె బాధకు కన్నీరు కారుస్తున్న జ్యోత్స్నను గుండెలకు హత్తుకుని, "రవ్వలనగలు కొని పెడుతూనే నీచంగా చూస్తారు మనని. ఎక్కడికైనా వెళ్ళిపోమ్మా!" అని భోరుమన్నది అత్తగారు.

ఆశ్చర్యపోయింది జ్యోత్స్న. తన చుట్టూ, తనలో ఇంతవరకు ఎంత అజ్ఞానం? ఏమర్థమయ్యారు వీళ్ళంతా?

తల్లి మరింత అనారోగ్యంతో బాధపడుతోందని తన స్నేహితురాలు అయిన డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళింది.

"నీకు తెలుసా జ్యోత్స్నా! ఆడదాని ఎమోషన్స్, అణిచిపెట్టుకున్న ఆవేశాలు, దుఃఖాలు హార్మోన్సు మీద, యూట్రస్ మీద పని చేస్తాయి. మీ అమ్మగారి ప్రాబ్లం అదే. ఇంకమీదట అయినా ఆవిడ ఎలా ప్రవర్తించాలో, ఎంతవరకు మాట్లాడాలో మీ ఇంట్లోవాళ్ళు శాసించడం మానేసి, ఆవిడకు ఏది ఇష్టమో, ఏం చెయ్యదలచుకున్నదో తెలుసుకోండి" సలహా ఇచ్చింది డాక్టర్.

ఆలోచిస్తూ తల ఊపింది జ్యోత్స్న.

ఆ విషయం తండ్రితో, వదినెతో చర్చించబోయింది.

"అంటే? దానికి టెన్నిస్ అంటే ఇష్టం నలుగురుతో పోచుకోలు కబుర్లు చెప్పడం ఇష్టం వాళ్ళ పుట్టింటి వాళ్ళంటే ఇష్టం. చుడీదార్లు ఇష్టం ఇలా దానిష్టం వచ్చినట్లు చెయ్యమంటావా? నాన్సెన్స్. రోగమొస్తే ఎంత ఖరీదైన మందులైనా ఇప్పిస్తాను. కావాలంటే హాస్పిటలే కొంటాను. ఎందుకని? మిసెస్ సో అంటే సో కాబట్టి. అంతే 'ఇలా తప్ప బతకలేను' అంటే చచ్చిపోయాక పాలరాతి సమాధి కట్టిస్తాను. ఇంత క్రూరంగా మాట్లాడుతున్నాననుకోకు. ఇలా చెప్తేకాని అర్థం కాదు." మాట్లాడుతున్న తండ్రి వంక చూసి కూర్చుండిపోయింది జ్యోత్స్న.

తల్లికి ఏది లేదో, ఏమిటి జబ్బో అర్థమైపోయి, ఇలా వివేకం నిద్రలేస్తున్నా, ఆ 'ఆడది' తన ఇంటికి రావడం ఆమెలో విషం కక్కిస్తూనే ఉన్నది.

"డబ్బుకు అమ్ముడుపోయేదానితో... రెస్టారెంటులో" కచ్చగా అన్నది అతనితో ఆమె డైమెండ్స్ చెక్కిన మంగళసూత్రాలు కరిగిపోతున్నాయి.

హిస్టీరికల్‌గా మాట్లాడుతున్న ఆమెను "మీరు అన్న ప్రశ్న రపీమని ఆపేసింది.

అంతే, ఆమెలో రాక్షసి నిద్ర లేచింది. ఫట్‌మని గ్లాస్ కింద పారేసి నానా తిట్లు తిట్టి, "కప్పు కాఫీకి కూడా గతి లేనివాడివి నన్ను ఇన్‌సల్ట్ చేస్తావా? నీ లెవెలెంత నువ్వెంత? నా లెవెల్‌కు నీ హమేమిటి" అని బిల్లు డబ్బు విసిరికొట్టి పోయింది.

ఆ తరువాత రెండు రోజులు బోలెడంత పశ్చాత్తాపపడి క్షమించమన్నది. తన ప్రవర్తనకు సంజాయిషీ ఇవ్వబోయింది. ఆమె లోపలి మనిషిని అబ్జర్వ్ చేస్తున్న అతనిలో రచయిత అవేవీ చూపించుకోలేదు.

"దరిద్రం కన్నా బాధించేవి చాలా ఉన్నాయని నాకు తెలుసు. అవేవో మీరూ తెలుసుకోండి. ప్రపంచం మీద బాంబులు వేసేవాళ్ళు, మనుషుల మీద ఆసిడ్ పోసేవాళ్ళు, కోడళ్ళను సజీవదహనం చేసేవాళ్ళు, యుద్ధాలు చేసేవాళ్ళు... వీళ్ళు ఆర్థిక దరిద్రంతో ఇవి చెయ్యరు. అవునా? ఆలోచించండి. వాళ్ళ దరిద్రం మరేదో! నా లేమిని కించపరిస్తే మీకు కలిగిన ఆనందం నిజమైనదేనా? మీ గురించి మీరు నిజం ఆలోచిస్తే నేనెందుకు ఆ 'మాట' మిమ్మల్ని అన్నానో అర్థమౌతుంది." చాలా బాలన్స్‌గా చెప్పాడు.

వీళ్ళ స్నేహం తెలిసిన భర్త, "వాడితో కావాలంటే సంబంధం పెట్టుకో, కానీ రొంపిలో దిగకు. నీకూ, నాకూ కూడా మంచిది కాదు" అని చక్కటి ఉచిత సలహా ఇచ్చాడు.

అవాక్కైపోయింది జ్యోత్స్న. తాను అమ్ముడుపోయానని అతను ఎందుకు అన్నాడో అర్థమైంది. ఏం పెట్టి వీళ్ళంతా తనని కొన్నారు? అని ఆలోచించింది.

సాంఘిక భద్రతా? పవిత్రతా? రక్షణా? తన ఆలోచనలతో సహా అమ్ముడు పోయినా ఇవేవీ దొరకవు. దొరికినట్లే ఉంటాయి. ఇది పై 'కప్పు లేనిఅద్దాల మేడ.' తన ప్రతిచర్యా ప్రపంచానికి కావాలి. కానీ, తనకు ప్రైవసీ ఉండదు.

"నాకు చాలా చాలా అర్థమౌతోంది. ఏం చెయ్యాలి ఇప్పుడు?" అడిగింది సిద్ధార్థను.

"మీరు ఆలోచించడం నేర్చుకున్నారు. అది గొప్ప పరిణామం. ఎవరూ ఎవరి సమస్యలకూ పరిష్కారం ఇవ్వరు. ఇవ్వకూడదు. ఇది మీ జీవితం. అనుభవం మీది. నిర్ణయం కూడా మీదే. డ్రింక్స్, డ్రగ్స్ ఎస్కేపిజమ్ ఇస్తాయి. దానివల్ల మీ ఇన్‌సెక్యూరిటీ తగ్గదు. మీకు ఏది సుఖమో మీకు అర్థమవ్వాలి" స్పష్టంగా చెప్పాడతను.

తలెత్తి చూసింది. హక్కులు తీసుకోని ఆ స్నేహానికి మనసుతోనే అభివందనం చెప్పింది ఆమె కళ్ళల్లో కృతజ్ఞతతో కూడిన మెరుపు.

తన తల్లిలా, 'ఖరీదైన అనారోగ్యంగా తాను తయారవలేదు. ఇలా ఉంటే అదే జరగబోయేది.

తన డాక్టర్ ఫ్రెండ్‌ను బతిమాలింది.

ఇంక పిల్లలు పుట్టరు కాబట్టి, ఆమె భర్త మరొక వివాహం చేసుకోవచ్చు అని సర్టిఫికెట్లు సృష్టించి, తండ్రికి ఆర్థికంగా నష్టం లేకుండా, మామగారికి, భర్తకు పరువు మర్యాదల బాధలేకుండా బోలెడంత సానుభూతితో, మంచితనంతో ఆ వలయంనుంచి బైటపడింది జ్యోత్స్న.

"ఇంత నాటకం అవసరమా? నేను మీతో బతకలేనని నిజం చెప్పచ్చుకదా?" అడిగింది స్నేహితురాలు.

"చెప్తే నన్ను చంపేస్తారు. ఆ పని మా నాన్నే చెయ్యచ్చు కూడా. వీళ్ళ కన్వీనియంట్ అవసరాల ప్రేమ అంతపని చెయ్యడానికి వెనుకాడదు. నేను నేనుగా కొద్దిరోజులు బతకాలనుకుంటున్నాను." స్పష్టంగా చెప్పింది స్నేహితురాలికి జ్యోత్స్న.

తాను ఒకప్పుడు డొనేషన్ పంపిన సిమ్లాస్కూల్లో టీచర్‌గా చేరింది.

ఈ జనం అందరికీ దూరంగా వెళ్ళిపోయింది.

"థ్యాంక్యూ మైడియర్ ఫ్రండ్!" అన్న కార్డ్ సిద్ధార్థ ముంగిట్లో... ఆమె వెళ్ళిపోయిన తరువాత.

❀ ❀ ❀

జ్యోత్స్న చంపబడలేదు. చచ్చిపోలేదు. వేటాడబడలేదు. పారిపోలేదు.... ఇవేవీ జరక్కుండా బతికిపోయింది.

ఆమె ఉత్తరం ఆ విషయం చెప్పింది రాంజీకి. "ఇందులో ఏది జరిగినా మన కుటుంబాలకు ఒకటే. నా ఫోటోకి దండ వేసి అన్న దానాలు చేసి, నా సమస్యను, జ్ఞాపకాన్ని సమాధి చేసేసి ఉండేవారు.

"కానీ.... కానీ, బతికిపోయాను. ఇది నువ్వన్నా గుర్తించు అన్నా!" ఆ ఉత్తరం నిండా తృప్తి. గొప్ప ఆలోచన.

రాంజీ కదిలిపోయాడు.

ఇంత డబ్బు, ఇంత హోదా.... ఏ సమస్యనైనా చిటికలో పరిష్కరించి అడ్డం వచ్చినవాణ్ణి వేటాడో, కొనేసో, సక్సెస్‌ను వరించే అలవాటైన తామందరూ చెయ్యలేనిదేదో "మనిషిని మనిషిగా బతకనివ్వడం...." జరిగిందది.

ఇది ఎవరివల్ల జరిగిందో, ఆ వ్యక్తి ఎవరో తెలుసుకుని కదిలిపోయాడు రాంజీ. ప్రతిక్షణం పోరాటం, స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్ జరుపుతున్న ఆ వ్యక్తి సిద్ధార్థ. తామందరూ చెయ్యలేనిదేదో అతను చేశాడు. తండ్రికి అర్థం కాదు. అందుకే తన పర్సనల్ ష్యూరిటీతో అతనిని నిలబెట్టాలనుకున్నాడు.

అందుకే సిద్ధార్థను పిలిపించాడు.

❀ ❀ ❀

స్క్రీన్‌ప్లే చెప్పాడు సిద్ధార్థ. అది జ్యోత్స్నలాంటి చాలామంది కథ. ఎవరికీ అర్థం కాని కథ. స్తబ్ధత. హృదయం లేనితనం. బతికినా, చచ్చినా ఒకటిగా చూసే ఈ

వ్యవస్థ ఏ కసాయి కత్తి ఎంత అందంగా తెలియకుండా జలిపిస్తూ బెదిరిస్తుందో చెప్పాడతను అర్థమయ్యేట్లు తన కథనంలో, దాని పరిణామం సంఘం మీద, పిల్లల మీద ఎంత ఘోరంగా ఉంటుందో, ఇటువంటి కొనుగోలు మనస్తత్వం నుంచి ఉద్భవించిన సంతతి మానసిక గతేమిటో చెప్పాడు.

తామెవరికీ అర్ధం కానిది ఇతనికి .... ఇతనికి ఎలా అర్థమైంది? జ్ఞాననేత్రం అంటే ఇదేనా డైమెన్షనల్ షిఫ్ట్‌లో అర్థమవడమా?

తాను ఫైనాన్స్ చేస్తున్నానని చెప్పకుండా అది సిద్ధార్థ కథ అని చెప్పకుండా భార్యకు, తండ్రికి ఈ కథ వినిపించాడు. తల్లి వీల్‌చైర్‌లో కూర్చుని విన్నది.

"చాలా చాలా బావుంది ఈ కథ. కానీ, ఆ పిల్ల చచ్చిపోతే గొప్పగా ఉంటుంది. ఇంపాక్ట్ స్ట్రాంగ్‌గా ఉంటుంది" అన్నాడు తండ్రి.

"అవును రాంజీ! గొప్ప సింపతీ వస్తుంది" అన్నది భార్య.

"ఒద్దు.... ఒద్దు. బతకనీ..." ముద్ద మాటలతో అరిచింది తల్లి.

"చుప్... నువ్వు నోరుముయ్యి." అరిచాడు తండ్రి.

ఇంత చెప్పినా వీళ్ళెవరికీ అర్థం కాలేదా? కాదా?

పతితుల్ని, దీనులను, ఆర్తులను, దుఃఖితుల్ని గుండెలకు హత్తుకుంటున్న మదర్ థెరిసాను చూసి "మదర్! వీళ్ళంతా ఆర్థికంగా వెనకబడ్డవారిలోనే కాదు, మాలోనూ ఉన్నారు. మాకు, మా వర్గానికి కూడా మీరు కావాలి" అని ప్రార్థించిన అమెరికా ప్రెసిడెంట్ అర్థమయ్యాడు రాంజీకి ఆ క్షణంలో. కాపాడేవాడు ఎలా ఆలోచిస్తాడో సిద్ధార్థను చూస్తే అర్థమైంది.

మర్నాడు నిశ్శబ్దంగా చెక్కు సైన్ చేసి సిద్ధార్థకు అందించాడు.

"మీ సహాయానికి థ్యాంక్స్!" అన్నాడు సిద్ధార్థ మనఃస్ఫూర్తిగా.

"సహాయమా? ఎవరు ఎవరికి?" రాంజీ గొంతు పూడుకుపోయింది.

"మా కోసరం ఆలోచించి పెడుతున్న మీ సహాయం" సహాయానికి ఏంచేసి ఋణం తీర్చుకోగలం? అన్నాడు.

"రాంజీగారూ! జీవితం సినిమా కాదు ఎడిట్ చెయ్యడానికి. ముఖ్యంగా భావావేశాన్ని ఎడిట్ చెయ్యలేము. దుఃఖాన్ని, కోపాన్ని, ఇష్టాన్ని చెప్పలేని జీవితం ప్రేమను, ఆనందాన్ని కూడా చెప్పలేదు. రియాక్షన్ ఇవ్వలేదు. ఉంటే అన్ని భావాలూ ఉంటాయి. పోతే అన్నీ పోతాయి ఇలా అన్నీ పోగొట్టుకుని కావల్సిన ఎమోషన్ మాత్రం నటిస్తూ ఉంటే, మనిషి బతుకుతూ చస్తాడు. ఈ అయోమయాన్ని గుర్తించి బయటపడడం అందరికీ అవసరమే. సెలవు...."

నమస్కరించి వెళ్ళిపోయాడు గంభీరంగా సిద్ధార్థ.

*('ఇండియా టుడే' – 2-2-1999)*

# పూర్ణిమ

"నేను ఇండియా కెళదామనుకుంటున్నాను అన్నయ్యా!"

చదువుతున్న పుస్తకం మూసి సూటిగా సహజను చూశాడు మూర్తి.

"ఏం, లాస్‌ఏంజిల్స్ నచ్చలేదా నీకు?" నవ్వుతూ అన్నది మిసెస్ మూర్తి.

"ఛా! ఛా! అదికాదు వదినా! రిసెర్చ్ పేపర్ సబ్మిట్ చేసేలోపల ఒకసారి ఇండియా వెళ్ళాలనిపించింది."

"ఏది... నీ సోషల్ కండిషన్స్, ఉమెన్ - ఆ రిసెర్చ్ కోసరమా? ఇండియాలో నీకు కనబడబోయేది గౌరవం కప్పుకున్న స్లేవరీ, లేకపోతే ఆర్థిక వత్తిడి వల్ల వచ్చిన బానిసత్వం... I don't think you can study real woman there... Any way, నాకు ఆఫీస్ టైం అయింది...బై మూర్తీ...బై సహజా..."

వెళ్లిపోతున్న ఆమెనే చూస్తున్న మూర్తి చూపులో భావనకు ఉలిక్కిపడింది సహజ... ఏదో వస్తువును చూస్తున్నట్లు చూస్తున్నాడతను.

"అన్నయ్యా!" ఆమె గొంతులో ఏదో హెచ్చరిక.

"ఆఁ!" ఉలిక్కిపడ్డాడు మూర్తి...

"సహజా! నిజంగా నువ్వు నీ రిసెర్చ్‌లో సీరియస్‌గా ఉన్నావా? లేకపోతే పెళ్ళయ్యేదాకా కాలక్షేపం అనుకుంటున్నావా?"

"అదేమిటన్నయ్యా! అసలు... నేను..."

"ఉష్... ఇప్పుడే వస్తాను..."

సంవత్సరం క్రితం స్టూడెంటుగానే అమెరికా వచ్చింది సహజ... వదిన అంటే ముట్టనితనం, అన్నయ్య నిస్సహాయత త్వరలో అర్థమై స్నేహితురాలితో అపార్ట్‌మెంటులో ఉంటోంది సహజ... వదిన చెడ్డది కాదు, ప్రాక్టికల్ మనిషి... అలా అర్థం అవడం వల్ల హాయిగానే ఉన్నది సహజ... కానీ మూర్తన్నయ్య భావుకుడు అనుకునేది... కానీ మరి అమెరికా జీవితం, పెళ్లి, డాలర్ల సంపాదన అతణ్ణి మార్చేశాయేమో అనుకునేది...

ఐదు నిమిషాల తరవాత వచ్చిన అతని చేతులో ఫోటోగ్రాఫ్ - చాలా విలువైన దాన్ని పొదివి పట్టుకున్నట్లు పట్టుకుని వచ్చాడు.

"అరె... ఏమిటిది? రెండు కళ్లు...జస్ట్... రెండు అందమైన కళ్లు... అంతే..."

"చూడు... రిసెర్చ్ చేసేవాళ్లు మామూలువాళ్లు చూడలేని విషయాలు చాలా చూడగలగాలి. మన ఎదురుగా జరుగుతున్న సంఘటనలకు ప్రేరకాలు, మనుష్యుల మామూలు మాటల వెనకాల ధ్వని, నవ్వుల వెనకాల అర్థాలు, చూపుల వెనకాల

భావాలు... ఇవన్నీ... ఇవన్నీ తెలియాలి. ముఖ్యంగా సోషల్ కండిషన్స్ గురించి స్టడీ చేసేవాళ్లు... ఊరికే ఎవరో రాసిపెట్టినవి ఆధారం చేసుకుని డాటా క్రియేట్ చేసి, డాక్టరేట్ కొట్టెయ్యకూడదు..."

సూటిగా చూస్తూ నవ్వుతూనే చెప్తూ ఆమె పక్క సోఫాలో కూర్చున్నాడు మూర్తి.

"అన్నయ్యా!" కోపంగా అన్నది సహజ

"ఒద్దు... అంత రియాక్షన్ ఒద్దులే... చెప్పు... ఆ కళ్లల్లో ఏం కనబడుతున్నాయి నీకు?!" నవ్వాపుకుంటూ అంటున్న మూర్తిలో చిన్నప్పుడు ఉడికించి, ఏడిపించి చాకలెట్ కొనిపెట్టే అన్నయ్య కనబడ్డాడు.

"చెప్తానుండు..." తనూ చిన్నపిల్లలా ముద్దుగా అన్నది సహజ. "అందమైన కళ్లు... ఆ కళ్లలో నవ్వు, ఆనందం, కొంచెం బెరుకు... కనురెప్పల మీద నుంచి జారుతున్న వెలుతురు..."

"గుడ్... ఇంకా..."

"కంటి కింద పుట్టుమచ్చ... ఎవరో చాలా అందమైన మనిషి ఫోటోగ్రాఫ్ అయి ఉండాలి... నుదురు చాలా అందంగా ఉన్నది... ఎవరన్నయ్యా?!"

"అందమంటే... ఒద్దు... మళ్లీ నీకూ నాకూ క్విజ్ ఒద్దు... ఓకే... ఇండియా వెళ్లు... మన ఊరు వెళ్లు... మన కజిన్ రాంబాబు గుర్తున్నాడా నీకు?! వాళ్లింటికి వెళ్లు. అదొక ఉమ్మడి కుటుంబం... అక్కడ పూర్ణిమ ఉంటుంది. ఆవిడను చూడు... నీకు రిసెర్చికు పనికి వచ్చే చాలా విషయాలేమిటో తెలుస్తాయి. అర్థమౌతాయి..."

అలా మాట్లాడుతూ చాలా... చాలా చాలా చెప్పాడు మూర్తి... అతను మనస్సు తెరిచి మాట్లాడడం వల్ల అతని మాటల్లో, చేష్టల్లో ఏదో హాయి... ఇద్దరూ చాలా రుచికరమైన లంచ్ చేసుకుని తింటూ, కబుర్లు చెప్పుకుంటూ... హాయి అంటే ఏమిటో ఇద్దరికీ అర్థమైంది... ఇన్నాళ్లు అన్నయ్యను చూస్తున్నా ఈ కోణం తనకు కనబడలేదేమిటి?! ఆలోచిస్తూనే వింటోంది సహజ.

"వెళ్లేటప్పుడు నేను రాంబాబుకు వీడియో కెమేరా, అందరికీ బహుమతులు ఇస్తాను... ఫారిన్ నుంచి ఖరీదైన బహుమతులు తెచ్చేవాళ్లను తప్పనిసరిగా ఎంటర్‌టైన్ చేసే సంస్కారం అక్కడ చాలా ఉంది. సరేనా?..."

"అన్నయ్యా!"

"ఇంకేం మాట్లాడకు... నీకు ఇప్పటికే చాలా చెప్పాను. ఐనా, ఇంకా నీకు చాలా అడగాలని ఉన్నది... నిజానికి నాకు కూడా చాలా చెప్పాలనే ఉన్నది. కానీ చెప్పడానికి, అడగడానికి మధ్య మాటల్లో ఇమడని అనుభూతి ఒకటుంది... అది నీ అంతట నువ్వే అనుభవించాలని నా ఆశ... సరేనా?..."

బుద్ధిగా, ముద్దుగా తలూపింది సహజ...

❀ ❀ ❀

"రా సహజా! అంతా కులాసాగా ఉన్నారా?" ఆప్యాయంగా అడుగుతున్న పూర్ణిమను పరీక్షగా చూసింది సహజ... కంటి కింద తేనెరంగు పుట్టుమచ్చ... కళ్లల్లోకి సూటిగా చూసింది. ఆప్యాయత చూపించే ఆ కాటుక కళ్లు మరేమన్నా చెపుతున్నాయా అన్నట్లు చూసింది...

అందరికీ అన్ని బహుమతులు ఇచ్చింది... తెచ్చిన చీరల్లో ఎవరికి ఏది నచ్చితే అది అందరూ తీసుకోగా, మిగిలినది పూర్ణిమ తీసుకున్నది.

మూర్తి అన్నయ్య చెప్పింది నిజం... బహుమతులు చాలా చాలా ఆప్యాయతలు తెచ్చిపెడతాయి. అమెరికా అమ్మాయికి బోలెడు మర్యాదలు.

వీటన్నింటిమధ్యా అతి సహజంగా ప్రవర్తిస్తూనే, చాలా అలర్ట్‌గా అందరి గురించీ ఆలోచించే పూర్ణిమ గురించే ఆలోచిస్తోంది సహజ. చాలా మందితో మాట్లాడుతూ, చాలా చాలా విషయాలు సేకరిస్తోంది... తనకు ఇన్నాళ్లు తెలియనివి... అర్థంకానివి...

తన చుట్టూ ప్రపంచాన్ని పులిలా వణికించే రాంబాబును చూస్తే... అతని భార్య... పూర్ణిమ కళ్లల్లో భావన ఏమిటా అని చాలా చాలా వెతికేది సహజ... చాలా తెలుసుకున్నది కూడా...



రాంబాబు, మూర్తి, పూర్ణిమ వీళ్లంతా ఒక కాలనీలోనే ఉండేవాళ్లు... పూర్ణిమ సౌందర్యం, ఠీవి, సన్నగా కనుకొలుకల నుంచి మనుష్యుల్ని చూస్తూ... ఆ చూపులతోనే తను వాళ్ల గురించి ఏమనుకుంటుందో చెప్పెయ్యగలగడం... ఆమె ప్రత్యేకత. పన్ను మీద పన్ను ఆమెకు కొత్త అందాన్ని ఇచ్చేది... స్కూలు యూనిఫారం వేసుకున్నా ఆ తరువాత కాలేజీకి వెళుతూ చీర కట్టుకున్నా... ఎలా ఉన్నా తిరిగి చూడాలనిపించే పర్సనాలిటీ ఆమెది... అప్పట్లో దొరికే యాభై ఐదు రూపాయల చీర కూడా గంజి పెట్టి కట్టుకుంటే పట్టుచీరకుండే పరువు తెచ్చేది ఆమె.

అప్పట్లో ఆమె కాలేజీ హీరోయిన్. వాళ్ల నాన్నగారు మంచి పొజిషన్‌లో ఉండేవారు. ఆ అమ్మాయిని ఏ రాజకుమారుడులాంటి వ్యక్తికో ఇచ్చి చేస్తారనుకునే వాళ్లంతా...

రాంబాబు చాలా మంచివాడు – ఎవరూ అతనిలో కాంప్లెక్స్ నిద్ర లేపనంత కాలం... వాళ్ల నాన్న రాంబాబును చదువుకోకపోయినా, బట్టలు మడతపెట్టుకోక పోయినా, ఆయన పెళ్లాం మీద కోపం వచ్చినా, ఆయన ఆఫీసర్స్‌చేత తిట్లుతిన్నా రాంబాబును చావకొట్టేసేవాడు... పదహారేళ్లకు రాంబాబు ఎదురు తిరిగాడు... ఎలా అంటే – పారిపోయి... ఉన్న ఒక్క కొడుకూ పారిపోయి మూడు రోజులకు కనబడితే, ఆ తల్లితండ్రులు పడ్డ నరకయాతన ఆ తరవాత అతనికి ఎమోషనల్ బ్లాక్‌మెయిలే అయిపోయింది. దానితో అతని మాటకు ఎదురు చెప్పేవారు లేకుండా పోయారు. హితం చెప్పేవారు అసలే లేరు.

రాంబాబుకు చాలా సమస్యలు, టెన్షన్స్ ఉండేవి. ముఖ్యంగా ఆడపిల్లల విషయంలో... వాళ్ల వెంటపడేవాడు... వాళ్లు మాట్లాడితే., "అడ్డమైన నీతీ జాతీలేని రకాలు... ఛీ" అనుకునేవాడు. వాళ్లు మాట్లాడకపోతే... "ఏం చూసుకుని ఈ టెక్కు..." అని తిట్టుకునేవారు... ప్రతి కాంప్లెక్సు మనిషికి ఉన్నట్లే అతనికి నోటి దురుసు, అసభ్య పదజాలం, ప్రథమ కోపం చాలా ఉండేవి.

ఆడవాళ్లంటే వాళ్ల అమ్మలా, పిన్నుల్లాగా జుట్టు చెరిగిపోయి, జిడ్డోడి పోతూ, నలిగిపోయిన ఖరీదైన జరీ చీరలు కట్టుకుని, హాల్లో కూర్చుని పిండి వంటలు చేసుకుంటూనో, తింటూనో, బంగారు గాజులు సర్దుకుంటూ పనివాళ్ల మీద, పక్కవాళ్ల మీదా, అక్కడ లేనివారి మీదో చాడీలు చెప్పుకుంటూ ఉండడమే చూశాడతను...

కూరలో ఉప్పు తక్కువవడం దగ్గర నుంచి, 'మా అక్కను అంటావా?' అనే విషయం వరకు మొగవాళ్ల చేతిలో ఆ వంశంలో ఆడవాళ్లు దెబ్బలు తింటూనే ఉండేవారు... మర్నాడే మళ్లీ "మా ఆయన తెచ్చారు..." అని ప్రదర్శించగలరు. మరొక రెండు నెలల్లో "నెల తప్పింది" అని ముచ్చటపడుతూ చెప్పుకోనూ గలరు. ఇది అవస్థ, ఇందులో న్యూనత ఉన్నదని వాళ్లేనాడూ అనుకోలేదు... వాళ్లకే తెలియనప్పుడు ఆ ఇంట్లో పెరిగిన మొగపిల్లవాడికి, ఆడదీ, ఆమెకు ఆత్మాభిమానం వగైరా ఉంటాయన్నదీ తెలిసే అవకాశం అసలు లేదు.

అలా పెరుగుతున్న రాంబాబుకు పెత్తండ్రి కొడుకు మూర్తి అంటే చాలా ఇష్టం, హీరో వర్షిప్ ఉండేది...

మూర్తికి పూర్ణిమ అంటే పిచ్చి ఆరాధన.

"ఒరేయ్ రాంబాబూ! ఆ అమ్మాయి... అంత దేవతేమిటిరా అసలు?! అంత సున్నితత్వం... ఆ మనిషి... వీళ్లంతా ఆమె దగ్గర స్త్రీత్వం నేర్చుకోవాలి... ఏ భంగిమలోనైనా అంత అందంగా ఎలా ఉండగలదు అసలు?!..." ఇలా మాట్లాడేవాడు మూర్తి.

దీనివల్ల ఒక మేలు జరిగింది. రాంబాబుకు స్త్రీలపట్ల ఉన్న దృక్పథంలో కొంత మార్పు వచ్చింది... ఆడవాళ్లలో రకరకాల ఆడవాళ్లు ఉంటారని మాత్రం అర్థమైంది. అసలు, ఆడవాళ్లను, చీపురుకట్ట, వడ్లగంప, లావాటి పరుపు, లాంతరు, రోలు, బావిలో చేద... ఇలా ఉపయోగించే వస్తువుగా మాత్రమే కాకుండా మరొకరకంగా చూడవచ్చని అర్థమైంది...

"ఒరేయ్ రాంబాబూ! ఏదైనా నాకేం లాభం అని ఆలోచించకుండా చూడడం నేర్చుకో... పొద్దున్నే వచ్చే సూర్యోదయం ఎంత గొప్పగా ఉంటుంది? ఆఁ! రోజూ వచ్చేదేగా... అనెయ్యకు... సాయంత్రానికి వాడిపోయే ఆ జూకామందారం నీరెండలో ఎలా ఉన్నదో చూడు... ఎన్ని హొయలు, ఎంత అందం?!" ఇలా మాట్లాడేవాడు మూర్తి... ఎందుకో అతను మాట్లాడే ప్రతి మాటా పూర్ణిమ గురించే అన్నట్లు వినబడేది రాంబాబుకు...

ఈ మాటల వల్ల రాంబాబు ఎంత ప్రభావితుడయ్యాడో చెప్పలేం... కానీ, ఒకరోజు గుళ్లో ఏవో పూజలూ అవీ జరుగుతూంటే బోలెడు మంది ఆడవాళ్లు పొలోమని బైటకు వస్తున్నారు. వాళ్ల మధ్య సున్నితంగా అడుగులు వేసుకుంటూ, బైటకు వస్తోంది పూర్ణిమ. రాయంచకు చీర కట్టినట్లు, అమ్మవారు అర్జంటుగా కాలేజీ స్టూడెంటులా అలంకరించుకున్నట్లు... ఒక్కసారి ఆమె చుట్టూ ఉండేవాళ్లను చూశాడు. మొరటు మోచేతులు, మూతులు గట్టిగా కొంగుతో తుడుచుకుంటూ, కళ్లనిండా అసూయలు, అహంకారాలు, ఎదటివాళ్ల ప్రశంసల కోసరం నగల సవరింపులు... వాళ్ల మధ్య అతి నిర్మలమైన చూపులతో పూర్ణిమ!

'ఈ పిల్ల పారిజాతం పూదండలా ఉంటే... వీళ్లంతా గవిడి గేదెలను నిలబెట్టి పట్టుచీరలు కట్టినట్టు...' అనుకున్నాడు... అతని సంస్కారం అలాగే ఆలోచించగలదు మరి.

ఈ మొత్తం గందరగోళంలో పూర్ణిమ గొప్ప అందని జాబిల్లిలా, చాలా వాంఛించదగ్గ స్త్రీమూర్తిలా తయారైంది. ఆమెను మూర్తి పెళ్లి చేసుకుంటాడు అనుకున్నాడు కూడా.

కానీ, మూర్తికి ఫారిన్ ఛాన్స్ వచ్చి వెళ్లిపోయాడు. అక్కడ సెటిల్ అయిన తరవాత, కుటుంబం అప్పులు తీరిన తరవాత పూర్ణిమను చేసుకోవాలన్నట్లు చెప్పాడు...

జీవితంలో ముఖ్యమైన విషయాలు ముందు వెనక అవడంవల్ల జరిగే పరిణామాలు విపరీతంగా ఉంటాయని మూర్తికి తెలియదు అప్పుడు.

ఆ పరిణామక్రమంలో పూర్ణిమ జీవితంలో పెద్ద పెద్ద ట్రాజడీలు చాలా జరిగాయి. మూర్తి వెళ్లిపోవడం అనేది ట్రాజడీ అని అప్పట్లో ఆమెకు తెలియదు... కానీ తండ్రి హార్ట్ అటాక్‌తో పోవడం, కూతురుపట్ల ముద్దుతప్ప, రక్షణ తెలియని తండ్రి అతి తక్కువ ఆస్తి మిగిల్చిపోవడం, వీటితోపాటు మరొక అత్యంత ఘోరమైన విషయం... మేనత్త ఎవరితోనో లేచిపోవడం... "నాతో కాపరం చెయ్యడానికి కట్నం అడిగేవాడిని ఏం పేరు పెట్టి పిలవాలి?" అని ప్రశ్నించి తన ఇష్టమైన వ్యక్తితో వెళ్లిపోయిన ఆ అమ్మాయి తన వ్యక్తిత్వం నిలబెట్టుకున్నాననుకున్నది. కాని, దాని పరిణామాలు ఆలోచించలేదు. పూర్ణిమ మేనమామ రాలుగాయి వంశం అని తిట్టి బాధ్యతలు తప్పించుకున్నాడు. మేనత్తకు తప్పిపోయిన పెళ్లివారు ఏమీ చెయ్యలేక, పూర్ణిమ గురించి, ఆమె తల్లి గురించి దుష్ప్రచారం చేసి కచ్చ తీర్చుకున్నారు.

తండ్రి ఉన్నంతకాలం మహారాణిలా కనబడ్డ తల్లిలో ఎంత బేలతనం ఉన్నదో, ఎంత అమాయకత్వమున్నదో అర్థమైంది పూర్ణిమకు. పెళ్లైన పాతికేళ్లలో ఆమె నేర్చుకున్నది ఏమీలేదు, భర్త చెంతన బ్రతకడంతప్ప. అండలేని సాంఘిక పరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో తల్లికి, కూతురికీ–ఇద్దరికీ తెలియదు.

అలాంటి పరిస్థితుల్లో...

"పిల్ల మనకు తెలిసినదేగా... బాగానే ఉంటుంది. ఎవరో వేలు విడిచిన పెదనాన్న సాంప్రదాయం కావాలని తిరుగుతున్నాడు. అయినా మనకు తూగే సంబంధం కాదేమోనని బావగారు అంటున్నారు..."

భోజనాలు చేస్తూ హాల్లో పిన్నులు, తల్లి పెదనాన్న మాట్లాడుకోవడం విని, ఎవరి గురించో తెలుసుకున్న రాంబాబుకు కళ్లు తిరిగాయి.

పూర్ణిమ... తనకు సంబంధంగా వచ్చింది...

అంతే... ఆ రాత్రి నిద్ర పోలేదతను... ఏదైనా టెన్షన్ వస్తే కర్చీఫ్ తినేసినంత పని చేస్తాడతను... ఆ రోజు రాత్రి మూడు కర్చీఫులు ముక్కలైపోయాయి.

మర్నాడు, 'ఆ సంబంధమే చేసుకుంటాను' – అని డిక్లేర్ చేసి, ఎవరూ ఏమీ అనకపోయినా, "ఆ కుటుంబాన్ని ఏమన్నా అంటే వాయించేస్తాను..." అని వార్నింగులు ఇచ్చి, నానా గందరగోళం చేసి, "వీడి నోరుబడ –" అని వాళ్ల సంస్కారం ప్రకారం ఇంట్లో ఆడవాళ్లు మెటికలు విరిచే స్థితి తెచ్చుకున్నాడు.

"వాళ్లనేం కట్నకానుకలు అడక్కండి!" మరొక ప్రకటన చేశాడు.

'నేను నిన్ను చేసుకోడం నీ అదృష్టం చూశావా?' అన్నట్లు చూసే అతణ్ణి లాంఛనపు తాంబూలాల ఫంక్షన్‌లో ఒక్కసారి చూసి తలదించుకున్నది పూర్ణిమ.

మూణ్ణిద్దర్లలోనే తను ఆ ఇంట్లో ఎంత ముఖ్యమైన వ్యక్తో, తన మాటకు ఎంత విలువ ఉన్నదో చెప్పేస్తూ ఇల్లంతా చెడ తిరిగేసి, కుక్కను అనవసరంగా బెల్టుపెట్టి కొట్టి, అందరి మీదా అరిచి, స్నేహితులకు తనకు అంత అందమైన భార్య దొరికినందుకు రాత్రి ఒంటిగంట దాకా డ్రింక్‌పార్టీ ఇచ్చి, గదిలో అడుగుపెట్టి, స్నానం చెయ్యకుండా, కాళ్లు కడుక్కోకుండా ఓరగా ఆమె వంక చూస్తూ 'నాకు నిద్ర వస్తోంది' అని మంచంమీదపడ్డ ఆ మనిషిని మరొకసారి నిశ్శబ్దంగా చూసింది పూర్ణిమ. ఆ రాత్రి అతని బలవంతానికి, అతని ఎమోషన్స్‌కు బలైపోతూ "నిన్ను సుఖపెడతాను. నా మాట విని బుద్ధిగా ఉండు, నాకు ఎదురు చెప్పకు" అని పలవరిస్తున్న భర్తను చూడలేక కళ్లు మూసుకున్నది పూర్ణిమ.

కానీ... ఆమె అంతర్‌చక్షువులు తెరుచుకోవడం ప్రారంభించాయి. కాపరానికి వచ్చిన వారంరోజుల్లోనే పూర్ణిమ ఎంత విడిమనిషో అర్థమైంది అందరికీ... వేరు సెనక్కాయల పాతర మీద రోజాపువ్వులా ఉన్నది.

సంస్కారంలేని ఆడవాళ్లు ఏదైనా సహిస్తారు కానీ, మరొక ఆడదాన్లో ప్రత్యేకతను అసలు సహించలేరు... అది ఆ ఇంట్లో ఏ మొగవాడన్నా గుర్తించాడా – ఇంక ఆ ఆడదాని జీవితం నరకమే.

అంత కచ్చతో వాళ్లు కలిగించేది ఆత్మన్యూనత... ఆ అస్త్రాన్నే పూర్ణిమ మీద ఉపయోగించారు.

మూర్ఖులైన ఆడవాళ్లకుండే ముఖ్యాస్త్రాలు దొంగతనం అంటకట్టడం, క్యారెక్టర్ అసాసినేషన్...

"మా అల్లుడికి అలా పమిట జారిపోతూ పులుసు వడ్డించాలా?" హుంకరించింది చిన్నత్తగారు.

"నా గదిలో కొబ్బరి నూనె సీసా తియ్యడమెందుకు? దొంగ బుద్ధులు, లేకి లక్షణాలు" అన్నది ఆడపడుచు.

అవాక్కై నిలబడిపోయింది పూర్ణిమ. అన్నవాళ్లను ఆశ్చర్యంగా చూసింది... చదువుకు సంస్కారానికి సంబంధం లేదు. ఆ అన్న అత్తగారు ఆ కాలం బి.ఏ. ఆడపడుచు పి. హెచ్ డి. చేస్తోంది.

"అసహ్యంగా మాట్లాడకండి..." అని మాత్రం అనగలిగింది పూర్ణిమ... ఏడుస్తూ పారిపోయింది గదిలోకి.

ఆ సాయంత్రం హాల్లో పంచాయితీ పెట్టాడు రాంబాబు. "ఏమిటి మా అమ్మను, చెల్లెల్ని అన్నావుట? నిజమేనా?" నిలదీస్తున్న అతణ్ణి మళ్లీ కళ్లెత్తి ఒక్కసారి చూసింది పూర్ణిమ... ఆ చూపులు... ఒకసారి అతనికి అర్థమయినట్లైంది... అతనికి తెలియకుండానే అతనిలో దాగిన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్... ఏదో అలజడి, ఎక్కడో కుంగిపోతున్నట్లు... అంతే... ఈడ్చి కొట్టాడు పూర్ణిమను అతను.

"ఒళ్లు దగ్గర పెట్టుకుని బ్రతుకు, జాగ్రత్త!..." అన్నాడు. గుమ్మానికి ఆనుకున్న పూర్ణిమ అలాగే కుప్పకూలిపోయింది.

ఆ తరవాత... రాంబాబు ఖంగారు, హాస్పిటల్, మందులు, బత్తాయి రసాలు, నిద్రపోకుండా జాగరణలు...

"నువ్వంటే నాకు ప్రాణం... నిన్నెవరన్నా అంటే సహించను... అలా అనిపించుకోకుండా ఉండాలి నువ్వు..." బుజ్జగిస్తూ, తన మీదకు వంగి చెప్తున్న భర్తను కళ్లెత్తి చూడకుండా ఆ చూపులు దాచేసుకున్నది పూర్ణిమ.

ఆ తరవాత పురుడు... ఆమె తల్లికి జరగవలసిన అన్ని అమర్యాదలు, హోదాలపరంగా, అలవాట్లపరంగా, మాటలపరంగా... జరిగాయి. పుట్టింటిని అవమానించడం వీళ్ల మరొక అస్త్రం అని అర్థమైంది పూర్ణిమకు.

"అమ్మా! నువ్వు వెళ్లిపో... నిన్నంటుంటే భరించలేను..." అని పూర్ణిమ ఏడ్చేదాకా తెచ్చారు వ్యవహారం.

"బాలింతను ఎలా ఒదిలిపెట్టనే...?" ఏడ్చింది తల్లి.

"ఫరవాలేదు... నువ్వు లేకపోతే, బాధ్యతలేని పుట్టింటివాళ్లు అని తిట్టుకుంటూ మా ఆయన మంచి సంపాదించడానికి అన్ని ఉపచారాలు చేస్తారు. నువ్వు వెళ్లి హాయిగా ఉండు..." అని బలవంతంగా పంపించేసింది తల్లిని పూర్ణిమ.

"మీ అమ్మకు ఏం చూసుకుని ఆ పొగరు అంటోంది మా అమ్మ.. ఏమన్నదేమిటి ఆవిడ?" అడుగుతున్న భర్తను చూడకుండా మరొక్కసారి చూపులు దాచేసుకుంది పూర్ణిమ.

తమను కాదని వెళ్లిపోయిన ఆడపడుచు సుఖంగా ఉన్నదా? తమందరి మాట కాదనక తలవంచుకుని తాళి కట్టించుకున్న కూతురు సుఖంగా ఉన్నదా? అన్న

ప్రశ్నకు జవాబు తెలిసి భయపడింది తల్లి. ఒంటరితనం, దిగులు, ఉన్న ఒక్క కూతురు దూరమైపోవడం - మంచం పట్టింది తల్లి... తీసుకువెళ్లి చూపించి తీసుకువచ్చేవాడు పూర్ణిమను రాంబాబు; రాత్రి తల్లితో ఆమె ఉండకూడదు.

"మా అమ్మ వద్దన్నది... మా అక్కయ్య ఏమన్నా అంటుంది..." ఈ మాటల వెనకాల అతని ఇన్‌సెక్యూరిటీ పూర్ణిమకు అర్థమయింది.

తల్లి పోయింది.

"మీ అమ్మ ఛస్తే. మన ఇంట్లో ఎందుకు పండగ మానుకోవాలి... అది మన ఆచారం కాదు అంటోంది మా అమ్మ..." అని తల్లి చచ్చిపోయిన నెలరోజుల లోపల ఖరీదైన పట్టుచీర కట్టించాడు భర్త.

చాలా చాలా అర్థమైపోతున్నాయి పూర్ణిమకు.

అతనిచ్చే ఏ బహుమతీ అతనివ్వాలనుకున్నదే కానీ, ఆమెకు కావల్సినది కాదు.

తనకు ఇష్టమైన లేత ఆకుపచ్చ, లేత గులాబీ రంగులు చూసి, "ఎలా తెలా పోతూ ఏమిటా రంగులు?" అని పెద్దత్తగారు వంకర నవ్వు నవ్వినప్పుడు తలెత్తి నిశ్శబ్దంగా చూసింది పూర్ణిమ... అవే చూపులు... మరెప్పుడూ తనకు ఇది ఇష్టం అని చెప్పలేదు. ఆమె మొరమరాలు అడిగితే అతను వేరుశనగలు తెస్తాడు... "నీ ఇష్టమేమీ లేదు... నా ఇష్టమే అంతా..." అన్ని విషయాలు చెప్పే చాలా నగలు, చీరలు, ఆస్తులు ఆమె పేరన ఉన్నాయి. ఆమెకు కానివి, హక్కులేనివి, అలంకారమైనవి.

రెండవ పిల్లాడు పుట్టినప్పుడు మొగపిల్లల్నే కన్నందుకు అందరూ అభినందించారు రాంబాబును.

అప్పుడే వచ్చాడు స్టేట్స్‌నించి మూర్తి.

ఏదో తెలియని హాయి వాతావరణంలో గుర్తించి కళ్లు తెరిచి చూసింది పచ్చిబాలింత పూర్ణిమ.

చేతుల్లో రోజా పువ్వులతో వళ్లంతా కళ్లుగా చూస్తున్నాడు మూర్తి... ఆశ్చర్యంగా, ఆనందంగా, హాయిగా... కళ్లెత్తి చూసింది పూర్ణిమ. చటుక్కున ఫోటో తీశాడు మూర్తి.

గభాలున ఒంటినిండా దుప్పటి లాక్కున్నది... ఎవరన్నా చూస్తారేమోనన్న భయం. మరొక ఫోటో తీశాడు - పాపతో కలిపి.

"ఒద్దు... తప్పు..." అన్నది తలవంచుకుని.

"ఏది? ఏమిటి తప్పుట?" సున్నితంగా అడిగాడు.

మరొకసారి తలెత్తి చూసింది... గుండెల్లోని అనుభూతి కళ్లల్లోకి నీడలా... కన్నీరుగా...

చటుక్కున కెమేరా క్లిక్‌మనిపించాడతను.

ఆమె కళ్లల్లో మళ్లీ భయం నీడలు.

"పూర్ణిమా!... భయపడకు... ఎక్కడో ఏదో తప్పు జరిగిపోయింది. నేనేం చెప్పలేను. మనిషి జీవితంలో తెలుసుకోవలసింది ప్రియారిటీ అని ఆలస్యంగా అర్థం చేసుకున్నాను... ప్చ్... టూ లేట్... ఇదిగో నా అడ్రస్... అలా చూడకు... నాకు ఉత్తరాలు రాయద్దు. రాయవని తెలుసు... కానీ... ఏ బాధ అయినా అర్థం చేసుకునే స్నేహితుడున్నాడనుకుంటే హాయి... కాగితం మీద రాసేసి, నాకు పోస్ట్ చేశాననుకుని చింపెయ్యి... నిజంగా పోస్ట్ చేద్దామనుకున్నప్పుడు ఇందులో అడ్రస్... వస్తాను..." కార్డ్ ఆమె చేతిలో పెట్టి తిరిగి చూడకుండా వెళ్లిపోయాడతను.

వరండాలో రాంబాబు గొంతు... భయపడిపోయింది పూర్ణిమ. మూర్తి వచ్చాడని తెలుస్తే... కార్డు దాచేసుకున్నది... రోజాపువ్వులు దిండుకింద పెట్టేసింది.

"ఏరా, ఎలా వున్నావు?" మూర్తి గొంతు.

"బాగున్నాను... నాకు రెండవ కొడుకు." వచ్చి చూడమనలేదు రాంబాబు.

"గుడ్... కంగ్రాట్స్... నాకిప్పుడు టైంలేదు చూడాలంటే, వస్తాను..." వెళ్లిపోయాడు మూర్తి.

రాంబాబు వచ్చేటప్పటికి నిద్రపోయినట్టు నటించింది పూర్ణిమ. అది తప్పో రైటో ఆమెకే తెలియదు. ఆ పెద్ద పెద్ద బీరువాలున్న గ్రనైట్ ఫ్లోర్ ఉన్న బంగళాలో ఏవీ తనవి కావనిపించేవి. ఒక్క చీరల అడుగున దాచిన ఆ కార్డ్. వాడిన రోజాపువ్వులు, అమ్మ చచ్చిపోతూ ఇచ్చిన గాజుల జత తప్ప.

ఆ తరవాత పూర్ణిమ జీవితాన్ని తట్టుకోవడం నేర్చుకున్నది. మూర్తి చెప్పిన ట్రిక్ బాగా పని చేసింది. కాగితం మీద అన్ని బాధలు, తిట్లు, కోపాలు రాసేసుకుని చించెయ్యడమో, కాల్చేయ్యడమో చేసేది. ఈ కర్థాసిస్ వల్ల ఆమె మానసిక బలం ఎక్కువైంది.

ఆ సంవత్సరం న్యూ ఇయర్ కార్డ్ మిసెస్ అండ్ మిస్టర్ రాంబాబుకు మిసెస్ అండ్ మిస్టర్ మూర్తి దగ్గరనుంచి వచ్చింది. ఆ కార్డు అలా చూస్తూ ఉండిపోయింది పూర్ణిమ. ఆ అమ్మాయి ఎలా ఉంటుందా? అని వూహించుకున్నది...

మూర్తికి పెళ్లైంది అని తెలిసి విపరీతంగా సంతోషించాడు రాంబాబు... అతనిలో అంతర్గత భయాలు చూసి నవ్వుకున్నది పూర్ణిమ.

"ఈ కార్డు మీద ఏదో రాసుంది, చదివావా?" అంటూ ఇచ్చి వెళ్లిపోయాడు రాంబాబు.

``We visit others as a matter of social obligation... How long has it been since we have visited with ourselves?"

అన్న కొటేషన్ ఉన్నది... అంతే... పూర్ణిమలో చిన్న చిన్నగా చైతన్యం ప్రారంభమైంది. తనను తాను పరీక్షించుకోవడం ప్రారంభించింది.

తనతో తాను బ్రతకడం తనకు ఎంత భయమా? అని ఆశ్చర్యపోయింది.

ఎదటివాళ్లుకాదు తన సమస్యలకు కారణం. ఆ సమస్యలను తనలో ఏదో అధైర్యం ఆహ్వానించి బాధపెడుతోంది. ఎవర్నో చెడ్డవాళ్లను చేస్తేకానీ 'తృప్తిపడని ఏదోకరుడుకట్టిన తెలియని కర్కశత్వం తనలో ఉన్నది... ఇది మార్చుకోవాలి. ఎదటి వాళ్లలో చాపల్యం, కుసంస్కారం, అజ్ఞానం తనకు ఏదో ఆనందాన్నిస్తోంది. ఇదొక రకమైన రోగగ్రస్త మనస్తత్వం. తనలో లోపాలు ముందు తగ్గించుకోవాలి... తన ప్రవర్తన ఎదటివాళ్లలో ప్రేమనో, అభిమానాన్నో నిద్రలేపకుండా కచ్చను, అసూయను నిద్ర లేపి పలకరించేట్లు తనూ ప్రవర్తిస్తోంది. తెలిసినట్లున్న తనకు, తెలియని వాళ్లకు ఏమిటి తేడా?! ఉలిక్కిపడింది... తనలో లోపాలు గ్రహించుకుని తనను తాను గౌరవించుకోనిది బ్రతకలేనని గ్రహించుకున్నది. అది అహంకాదు... అంతర్మథన.

ఇప్పుడు ఆమెను కష్టాలు, అమర్యాదలు, సూటీపోటీ మాటలు బాధ పెట్టడంలేదు. దైన్యంపోయి, తన చుట్టూ మనుష్యుల మీద జాలి పెరిగింది.

రెండేళ్ల తరవాత భార్యతో ఇండియాకు వచ్చిన మూర్తికి పూర్ణిమతో మాట్లాడే అవకాశం రాకపోయినా, ఆమెలో మార్పు స్పష్టంగా అర్థమైంది. కానీ మూర్తి భార్య మాత్రం-

"ఆ మనిషేమిటి అలా గాడిద చాకిరీ చేస్తూ... ఎమోషనల్ స్లేవరీ... ఛీ! నేనైతే ఎప్పుడో డైవర్స్ ఇచ్చేదాన్ని..." అనేసింది పూర్ణిమను చూసి... జవాబు చెప్పలేదు మూర్తి... చెప్పలేదు కూడా.

❀ ❀ ❀

ఆ ఇంట్లో ఉన్న రెండు వారాల్లోనే ఇంచుమించుగా ఈ కథంతా తెలుసుకున్నది సహజ... కొంచెం ఊహించుకున్నది. ఎప్పుడూ బిజీగా, క్షణం తీరిక లేకుండా అందరికీ అన్నీ అమర్చిపెట్టే పూర్ణిమ సాన్నిధ్యంలో ఏదో హాయి...

ఇంతకీ పూర్ణిమ హాయిగా ఉన్నదా? అని, అదే ప్రశ్న అడిగింది సహజ.

నవ్వింది పూర్ణిమ వెన్నెలలా.

"నేను హాయిగా ఉండటానికి మరొకరిమీదో, పరిస్థితులమీదో ఆధారపడే స్థితిలోలేను సహజా!... నాకు హాయిగా ఉండటం తెలుసు..." బట్టలు ఆరేస్తూ అన్నది పూర్ణిమ.

"ఎవరివి వదినా, ఇంత చిన్నపిల్లల బట్టలు?"

"మా పిన్నత్తగారి రెండో కోడలు పిల్లలవి... వాళ్లాయన పేకాటలో ఆస్తులు పోగొట్టాడు... అతణ్ణేమీ ఎవరూ అనరు... మొగవాడు కాబట్టి... కానీ ఆ పిల్ల దురదృష్టమని ఆ పిల్లను శిక్షిస్తున్నారు... సంపాదనలేని భర్త ఉంటే, ఆపైన పిల్లలుంటే ఇంక ఈ కుటుంబ వ్యవస్థలో ఆ ఆడదానికి నరకమే... మిగతా ఆడవాళ్లు ఆమెకు విధించే శిక్షలు... ఘోరం... ఆ పిల్లకు జ్వరం... పనిమనిషి వాళ్ల కుటుంబం బట్టలు ఉతకదు... అందుకని నేను ఉతికి ఆరేస్తున్నాను. రేపు పిల్లలు స్కూలుకు వెళ్లాలి కదా!"

"పనిమనిషి ఎందుకు ఉతకదు?"

"అది అంతే... వాళ్లాయన సంపాదించలేడు కాబట్టి ఆ పిల్లకు కనీస సుఖాలు ఉంచరు. ఆత్మన్యూనత కలిగిస్తారు... ఇక్కడ ఆడవాళ్లు అప్పడాలు, వడియాలు తినకూడదు... అవి మొగవాళ్లకు మాత్రమే పరిమితి అనే కుటుంబాలున్నాయి..."

"అదేమిటి? ఇది అడివా? వీళ్లు మనుష్యులు కారా? నాన్సెన్స్..."

"తిట్టకు సహజా! అర్థం చేసుకో... ఈ వ్యవస్థ రక్షించబడాలంటే మారవలసింది ఆడవాళ్లు... పెళ్లికి పిల్లలు పుట్టడం సెక్యూరిటీ అనుకుంటున్నారు కానీ ఆ పిల్లలను ఎలా పెంచగలం అని ఆలోచించడం లేదు... ఒక్క బిడ్డ స్కూలిడ్ పూర్తిచెయ్యడానికి లక్ష రూపాయలు అయ్యేకాలం ఇది. ఏ సెక్యూరిటీతో బ్రతుకుతారు? బైటకు వెళ్లలేరు... వీళ్లు సంపాయించలేరు... కుటుంబపరువు అంటారు..."

"మరి దీనికి పరిష్కారం?"

"కుటుంబ వ్యవస్థ రక్షణ కల్పించడం నేర్చుకోవాలి. లేకపోతే కూలిపోతుంది. ఫామిలీ ట్రస్టులు ఉండాలి... బాధ్యతలులేని కుటుంబ గౌరవాలు లాభంలేదని ఆడవాళ్లకు అర్థమవగానే ఈ వ్యవస్థను కూల్చేస్తారు... ఈ అజ్ఞానం, అర్థంలేని అహంకారంవల్ల లాభంలేదు..."

"నువ్వేం చెయ్యగలవు వదినా?... ఇలా బట్టలు ఆరేసి పెట్టగలవు... చిన్న చిన్న సహాయాలు చెయ్యగలవు... అంతేగా?..." సూటిగా చూస్తూ అడిగింది సహజ.

నిట్టూర్చింది పూర్ణిమ...

"నేను కొంచెం మాత్రమే చెయ్యగలనేమో!... ఆ అమ్మాయికి అండగా ఉండగలను కానీ రాంబాబుగారు చాలా చెయ్యగలరు... ఆయనచేత చేయిస్తున్నాను. ఆ పిల్లలకు చదువు, ఆమెకు ఇన్సూరెన్స్ చేయించారు.. ఏదైనా చెయ్యాలిగా..."

"హుఁ! మరి మిగతావాళ్లకు బాధ్యత లేదా? మరి ఈ ఒలకబోసే ప్రేమానురాగాలు, ఇదంతా పై డ్రామాలేనా?"

"హుఁ!" విరక్తిగా నవ్వింది పూర్ణిమ...

"మా మామగారు చచ్చిపోయినప్పుడు ఆస్తుల పంపకాలప్పుడు కాట్లకుక్కలు కొట్టుకున్నట్లు కొట్టుకున్నారు వీళ్లంతా... డబ్బు పునాదిగా ఉండే బంధుత్వాలు బాంధవ్యాలుగా మారవు సహజా!... వీళ్లకు మేధోపరంగా గౌరవాలు, మనిషిని మనిషిగా గుర్తించుకోవడం రానప్పుడు ఈ పరిస్థితులింతే..."

ఆమె వంకే చూస్తోంది సహజ... ఆ కళ్లు... ఆలోచనలతో చాలా షార్పుగా, వెలుతురుతో... కరుణతో... జాలితో...

ఈవిడ ఈ కుటుంబంలో ప్రతి ఒక్కరి గురించీ ఆలోచిస్తుంది. అవసరాలు తీరుస్తుంది... కానీ... వీళ్లందరికీ ఈవిడ 'బాబుగాడి భార్య' అంతే... వినయంగా, అమాయకంగా కనిపించే ఈ యువతి తమ అందరి యోగక్షేమాలు ఆలోచిస్తోందని ఎప్పటికీ వాళ్లకు అర్థంకాదేమో...

❀ ❀ ❀

ఆ రోజు దేవాలయంలో ఏదో అభిషేకాలు... అందరు చుట్టాలు అక్కడికి చేరారు... అక్కడ భగవంతుడి గురించి తప్ప అందరి గురించీ గందరగోళంగా మాట్లాడేస్తున్నారందరూ. పూజారి దారిన పూజారి నమకం చమకం యాంత్రికంగా చెపుతున్నాడు...

"అబ్బబ్బ... ఇక్కడ ఊపిరి ఆడడంలేదు వదినా!... దా బైటకు వెళదాం..." అన్నది సహజ.

గుడి ప్రాంగణంలో నాగలింగం పూల చెట్లకింద కూర్చున్నారు ఇద్దరూ...

బస్తాడు కొబ్బరికాయలు పట్టించుకుని రావడానికి వెళ్లిన రాంబాబుకు గుడికి రాగానే తమ జనంలో భార్య కనిపించలేదు. అడిగాడు అందర్నీ... ఒక అరగంట రభస తరవాత-

పూర్ణిమ భుజం మీద ఒక చెయ్యి బలంగా పడింది...

కొంచెం దూరంలో పొగడపూవులు ఏరుకుంటున్న సహజ రాంబాబు మాటలు విని అవాక్కైపోయింది.

"అందుకే... అందుకే... మా అమ్మ అంటుంది - నీకు స్వతంత్రం ఇస్తే నువ్వు మీ అత్తలా లేచిపోతావని..."

తలెత్తి చూసింది పూర్ణిమ... మౌనంగా అతనితో కలిసి వెళ్లిపోయింది. ఆశ్చర్యంగా అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్లింది సహజ. ఆ తరవాత అతడు ఒక వికృత నృత్యం చేశాడు ఇంట్లో.

"ఇంత పిచ్చి వెధవేమిటి వీడు? చెప్పకుండా ఎందుకు వెళ్లావ్? అని ఒక వందసార్లు అని ఉంటాడు..." అన్నది ఇంక ఉండబట్టలేక పెద్దత్తగారు.

ఏమీ జరగనట్లు కాసేపటికి వెళ్లి... "రండి... అన్నం పెడతాను..." అని బతిమాలి, తప్పంతా తనదే అయినట్లు సారీ చెప్పి భోజనం పెడుతున్న పూర్ణిమను చూసి ఒళ్లు మండిపోయింది సహజకు.

"సహజా! నా మీద కోపంగా ఉన్నదా?" సాయంత్రం నవ్వుతూ వచ్చి అడిగింది పూర్ణిమ...

"ఎలా నవ్వగలవు వదినా?... ఇన్నాళ్లు నీ ప్రవర్తన చూసి కూడా అంత అమర్యాదకరంగా ఆ మనిషి ఎలా మాట్లాడగలడు వదినా?..." కోపంగా, రోషంగా అన్నది సహజ... ఈ కొద్దిరోజుల్లో పూర్ణిమ మీద ఏదో ప్రేమ, అదిచ్చే హక్కు - ఇవి మాట్లాడిస్తున్నాయి ఆమెను.

"ఎన్నాళ్లైనా ఒకటే... నన్ను బాధపెడితే అది తన ఆధిక్యత అనుకునే అమాయకుడు. ఏమిటి, నువ్వేదో విమెన్ అండ్ సోషల్ కండిషన్స్ వగైరా మీద రిసెర్చ్ అన్నావు కదూ... ఈ దేశంలో ఆడవాళ్లకు, మగవాళ్లకు కావల్సిందేమిటో నీకు అర్థమైందా?"

"మొగవాళ్లకేం మాయరోగం?... ఏదైనా సమస్యలుంటే ఆడవాళ్లకేగాని..." కచ్చుగా అన్నది సహజ.

"అలా ఆలోచిస్తే నువ్వు నాలుగు పుస్తకాలు చదివి రిసెర్చ్ పేపరు సబ్మిట్ చెయ్యగలవు కానీ, సమస్యలకు పరిష్కారాలు ఆలోచించలేవు...."

ఉలిక్కిపడింది సహజ... మూర్తన్నయ్య దాదాపు ఇదే మాటలు మాట్లాడాడు.

"మరి?" అడిగింది.

"గుర్తు పెట్టుకోవలసిన విషయం ఏమిటో తెలుసా? ఇక్కడ చెలామణి అవుతున్న కుటుంబ వ్యవస్థ - మొత్తం అందరిలోనూ అభద్రతా భావం చెలరేపుతోంది. ఎవరికి వారికే ఆర్థిక అభద్రతో, సాంఘిక అభద్రతో, ఎమోషన్ డిపెండెన్సీయో తప్పడంలేదు... అవునా?!"

"అవును... అదే ఎందుకు అని?"

"ఇక్కడ మొగవాడికి ఆడదానికి కావల్సినవి తప్పుతప్పుగా అంచనా వేస్తున్నారు... ఆడదానికి ఇన్‌సెక్యూరిటీ అనుకుని రక్షణ కల్పిస్తాం, రక్షిస్తాం అంటున్నారు... మొగవాడికి స్వాతంత్ర్యం కావాలనుకుంటున్నారు... కానీ ఈ వ్యవస్థలో చిక్కుకున్న మొగవాడికి ఇన్‌సెక్యూరిటీ సమస్య ఎక్కువ. ఎంత చదువు, డబ్బు ఉన్నా నా అనే వ్యవస్థ కోసరం తపించిపోయేవాళ్లే వీళ్లంతా... ఏదో భయం... నీ భార్య లేచిపోతుందనో, నీ ఆస్తి పోతుందనో, నిన్ను గౌరవించరనో, నీ పితృదేవతలు దీవించరనో సగటు మనిషిని హింస పెట్టగలదు ఈ వ్యవస్థ. మా అమ్మ ఇలా అంటోంది, మా అక్క ఒప్పుకోదు - ఇలా మాట్లాడే ప్రతి వ్యక్తీ, ఒకొక్కసారి మా ఆవిడ వంట, ఆవిడ తెలివితేటలు - ఇలా పొగిడే ప్రతి వ్యక్తీ చాలా టెన్షన్ మీద ఉన్నట్లే లెఖ్ఖ... తెలివి గల ఆడది ఇక్కడ సైకోథెరపిస్ట్‌లా పని చెయ్యాలి... లేకపోతే, అమ్మా నాన్న చెప్పారనో, ఆస్తి వస్తుందనో ఆడదాన్ని నిట్టనిలువునా కాల్చేసెయ్యగల రోగగ్రస్తులు వీళ్లు." - వరకట్న హత్యలకు భాష్యం చెప్పేసింది పూర్ణిమ.

నిర్ఘాంతపోయింది సహజ.

"మరి ఆడవాళ్లు?"

"రవ్వంత గుర్తింపు, కొంచెం లాలింపు, మానసిక స్వతంత్రంతో చాలా చెయ్యగలదు ఆడది... తనను తాను రక్షించుకుని, మిగతావాళ్లనూ రక్షించుకోగలదు."

'ఆవిడ దగ్గరకు వెళ్లు... నీకు చాలా చెప్తుంది -' అన్న మూర్తన్నయ్య మాటలు గుర్తువచ్చాయి.

"ఇటువంటి వ్యవస్థలో పెళ్లి అవసరమా వదినా?!"

"అది చెప్పలేను... కానీ ప్రస్తుతం పెళ్లిళ్ల పద్ధతి మాత్రం బాగాలేదు... పెళ్లే జీవితం అనుకున్నవాళ్లు చాలామంది బలైపోతున్నారు... వ్యక్తిత్వం లేకుండా కాలిపోతున్నారు... మాట్రిమోనియల్ కాలం చూసి, ఉద్యోగం, అందం ఉంటే చాలని పెళ్లికి ఒడంబడిపోతున్నారు. పెళ్లి ప్రొఫెషనల్‌గా మార్చేసుకుని చాలామంది

తెలివిగల ఆడవాళ్లు బ్రతికేస్తున్నారు. ఆడపిల్లలకు దీనివల్ల స్వతంత్ర్య ఉందేమో కానీ మొగవాడికి సెక్యూరిటీ, హాయి కనిపించవు... ఇలా చాలామంది బాధపడుతున్నారు."

"ఎందుకు బైటపడలేకపోతున్నారు? పిల్లల వల్లనా?"

"తల్లి అయిన ఆడది ఈ వ్యవస్థలో తన బిడ్డలకు తండ్రిని కాపాడుకోవడానికి పాటుపడుతుంది. కష్టాలు, అవమర్యాదలు ప్రేమతో భరించదు. తన సంసారం కోసరం భరిస్తుంది. ఈ విషయం ముప్పాతిక మూడొంతుల మొగవాళ్లకు తెలియనీయకుండా ఈ వ్యవస్థ జాగ్రత్త పడుతుంది. సంపాదించలేని మొగవాడిని ఈ వ్యవస్థ శిక్షిస్తుంది. భయపెడుతుంది. మనిషిని మనిషిగా కాక అతను తీర్చే అవసరాన్ని బట్టి గౌరవించే ఈ వ్యవస్థలో అవినీతి ఎందుకు పెరగదు? ఇది రోగగ్రస్థమైన వ్యవస్థ... ఇది మొగవాణ్ణి రోగగ్రస్థుడిగానే మారుస్తుంది. ఇతణ్ణి రక్షించగలిగేవి ప్రేమ, ఓదార్పు - ఇవే... ఇప్పుడు చెప్పు... ఇందాక నేను రాంబాబుగారితో అలా ప్రవర్తించడం అవసరమా? కాదా..."

నిర్ఘాంతపోయి చూస్తోంది సహజ...

ఈవిడ ఇంత ఆలోచిస్తోందా? ఈవిడ తెలివితేటలు, ఆలోచనాసూక్ష్మం, తన భర్తను కాపాడుకోవడానికి పడే తపన ఏమాత్రం తెలియని ఆ రాంబాబు మీద నిజంగా జాలి వేసింది సహజకు.

"వదినా! ఒక విషయం చెప్పు... ఇవ్వాళ్టికి ఇవ్వాళ నాతో అమెరికా తీసుకువెళ్లి నీకు ఆర్థిక స్వాతంత్ర్యం, సాంఘిక గౌరవం ఇస్తే - హాయిగా వచ్చేస్తావా?"

కాఫీ కప్పులు తీసుకువెళుతూ వెనక్కు తిరిగి సూటిగా చూసింది పూర్ణిమ.

"రాను సహజా! రాలేను... ప్రపంచమంతా నా కాళ్ల ముందు ఉంచినా రాను..."

"కారణం?" కుతూహలంగా అడిగింది సహజ.

"చాలా కారణాలు ఉండచ్చు..."

"ఒకటి చెప్పు... నీకు ఇన్‌సెక్యూరిటీ ప్రాబ్లం వస్తుందనా? నీవాళ్లు అనుకున్న వాళ్లకు దూరం అయిపోతావనా?"

ఆలోచిస్తూ నిలబడింది పూర్ణిమ...

"ఒకప్పుడైతే నిజమేనేమో. ఇప్పుడు కాదు... రాంబాబుగారితో నాకొక అనుబంధమున్నది... అతని మనుష్యులు అతణ్ణి భయపెట్టకపోతే, అతను చాలా మంచివ్యక్తి. తప్పుదారిన పట్టిన కుటుంబవ్యవస్థ చేసే మొదటి పని ఇంట్లో వృద్ధిలోకి వస్తున్న మొగవాడిని నీ బాధ్యత నువ్వు చెయ్యడం లేదని గిల్టీగా మార్చి నిస్సత్తువ చెయ్యడం... దీనికి రాంబాబు బలైపోయారు... అతను నేను లేకుండా బ్రతకలేడు... అతడు ఈ విషయం ఒప్పుకోకపోవచ్చు... ఇది ప్రేమా అంటే కాకపోవచ్చు... కానీ నేను లేని మర్నాడు అతణ్ణి బాధపెట్టి సోషల్ స్లేవరీ చేయిస్తారు వాళ్లంతా... మరొక

కారణం. ఇక్కడ ఈ నిస్వార్థకర్తవ్యాలమధ్య నాకొక తృప్తి ఉన్నది... నా పిల్లల్ని నాకు కావల్సినట్లు, ఈ వ్యవస్థను అర్థం చేసుకుని బాగుచేసేట్లు పెంచాలని ఉన్నది... ఈ దేశంలో పుట్టినందుకు నేను ఏదో చెయ్యాలనిపిస్తోంది... పారిపోవాలనిపించడం లేదు సహజా!"

వెళ్లిపోతున్న ఆవిడ అందెల ధ్వని వింటూ అలాగే కూర్చున్నది సహజ... బుర్రంతా తిరిగిపోయింది.

తన రిసెర్చ్ పేపర్ల ముందు కూలబడింది... ఏవేవో లెఖ్ఖలు, ఏవేవో చట్టాలు... వీటన్నింటికీ అతీతంగా ఈ టైపు చేసిన అక్షరాల మధ్యనుంచి జారిపోతూ మెరుపులతో ప్రవహిస్తున్న ఏదో వ్యక్తిత్వంతో కలిసిన స్త్రీత్వం ఆమెకు దర్శనమిస్తోంది.

"ఆడవాళ్ల గురించి నీకు చాలా అర్థమవ్వాలి..." అన్న మూర్తన్నయ్య మాటలు...

❀ ❀ ❀

"వదినా!... మూర్తన్నయ్యకు ఈ మెయిల్ పంపుతున్నాను... చదువుతావా?" లాప్‌టాప్ దగ్గరకు వచ్చి చూసింది పూర్ణిమ.

మౌనంగా చదివింది.

"I have discovered what you wanted me to discover... thank you."

"నేనొక మెసేజ్ పంపించనా?" అన్నది పూర్ణిమ.

ఆ మొహంలో ఏ భావమూ లేదు. చాలా ప్రశాంతంగా ఉంది.

"నువ్వా?... గుడ్!... పంపించు... అన్నయ్య థ్రిల్ అయిపోతాడు." ఆనందంగా అన్నది సహజ.

""The soil in return for her services keeps the tree tied to her. The sky asks nothing and leaves it free"

- *Ravindranath Tagore.*

మౌనంగా టైప్ చేస్తోంది పూర్ణిమ.

*('రచన' నూతన సహస్రాబ్ది - జన్మదిన ప్రతిష్ఠాత్మక ప్రత్యేక సంచిక - ఫిబ్రవరి, 2000)*

# మహోత్సవం

ఉద్యోగరీత్యా కేరళ వచ్చింది వర్షిణి. ఆమె పూర్తి పేరు 'అమృత వర్షిణి'. రాగాల మీద మోజుతో ఆ పేరు పెట్టుకున్న తల్లి తండ్రీ ఇద్దరూ అద్భుత సంగీతకారులు. సంగీతం వాళ్లిద్దర్నీ ప్రేమికుల్ని చేసింది. సంగీతం రిలీఫ్ ఇస్తుందని అందరికీ లెక్చర్లు ఇచ్చే వాళ్ళిద్దరూ ఏనాడూ పెళ్లి అయిన తరువాత రిలీఫ్ పొందలేదు. అదీ సంసారమంటే...

"మా ఉత్సవం ఎంత బాగుంటుందో... సెలవలు పెట్టి విదేశాల నుంచి కూడా ఈ ఉత్సవాలకు వస్తారు మావాళ్లంతా..." అని బలవంతపెట్టి త్రిపుణతురాలోని పూర్ణ త్రయేశ్వర ఆలయ ఉత్సవాలకు లాక్కుని వచ్చింది మలయాళీ కొలీగ్.

ఇంత చదువుకున్న అమ్మాయికి ఈ పైత్యం ఏమిటా? అని ఆశ్చర్యపోతూనే ఉత్సవాలకు వచ్చింది వర్షిణి. పూర్ణత్రయేశ్వరుడైన భగవంతుడి ఉత్సవాలు... అదొక మహాద్భుత అనుభవంగా నిలిచిపోయింది వర్షిణి జీవితంలో... గుడి చుట్టూ పాతబడిపోయిన అలనాటి రాజభవనాలు... పాతవైన నల్లటి గోడల మీద ఆకుపచ్చని నాచు కూడా శోభాయమానంగా అనిపిస్తోంది... అందరి ముఖాలలోనూ అంతులేని ఉత్సాహం.

స్వామి గజోత్సవాన్ని 'శ్రీవేలి' అంటారు... తొమ్మిది ఏనుగులు గొప్పగా రాజసంగా అలంకరించబడ్డాయి... సర్వేశ్వరుడు ఊదారంగు అలంకారాలు ఉన్న ఏనుగు పైన కొలువై ఉన్నాడు... కేవలం తులసి, తామర, మల్లెలు తప్ప మరే అలంకారం ఉండదు. సూర్యభగవానుడు ఆ విరాట్ స్వరూపానికి విస్తృతమైన కిరణార్చన చేస్తున్నాడా అన్నంత అద్భుతంగా... వెలుతురుగా ఉన్నది చుట్టూ...

"ఇవ్వాళ త్రికేట నక్షత్రం... చాలా పవిత్రదినం... ఒకప్పుడు బిల్వమంగళుడు స్వామిని అర్చించడానికి వచ్చాడు... అతడి సూక్ష్మ శరీరానికి స్వామి గుడిలో అనుభవం కాలేదు... అర్థం కాక ఉత్సవంలోకి వచ్చాడు. పధ్నాలుగు ఏనుగుల మీద సర్వేశ్వరుడు చండా ధ్వనికి ఎలతెమ్మి పాదాలతో పరమాద్భుత విరాట్ నృత్యాన్ని చెయ్యడాన్ని దర్శించి పులకించిపోయాడుట బిల్వమంగళుడు..." ఏదో మలయాళ వచనం చెప్పి, అమిత ఉత్సాహంగా అర్థం చెపుతోంది స్నేహితురాలు... ఆశ్చర్యంగా వింటూనే ఆ మూడ్ లోపలికి వెళ్ళిపోయింది వర్షిణి.

ప్రచండమైన చండా ధ్వని... చండా... ఇది కేరళ ఉత్సవాలలోని గొప్ప విస్తృతమైన ఆచారం... విపరీతమైన బరువుతో తబలా లాగా ఉండే ఈ వాయిద్యాన్ని

ఆరోహణ అవరోహణలతో ఒక రకమైన లయతో ప్రోగించినప్పుడు మెల్లిమెల్లిగా ఆ లయ ఆవహించి మనస్సు అంతర్ముఖమై, సూక్ష్మ శరీరాన్ని కదిలించి, చలింపచేసి, దృష్టిని ఏకోన్ముఖం చేసి, నిద్ర లేపి, అడుగులు వేయిస్తుంది. అంతమంది జనంలో ఉన్నా ఏ మనిషి అనుభవం ఆ మనిషిదే...

శంఖచక్రగదాహస్తాలతో నారాయణమూర్తి దర్శనమిస్తే చండా ధ్వని లయతో ఆ స్వామిని ఛత్రం, చామరం సేవ చేస్తున్నట్లుగా చేతులు ముద్రాభినయం చేస్తున్నారు ఏనుగు మీది అర్చకులు.

అప్రయత్నంగా పెదవులు "నారాయణాయ విద్మహే"... అంటూనే అంటాయి. అడుగులతో, పెదవులతో, అనంతమైన మనస్సుతో... అంతా దివ్యార్చనే!

సరదాగా స్నేహితురాలితో వచ్చిన వర్షిణి ఆ ఉత్సవమాదకతలలో పూర్తిగా మునిగిపోయింది. మళ్ళీ రాత్రికి వచ్చింది స్నేహితురాలితో కలిసి.

ఆ రాత్రి బంగారు బిందెలో 'కానుక' అని భగవంతుడికి 'దక్షిణ' సమర్పిస్తారు. కానుక సమర్పణకు వేంకటేశ్వరస్వామి గుడిలో లాగా పెద్ద క్యూలో నిలబడ్డారు... ఈ ఉత్సవాలలో పాడటమే అదృష్టంగా వస్తారు కళాకారులు. కే. ఎస్. గోపాలకృష్ణన్ మురళీ వాయిద్యం అద్భుతంగా జరుగుతోంది.

కథకళి నృత్యం ఈ మలయాళ దేశపు కళాబిందువు. నిద్ర తూలే కళ్ళతో నేలమీద కూర్చుని, తెల్లవారుఝాము వరకూ 'కథకళి' చూడడం అదొక కొత్త అనుభవం. పూతన మోక్షంలో పూతన వేషం వేసిన అమ్మాయి పరమాద్భుతంగా చేసింది. మేకప్ తీసేసిన తరవాత ఆ అమ్మాయి సౌందర్యాన్ని చూసి ఆశ్చర్యపోయింది వర్షిణి.

"మనస్ఫూర్తిగా కళ్ళు మూసుకుని భగవంతుడికి మొక్కుకో... ఈయన సంతాన గోపాలం అంటారు కానీ సర్వం ఇచ్చే సర్వేశ్వరుడు..." అతి వినమ్రంగా తలవంచుకుని కళ్ళు మూసుకుని ప్రార్థిస్తున్న స్నేహితురాలిని చూస్తూ ఆశ్చర్యపోయింది వర్షిణి. ఎంత గొప్ప సంస్కారం వీళ్లది?! ఎంతగా కాపాడుకుంటున్నారో వీళ్ళ సంస్కృతిని!!

విడిగా ఆ అమ్మాయి జీన్స్‌పాంట్‌తో కత్తిరించిన జుట్టుతో చాలా మాటరాఫ్ ఫాక్ట్‌గా ఉంటుంది. ఆ అమ్మాయిలో మలయాళీ జరీ అంచు ముండు సెట్టుతో, గంధం బొట్టుతో మనస్సును అవనతం చెయ్యగల పవిత్రత ఉందన్నమాట!

"దణ్ణం పెట్టుకో..." అదిలించింది ఆ అమ్మాయి.

గభాలున కళ్లు మూసుకున్నది వర్షిణి... ఏం కోరుకోవాలి?!

గులాబీరంగుల అలంకారాలతో మెరిసిపోతున్నాడు పూర్ణత్రయేశ్వరుడు. ఏమి అందమది?! ఈ అలౌకిక అందం మనుష్యుల్లో వెతుక్కుని ఒంటరిదాన్నైపోయానా? అని ఆలోచిస్తోంది వర్షిణి.

మనస్సు గతంలోకి పారిపోయింది.

❀ ❀ ❀

అతను... అతని పేరు కృష్ణన్ నాయర్... కాలేజీలో సహాధ్యాయి... పేరుకు తగ్గట్లుగా కృష్ణ విగ్రహంలాగా ఉండేవాడు... అతని సన్నిధిలో నిశ్శబ్దం మాట్లాడుతున్నట్లనిపించేది. చామనచాయ, లేత గులాబీరంగు పెదవులు, అనంత పద్మనాభస్వామి వారికి ఉన్న అందమైన పద్మాలలాంటి కళ్లు... ఓహ్... అతని సౌందర్యం, అతని గంభీరత... ఆమె తల్లకిందులుగా అతని ఆకర్షణలో పడిపోయింది...

అతడు ఆమెను చాలా ఆదరించేవాడు.

మధ్యతరగతి కుటుంబాల్లో ఉండే సంఘర్షణ, డబ్బుకు వెతుకులాట, ఫాల్స్ ప్రిస్టేజి... వీటి మధ్య అన్నింటికీ మొండిగా ఉంటేతప్ప బ్రతకలేం అని ఆడపిల్లలు టీనేజ్‌లోనే నిర్ణయాలకు వచ్చేస్తూ ఉంటారు... కానీ ఆమె చెప్పే ప్రతి విషయం వినేవాడతను... ఒప్పుకునేవాడా అంటే కాదు... కానీ... ఆ ఆదరణ... దయగా చూసేవాడు... 'దయ' - పోరాటంలో బ్రతికే ఆడపిల్లను ఈ దయ ఎంత అలరిస్తుందో అర్థమైన వ్యక్తి అతను. అయిదేళ్ళ చదువు తర్వాత కేరళ వెళ్ళిపోయాడతను.

"మన స్నేహం సంగతి?" అని అడిగినప్పుడు... నవ్వేశాడు.

"స్నేహం... అదెక్కడికి పోతుంది?! జీవితాలు కలవడం అంటావా?! అది చాలా కష్టం..." అన్నాడు.

"కారణం?" ఆశ చావక అడిగింది వర్షిణి... పెళ్లంటే మూడు లక్షల ఖర్చు. తండ్రి అప్పులు. తల్లి ఆర్భాటాలు, అత్తవార్ని కొత్త శత్రువులుగా ముందే చిత్రీకరించు కోవడం... ప్రతి విషయానికీ నెగటివ్ ఆలోచనలు... ఈ వాతావరణంలో పెరిగింది వర్షిణి... ఇల్లాంటి అర్థంలేని పెళ్ళి అనే అదుసులో కాలు వెయ్యాలని లేదు...

"నీకు నేను మాత్రం ముఖ్యం... నాకు నా కుటుంబం, బాధ్యతలు, నువ్వు అన్నీ ముఖ్యమే. నా జీవితంలోకి నా బాధ్యతలలోకి నిన్ను లాగడం ప్రేమ కాదు,"

"లేదు... లేదు... నేను ఎలాగైనా అడ్జస్టు అవుతాను..." సరిపెట్టుకోవడం అంటే నాకు అసహ్యం అనే వర్షిణి ఆ మాటలు అనాలోచితంగా అనేసింది.

"వర్షిణీ! నీ ప్రత్యేకతలు ఏమిటో తెలుసా నీకు? నీ తెలివి తేటలు, నీ స్వతంత్ర భావాలు - ఈ రెండింటినీ గౌరవించుకోలేని పరిస్థితుల్లోకి నిన్ను తీసుకెళ్ళి, నా కోసరం అడ్జస్ట్ అవవా? అని అడగడం... అది బుద్ధిలేనితనం... మన బాంధవ్యాన్ని కించపరచుకోవడం... సారీ... ఒద్దు... ఇది ప్రస్తుతం జరగని విషయం..." వెళ్ళిపోయాడతను.

వెళ్ళిపోతూ ఆమెలో ఆ రాగరంజితత్వాన్ని ఎత్తుకుపోయాడు. "గుడ్‌బై" అని చెప్పి రైలెక్కిన అతని కళ్లల్లో తడి నిజమా? తన ఊహా?! తనకే తెలియదు.

ఆ తరవాత?!... ఆ తరవాత కచ్చకొద్దీ చాలామందితో స్నేహం చేసింది... ఎక్కడా ఏదో ఓటితనం... ఏదో అసంపూర్తి. ఏమిటి కృష్ణన్‌నాయర్‌లో ఆకర్షణ?! మనస్సుకా? శరీరానికా? మెదడుకా? లేక ఆత్మబంధుత్వమా?!

ఈ గందరగోళంలో చాలా తెలివి తక్కువ పనులు చేసింది వర్షిణి - ఒక పెళ్ళి చేసుకోవడం తప్ప... కారణం?! తనలోని ఒక కోణం ఆమెకు బాగా అర్థమైంది... ఆ మొండితనం... లొంగనితనం... అది ఏ సగటు మొగవాడూ భరించలేడు... ఆడవాళ్ళు సహించలేరు... అందుకే ఆమెకు పరిచయాలు ఎక్కువ, ఆత్మీయులు తక్కువ.

"ఎగ్రసివ్ ఉమెన్ మొగవాడిలో భయం కలగచేస్తుంది. ఈ కొత్త ప్రపంచంలో ఆడదానికి కట్టుబాట్ల భయం లేదు. మొగవాడికి ధర్మం భయం లేదు... అందుకే రిలేషన్‌షిప్స్ చాలా పెళుసుగా ఉంటాయి"... అన్నది ఒక స్నేహితురాలు.

ఇది నిజమా?! ఇది తెలిసే కృష్ణన్‌నాయర్ భయపడ్డాడా?! ఏమో... ఏమైనా తనను తాను దాచుకోవడం తనకు రాదు. కంటి రెప్పలు టపటపా కొట్టుకుంటూ, మాటలు తడబడుతూ, నేల చూపులు చూసుకుంటూ, మనస్సు ఏమి ఆలోచిస్తోందో చచ్చినా మాటలకు అందకుండా బ్రతకడం, మంచి అమ్మాయిలా నటించడం తనకు చచ్చినా రాదు... అల్లాంటి అమ్మాయిలను చూసి 'ఎంత మంచిదిరా ఈ అమ్మాయి పాపం?!' అని అడ్డంగా ఆరాధనలో పడే మొగవాళ్ళలోని పరిపూర్ణమైన అమాయకత్వాన్ని అసలు సహించే ఓర్పులేదు వర్షిణిలో.

ఏదైనా కావచ్చు... ఆమె సగటు మొగవాడికి అర్థం కాని అసంపూర్తి చిత్రం... అతడు తెలివిగలవాడికి మంచి మేధావంతురాలైన స్నేహితురాలు... ఈ రెండింటి మధ్య ప్రియురాలు అయ్యే అవకాశాలు చాలా చాలా తక్కువ.

కానీ, కృష్ణన్‌నాయర్ విషయంలో...

❀ ❀ ❀

"అయిందా ప్రార్థన?! పద పోదాం..." చెయ్యి పట్టుకుని జనంలోకి లాక్కువెళ్ళి పోతోంది స్నేహితురాలు.

ప్రార్థనా? ఏమిటిది? కళ్ళు తెరిచి ఉంటే కనీసం పరిశీలన అన్నా ఉండేది... కళ్ళు మూసుకుని తను చేసింది ఏమిటి?! ఆలోచనల ఉప్పెన... ఉపద్రవం.

ఏనుగుపైన వెలిగిపోతున్న పూర్ణత్రయేశ్వరుణ్ణి చూసింది వర్షిణి... "నాకేం కావాలో నాకంటే నీకే బాగా తెలుసేమో..." అంటూ వెనక్కు వెనక్కు చూసుకుంటూ వెళ్ళిపోయింది వర్షిణి.

❀ ❀ ❀

ఇంటికి రాగానే...

``Interdependence is a higher value than independence" - ఈ కొటేషన్‌తో ఉన్న కార్డ్‌తో పళ్ళ చిట్టి... ఎవరా?! అని ఆశ్చర్యంగా సంతకం చూసింది - కృష్ణన్‌నాయర్!

ఆశ్చర్యపోయింది... ఏం తెలుసు అని ఈ కొటేషన్?! తనను గురించి తెలుసుకుంటూనే ఉన్నాడా?! లేకపోతే ఈ అడ్రస్‌కు ఎలా?! ఫ్రం అడ్రస్

చూసింది... లేదు... కృష్ణన్‌నాయర్... మెల్లిగా, సుతారంగా ఆ అక్షరాలను స్పృశిస్తోంది ఆర్తిగా... చటుక్కున పూర్ణత్రయేశ్వరుడు గుర్తుకు వచ్చాడు.

'థ్యాంక్యూ... థ్యాంక్యూ సోమచ్...” మనస్ఫూర్తిగా అనుకున్నది వర్షిణి... ఆ రోజంతా ఏదో పుస్తకం చదువుతూ... ఆలోచిస్తూనే ఉన్నది వర్షిణి: ఏమిటీ జీవితం?

టి.వి.లో యానిమల్ ప్లానెట్ చూస్తూ ఆలోచిస్తోంది. ఇన్స్టింక్స్ మీద బ్రతుకుతున్నామా? సంఘం ఇచ్చిన తర్ఫీదు మీద బ్రతుకుతున్నామా? మామూలు జంతువుకు బాధ్యతగల జంతువుగా ట్రైనింగ్ ఇవ్వచ్చును. కానీ, అది తన తర్ఫీదుకు, దాని ఫలితానికి ఈ రెండింటికీ బాధ్యత వహించదు... వహించక్కర్లేదు కూడా... కానీ... మనిషి?! అలా కాదు... మనకి మనం కొత్త ప్రోగ్రాం రాసుకోగలం... మన సొంత భావనలకు, సంఘం తర్ఫీదుకు మధ్య ఎన్నో అదుపుల మధ్య, చట్రాల మధ్య, ఆకర్షణల మధ్య, బలవంతపు బాధ్యతల మధ్య మనకు ఏం కావాలో అది నిర్ణయించుకునే శక్తి, స్వతంత్రం మనిషికి ఉన్నాయి.

మరి ఎక్కడ తను ఓడిపోయింది?! ఏ స్నేహమూ ఆమెకు శాశ్వతంగా నిలవదు... ఏ అనుభూతీ అంతర్లీనంగా ఇంగిలిపోదు. అన్నీ అలల మీద రాతలే... ఈ కార్పరేట్ ప్రపంచం ఉద్యోగాలలో ముఖ్యంగా రూపాయి రూపాయికి లెఖ్ఖలు వేసే బాల్యం నుంచి ఈ హోదాకు వస్తే డబ్బు, దాని శక్తి అర్థమైతేమటుకు అనుభూతులు, కన్నీళ్ళు వీటి ముఖ్యత్వం... వెనుక పుటల్లోకి వెళ్ళిపోతుంది.

అమ్మ, నాన్న, అక్క, చెల్లెళ్ళు, అన్నయ్య పిల్లలు... ఎక్కడికి వెళ్ళినా ఏదో గిఫ్ట్‌తో వెళుతుంది వర్షిణి... ఏదో ఇచ్చి ఏదో కొనుక్కోవాలి. ఏదీ ఊరికే రాదు ఈ ప్రపంచంలో... ప్రేమ, ఆప్యాయత, చుట్టరికాలు, బంధుత్వాలు... అన్నీ అంతేనా?! ఇలా ఆలోచించడం... తనకు తెలుసు... కానీ ఈ పరిధిలో కుంచించుకుపోతోంది. ఎందుకు తనను తను ఇలా కండిషన్ చేసుకుంటోంది?!

ఆ రాత్రి స్నేహితురాలు ఉత్సవానికి రాలేనన్నది... అయినా ఒంటరిగా కారు తీసుకు బయలుదేరింది ఉత్సవానికి. పూర్ణత్రయేశ్వరుడి ఆకర్షణా?.. ఆశా?! ఏమని?!

చండా మ్రోగుతోంది... నటరాజస్వామి డమరుకంలా... దాదాపు పధ్నాలుగు చండాలు, కొమ్ముబూరలు, తప్పెట్లు ఒక్కసారి విజృంభించి, గగనమంతా ఆక్రమిస్తున్నాయా అన్నంత హోరు... కాగడాల వేడి... జనమంతా ఆడ మొగ భేదం లేకుండా చండా ప్రతి ధ్వనికీ అడుగులు వేస్తున్నారు... ఊగిపోతున్నారు పూనకం వచ్చినవారిలా... ఈ ధ్వని... ఈ సంగీతపు లయలు... ఎక్కడో అంతర్లీనంగా ఎక్కడో దాగిన అనుభూతులను ఉద్దీపింపచేసి నిద్రలేపుతున్నాయా?!

ఎందుకో పట్టరాని దుఃఖం వస్తోంది వర్షిణికి... నరాల మధ్య ఒరిపిడి... ఎక్కడెక్కడో గడ్డకట్టిన అనుభూతులు ఒక్కసారిగా సంగీతపు ఉష్ణమాదకతకు కదిలి, ఘనీభవించడం మర్చిపోయి ప్రవహిస్తున్నాయా అన్నట్టుగా ఉన్న వెచ్చదనం... రక్తంలో వేడి... పాతకాలపు గుడి గోడలను ఆనుకుని నిలబడింది వర్షిణి...

విద్యుద్దీపాల అలంకరణతో వెలిగిపోతోంది ఆలయ ప్రాంగణం... చిరు వర్షానికి తడిసిన ఇసుక... ఎవరిదో పాప కాలి అందె... ఇసుకలో సహం కూరుకుపోయి మెరుస్తోంది. దానివంకే చూస్తూ ఆలోచిస్తున్నది వర్షిణి... తీద్దామా? వద్దా? తీసి ఎవరికి ఇవ్వాలి? కొన్ని అనుభూతుల్లా... ఇది ఇసుకలో మాటుబడి ఉండడమే మంచిదేమో!... గుండె బరువెక్కింది... కళ్ళు మూసుకున్నది వర్షిణి... వెచ్చ వెచ్చగా కన్నీళ్ళు... ఎన్నాళ్ళైంది ఇలా... ఇలా... కరిగి...

"బాగున్నదా మా ఉత్సవం?" ఆప్యాయంగా అడుగుతున్నారెవ్వరో. ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది... సన్న జరీ అంచు పంచ, నీలిరంగు షర్ట్... అదే చిరునవ్వు... ఆ కళ్ళల్లో... అదే దయ.

కృష్ణన్ నాయర్!

"అరె... నువ్విక్కడ ఎలా?..." గట్టిగా అరిచినంత పనిచేసింది...

"ష్... ఏమిటా ఎక్సైట్‌మెంట్?" – నవ్వుతూనే మందలించాడతను. అతని కళ్ళు నవ్వుతున్నాయి.

అప్పుడు చూసింది అతని చేతిల్లో రెండేళ్ళ పాపని. పక్కన చాలా అందమైన మలయాళీ అమ్మాయి... చూడగానే ఆకట్టుకునేటంత పెద్ద కళ్ళు. వీపంతా పాకిన లావాటి పొడుగాటి జుట్టు... మలయాళీ అందం.

"వర్షిణి... అమృతవర్షిణి..." పరిచయం చేశాడతను. 'అలాగా' అన్నట్లు చూసింది ఆ అమ్మాయి... చేతులు జోడించింది. వర్షిణి పరీక్షగా చూస్తూ... ఏదో అసూయ... బల్లిలా గుండెల్లో కదిలింది...

"నేనిక్కడున్నానని ఎల్లా తెలుసు?!" అడిగింది వర్షిణి.

"తెలియదు... కానీ కేరళ వచ్చావని తెలుసు..."

"అవును... పొద్దున్న నీ వెల్‌కం కార్డు అందింది. అయినా ఎలా తెలుసు?"

"తెలుసుకున్నాను... అంతే." నవ్వేశాడతను.

నాలుగేళ్ళలో ఈ మనిషిలో ఏ మార్పూ రాలేదు... ఏదేదో గబగబా మాట్లాడుతూనే ఆలోచిస్తోంది వర్షిణి. ఓరగా ఆ అమ్మాయినే చూస్తోంది... ఆ పిల్ల మౌనంగా.. అణకువగా... ఈ కేరళలో చాలామంది ఆడపిల్లల్లో ఈ తెచ్చిపెట్టుకున్న మౌనం, అణకువ, కళ్లతో సంభాషించడం చూసింది వర్షిణి. అక్షరాస్యత ఎక్కువైన ఇక్కడ పని అమ్మాయి కూడా రోజూ పేపరు చదువుతుంది. రాజకీయాలు, స్ట్రైకులు, హక్కులు చాలా తెలుసు వీళ్ళకు... అవేర్‌నెస్ మహా ఎక్కువ... కానీ ప్రవర్తనలో అది కనబడదు... ఎంతో అణకువగా, బారెడు జుట్టుతో, చేతిలో గొడుగుతో చకచకా నడిచివెళ్ళే ఈ అమ్మాయిలలో డబుల్ పిహెచ్. డిలు ఉన్నా ఆశ్చర్యం లేదు... కానీ ఈ అణకువ వెనకాల చాలా స్వేచ్ఛ, శరీరపు కదలికల మధ్యనుంచి ఎప్పుడు బయటపడిపోతుందో అనిపించేటంతటి అనుభూతుల ఉరవడి... ఒత్తిడి...

మాట్లాడడం... ఆలోచించడం... దేనిని దాన్ని విడిగా ఒకేసారి చెయ్యగలగడం కార్పరేట్ ట్రైనింగ్ నేర్పింది వర్షిణికి. ఇది అవలీలగా అర్థమైన అమ్మాయిలు

ఎప్పుడూ ఎవరికీ అర్థం కారు - ఎంత ప్రయత్నం చేసినా...

"ఉండు వర్షిణీ!... వీళ్ళను మావాళ్ళ దగ్గర వదిలేసి వస్తాను" అన్నాడతను.

'వస్తాను' అని కళ్ళతోనే చెప్పి వెళ్ళిపోయింది ఆ అమ్మాయి.

తిరిగి వచ్చాడతను. చేతిలో బూరెలలాంటి తీపి పిండివంటలతో...

"ఇప్పుడు చెప్పు. ఎలా ఉన్నావు?"

ఇసుకలో కూర్చున్నారిద్దరూ గోడనానుకుని.

గులాబీరంగు పంజాబీ డ్రస్సు... తళుక్కుమంటున్న డైమండ్ రింగ్... పరీక్షగా ఆమెనే చూస్తున్నాడతను.

"ఎలా ఉంటాను?! ఇదుగో... ఇలా... నువ్వెలా ఉన్నావు? అయినా నీకు పెళ్ళైతే కనీసం శుభలేఖ పంపించవచ్చుగా... అవునూ... ఆ కొటేషన్ ఏమిటి... ``Interdependence is a higher value than independence!" చాలా... చాలా ఆలోచిస్తున్నాను దాన్ని గురించి..." గబగబా మాట్లాడేస్తోంది వర్షిణి... అతని వంక చూస్తూ... మళ్ళీ అతను కనబడడేమోనన్నంత ఆర్తిగా చూస్తూ...

ఇసుక గుప్పెట్లో పట్టి జారవిడుస్తోంది. మధ్య మధ్యలో చేతులు దులుపుకుంటోంది. మళ్ళీ ఇసుకలో రాళ్ళన్నీ ఏరి కుప్పలు చేస్తోంది... మళ్ళీ కుదిపివేస్తోంది... మాట్లాడుతూనే ఉన్నది:

అతని కళ్ళల్లో మురిపెం... ఆమె మనస్సులో చిన్న గర్వపురేఖ... ఈ మురిపెం... ఇది కనిపించదేం చాలామంది దగ్గర? ఆడపిల్లను అనుభవించగల వస్తువులాగా చూస్తూ, బహుమతులు ఇచ్చి, డిన్నర్లు ఇచ్చి, బొకేలు ఇచ్చి ఎంత అనుభూతి రాహిత్యం పొందుతున్నాడు పాపం, మొగవాడు!!

"ఊ... చెప్పు... ఏమేమి చేశావు ఇన్ని రోజుల్లో?..." అడిగింది వర్షిణి.

"ఏం చేశానా? చాలా చేశాను... మంచి ఉద్యోగంలో చేరాను. కుటుంబానికి కొన్ని అప్పులు ఉండేవి. తీర్చేశాను. నాన్నగారు రిటైర్ అయ్యే సమయం... అందుకని వాళ్ళకు ఇబ్బంది లేకుండా నెలనెలా కొంత అయివేజు వచ్చే ఏర్పాటు చేశాను... లోను తీసుకుని ఇంటిపైన ఒక పోర్షన్ వేయించి, అమ్మా నాన్నా ఉండే ఏర్పాటు చేశాను... కింద అన్నయ్య, వదిన ఉంటారు... చిన్న కొబ్బరి తోట కొన్నాను... మా అమ్మ పుట్టిన రోజు బహుమతిగా... దానిమీద రాబడి ఆవిడకే... ఇప్పుడు నేను హాయిగా, ఫ్రీగా ఉన్నాను... అదీ కథ."

"సరే... ఈ అక్కౌంట్స్ కాదు నేను అడిగింది..."

"ఈ మలయాళ దేశంలో కట్నాలు లేవు కాబట్టి సరిపోయింది. అదే మా ఆంధ్రాలో అయితే కృష్ణన్‌నాయర్ ఎంత ధర పలికేవాడో..." ఆలోచిస్తూనే అన్నది వర్షిణి.

"ఏం, ఇది అవసరం కాదా... ఇదే నిజం వర్షిణీ!... నేను నా బాధ్యతలను సరిగ్గా చేసి బయటపడితేనే నా ఆలోచనల నుంచి నాకు ఫ్రీడం వస్తుంది... లేకపోతే

అనుభూతులు అలసట తెస్తాయి... ఏదో అపరాధ భావన... గుండె మీద ఒత్తుతూనే ఉంటుంది. నా దృష్టిలో ఇల్లాంటి ఫ్రీడం నిజమైన ఫ్రీడం వర్షిణీ!..."

"అంటే... బాధ్యతలు తప్ప ఇంక జీవితంలో మరేం లేవంటావా?" ఆలోచిస్తూనే అడిగింది:

"అలా కాదు... ఇది ఎవరికి వారు నిర్ణయించుకోవలసిన విషయం వర్షిణీ!... మన జీవితాల్ని మనమే ప్లాను చేసుకోవాలి... లేకపోతే మరొకరు మనకు ప్లానులు గీసి నెత్తిన రుద్దుతారు... అప్పుడు జీవితం అంతా కాంప్రమైజ్... అలా జరక్కూడదు. మన బాధ్యతలు. మన ఆనందాలు – అవి మరొకరి చేతిలోకి జారిపోతున్నాయని బాధపడి ప్రయోజనం లేదు. నా బాధ్యత నీ బాధ్యతే అని భార్యను శాసించి చాలా సంసారాల్లో రొమాన్స్ పోగొట్టుకుంటున్నారు... శాసిస్తే జీవితాలు చెదిరిపోతాయి..."

దిమ్మ తిరిగిపోయింది వర్షిణికి. ఎంత ఆలోచిస్తున్నాడతను?!

"ఊ... సరే... ఇంతకీ మీ అమ్మగారు ఎలా ఉన్నారు?!"

"మా అమ్మా? బాగుంది... అన్నయ్య దగ్గర ఉంది..." అన్నది వర్షిణి.

"ఇంకా ఆవిడ అలా పనిచేస్తూ, అందరి బాధ్యతా చూస్తూ, ఎప్పుడూ నవ్వుతూ... చాలా గొప్ప మనిషి ఆవిడ... ఆవిడ చేసే పులిహోర నేను ఎప్పుడూ మర్చిపోలేను."

నవ్వుకుంది వర్షిణి... గొప్ప మనిషి... ఆ మాటేమిటి? అమ్మ గురించి తనెప్పుడూ అలా అనుకోలేదే!...

"ఏం గొప్ప కనబడింది మా అమ్మలో?..." నవ్వుతూనే అడిగింది.

"అలా అనకు వర్షిణీ!... ఒక్కసారి మీ అమ్మలేని ఆ ఇల్లు ఎలా ఉండేదో ఊహించుకో...మీ అందరి వ్యక్తిత్వాల గొప్పతనాల మధ్య ఒక కాంప్రమైజింగ్ పర్సన్ ఉంది కాబట్టే మీరంతా ఇలా ఉన్నారు."

'నిజమా?' – ఆలోచిస్తోంది వర్షిణి... అమ్మలేని ఆ ఇల్లు – అమ్మో... ఊహించడానికే భయంగా ఉంది.

"రా వర్షిణీ!... పై అంతస్థులో మోహినీ అట్టం చూద్దాం" అన్నాడతను.

ఆ రాత్రి అతణ్ణి ఇంటి దగ్గర దింపి వెళ్ళిపోయింది వర్షిణి. ఆ తరవాత వాళ్ళిద్దరూ చాలాసార్లు కలుసుకున్నారు.

❀ ❀ ❀

"నన్ను ఓల్డ్‌హోంలో చేర్పించవే వర్షిణీ! నేను వదినకు బ్రతుకున్నంత కాలం బాధ్యతగా బ్రతకలేనే..."

అమ్మ పోయిన సెలవులకు వెళితే ఏడ్చింది. అన్నయ్యతో ఆ మాట అంటే...

"ఆవిడ సంగతి తెలిసిందేకదే... ఎంత చేసినా తృప్తి లేదు. ఆ ఓల్డ్‌హోంకు పంపే డబ్బులు నాకు పంపు... వేన్నీళ్ళకు చన్నీళ్ళు సాయం..." అన్నాడు అన్నయ్య.

ఆ మాటలు విని, "ఎలాగో సర్దుకోమ్మా!" అని నెలనెలా అన్నయ్యకే డబ్బులు పంపుతోంది వర్షిణి:

అమ్మను తెచ్చి తన దగ్గర ఉంచుకోవచ్చును. కానీ, ఏ ఒక్క విషయంలోనూ తామిద్దరికీ పడదు... అమ్మ మళ్ళీ ఫోను... శనివారం అతనికి శలవు... ఇంటికి వచ్చాడు... అమ్మ సంగతి కృష్ణతో చెప్పింది.

"వర్షిణీ!... నాకు తెలిసిన మంచి ఓల్డ్‌హోమ్‌లున్నాయి. వెంటనే అమ్మను జాయిన్ చెయ్యి."

"అదికాదు కృష్ణా!"

"ఏదికాదు?! వర్షిణీ! ఈ దేశంలో ఇంట్లో ఉండి అన్నీ అమర్చిపెట్టి అందరి 'మూడ్సు'ను భరించే ఆడవాళ్ళకు జీతం లేదు, రిటైర్‌మెంటు లేదు. పెన్షన్ లేదు. వాళ్ళ పేర్ల మీద ఆస్తులుంటే వాళ్ళకు అనుభవం లేకుండానే మరొక తరానికి వెళ్ళిపోతాయి... పాతిక ఏళ్ళ నువ్వు మరి ఏ మనిషితోనూ అడ్జస్ట్ అవడానికి ఇష్టపడకుండా నీ జీవితాన్ని నువ్వు ఏర్పరుచుకున్నావు... కానీ నలభై ఏళ్ళుగా ఆవిడ మీ అందరి కోసం, మీరు ఇబ్బందిపడకూడదంటూ అందరితోనూ అడ్జస్టు అవుతూవచ్చారు... ప్రతిక్షణం స్వాతంత్ర్యం గురించి మాట్లాడే నీకు అది ఎంత కష్టమో అర్థమవడం లేదా? ఆమెకు ఆర్థిక స్వతంత్రం లేదు కాబట్టే ఆవిడ జీవితాన్ని సెంటిమెంట్లతో కట్టేసి మీరంతా ఆవిడ జీవితం ప్లాను చేస్తున్నారు... అది తప్పు... ఆవిడకు ఏది ఇష్టమో, ఏది కష్టమో మీకు ఎవరికైనా తెలుసా?! ఆవిడకు ఏది కావాలో, ఏది ఒద్దో అని మీరు గౌరవించారా?! నీ గోల్డ్‌ఫిష్‌పుడ్‌లో ఎన్ని రకాలున్నాయో నీకు తెలుసు కానీ, మీ అమ్మగారికి ఏ రంగు చీరంటే మనసో నీకు అసలు అయిడియా ఉందా?! ఆలోచించవద్దు వర్షిణీ!... ప్లాన్ చెయ్యి వెంటనే..." నిదానంగానే చెబుతున్నా అతని మాటల్లో పదునున్నది.

"పోనీ, నేను తెచ్చిపెట్టుకుందామంటే..." తన మాటల్లో ఓటితనం, ఆవిడ అక్కర్లేనితనం తనకే అర్థమౌతుంది.

"తప్పులేదు వర్షిణీ!... నీకూ ఆవిడకూ పడదు... మీ వ్యక్తిత్వాల క్లాష్ అది... అలాగే మీ వదినకూ అవ్వచ్చుకదా! నువ్వు పంపే డబ్బు మీ అన్నయ్యకు ఆసరా... నిజమే. కానీ, దీనివల్ల మీ వదినకు ఏమున్నది బాధ్యత?! మీ అమ్మకు ఏం లాభం?!"

నిజమే... తను, అన్నయ్య భరించలేని ఆవిడ వ్యక్తిత్వం వదిన ఎందుకు ఒప్పుకోవాలి? అయినా, తను ఎందుకు ఇలా ఆలోచించలేకపోయింది?! మెంటల్ కండిషనింగ్... అంతే!

"పోనీ... అమ్మకే డబ్బు పంపిద్దామంటే ఆవిడకు అనవసరం. పైగాపిచ్చి ఖర్చులు పెడుతుంది..." తనను తాను సమర్థించుకుంటూనే అన్నది వర్షిణి.

"వర్షిణీ!" హెచ్చరికగా అన్నాడు కృష్ణన్ నాయర్... "మీ నాన్నగారు లెఖ్ఖలు కట్టి డబ్బులు ఇస్తూంటే ఆవిడ అందులో మిగిల్చి, తన సొంత ఖర్చులు మానుకొని మీ ఇద్దరికీ పాకెట్‌మనీ ఇచ్చేవారు. వీళ్ళకు ఎందుకు అని ఆవిడ ఆనాడు ఆలోచించి ఉంటే...?!... ఈనాడు నీ చేతి నిండా డబ్బు ఉంది... అయినా, ఆవిడకు డబ్బు

ఎందుకు అనిపిస్తోందా?! నీ ఇంటి కుక్కపిల్లకు హార్లిక్స్, నీ తోటమాలికి మూడు వేల జీతం... ఇవన్నీ నీ అవసరాలు... కానీ, జీవితంలో అవసరాలు, ప్రయారిటీస్, విలువలు అటూ ఇటూ మారిపోకూడదు వర్షిణీ!... ఆలోచించు..."

బుఱ్ఱ తిరిగిపోయింది వర్షిణికి... ఆవిడ తన తల్లి. కానీ అతను ఎంత ఆలోచిస్తున్నాడు?! ఇతనికి అమ్మ గురించి తెలిసినదాన్లో అన్నయ్యకు అయిదోవంతన్నా తెలుసా?!

"నేను అమ్మను తెచ్చేసుకుంటాను కృష్ణా!" లేచి నిలబడుతూ ఆవేశంగా అన్నది వర్షిణి.

"ఒద్దు... ఇక్కడ నీ ఇల్లు కాపలా, నీ కుక్కల పెంపకం, నీ పనివాళ్ళ అజమాయిషీ, నీ గేటు తాళం, నీ ఎలక్ట్రిసిటీ బిల్లు... ఏదన్నా అతిగా కల్పించుకుంటే నువ్వు కసురుకుంటావు... పట్టించుకోకపోతే బాధ్యత లేదంటావు. ఆవిడను పెనం మీద నుంచి పొయ్యిలోకి వెయ్యకు... అయినా, ఆవిడకు ఈ వయస్సులో కావలసినవి కొత్త బాధ్యతలు కావు... ఆవిడకు వైద్య సౌకర్యం, బాధ్యతతో కూడిన సేవ చేసేవాళ్ళు, బాధ్యత లేని ఆనందం - ఇవి ఇచ్చే ఓల్డ్‌హోం చూద్దాం... సరేనా?..."

అతని వంక ఆరాధనగా చూసింది వర్షిణి... అతను ఆమె వంక చూసి నవ్వాడు... ఆ కళ్ళు దయాపారావతాలు...

❀ ❀ ❀

అతనే వెతికి ఆమె తల్లిని మంచి ఓల్డ్‌హోంలో చేర్పించాడు. అక్కడ ఆవిడ ఎంతో స్వతంత్రంగా, హాయిగా ఉంది. లేసులు అల్లిన టేబిల్ క్లాతు. అగరువత్తులు, దేవుడి మండపం, తెల్లని పక్క, శుభ్రమైన పరిసరాలు... రెండు వారాల్లో ఆవిడకు చాలామంది ఆత్మీయులు... కొంతమంది ఆరాధకులు ఏర్పడ్డారు... చాలారోజుల తరవాత ఆమె గళం విప్పి పాడుతూంటే ఆ చుట్టు పక్కల రాగచైతన్యం...

అమ్మను అంత ఆనందంగా ఎన్నడూ చూడలేదు తాము... ఎప్పుడూ ఆవిడ కళ్ళ కింద నీడలూ, అనవసరమైన విషయాలకు కూడా సరిపెట్టుకోవల్సిరావడం వలన విసుగు, ఎవరూ తన మాట వినరన్న ఉడుకుబోతుతనం... ఇలాగే చూశారు అమ్మను తామంతా...

"హాయిగా ఉన్నాను వర్షిణీ!... ఎవరికీ బరువుకానప్పుడు, మనను ఎవరో బాధ్యత అనుకోనప్పుడు జీవితం చాలా బాగుంటుంది. థ్యాంక్యూ వర్షిణీ!..." తనను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంటూ అన్నది తల్లి... కన్నీళ్ళు వచ్చాయి వర్షిణికి.

"అతనికి చెప్పమ్మా థ్యాంక్స్!"

తల్లి నవ్వింది అతణ్ణి చూసి హాయిగా...

❀ ❀ ❀

"నిన్నొక విషయం అడుగుదామనుకుంటున్నాను" - అమ్మను చూసి వచ్చే దార్లో అన్నాడతను.

"చెప్పు..."

"ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?! అవసరం అనిపించకా? లేక..."

మాట్లాడలేదు వర్షిణి... 'నీలాంటివాడు మరొకడు దొరక్క...' అని చెప్పలేకపోయింది.

"ఇది నీ జీవితం... నీ కోసరం నేను నిర్ణయాలు తీసుకుని శాసిస్తున్నానుకోకు. నీకు అభ్యంతరం లేకపోతే మనిద్దరం పెళ్ళి చేసుకుందాం..."

"అదేమిటి? నీకు పెళ్ళైందిగా..." పెద్దగా అరుస్తూ బ్రేక్ వేసింది వర్షిణి. చుట్టూ చిక్కటి అడవి.

"ష్!... ఏమిటా కేకలు?! చెట్లు జడుసుకుంటాయి... నీకు చెప్పానా నా పెళ్ళైందని?..."

"మరి గుళ్ళో ఆవిడ?!"

"ఆమె నా వదిన... ఆ పాప మా అన్నకూతురు..."

"మరి ఇన్నాళ్ళూ నేను ఇలా అనుకుంటూ వుంటే ఎందుకని..." చెవిపట్టుకుని ముద్దుగా తిప్పుతూ అన్నది వర్షిణి.

"నాకు పెళ్ళైందని తెలిస్తే నీ ప్రవర్తన ఎలా ఉంటుందా అనుకున్నాను... మామూలు ఆడపిల్లవి అయివుంటే మన మధ్య స్నేహం చంపేసేదానివి... లేదా, నువ్వు నాకు దక్కనందుకు నేను బాధపడేట్లు చేసేదానివి... కానీ... నువ్వు అమృత వర్షిణివి... నువ్వు నువ్వే..."

మాట్లాడలేదు వర్షిణి - చాలా దూరం వరకూ... కేవలం స్వేచ్ఛ చాలా ఆనందం ఇస్తుందనుకునేది తను... ఎంత అబద్ధం అది?! మరొకరికి ఆనందం ఇచ్చినప్పుడే మన స్వేచ్ఛకు అర్థం తెలుస్తుంది... అతను రాసిన కొటేషన్ ఎంత కరెక్ట్?!

వర్షంలో అందమైన ఆకుపచ్చదనం చలికి తడికి తడుస్తూ ఒణుకుతోంది.

"నీకు పెళ్ళైపోయివుంటే నువ్వొక తియ్యటి జ్ఞాపకానివి. మరి నేనెందుకు చేసుకోలేదంటే... మొదట నా బాధ్యతలు - వాటిని గుర్తించలెకపోతె నేను హాయిగా ఉండలేనని నాకు తెలుసు... మరొక ముఖ్యకారణం మరొక అమృతవర్షిణి నాకు దొరకలేదు కాబట్టి."

గట్టిగా నవ్వింది వర్షిణి... చీకట్లో మెరుపులు... ఉత్సవంలో చూసిన పూర్ణ త్రయేశ్వరుడు గుర్తుకు వచ్చి...

"నీకేమి ఇవ్వాలో నాకు తెలుసు" అన్నట్లు వెలుగుల మధ్య సౌందర్య శృంగార వర్షం కురిపిస్తున్నాడు.

*('రచన' జన్మదిన-ఉగాది ప్రత్యేక సంచిక - ఏప్రిల్, 2002)*